## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071740

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit,<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆచార్యవాణి

(ద్వితీయ సంపుటము)

# వేదములు

కంచికామకోటి పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య

**శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ - మహాస్వామివారి ఉపన్యాసములు**

తెనుగు అనుకృతి - పింగళి సూర్యసుందరం


**ప్రకాశకులు**

కంచి శ్రీ మహాస్వామి శతాబ్ది ప్రచురణలు

'గురుకృప'

18A, అజీజ్‌నగర్ రెండవవీధి,

కోడంబాక్కం, మదరాసు - 600 024.

మహాస్వామి సంచిక ఆవిష్కరణ సందర్భముగా



శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు,
శ్రీ విజయేంద్ర సరస్వతీ స్వామి వారు

శ్రీః

శ్రీ చంద్రమౌళీశ్వరాయ నమః

# శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య
# జగద్గురు శ్రీ శంకర భగవత్పాదాచార్య పరంపరాగతమ్
# శ్రీకామకోటి మహా సంస్థానమ్.

యాత్రాస్థానమ్ - ఖాట్మండు 24-4-97

సర్వప్రాణి హితమయినవి, సర్వధర్మమూలమయినవి యగు వేదాంగముల యొక్క సారభూతమయిన సిద్ధాంతములు మాగురుదేవులు "శ్రీ మహాస్వామివారు" అతి చిన్న మాటలలో, సులభగ్రాహ్యముగ తమ అనేక అనుగ్రహ భాషణములలో విడమరచి చెప్పియున్నారు. అవి "దైవత్తిన్ కురల్" అనుపేర ద్రావిడ భాషలో ఆరుసంపుటములుగ వెలువరించ బడియున్నవి. కొన్ని ఆంగ్లమున తర్జుమా చేయబడినవి.

అందుకొన్ని విషయములు ఇతః పూర్వము జగద్గురు బోధలు అనుపేర పదిసంపుటములుగను, ఆచార్యవాణి యనుపేర ఒక సంపుటముగను తెనుగున ముద్రింపబడియున్నవి. ఇప్పుడు "ఆచార్యవాణి" పరంపరలో శ్రీ మహాస్వామివారు వేదములపై చేసిన ప్రసంగములు ఆంగ్లేయమునుండి అనువదింపబడి 'కంచి శ్రీ మహాస్వామి శతాబ్ది ప్రచురణలు" వారిచే ప్రచురింప బడుచున్నవని తెలిసికొని ఎంతయో సంతుష్టులమయినాము.

తెనుగువారికి మహోపకారమయిన ఈ పుణ్యకార్యములో పాలుపంచుకొనిన అనువాద కర్తలు శ్రీ పింగళి సూర్యసుందరంనకు, ద్రవ్యసహాయమొనర్చిన శ్రీ చావలి శ్రీరాంనకు, సంవిధాన కర్త చల్లా విశ్వనాధ శాస్త్రికినీ, తదితరులకూ మాగురుదేవుల కృపజేత సర్వాభీష్ట ఫలసిద్ధి యగుగాక యని నారాయణ స్మృతి పూర్వకముగ ఆశీర్వదించుచున్నాము.

ఇతి నారాయణస్మృతిః

**(కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శంకరాచార్య శ్రీమజ్జయేంద్ర సరస్వతీ శ్రీ చరణులొసగిన శ్రీముఖము)**

# ముందుమాట

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి మహాస్వామివారు కాంచీపుర శంకరమఠాధిపతిగా మాత్రమే కాక, ఒక మహామునిగా మనందరి హృదయాలలో అత్యంత గౌరవస్థానమందున్నారు. వారు అనుగ్రహించిన భాషణలు "వేదములు" అనే పేరుతో ఉన్న విషయాన్ని ఆంగ్లం నుంచి తెలుగు భాషలోనికి శ్రీ పింగళి సూర్య సుందరంగారు అనువదించారు. ఇది ఇరువదియైదు వ్యాసముల సంపుటిగా గ్రథితమైంది. వేదములను గురించి సామాన్యులే కాక, పండితులు కూడ గ్రహించి లబ్ధి పొందవలసిన విషయములు శ్రీవారి భాషణలో ఎన్నో యున్నవి.

వేదములను అధ్యయన మొనర్చి షట్ఛాస్త్రములను చదివి, వేదార్థమును తెలిసిన పండితులను గూర్చి "వారు సాంగోపాంగముగ వేదమును అధ్యయనము చేసినార"ని మనమందుము. అనగానేమి? సాంగవేదాధ్యయనము యొక్క స్వరూప, ప్రయోజనము లెట్టివి? వాటి వివరములు, విశిష్టత ఎట్టిది? ఈ విషయములు సామాన్యులకు తెలియవు. పండితుల వద్దకు పోయి అడిగినచో వారు శాస్త్ర బోధ చేయింపగలరు కాని, మృదువైన భాషలో సామాన్యునికి అర్థమగునట్లు బోధించుట వారికి కష్టము. సముద్రము వంటి ఆర్యధర్మమును ఆపోశనపట్టి, జీర్ణించుకొని, సామాన్యుని అల్పజ్ఞతను కూడ వాత్సల్యముతో గ్రహించగలిగిన దయామూర్తికి మాత్రమే ఇట్టి బోధ సాధ్యము కాగలదు. ఇందు వేదస్వరూపము, దాని అపౌరుషేయత్వము, దాని స్వయం ప్రామాణికత, వేద మంత్రమందలి నిగూఢమైన శక్తి, అట్టి శక్తికి హేతుభూతమైన శబ్ద, స్వర లక్షణములు వివరించుటలో శ్రీవారు ఈ కాలపు ప్రజలను జ్ఞానామృత వర్షముతో తడిపినారు. ప్రధాన విషయమేమన, మనకు పండితులు లేకపోలేదు. ఈ విషయమునంతను వారు కూడ వివరించి యుండ వచ్చును. కాని వేదార్థములు, రచింపబడినవి, కొంత వైవిధ్యము కలవిగానున్నవి. అదెట్లు? వేదకర్మల విషయమై అవి వేదాంత దృక్పథగామికి అనావశ్యములనియు, వాటిని గురించిన విజ్ఞానము శూన్యమే అయినను, తమ తాత్త్విక చింతనకు వాటి జ్ఞానము నిరుపయోగ మగుటయే కాక, అది తమ మార్గమునకు అవరోధమగునని అనేకులు భావించు కాలమిది. అట్లే కేవల వేదాధ్యయనము, శ్రౌత యజ్ఞములు - వీనితోనే జన్మ చరితార్థమగునని భావించువారు ఎచ్చటనైనను వుండవచ్చును. ఆర్యధర్మ సమగ్రస్వరూప మిట్టిదని ఆకళింపు చేసుకొనిన వారు మాత్రమే ఇట్టి యపప్రథలను తొలగింప సమర్థులు. శ్రీవారట్టివారు.

వేదములు మహర్షుల తపస్సులందు మాత్రమే భూలోకమున అవతరించినవి. వాటి స్వరూపస్వభావములు మరల తపోధ్యానములందు కాక మరి ఎట్లు కేవల శాస్త్ర జ్ఞానముచే గాని, పదునైన బుద్ధితో గాని పూర్తిగా అవగతముకాగలదు? శ్రీవారి శాస్త్రజ్ఞానమునకు వెనుక

వారి తపోధనమున్నది. అందువలన వారి మాటలకు ఒక ప్రామాణికత కలదు. వారి మాటలు సందేహ నివృత్తి చేయగలిగిన తుది నిర్ణయములుగా మనము స్వీకరింపవచ్చును.

వారి నవీన శాస్త్ర విషయపరిజ్ఞానము కూడా సమగ్రమనుట అతిశయోక్తి కాదు. అట్టి విషయములందు వారి వేద విజ్ఞాన తులనాత్మకత మరియు విశేషము. వారి మాటలిట్లున్నవి:

"భూమే సూర్యుని చుట్టూ తిరుగుతుంది.... ఉదయించి..... అస్తమిస్తున్నట్లు కనిపిస్తుంది.... ఐతరేయ బ్రాహ్మణంలో ఉంది. అందులో సూర్యోదయంగాని, సూర్యాస్తమయంగాని లేవని ఉంది".

"ఉత్తర ధృవానికి ఇంకా ఉత్తరంగా ఏ ప్రదేశమైనా ఉంటే అక్కడే మేరువుంది. అక్కడే స్వర్గముంది."

"వేదాలలో జ్ఞానకాండ, అంటే ఉపనిషత్తులు, అద్వైతం గురించే చెబుతుంది. కాని ద్వైతం గురించి చెప్పే కర్మకాండ తరువాతనే ఉంటుంది."

"కర్మల నాచరించటం వల్ల కలిగే చిత్తశుద్ధి లభించిన తర్వాతనే ఆత్మవిచారాన్ని ఆరంభించాలన్నాడు. ఆదిలో మీమాంసానుసారం కర్మల నాచరించాలి. వాటిని విడనాడమని బౌద్ధులు చెప్పే స్థితికి చివరకు చేరాలి".

"ఆచార్యుల వారు మీమాంస, సాంఖ్య, న్యాయ సిద్ధాంతాలను కొంత వరకే అంగీకరించారు..... అన్నిటినీ సమన్వయ పరిచారు."

"స్మృతులలో ఆయా రచయితల వ్యక్తిగత అభిప్రాయాలుండవు. వేదాలలో ఉన్నవాటినే తీసుకొని సంకలనాలని తయారు చేశారు. వేదాలలోని విధులను ఎట్టి పరిస్థితులలోనూ మార్చలేము. కాబట్టి ధర్మశాస్త్రాలలోని నియమాలను మార్చే ప్రసక్తే లేదు."

ఇవన్నీ నేటి యాధునికుల విమర్శలకు వారి చివరి సమాధానం. అనగా, ఆర్యవిజ్ఞానము యొక్క సమాధానము.

ఇట్టి యపురూప విషయములను శ్రీ సుందరంగారు భాషాంతరీకరణము చేయుటలో పడిన శ్రమ, అవగాహన, శ్రద్ధ, వారు సాధించిన భాషాసౌలభ్యము మన తెలుగువారికి మహోపకృతి, భాగ్యము. ఇది ఇంతకన్న సులభము చేయుట అసాధ్యమని భావింతును.

శ్రీవారి భాషణములపై ముందుమాట ఎవరు వ్రాయగలరు? నా అవగాహన, ఆనందము మాత్రమే చెప్పుకొంటిని.

శుభంభూయాత్

కందుకూరి శివానందమూర్తి

# విజ్ఞప్తి

"అటమటమయ్యె నా భజనమంతయు భూవర! చూడుమా
యిటువలె గారవించు జగదీశుడు కృష్ణుడు లేని పిమ్మటన్
బటుతర దేహ లోభమున ప్రాణములున్నవి వెంటబోక, నే
గట గట! పూర్వజన్మమున కర్మము లెట్టివి జేసినాడనో"
(శ్రీమదాంధ్ర భాగవతము 1-371)

రమారమి ఈ శతాబ్దమంతయూ ఆధ్యాత్మికాకాశమున జాజ్జ్వల్య మానముగ ప్రకాశించి, మనలకు వెలుగు ప్రసాదించిన జ్ఞాన భాస్కరులు అస్తమించినారు. అవ్యాజకరుణామూర్తి. అమ్మ కన్నను మిన్నగ మనలనాదరించిన మన స్వామి దేహత్యాగము జేసినారు. అయినను మన దేహ లోభమెంత పటుతరమయినది? వారి లేని జీవితము ఊహింపనైన ఊహింప జాలని మనము వారి వెంట బోలేదు సరికదా! అన్ని లౌకిక వ్యవహారములను యధావిధి నిర్వర్తించుకొనుచున్నాము.

కొందరు పెద్దలు, పండితులు, జ్ఞానులు స్వామి ఎచ్చటకును పోలేదనియూ, నిష్క్రియులై, నిర్గుణులై మనయందే ఆత్మారాములుగ వసించు చున్నారనియు ఊరడి పల్కుచున్నారు. అది వారి అనుభవము అయివుండవచ్చును. వారు చెప్పినది సత్యమనుటకు శాస్త్ర ప్రమాణమునూ యున్నది.

అయిననూ ఆ కరచరణముఖతామరసమునూ, చిరు మందహాసమునూ దగ్గరగ అనుభవించిన అస్మదాదుల మనసు "రక్తాంత స్పృహణీయ దీర్ఘనయనం, స్వాకుంచిత భ్రూలతం, హాసస్మేర ముదార ఫాలఫలకం, స్ఫూర్జత్కపోలారుణం, శ్రీ కర్ణం సునసం సుచారు రదనం పూర్ణేందు బింబాననం" అని మా కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులవారు వర్ణించిన స్వామి అతిసుందర దివ్యమంగళ రూపముపైననే లగ్నమగును. మన దీక్షితులు గారే గురుకృపాలహరిలో మరొక చోట "సుందర తవ సుందర పద సందర్శన వందనానుసంధానస్రక్, చందన ధారణలేపన సౌందర్యానంద సారసారం యాచే" అనిన విధముగా మన చేతము ఆ సౌఖ్యము మీదనే మరులు కొనియున్నది.

శ్రీ మధుసూదనానంద సరస్వతీ స్వామి వారి గీతావివరణలో ఒక మంగళశ్లోకముః

"ధ్యానాభ్యాస వశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కించన యోగినో యదిపరం పశ్యంతి పశ్యంతుతే
అస్మాకంతు తదేవ లోచన చమత్కారాయ భూయాచ్చిరం
కాళిన్దీ పులినోదరే కిమపి యన్నీలం మహోధావతి!"

"ధ్యానాభ్యాసము చేత వశం వదనయిన మనసు వలన కొందరు మహాయోగులు నిర్గుణమైన, నిష్క్రియమైన ఆత్మజ్యోతిని దర్శించగలిగిన యెడ దర్శించెదరుగాక! మాకు మాత్రము ఆ బ్రహ్మమే యమునానదీ పులిన తీరములందు పరుగులిడుచు తిరుగాడుచున్న వర్ణణాతీతమయిన చిక్కటి నలుపుగ (కృష్ణునిగ) నిరంతరము కన్నుల పండుగ జేయుచుండుగాక!"

స్వామి విషయమున మా ప్రార్థన కూడ అదే విధముగా యుండెడిది. ఇప్పుడు మొదటి స్థితి నాశ్రయించుటయా? లేదు! రెండవస్థితినే భావన ద్వారా సిద్ధపరచుకొనుటకు ప్రయత్నించుచున్నాము. అయినను, స్వామి కడపటి రెండు వర్షములు నిష్క్రియాత్మక స్థితిలో యుండి మనలకు జీవన్ముక్తస్థితి యన్న ఎటులుండునో చూపుటయేగాక, వారి మంజుల వాగ్విలాసమునకు, చిఱునగవుతోనిండిన ప్రేమామృత దృక్కులకు మనలను దూరముగ యుంచి వారి మహాప్రస్థానమునకు సమాయత్త బరచినారు.

జీవన్ముక్తులు లోకమున మూడు విధములుగ ప్రవర్తకులగుచున్నారు. జటభరతుడు, రమణులు వంటి సాక్షీమాత్రులును, నిష్క్రియాత్మకులును అయిన మహాపురుషులు కొందరు. వీరు బ్రహ్మానందానుభవ

మగ్నులై వారి సంస్థితి వలననే లోకమునకు శ్రేయస్సు గూర్చెదరు. మరికొందరు శ్రీ శుకకరులవంటి ఉపదేశ ప్రధానులు. వీరు జీవన్ముక్తులయి యుండియూ శిష్యులకు, లోకమునకు తమ ఉపదేశముల ద్వారా కూడ హితము గూర్చెదరు. జనకుల వంటి ఇంకొందరు వ్యవహార ప్రధానులు. నిస్సంగ, నిర్మోహ లక్షణములు కలిగిన వారి వలన లోక వ్యవహారములు ధర్మ బద్ధముగ నడుచును. తద్వారా లోక శ్రేయస్సు గలుగును.

మహాస్వామి వారు ఈ మూడు విధములయిన లక్షణములను పుణికి పుచ్చుకొనిన జీవన్ముక్తులు. సంవత్సరముల తరబడి సమాధి నిష్ఠులయి కాష్ఠమౌనాది నియమములతో కేవలము సాక్షీమాత్రముగ యున్నారు. ప్రతిదినము తమ యొద్దకు వచ్చు శిష్యకోటినీ యావజ్జాతికినీ ఉపదేశ ఉపన్యాసమూలముగ వారివారి అధికార భేదమునను సరించి శాస్త్రవిహిత మయిన మోక్షోపాయములను ఉపదేశించినారు. డెబ్బదిఏండ్ల వీరి క్రియాశీలక పీఠాధిపత్యకాలమున వీరి కార్యనిర్వాహణా దక్షత అత్యాశ్చర్యకరమయినది.' దేశము వివిధ క్లిష్టసమయముల నెదుర్కొను నపుడు స్వామి వారి నిర్వాహణ దక్షణతో కూడిన సలహాలు, కార్యములు అందరు ఎఱిగినవే.

జీవన్ముక్తులకు విధినిషేధములులేవు. "నిస్త్రైగుణ్యేపథివిచరతాం కోవిధిః కోనిషేధః". అయినను, స్వామి వేదవిహిత ధర్మములను, ఆచారమును నియమముతో అనుష్ఠించి, వేదవిహిత ధర్మములను నూటికి నూరుపాళ్లు ఆచరింపవచ్చునని మనకి చూపినారు. నియమపాలనలో శరీరమును అంత కష్టపెట్టుకొనుటకు కారణము మానవాళిపై వారికి గల అవ్యాజమయిన కరుణయే.

స్వామివారి సునిశిత పరిశీలనా దృష్టి అనన్యతోలభ్యము. వారి లౌకిక విషయ పరిజ్ఞానము, అలౌకిక ప్రతిభ అనన్యసాధారణము. శ్రీవారు చేసిన ఉపన్యాసములు వారి సర్వజ్ఞత్వమును ప్రకాశింప జేసెడివి. ఆత్యంతికమయిన శాస్త్రవిషయములను అతిసులభముగా విడమరచి చిన్నపిల్లలకు సహితము విశదమగునట్లు వివరించుట స్వామి లక్షణము. "శాస్త్రేచ కవితాః, కావ్యేచ శాస్త్రం" అనినాడు ఖండన ఖండ ఖాద్యకారుడు శ్రీహర్షుడు. శాస్త్రీయ మయిన అత్యంత క్లిష్ట విషయము రసస్ఫోరకముగ, కవితారూపముగ చెప్పగలననియూ, కవితలను క్లిష్టతరమైన శాస్త్రముగ చెప్పగలననియూ చెప్పుచున్నారు. అందు మొదటి లక్షణము పెద్ద శ్రీవారి యందు పుష్కలముగ యున్నది. అయిననూ కించిద్‌జ్ఞుడయిన నేను మహాస్వామి ప్రతిభ గూర్చి మాట్లాడుటకు అనర్హుడను. నాయీపసివాని అసంబద్ధప్రలాపన వోలు పలుకులతో స్వామిని స్తోత్రము చేయుటయే నా అభిమతము.

మన అదృష్టవశమున స్వామి మదరాసు సంస్కృత కళాశాలలో చేసిన ప్రసంగములన్నియూ, టేపులద్వారా భద్రపరచబడినవి. అవి తమిళ భాషలోయున్నవి. ఆంధ్రపర్యటనమున శ్రీవారు తెనుగన జేసిన ఉపన్యాసములు, ఒకటి రెండు మినహాయించి, భద్రపరచిన దాఖలాలు లేవు. తమిళ ఉపన్యాసములన్నియూ శ్రీరా॥గణపతిగారు విషయముల వారీగా విభజించి తిరిగి వ్రాసినారు. ఇవి (దైవవాక్కు) "దైవత్తిన్‌కురల్" అనుపేర సహస్రాధికమైన పుటలున్న సంపుటములుగ ప్రకాశింపబడినవి. అందుకొన్ని అంశములు 'Guru Tradition', 'Hindu Dharma' అనే పేర ఆంగ్లమున తర్జుమా జేయబడి "భావన్స్" వారి ద్వారా ప్రచురింపబడినవి. ఇంకను తమిళములోను, ఆంగ్లేయమునను అనేక చిన్నచిన్న సంపుటములుగా స్వామి ఉపన్యాసములు ప్రచురింపబడినవి.

శ్రీవారి వాణిని తెనుగున కనువదించి తెనుగులకు మహోపకృతి కావించిన వారిలో ఆద్యులు శ్రీ యం.వి.బి.యస్. శర్మగారు. వీరనువదించిన ఉపన్యాసము ఆంధ్ర ప్రభలో ముద్రింపబడి తరువాత పది సంపుటములుగ తెనాలి "సాధన గ్రంథమండలి" వారిచే వెలువరింప బడినవి. శ్రీ శర్మగారు శ్రీశంకర విజయేంద్రస్వామివారు పనుపున నేకోరినంతనే 'దైవత్తిన్ కురల్'లోని కొన్ని అంశములను ఆంధ్రీకరించి ఇచ్చినారు. ఇది ఆచార్యవాణి ప్రథమ సంపుటముగ అచ్చొత్తింపబడినది. దీనిలో 'అద్వైతము' 'వైదికమతము' 'గురుసంప్రదాయము'లపై స్వామి వారి భాషణలు తెనుగు జేయబడినవి. శ్రీ శర్మగారి తెనుగు సుందరమైనది.

సరళమయినది. చిన్న చిన్న వాక్యములలో పెద్దపెద్ద విషయములు సూటిగా తెల్పుటలో శ్రీవారి శైలి వారి అనుగ్రహమున వీరికబ్బినది.

'Vedas' అను ఆంగ్లగ్రంథము శ్రీ పింగళి సూర్యసుందరము గారి చేత తెనుగున తర్జుమా జేయబడి "ఆచార్యవాణి" ద్వితీయ సంపుటముగ వెలువరింపబడుచున్నది. శ్రీ సుందరంగారు ప్రముఖ ఆంధ్రపండితులు, పరిశోధకులు, బహుగ్రంథకర్తలు, అయిన ఆచార్య పింగళి లక్ష్మీ కాంతం గారి కుమారులు. వీరు ఉద్యోగ విరమణ తరువాత ప్రస్తుతము హైదరాబాదులో స్థిరబడినారు. శ్రీరమణులకు సంబంధించిన గ్రంథములను, ఇతరములను ఆంగ్లమునుండి తెనుగునకు అనువాదము చేసి తెలుగులకు ఉపకారమొనర్చినారు. మహాస్వామి మహాప్రస్థానాంతరము నిస్తేజమయి, గ్రంథవిషయమున అశ్రద్ధ చూపిన నన్ను ప్రోత్సహించి, మందలించి ప్రస్తుత మీస్థితికి ఈ గ్రంథమును తెచ్చుటకు కారణము వీరే. వీరి తెనుగు అతిసరళమయినది. ఆంధ్రవాక్యనిర్మాణశైలి ఆంగ్లేయ వాక్యనిర్మాణము పోలియుండును. అనువాద విషయమున వీరి కృషి కృతజ్ఞతాపూర్వక శ్లాఘయోగ్యము.

ప్రస్తుత గ్రంథమున శ్రీవారు చతుర్దశ విద్యలపై సువిశదమైన వివరణనిచ్చినారు. వేద పరిరక్షణమునకై అనేక సంస్థలు, ప్రణాళికల ఏర్పాటుద్వారా కృషి సలిపిన మహాస్వామికి అత్యంత ఆసక్తి కరమయినది ఈ గ్రంథమందలి విషయము. శ్రీచరణులు సాధారణముగ మతాచార్యులు, మహర్షులవంటి వారలను బహువచనముతో మిక్కిలి భక్తి ప్రపత్తులతో పేర్కొందురు. ఈ గ్రంథమున అక్కడక్కడ వ్యావహారికమున ఏకవచనము దొర్లియుండవచ్చును. పాఠకులు సవరించుకొనగలరని ప్రార్థించుచున్నాము. విశ్వనాథవారు ఒకప్పటి తమజంటకవి, కొడాలి వారిని సంస్మరించుచూ "అతడు తోడు గల్గినను అచ్చముగా కలకండ అచ్చులన్ పోతలు పోసియుండెడమ్మ" అనినారు. ముందు మేము అచ్చొత్తించిన మహాస్వామి, ఆచార్యవాణి పుస్తకముల ముద్రణా వ్యవహారమంతయు మా సోదరుడు చి॥ సురేష్ చూచెడివాడు. ఉద్యోగపరమయిన మార్పు వలన అతడు హైదరాబాదు పోవుటచే ఈ ముద్రణ వ్యవహారము కుంటుపడినది. విజయవాడలో DTP కి ఇచ్చి, మూడవ ప్రూఫ్ వరకు దిద్ది, మొత్తము డబ్బు ఇచ్చిన తరువాత మాకు తుదిప్రతి ఈయక మునుపు ముద్రణాలయ యజమాని అంతర్ధానమొందినాడు. తిరిగి మా సోదరుని నిర్వహణలో G.V. గ్రాఫిక్స్ వారు అత్యంతరమణీయముగ DTP చేసి ఇచ్చినారు. ప్రూఫులు చూచు బాధ్యతను గూడ శ్రీ సూర్యసుందరం గారు స్వీకరించినారు.

ఈ గ్రంథమున శాస్త్రీయ విషయములనన్నిటినీ విని సవరించిన వారు విద్యారణ్య వేత్తలు, ఘనపాఠి, వేదాంత మీమాంసా శిరోమణులు శ్రీ దెందుకూరి మల్లికార్జున సోమయాజి గారు. వీరు శ్రీవారి పాదపద్మములందు ఆత్యంతికమయిన భక్తి భావముగలవారు. నిరంతర మగ్నిహోత్రము చేసి కొనుచు విద్యార్థులకు ప్రవచనమొనర్చుచు ప్రస్తుతము మదరాసులో యున్నారు.

ముద్రణా వ్యయములో దాదాపు సగము వరకు తమ మండలీకాశ్రమము తెనాలి ద్వారా ఇచ్చిన వారు మద్రాస్ వాస్తవ్యులు, ప్రముఖ చార్టర్డ్ అకౌంటెంట్ శ్రీ చావలి శ్రీరాం గారు. శ్రీరాం గారు మదరాసులో బహు ప్రసిద్ధులైన కీ॥శే॥ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి తృతీయ పుత్రులు. శ్రీ శాస్త్రిగారు స్వామివారి అంతరంగిక భక్తులు. అమిత ఐశ్వర్యవంతులు. మహాదాత. శ్రీరాంగారు వీరి పుణ్యలక్షణములు పుణికి పుచ్చుకొనినారు. శ్రీవారి ఆదేశమున అనేక పుణ్యకార్యములు చేయుటయేకాక, స్వామివారి పనుపున తెనాలి తమ గృహములో శ్రీమాండలీక వెంకటశాస్త్రిగారి పేర నారంభింపబడిన మాండలీకాశ్రమములో ప్రతిప్రాతః కాలమున, ప్రతి ప్రదోషమున ఆధ్యాత్మిక కార్యక్రమములు నిర్వహించుచున్నారు. ఇంకనూ స్వామివారి ఆదేశాను సారము తిరువామియూర్ మరుందీశ్వర స్వామి ఆలయ పునరుద్ధరణ, గోపురనిర్మాణము, కుంభాభిషేకము, వారి తండ్రిగారు ఆరంభించిన మద్రాస్‌లోని కామాక్షీ దేవాలయ నిర్మాణము పూర్తిగావించుట, సోదరుల సహాయముతో నిత్యపూజలు అత్యంత వైభవముగా నిర్వహించుట, వీరు చేసిన, చేయుచున్న పుణ్యకార్యములలో కొన్ని.

ముద్రణావ్యయమున మిగిలిన భాగము మా నాయనగారు, కీ.శే. చల్లా శేషాచల శర్మ గారి స్మృతి కొరకై మా కుటుంబ సభ్యులు పూరించినారు. మా నాన్నగారికి చిఱుతప్రాయము నుండి ధార్మిక విషయములందు ఆసక్తి మెండు. వారు బ్రహ్మశ్రీ చివుకుల వెంకటరమణ సిద్ధాంతి గారి వద్ద భాష్యత్రయ శాంతి చేసినారు. వారు లౌకిక జీవితమును కూడ అతి సమర్థవంతముగా నిర్వహించుకొనినారు. 1961లో శ్రీ మహాస్వామి వారి దర్శనము చేసిన దాదిగా వారి పాదపద్మములందే అనన్య భక్తి. గత పది సంవత్సరములుగా మా నాయనగారు చేసిన దాన ధర్మాధికములు, ఇష్టాపూర్తములు, మహత్కార్యములు చెప్పుటకు స్వోత్కర్ష అగునేమోనని సందేహించు చున్నాను.

వారు స్వామి వారి పాదుకల సమక్షమున వారిచే ప్రసాదించబడిన యోగమును నిరంతరము అభ్యాసము చేసికొనుచు గడిపినారు. శ్రీ విద్యా సంప్రదాయములో పూర్ణ దీక్షాపరులు అయిన మా నాన్నగారు నిరంతరము స్వామి పాదములే తమ శిరస్సున భావించు కొనుచుండెడివారు. స్వామివారి జన్మదినోత్సవమే మా యింట పండుగలకెల్లను పెద్ద పండుగ. శ్రీ చందోలు శాస్త్రులు గారి వంటి బ్రహ్మణ్యుల సమక్షములో ఆయుష్య, ఆవహంతి, రుద్ర హోమాదులు, సంచికావిష్కరణములు, ఉపన్యాసాదులతో జన్మ దినోత్సవములు అతి రమ్యముగా నిర్వహింపబడు చుండెడివి. శ్రీ స్వామి వారి విదేహ ముక్తి అనంతరము స్వామివారి ఆరాధనలను 1995, 1996 సం॥ లలో తాము స్వయముగా శాస్త్రోక్తరీతిని చేసినారు. మా నాయనగారు 1996 డిసెంబరు 15వ తేదీన, తమ 73వ ఏట కపాల మోక్షము జరిగి స్వామి పాదపద్మముల యందు ఐక్యమైనారు.

శ్రీ కందుకూరి శివానంద మూర్తిగారు "గురువుగారు" భీమునిపట్టణములో ఆనందవనమను ఆశ్రమమున ఆత్మనిష్ఠులుగా యుండి వందలాది శిష్యులకు ఆధ్యాత్మికోన్నతిని ప్రసాదించుచున్నారు. ఆధునిక భారతమునగల అతి కొద్దిమంది యోగనిష్ఠులలో వీరు ముఖ్యులు. మహాస్వామి ప్రసంగములకు ఈ మహాపురుషుని పీఠిక తగియున్నది. వారికి మాకృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఎంతో శ్రమకు ప్రయాసకు ఓర్చి, ప్రతిఫలాపేక్ష ఏమియులేక - ఆధ్యాత్మిక ప్రవృత్తియే కారణముగ తెనుగించుటయే కాక, అది ముద్రణ నొందువరకు ప్రూఫులు దిద్దుట వంటి బాధ్యతలన్నియూ స్వీకరించిన శ్రీ పింగళి సూర్యసుందరంగారికి, ద్రవ్యసహాయమొనర్చిన శ్రీచావలి శ్రీరాంగారికి తెనుగు ప్రజ కృతజ్ఞతతో యుండగలదు.

ఆంధ్రీకరించుకొని ముద్రించు కొనుటకు అనుమతి నొసగిన ఆంగ్లసంపుటి కాపీరైటు దారులు శ్రీ కామాక్షీసేవాసమితి, బొంబాయి వారికి మా కృతజ్ఞతలు.

ఈ ప్రయత్నమంతయూ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు, శ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ స్వామివారల ఆదేశముచే జరిగినది. వారి ఆశీరనుగ్రహ విశేషము చేత తెనుగు ఆస్తికజనులు ఈ ప్రయత్న ఫలము ననుభవింపగలరు గాక యని అంతర్యామి అయిన మహాస్వామిని ప్రార్థించు చున్నాను. నవ్యశ్రీ చరణులయొక్కయూ, బాలస్వామివారి యొక్క పాదపద్మములకు మ్రొక్కి విన్నపము చేయుచున్నాను.

'గురుకృప'
అజీజ్ నగర్ రెండవ వీధి,
కోడంబాక్కం,
మదరాసు - 600 024.

చల్లా విశ్వనాధ శాస్త్రీ
ఈశ్వరనామ సంవత్సర చైత్ర కృష్ణ
పంచమీ సోమవారమ్.

# విషయ సూచిక

# 1

# వైదిక మతమునకు ప్రామాణిక గ్రంథము

ఈ రోజులలో ఎన్నో విభిన్నమైన విషయాల గురించి ఎన్నో గ్రంథాలున్నాయి. ప్రతి మతం గురించీ ఎన్నో పుస్తకాలు కూడా ఉన్నాయి. ప్రతి మతానికీ ప్రధానమైన గ్రంథమంటూ ఒకటి ఉంటుంది. ప్రతి ధర్మానికీ ఒక స్థాపకుడున్నాడు - ఆయన రచనలకీ, ప్రవచనాలకీ ఆ మతంలో ప్రాముఖ్యత ఉంటుంది. ఆ మతస్థులు తమ మతస్థాపకుని గ్రంథమే ప్రామాణికమైనదనీ, అనుసరణీయమైనదనీ విశ్వసిస్తారు. కొందరు అటువంటి గ్రంథాన్ని ఆరాధిస్తారు, దేవాలయాలలో పెట్టుకొని పూజిస్తారు. ఉదాహరణకి - సిక్కులు. ఈ విధంగా తమ పవిత్రగ్రంథాన్ని ఎంతో ఆదరంతో "గ్రంథ్ సాహెబ్" అని చెప్పుకుంటారు. అట్లాగే ప్రతి మతమూ ఒక గ్రంథాన్ని ఎంచుకొని ఆ గ్రంథమే ముక్తి మార్గాన్ని చూపిస్తుందనీ, ఆత్మోన్నతిని కలిగిస్తుందనీ నమ్ముతుంది. ఆ గ్రంథం ఆ మతస్థాపకుని పేర వెలసినా అందులోని మాటలు భగవద్వాణి అనీ, భగవదాదేశమనీ అవి ఆ మతస్థాపకుని ద్వారాగాని, ప్రవక్త ద్వారా గాని, బహిర్గతమైనవనీ ఆ మతస్థులు నమ్ముతారు. అందువల్ల వాటిని "బహిర్గతమైన వాక్కులు" అంటారు. హిందువులమైన మనం మన పవిత్ర గ్రంథాలైన వేదాలను "అపౌరుషేయము" లంటాం. ఇవి మానవునిచే రచింపబడినవి కావనీ, భగవంతుని వాక్కును ప్రచారంలోకి తీసుకురావటానికి మానవుడు సాధనం మాత్రమే అయాడనీ దీని భావం.

ఏ మతానికైనా ప్రాతిపదిక అనదగ్గ సాధికారకమైన గ్రంథమేది అని ప్రశ్నిస్తే అన్యమతస్థులు నిస్సంకోచంగా సమాధానాలు చెప్తారు. క్రైస్తవులు "బైబిల్" అంటారు, మహమ్మదీయులు "కొరాన్" అంటారు, బౌద్ధులు "ధమ్మపద" మంటారు, పార్శీలు "జెండ్ అవెస్టా" అంటారు. కాని హైందవులమైన మనమిటువంటి సమాధానమీయలేం. మనకి అటువంటి గ్రంథమంటూ ఒకటి లేదు, అటువంటి గ్రంథ రచయిత అంటూ ఒకడు లేడు.

కొందరు రామాయణాన్ని మన పవిత్ర గ్రంథంగా చెప్పుకొంటే, మరికొందరు భగవద్గీతని చెప్పుకొంటారు. ఇంకా కొందరు వేదాలను మనకు శిరోధార్యాలైన గ్రంథాలుగా చెప్పుకొంటారు. అన్ని కాలాలలోనూ పరిస్థితి ఇట్లా ఉండేది కాదు. ఈ విభిన్నాభిప్రాయాలకీ, ఈ అస్తవ్యస్తతకీ కారణమొకటి ఉంది: అన్యమతస్థులకి తప్పనిసరిగా మతపరమైన విద్యాబోధన చేసే ప్రాథమికమైన గ్రంథమొకటి ఉంది. కాని హైందవులకు ప్రాథమికమైన ధార్మిక విద్యాబోధన అంటూ ఏమీ లేదు. ఈ కారణం వల్లనే మనం మన మత గ్రంథాలని విమర్శిస్తూంటాం, కించపరుస్తూనూ ఉంటాం. ఇతర మతస్థులు తమ మతగ్రంథాలను కాపాడుకొంటారు, గౌరవంగా చూసుకొంటారు; అంతేకాక, తమకి భిన్నమైన మతాల సూత్రాలని ఆక్షేపిస్తూంటారు.

ఇతర మతస్థుల వలె మనకి కూడ చిన్న వయస్సులో మన ముఖ్యమైన మత గ్రంథాల గురించి బోధన ఉండి ఉంటే మనం మన పవిత్రగ్రంథాలను శంకించం. వాటి గురించి ఇంత అజ్ఞానంతోనూ ఉండం.

మనకి మన మతమంటే ఏమిటో తెలియాలి. దీనికి మన పవిత్రగ్రంథాలే కదా సాధనం? కాని అంతకంటె ముఖ్యం, మతం యొక్క ఆవశ్యకతని తెలుసుకోవటం. మతమంటే కేవలం కర్మకాండకాదు. మతమంటే ధర్మం. ధర్మమంటే ఏమిటి? దేని ఆచరణ వల్ల మనకి సంతృప్తి, సంతోషమూ కలుగుతాయో అదే ధర్మమంటే. ధర్మమంటే ఏమిటో తెలుసుకోవాలన్నా, ధార్మిక సూత్రాలని తెలుసుకోవాలన్నా మనం కొన్ని గ్రంథాలని అధ్యయనం చెయ్యాలి. అటువంటి గ్రంథాలని "ధర్మ ప్రమాణాలు" అంటారు. "ప్రమాణ" మంటే సత్యాన్ని నెలకొల్పేది అని అర్థం. అంటే, "ధర్మప్రమాణ"మన్న పదానికి అర్థం, ధర్మం గురించి నిజమైన జ్ఞానాన్ని ప్రసాదించేది అన్నమాట. నిజమైన ధర్మం గురించి చెప్పే పవిత్ర గ్రంథాలేమిటి?

*"అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః*
*పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతా శ్చతుర్దశ"*

ఇవి పద్నాలుగు - నాలుగు వేదాలు, (అంటే ఋక్, యజుః, సామ, అధర్వ) ఆరు వేదాంగాలు అంటే వేదాలకు అనుషంగాలు (ఇవి శిక్ష - శబ్ద శాస్త్రము, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము. భాషా శాస్త్రము, జ్యోతిషము, కల్పము) నాలుగు ఉపాంగములు. మీమాంస అంటే వేదాలకి వ్యాఖ్య, న్యాయం అంటే తర్కం. పురాణం, ధర్మశాస్త్రం - అంటే వర్తనకి సంబంధించిన నియమాలు. వీటిలో విజ్ఞానం, వివేకం నిక్షిప్తమై యున్నాయి. అందువల్లనే ఈ పద్నాల్గింటినీ విద్యాస్థానాలంటారు.

వీటికి ఉపాంగాలంటూ ఇంకో నాల్గింటిని చేర్చవచ్చు. ఇవి వేదాంగాలకి అనుబంధాలు. ఇవి (1) ఆయుర్వేదం - జీవితానికి సంబంధించిన శాస్త్రం (2) అర్థశాస్త్రం - సంపదకీ, అర్థానికి సంబంధించిన శాస్త్రం, (3) ధనుర్వేదం - అస్త్రాలకీ, యుద్ధానికీ సంబంధించిన శాస్త్రం, (4) గాంధర్వవేదం - సంగీతం, నృత్యం, నాటకం వంటి లలితకళలకి సంబంధించిన శాస్త్ర గ్రంథాలు.

మన మతానికి గుండెకాయ అని చెప్పదగ్గవి చతుర్వేదాలు. అవే అతి ప్రమాణాలు. ఆరు వేదాంగాలు, నాల్గు ఉపాంగాలు కూడా వేదాలమీదే ఆధారపడ్డాయి. ఇవి వేదాలని అర్థం చేసుకోవటానికి వీలుగా ఉండే అనుబంధాలు. వేదాలను ఈ ఆరు అంగములతో, నాలుగు ఉపాంగములతో కలిపి అధ్యయనం చెయ్యాలి.

ఆది లేదు - కర్తలేడు :

వేదాలు "అనాది" - అంటే కాలపరిమితిలో ప్రారంభమంటూ లేనివి. వాటికి పూర్వంగాని, వాటికంటె ముందు వచ్చినవి గాని ఏమీ లేవని అర్థం. అంటే, ఇవి ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయన్నమాట. కాని దీనిని ఒప్పుకోవటమెట్లా? ఏ గ్రంథానికైనా కనీసం ఒక్కడైనా రచయిత అంటూ ఉండాలికదా? ఓల్డ్ టెస్టమెంట్ (Old Testament) ఎందరో ప్రవక్తల ప్రవచనాల సంకలనం. కొరాన్ - మహమ్మదు ప్రవక్త ప్రచారం చేసినది. ఈ వ్యక్తులు

ఎప్పుడో ఒకప్పుడు ఉండేవారు. వారికి పూర్వం వారి ప్రవచనాలు లేవు. ఈ విధంగా చూస్తే వేదాలకి కూడా ఎప్పుడో ఒకప్పుడు సజీవులైన రచయితలుండి ఉండాలి కదా. వారికి పూర్వం ఈ బోధనలు అలభ్యములే కదా. ఇది ఎంత ప్రాచీనమైనదైనా అయి ఉండవచ్చు. కాబట్టి వేదాలను 'అనాది' అనటం సమంజసం కాదని కొందరి వాదం. వేదాలను మానవులే రచించారనుకుంటే, ఇటువంటి వాదనలు సహేతుకంగానే కనబడుతాయి. ఎవ్వరూ వ్రాయక పోతే, గ్రంథమంటూ ఒకటి ఎట్లా వస్తుంది? రచయిత అన్నవాడు లేకపోతే, గ్రంథమంటూ ఉండదు. ఆ రచయిత ఎప్పుడో ఒకప్పుడు సజీవుడై యుండి ఉండాలి. మాములుగా చూస్తే "గ్రంథానికి రచయిత లేడు" అన్న వాదానికి ఏమీ బలంలేనట్టు కన్పిస్తుంది.

అందువల్ల, ఎంతో ప్రగతిని సాధించిన ఋషులనబడే వ్యక్తులు వేదాలను రచించారన్న వాదాన్ని లేవనెత్తారు. వేదాలలో ఎన్నో సూక్తులున్నాయనీ, ఇవి కొందరి ఋషుల వాక్కులనీ అన్నారు. వేదాలలోని మంత్రాలని జపించేప్పుడు, ఆ వేద పాఠానికి సంబంధించిన ఋషిపేరుగాని, ఆ మంత్రం యొక్క ఛందస్సు పేరుగాని, ఆ మంత్రానికి గల అధిష్ఠాన దేవత పేరుగాని చెప్పటం పరిపాటి. వేదమంత్రాలు ఎందరో ఋషులను పేర్కొంటాయి, అందువల్ల వారందరూ కర్తలేనన్న భావం నెలకొన్నది. ఒకోసారి ఋషి యొక్క వంశానుక్రమం కూడా చెప్పటం కద్దు. దీని వల్ల ఒకే పేరుగల యిద్దరు ఋషులను విడివిడిగా గుర్తించటం తేలిక. ఉదాహరణకి "అగస్త్యోమైత్రావరుణి" అంటే, మిత్ర, వరుణుల కుమారుడైన అగస్త్యుడని తెలుస్తుంది. అయితే, మంత్రం ఒకరిపేరున ఉంటే ఆయనే కర్త అనుకోవాలి కదా? అంటే, ఆయనకి పూర్వం ఆ వేదమంత్రం లేదని ఋజువు కాదా? అటువంటప్పుడు, వేదం "అనాది" అని ఎట్లా అనగలం? అసలు రహస్యమేమిటంటే - ఈ ఋషిగాని, ఆ ఋషిగాని, ఏ ఋషీగాని వేదమంత్రాలని కూర్చలేదు. అందువల్లే ఏ ఋషులూ వాటి కర్తలు కారు.

వేదాలు అపౌరుషేయాలు - అంటే పురుషప్రమేయం లేనివని అర్థం. "పౌరుషేయ" మంటే మానవ కల్పితం. వేదాలు మానవకల్పితాలు కానందువల్ల ఏ ఋషీ వాటిని రచించియుండడు. వారే వ్రాసి ఉంటే ఋషులను మంత్ర కర్తలనవచ్చు. కానీ వారిని మంత్ర ద్రష్టలంటాము. అంటే, మంత్రాలను దర్శించిన వారన్నమాట. దీని అర్థమిది : ఋషులు మంత్రాలను కనుగొన్నారు, లేక చూచారన్నమాట. వాటిని రచించలేదు, సృష్టించలేదు.

కొలంబస్ అమెరికాను కనుగొన్నాడన్న మాటకి అర్థం ఏమిటి? అతడు అమెరికాను సృష్టించాడనా? కానేకాదు. ఉన్న అమెరికాను మిగిలిన లోకం దృష్టికి తీసుకువచ్చాడు. న్యూటన్, ఐన్‌స్టైన్ వంటి శాస్త్రజ్ఞులు భౌతిక నియమాలను కొన్నిటిని ప్రతిపాదించి ప్రసిద్ధులైనారు. అంతేకాని వారే ఆ నియమాలను సృష్టించలేదు. భూమ్యాకర్షణ వల్లనే కదా న్యూటన్‌కి పూర్వం కూడ వస్తువులు క్రింద పడేవి; ఆయన దానిని కనుగొన్నాడు. అంతే. ఈ శాస్త్రవేత్తలు ఉన్న ప్రకృతి నియమాలను అర్థం చేసుకుని లోకానికి మొట్టమొదటిసారిగా చెప్పారు. ఆ విధంగానే సంస్థితమైన మంత్రాలను ఋషులు గ్రహించి, లోకానికి చెప్పారు.

మంత్రాలు ఎప్పుడూ ఉండనే ఉన్నాయి. ఋషులు వాటిని కనుగొనటం వల్ల, ఆ మంత్రాలకు వారి పేర్లను జోడించారు. అప్పటికే ఉండి, అజ్ఞాతంగా మిగిలిన వేదమంత్రాలని మానవలోకానికి ఎరుకపరచిన ఘనత ఋషులకు దక్కుతుంది. అందువల్లనే వారి పేర్లను చెప్పేప్పుడు మనం వారి స్మృతికి గౌరసూచకంగా శిరస్సుతో నేలను తాకుతాం. వారు చేసిన మహత్కార్యానికి నివాళి యిది. మంత్రాన్ని ఉచ్చరించటానికి పూర్వంకూడ ఈ భావంతోనే వారి పేర్లను పేర్కొంటాం. "ఋషులు మంత్రాలను కనుగొన్నార"న్నప్పుడు వారు కనుగొనక పూర్వమెక్కడ ఉండేవి? "అనాది" అంటే అవి ఎప్పుడూ ఉండేవని అర్థమా? ఉంటే, ఎక్కడ ఉండేవి? అంతరిక్షంలోనా?

సృష్టితో బాటే వేదమంత్రాలు కూడా ఆవిర్భవించాయి అనుకొంటే, సృష్టికర్త వాటిని కూడా జగత్తుతో బాటే సృష్టించాడని అర్థం కాదా? అంటే, భగవంతుడు వేదాలను రచించి, ఋషులు క్రమంగా కనుగొనటానికి వీలుగా ఎక్కడైనా దాచిపెట్టాడా? అయినా, సృష్టితో బాటే వేదాలు కూడా ఉద్భవించాయంటే అవి "అనాది" ఎట్లా అవుతాయి? ఇప్పటి బ్రహ్మసృష్టిని కొలవటం సాధ్యమే. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అనబడే ఈ యుగాలకు నిర్ణీతమైన కాల పరిమితులున్నాయి. ఇటువంటి యుగక్రమాలు వెయ్యి జరిగితే బ్రహ్మకి ఒక పగలు క్రింద లెక్క. అట్లాగే ఇంకొక వెయ్యి జరిగితే బ్రహ్మకి ఒక రాత్రి. ఈ విధంగా చూస్తే బ్రహ్మవయస్సిప్పుడు ఏభై సంవత్సరాలే. బ్రహ్మ ఆయుర్దాయం నూరు సంవత్సరాలు. ఈ బ్రహ్మకి పూర్వము మరొక బ్రహ్మ ఉండేవాడు. అందువల్ల ఇప్పటి బ్రహ్మ, అతని సృష్టి 'అనాది' కాదు. అయితే ఏది "అనాది"? పరమాత్మ అందరి బ్రహ్మలకంటే ముందే ఉండి ఉండాలి. బ్రహ్మం - అంటే నిరాకారుడైన భగవంతుడు, ఎల్లప్పుడూ ఉంటూనే ఉండాలి. ఆయన నిత్యుడు. విశ్వమూ, పదార్థమూ సృష్టింపబడటమూ, లయ మొందటమూ ఆయన వల్లనే. పరమాత్మ తన సృష్టికార్యాన్ని బ్రహ్మతోనూ, సృష్టి సంస్థితిని విష్ణువుతోనూ, సృష్టిలయాన్ని శివునితోనూ చేయిస్తాడు. బ్రహ్మ, విష్ణు, శివులుకూడా లేకుండా పోతారు. అందువల్లనే బ్రహ్మవయస్సుని లెక్కకట్టవచ్చు. తన నూరు బ్రహ్మవర్షాలూ ముగిసిన తరువాత బ్రహ్మ పరమాత్మలో లీనమవుతాడు. అప్పుడు మరొక బ్రహ్మ అందుకుంటాడు.

మళ్లీ వేదాల సంగతి చూద్దాం. పరమాత్మ వేదాలను, బ్రహ్మలకు పూర్వం, అంటే సృష్టికే పూర్వం, సృజించాడా?

సృష్టికి పూర్వమే వేదాలుండేవనీ, బ్రహ్మ తన సృష్టిని శబ్దరూపంలో సంస్థితమై యున్న వేదమంత్రాలతోనే కొనసాగించాడనీ - శాస్త్రాలవల్ల మనకి తెలుస్తుంది. శ్రీ మద్భాగవతంలోని బ్రహ్మ సృష్టి గురించిన వివరణను బట్టి ఈ విషయం తెలుసుకోవచ్చు.

అంటే పరమాత్మా, వేదాలూ అనాది అనుకోవచ్చా? కొంచెమాలోచిస్తే ఇదీ తప్పేనని తోస్తుంది. జగత్సృష్టికి పూర్వమే పరమాత్మ వేదాలను సృష్టించాడనుకొంటే, అవేవీ సృష్టింపబడక పూర్వం కొంత కాలం గడచినట్టే కదా - అంటే జగత్సృష్టికి పూర్వం భగవంతుడు కాలాన్ని సృష్టించాడన్న మాట, ఆ తరువాతే వేదాలను సృష్టించి నట్టు అర్థం వస్తుంది, అటువంటప్పుడు వేదాలు "అనాది" అని ఎట్లా అనగలం?

తానూ, వేదాలూ 'అనాది' అయితే భగవంతుడు వేదాలను సృష్టించి యుండలేడు. ఆయనే సృష్టించి ఉంటే వాటికి మొదలు అంటూ ఒకటి ఉంటుంది. అన్నీ ఈశ్వరసంభూతాలే. ఈశ్వరునికి వెలుపల ఏమీ లేనందువల్ల - ఈశ్వరుడూ, వేదమూ ఒకరితో బాటు ఒకరు ఆరంభమంటూ ఏమీ లేకుండా ఉండి ఉండాలి. కాని ఇది సరియైనదిగా తోచదు. ఈశ్వరసృష్టికాకుండా, ఈశ్వరుని పై ఆధారపడని ఉనికి లేకుండా, "అనాది" ఎట్లా సాధ్యం?

ఈ గందరగోళానికి సమాధానము వేదములోనే యున్నది. బృహదారణ్యక ఉపనిషత్తులో (2.4.10) ఇట్లా ఉంది. వేదం - ఋక్, యజుః, సామరూపాలలో - ఈశ్వరుని "నిశ్వాసితం' ' మాత్రమే. "నిశ్వాసిత" మన్న మాటకి అర్థం ఊపిరి విడవటమని. ఊపిరి లేకుండా ఉండగలమా? ఆ విధంగానే వేదాలు పరమాత్ముని ఊపిరేనన్నమాట. ఆద్యంతాలు లేని పరమాత్మ నిత్యుడే అయితే, ఆయన యొక్క ఊపిరేఅయిన, వేదాలు కూడా అనాదే - ఆయనతో బాటే అవి సంస్థితమై ఉంటాయి.

ఇక్కడ గమనించవలసిన విషయమిది : భగవంతుడు కూడా వేదాలను సృష్టించలేదని. మన ఊపిరిని మనమే కల్పించుకొన్నామనలేం కదా. మనం పుట్టినప్పటి నుండీ ఊపిరి ఉంటూనే ఉంది. ఆ విధంగానే ఈశ్వరుడూ, వేదాలూను. ఆయన కూడ వేదాలను సృష్టించాడనలేము. రెండూ ఎప్పుడూ కలిసే ఉన్నాయి.

వేద భాష్యాన్ని వ్రాసిన విద్యారణ్యులు తన గురువు సాక్షాత్తూ ఈశ్వరుడే నంటూ, ఆయన యొక్క "నిశ్వాసమే వేదాల"ని స్తుతించాడు. విద్యారణ్యులవారు భాష్యంలో తన గురువు వేదాలలో ఎట్లా లీనమై పోయారో వర్ణించటమే కాక వేదాలు ఈశ్వర సృష్టి కావని కూడ నొక్కి చెప్తారు.

గీతలో కృష్ణ భగవానుడు "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" అంటాడు - అంటే వేదాల వల్ల తెలియనగు వానిని నేనే అని అర్థం. అంతేకాదు, వేదాలను తాను సృష్టించిన వానిగా చెప్పుకొనక, వేదాంతానికి విషయమే తానంటాడు "వేదాంతకృత్" అంటాడు, "వేదకృత్" అనడు. వేదాలన్నీ తనకి తెలుసునంటాడు - వేదవిద్. వేదాంతంలో ఊహింపబడిన కేవలస్థితిలో సృష్టికి పూర్వమే ఈశ్వరుడూ, వేదాలూ కలిసి ఉండేవి.

గీతలో వలె భాగవత పురాణంలో కూడా వేదాలను భగవంతుడు కల్పించినట్లుగా ఎక్కడా లేదు. ఆయన హృదయంనుండి విస్ఫుట మయ్యాయని ఉంది. స్ఫుటమవటమంటే ఉన్నదేదో హఠాత్తుగా బయటపడటమని అర్థం. అంతకు పూర్వం లేనిది క్రొత్తగా వచ్చిందని అర్థం కాదు. మొట్టమొదటగా జనించిన బ్రహ్మ ఆది ఋషి. ఆయనకే అన్ని వేదమంత్రాలూ ఎరుక. ఈ ఎరుక కల్పించిందీ ఈశ్వరుడే. ఎట్లా? బ్రహ్మ నేర్చుకోవాలని ఉచ్చరించాడా? కాదు. తన హృదయం ద్వారా ఇచ్చాడు. భాగవత పురాణంలోని మొదటి శ్లోకంలో "తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే." అంటే ఈశ్వరునిలో వేదాలు ఎప్పుడూ, ఆయన శ్వాసగా ఉన్నట్టు స్పష్టమవుతోంది. ఈశ్వరుని సంకల్పం వల్ల బ్రహ్మకి వాటి గురించి ఎరుక కలిగింది. ఈశ్వరుని హృదయకంపనల మార్గ దర్శకత్వంలో తన సృష్టిని కొనసాగించాడు బ్రహ్మ. ఇది సాధ్యమా? కంపనలు అంత పని చెయ్యగలవా?

# 2

# శబ్దమూ - సృష్టీ

శబ్దమంటే ఏమిటి? ఆధునిక విజ్ఞానం ప్రకారం, ప్రకంపనం. అణువిజ్ఞాన శాస్త్రమూ, ఐన్‌స్టైన్ సిద్ధాంతమూ, అణురూపంలో పదార్థమంతా ఒక్కటేనని నిరూపించాయి (ఇది వేదాంతంలోని అద్వైతం!). కాని వస్తువులన్నీ కళ్లకి వేరువేరుగా కనబడుతాయి. దీనికి కారణం ప్రాథమిక శక్తి వివిధ ప్రదేశాలలో వేరువేరు వేగాలతో ప్రకంపించటం.

ప్రకంపనం శబ్దాన్ని కలిగిస్తుంది. దీనినే వేరే విధంగా చెప్పాలంటే - శబ్దం రావాలంటే ప్రకంపనాలని సృష్టించాలి. ప్రాథమిక శక్తి యొక్క ప్రకంపనలు వేరు వేరు వేగాలతో సంభవించటం వల్ల విశ్వ సృష్టి జరిగిందన్న శాస్త్ర వాదమూ, పరమాత్ముని శ్వాసమూలంగానే విశ్వసృష్టి జరిగిందన్న వేదవాక్యమూ పొంతన కలిగే ఉన్నాయి.

మానవునిలోనూ, మృగాలలోనూ ఆరోగ్యానికీ, అనుభూతులకీ మూలం ఏమిటి? ఉచ్ఛ్వాసనిశ్వాసాలు - ఊపిరి శరీరంలోని వివిధనాడులలో ప్రసరిస్తూ ప్రకంపనలను కలిగిస్తుంది - ఇదే ఆరోగ్యానికీ, అనారోగ్యానికీ కారణం. యోగాభ్యాసం వల్ల నాడుల ద్వారా ఊపిరి ప్రసారాన్ని నియమబద్ధం చేస్తే అద్భుతమైన ఆరోగ్యం కలుగుతుంది. అటువంటి సందర్భాలలో రక్తనాళం తెగినా రక్తస్రావం జరుగదు. యోగులు, గుండెనీ నాడినీ స్తంభింపచేసి భూమిలో సమాధిస్థితిలో ఉండగలరు. పాము విషంగాని, తేలుకుట్టినాగాని వారిని ఏ మాత్రమూ బాధించవు. వాళ్లు మామూలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నియమబద్ధం చేయ గలగటం వల్లనే ఇవన్నీ సాధ్యం.

దేహం సజీవంగా ఉండటానికి మాత్రమే ఊపిరి యొక్క అవసరం పరిమితం కాదు. మనస్సూ, మానసిక ఆరోగ్యమూ కూడా దానిపై కొంతవరకు ఆధారపడి యున్నాయి. దీనికి కారణమిది: మన భావాలన్నిటికీ మూలమైన మనస్సూ, జీవశక్తికి మూలమైన ప్రాణమూ ఒకటే అవటం. నాడుల ప్రకంపనలే ఆరోగ్యకరమైన (మంచి) ఆలోచనలకి గాని అనారోగ్యకరమైన (చెడు) ఆలోచనలకి గాని మూలం. ఇది మీకూ అనుభవమయ్యే ఉంటుంది. భగవత్సాన్నిధ్యాన్ని అనుభూతికి తెచ్చే ప్రదేశంలో గాని, మానసిక ప్రశాంతిని కలిగించే సత్పురుషుని సమక్షాన గాని ప్రాణం ఎట్లా ఉంటుంది? కోపంగాని, ఉద్వేగంగాని కలిగినప్పుడు ప్రాణం ఎట్లా ఉంటుంది? ఈ రెండు పరిస్థితులలోనూ శ్వాసతీరే వేరువేరుగా ఉంటుంది కదా. రకరకాల ఆనంద సమయాలలో, సంతోషవేళలలో కూడా శ్వాస వివిధరీతులలో ఉంటుంది.

ధార్మిక అభ్యాసాల వల్లగాని, భజనలవల్ల గాని కలిగే ఆనందానికీ, ఇంద్రియ సంతృప్తి వల్ల కలిగే ఆనందానికీ తేడా ఉంది. సాధారణంగా, ఉచ్ఛస్థితికి చెందిన ఆనందం

కలిగినప్పుడు నిశ్వాసం కుడి నాసికాపుటం ద్వారా జరుగుతుంది. కేవల ఇంద్రియసుఖంలో ఎడమ నాసికాపుటం ద్వారా జరుగుతుంది. మనస్సులో ఉన్నతమైన భావాలు కలిగినప్పుడు ఇంద్రియాలన్నీ దానిపై కేంద్రీకృతమవుతాయి. అటువంటుప్పుడు ఊపిరి నెమ్మదిగా, లయబద్ధంగా రెండు నాసికాపుటాల ద్వారానూ సాగుతుంది. దేని గురించి చింతిస్తోందో, దానిలో భావం లీనమై పోయినప్పుడు ఊపిరి నిలిచిపోతుంది, మనస్సు ఆలోచించటం మానివేస్తుంది. అయినా ప్రాణి సజీవంగానే ఉంటుంది. అప్పుడే జ్ఞానం లేక శుద్ధ చైతన్య స్థితి జీవిని ఆవహిస్తుంది.

కాబట్టి, జీవుని భౌతిక దేహమూ, ఎరుక కలిగి ఉండటమూ (చైతన్యమూ) కూడా ఊపిరి యొక్క శక్తి వల్ల సృజింప బడినవే - దానిపైనే అవి ఆధారపడి యున్నాయి. ఊపిరి ఆడటం ఆగగానే అవీ ఆగిపోతాయి. ఊపిరి ఆడటమంటే మనస్సులోని ప్రకంపాలని నిబద్ధం చేయటమే.

అన్ని పదార్థాలూ - చేతనమైనవైనా, అచేతనమైనవైనా - పరమాత్ముని నుండే ఉత్పన్నమవుతాయి, అనేక రూపాలు ధరిస్తాయి, మార్పు చెందుతాయి, అదృశ్యం కూడా అవుతాయి. ఇన్ని రకాల మార్పులని కల్పించటానికి అవసరమైన ప్రకంపనలు "పరమాత్మ" అనబడే దాని నుండే రావాలి కదా!

బ్రహ్మం - నిర్గుణమూ, అచలమూ, అవ్యయమూ అనే అద్వైత సిద్ధాంతాన్ని కాస్సేపు ప్రక్కకి పెట్టుదాం.

అద్వైతమతానుసారం అనిర్వచనీయమైన మాయా శక్తితో కలిసే బ్రహ్మం దృశ్యమానమైన జగత్తులో అనేక రూపాలు ధరిస్తుంది. అట్లా కనబడటం మిధ్యే అయినా కాకపోయినా ఒకే మూల శక్తి సజీవంగానో, జడంగానో రూపం ధరిస్తుందని ఒప్పుకోవాలి. అది మాయే అయినా దేనిపైనో ఆధారపడాలి కదా. ఆ ఆధారమే ఈశ్వరుడు. అనేక రూపాలను ధరించే మాయ కూడ పరబ్రహ్మయొక్క ప్రకంపన ఫలితమే.

అనేక రూపాలను ధరించే ప్రకంపనలున్నా పరబ్రహ్మ అంతరంలో ఏ కదలికా లేక నిశ్చలంగా ఉంటుంది. మనకి మాత్రం రూపంధరించిన ప్రకంపనలు తెలుస్తాయి. ఇవి కూడా ఎంతో క్రమ బద్ధంగా ఉంటాయి. కక్ష్యలో పరిభ్రమించే అసంఖ్యాకమైన సౌరమండలాలు మొదలు ఒక గడ్డిపోచ, ఒక దోమ, సృష్టి వరకూ ఏదో ఒక నియమముంది.

విశ్వశ్రేయస్సు ఈ నియమంపైనే ఆధారపడి ఉంది. ప్రకృతి శక్తిని పరమాత్మ విశ్వసృష్టికీ, విశ్వపాలనకీ వినియోగించాడు. అయినా ఒక్కొక్కసారి ఈ నియమం తప్పుదారిని పట్టినా భగవంతుడు చూస్తూ ఊరుకొంటాడేమో ననిపిస్తుంది ! ఈ కారణం వల్లనే ప్రకృతి శక్తులు హద్దులు మీరటం చూస్తూంటాం. ఒకోసారి వర్షాలు పడవు. ఒకోసారి వరదలు మరీ విపత్కరంగా సంభవిస్తూంటాయి. మానవుని మనస్సువలె ఏదీ తన నిజప్రకృతికి దూరం

కాలేదు. విషయవాంఛలు చాలా బలీయం. ప్రకృతి సిద్ధమైన నియమాలూ, నిబంధనలూ సంయమనమూ ఏర్పడ్డా అన్ని హద్దులనూ, ఆంక్షలనూ ప్రక్కకు పెట్టి మనస్సు ఉన్మత్తతతో విశృంఖలమవుతూంటుంది.

మానవశ్రేయస్సుకు వ్యతిరేకంగా వర్తించే ప్రకృతి శక్తులను దారిలో పెట్టటం సాధ్యమేనా అనే ప్రశ్న కూడ ఉత్పన్నమవుతూంటుంది. అట్లాగే వెఱ్ఱి తలలు వేసే మనస్సుని అదుపులో పెట్టటం సాధ్యమేనా?

దృశ్యమానమైన జగత్తుకి ప్రకంపనలు, శబ్దమూ కారణమని గ్రహిస్తే, ఆ ప్రకంపనలే ఆ శబ్దమే - గతి తప్పిన ప్రకృతి శక్తులను సన్మార్గంలో పెట్టగలవనీ, అపవిత్రమైన ఆలోచనలు కల మనస్సుని క్షాళనం చేయగలవనీ అంగీకరించాలి. వేదాలు అట్టి ప్రకంపనలే, అట్టి శబ్దాలే !

యోగంలో ప్రాణాయామం సహాయంతో విశ్వనిశ్వాసంతో సంధానమేర్పర్చుకొని సమిష్టికీ, వ్యక్తికీ ప్రయోజనకరాలైన పనులు చేయవచ్చు. నాడులూ, నరాలూ చేసే ప్రకంపనలు మనిషి చెవులకు వినబడవు. ఈ సత్యాన్ని చాలా మంది ఒప్పుకొంటున్నారీ రోజులలో.

ఈ విధంగా చూచినప్పుడు విజ్ఞాన శాస్త్రం మతానికి వ్యతిరేకం కాదని గ్రహించవచ్చు. పైపెచ్చు, సమాజంపై మతప్రభావాన్ని పెంచటానికి కూడ దోహదమవుతుంది.

ఒక శతాబ్దం పూర్వం, అంటే రేడియో, టెలిఫోన్‌లను కనుగొనక పూర్వం, వేదోచ్చారణకూ, శ్వాసకూ గల ప్రభావంపై నమ్మకంలేని వారి శంకలను నివృత్తి చేయటం కష్టమయేది. కాని వీటిని కనుగొన్న తరువాత మనకి క్రొత్త మద్దతు దొరికింది.

నిర్జీవమైన రేడియోకి గల శక్తిని సజీవమైనవి కూడా పొందవచ్చు. నిజానికి, అంతకంటె ఎక్కువ శక్తినె సంపాదించ వచ్చు. దీనిని సాధ్యపరచేది, తపస్సు.

ఇల్లూ, సంసారమూ కల్పించే సౌకర్యాలనీ, ఆకలీ దప్పికా కలిగించే అవసరాలనీ, నిద్రా విశ్రాంతీ కలిగించే సౌఖ్యాన్ని లెక్క పెట్టకుండా ఏదో ఒక లక్ష్యంపై మనస్సుని, మానసిక శక్తినీ కేంద్రీకరించటమే తపస్సంటే. ఈ పని చేసేప్పుడు "దీనినంతా నేను చేస్తున్నాను, నేనింత కష్టపడు తున్నాను కాబట్టి నాకు సత్య స్వరూపం తెలుస్తుంది" అనే భావానికి తావీయకూడదు. అంత శ్రమలోనూ, ఏ ప్రయత్నమైనా సఫలం కావటానికి భగవంతుని అనుగ్రహం ముఖ్యావసరమన్న గుర్తింపూ, నమ్రత ఉండాలి. ఋషులు అటువంటి తపస్సు చేశారు. యోగశక్తుల మహోన్నత శిఖరాల నందుకొన్నారు.

జగత్సృష్టికి కారణభూతములైన ప్రకంపనలను, అంటే విశ్వనిశ్వాసాన్ని, ఎరుక కలిగి ఉండేవారు ఋషులు. అంతే కాదు, విద్యుత్ తరంగాలు శబ్ద తరంగాలుగా మారినట్లుగానే

వారికి కూడ అంతరిక్షంలోని తరంగాలు మారి చెవికి సోకేవి. వీటినే వారు లోకానికి వేదమంత్రాలుగా అనుగ్రహించారు.

ఇంకొక విషయం కూడా స్ఫురిస్తుంది నాకు, వేదాలను 'శృతి' అంటారు - అంటే వినబడినది అని అర్థం. సంస్కృతంలో చెవిని "శ్రోత్రమ్" అంటారు. పూర్వ కాలం గురుశిష్య పరంపరానుసారం వేదాలు ఒక తరం నుండి వేరొక తరానికి లిఖిత పూర్వకంగా కాక, అనుశ్రుతంగా సంక్రమించాయి. అందువల్లనే వేదాలను 'శృతి' అంటారని కొందరి భావం. అయితే, వేదాలు చదువుకొని, నేర్చుకోవటానికి వీలుగా లిఖిత రూపంలో ఎందుకు లేవు? దానికొక కారణమిది; కొన్ని శబ్దాలు ఉచ్చారణ ప్రకారం సరిగ్గా వ్రాయలేక పోవటం. ఆ ఉచ్చారణ ఒకోసారి రెండు అక్షరాల నడుమ ఉన్నట్లుంటుంది - ఇటువంటి శబ్దాలు వేదాలలో కోకొల్లలు. ఇటువంటి వాటిని ఉచ్చారణ ద్వారానే ప్రచురించ వలసి వస్తుంది. అంతేకాక, వేదమంత్రాలను లయబద్ధంగా ఉచ్చరించాలి (అట్లా చేస్తేనే సరియైన ప్రకంపనలు ఉత్పన్నమవుతాయి) కొన్ని శబ్దాలను ఉచ్చస్థాయిలోను, మరికొన్నిటిని మధ్య స్థాయిలోను ఇంకాకొన్నిటి అధమ స్థాయిలోనూ పలుకాలి. ఇటువంటి వ్యత్యాసాలను సూచికల ద్వారా గాని, చుక్కల ద్వారా గాని తెల్పినా కొన్ని దోషాలు దొర్లుతాయి. అందువల్ల ఉచ్చారణ కూడ పొరబడుతుంది. తత్ఫలితంగా ఆ మంత్రాల ప్రభావం కూడ తగ్గుతుంది. మామూలుగా కూడా, హెచ్చుతగ్గులతో వినబడే శబ్దాలకీ, ఒకే మాదిరిగా ఉండే శబ్దాలకీ మనపై ఉండే ప్రభావాన్ని చూడండి. మన ప్రతిస్పందనే కాదు - ప్రకృతి చేతలని క్రమపరిచే దివ్య శక్తి కూడ స్వరభేదం వల్ల ప్రభావిత మవుతుంది.

వేదాలలోనే (తైత్తిరీయ సంహితలో) ఉచ్చారణలోని మార్పుల వల్ల ఫలితాలు ఎట్లు విపరీతంగా మారుతాయో తెలిపే కథ ఒకటుంది. త్వష్ట అనే దివ్యశిల్పి ఇంద్రుని సంహరించగల కుమారుని కోసం "ఇంద్ర శత్రుర్వర్ధస్వ" అనే ఒక మంత్ర జపం చేశాడు. ఈ జపం చేసేప్పుడు స్వరాలను తప్పుగా ఉచ్చరించాడు. దీని వల్ల అతని ప్రార్థనకు సరిగ్గా వ్యతిరేకమైన ఫలితాలు లభించాయి. ఇంద్రుణ్ణి పరిమార్చే కుమారుణ్ణి గాక, ఇంద్రునిచే పరిమార్చబడే కుమారుడు అతనికి కలిగాడు. స్వరభేదం వల్ల,

రేడియో ట్యూనింగ్ కొద్దిగా మారిస్తే మనకి వేరొక కేంద్రం నుంచి వచ్చే ప్రసారం వినబడుతుంది. మనకి కావలసిన ప్రసార కేంద్రం కోసం సరిగ్గా ట్యూనింగ్ చేసుకోవాలి. వేదాలను వల్లించేప్పుడూ అంతే. స్వరము, నిర్దుష్టంగా ఉండాలి. రేడియో ట్యూనింగ్‌లో జరిగే మార్పువలెనే - వేద మంత్రాల పఠనంలో మార్పు వల్ల కూడా ఫలితాలు మారుతాయి. ఈ కారణాల వల్లనే, గురు ముఖతః వేద మంత్రాలను అభ్యసించాలన్న నియమమేర్పడింది.

వేదాలను 'శృతి' అనటానికి అసలు కారణమిది, సామాన్య మానవులకు వినబడని శబ్దాలను ఋషులు ఆలకించి యథాతథంగా శిష్యులకు నేర్పారు. తపోనిష్ఠలో ఉండి

అటువంటి శబ్దాలను గ్రహించే స్థితిలో ఋషులున్నప్పుడు ఆ వేద శబ్దాలు వారికి సాక్షాత్కరించాయి. అందువల్లనే వేదాలను `శృతి` అంటారు - `వినబడినది` అని అర్థం.

ఋషులను మంత్ర ద్రష్టలంటారని అన్నాను. అంటే మంత్రాలను దర్శించిన వారని అర్థం. మంత్రాలను నక్షత్రమండలాల వలె ఋషులు దర్శించారని అర్థం చెప్పుకోవచ్చు.

వీటన్నిటిలో ఏది సరియైన భావం? వాళ్లు వాటిని విన్నారా? చూచారా? వాటిని చూచి ఉంటే - ఏ భాషలో, ఏ లిపిలో వ్రాయబడ్డాయి - అప్పటికి దేవనాగరికీ గ్రంథలిపికీ పునాదియైన బ్రాహ్మీ లిపి కూడ లేదాయె! వ్రాయబడి యున్నా, వేదపాఠాలను ఉచ్చారణకనుగుణంగా సరిగ్గా వ్రాయటమసంభవం. ఈ గందరగోళానికి సమాధానమిదిః ఋషులు "చూచా"రన్నా "విన్నా"రన్నా యదార్థ మేమంటే వారు ధ్యానమగ్నులై యున్నప్పుడు వాటిని తమలో గుర్తించారు. అంటే ఒక్కసారిగా వారికి స్ఫురణ కలిగి, అంతరంగంలో మంత్రాల అవగాహన కలిగింది. వారున్న ఉచ్ఛస్థితిలో భౌతికంగా కళ్లు చూచి ఉండకపోవచ్చు, చెవులు వినియుండక పోవచ్చు. అయినా వారి అంతరాంతరాలలో వేద శబ్దాలు వారికి అనుభవసిద్ధమైనాయి వారిపై వాటి ప్రభావాన్ని విడిచాయి.

"చూడ"టమంటే ఎల్లప్పుడూ కంటితో చూడటమనే అర్థంకాదు. బాహిరవస్తుజాలం మన ఇంద్రియాలపై కల్పించే ఏ ప్రభావానన్నా ఇట్లా వర్ణించవచ్చు. ఫలానా వ్యక్తి "జీవితంలో ఒడుదుడుకులను చూచాడ"న్నప్పుడు అతనికి జీవితంలోని సుఖ దుఃఖాలు భౌతికంగా కనబడ్డాయని అర్థం కాదు. అతడు జీవితంలో సుఖదుఃఖాలను అనుభవించాడనే దాని అర్థం. కాబట్టి మంత్ర ద్రష్టలన్న మాటని ఋషుల ఆధ్యాత్మికానుభూతి గానే మనం అర్థం చేసుకోవాలి.

వేదాలను గ్రహించటానికి అనువైన, ప్రతిభా సమన్వితమైన చెవులుకల 'దివ్యశ్రోత్రులు' ఋషులని చెప్పుకోవచ్చు.

అర్జునుడు శ్రీ కృష్ణుని విశ్వరూప దర్శనం కోరినప్పుడు ఆయన "నీవు నన్ను నీ చర్మచక్షువులతో చూడలేవు - నీకు దివ్యదృష్టినిస్తాన"న్నాడు గీతలో. (దివ్యందదామితే చక్షుః). అర్జునుడు దివ్యనేత్రాలు పొందినట్టే ఋషులు కూడ దివ్యకర్ణాలను పొంది అంతరిక్షంలో సదా సంస్థితమైన మంత్రాలను వినగలిగారు.

ఇదంతా చెప్పటానికి కారణం - వేదాలు ఎవరి వల్లా రచింపబడలేదని చూపటానికే. ఋషులు వాటిని రచించలేదు. పరమాత్ముడూ కూర్చొని వేదాలను వ్రాయలేదు!



# 3

# వేదములపై పరిశోధన

వేదముల గురించి మన దేశంలో మనకి తెలిసినదానికి మూలం పాశ్చాత్య పండితులు చేసిన పరిశోధనా, వారి అడుగు జాడలలోనే జరిగే మన దేశస్థుల పరిశోధనలూను. ఇది చాలా శోచనీయం. వేదాల గురించి పాశ్చాత్యులెన్నో పరిశోధనలు చేశారు, నిజమే. వారి కృషిని మనం గుర్తించాలి - వారికి కృతజ్ఞతను కూడా చూపాలి. వేదాల ఘనతని చూచి స్ఫూర్తి పొందిన మాక్స్ - ముల్లర్ వంటి మహనీయులు వేదాలకి సంబంధించిన విషయాలనెన్నిటినో శ్రమపడి సేకరించారు, విశ్లేషించారు. వేదాలపై ఎన్నో గ్రంథాలు వ్రాశారు. రమారమి రెండు వందల సంవత్సరాల క్రితం, కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి సర్ విలియమ్ జోన్స్ స్థాపించిన ఆసియాటిక్ సొసైటీ అనే సంస్థ ప్రచురించిన గ్రంథాలను చూస్తే మనమాశ్చర్య చకితుల మవుతాం. ఈ స్టిండియా కంపెనీ సహాయం వల్ల మాక్స్ ముల్లర్ శాయనుని టీకతో ఋగ్వేదాన్ని ఎన్నో సంపుటాలుగా వెలువర్చాడు. అంతేకాక, ఇంకా ఎన్నో హైందవ మత గ్రంథాలను కూడ ప్రచురించాడు. ఎందరో ఆంగ్లేయులు, జర్మనులు, ఫ్రెంచివారు, రష్యన్లు ఎంతో శ్రమకోర్చి పరిశోధనలు జరిపారు. దేశంలో ఎక్కడెక్కడో యున్న వేదపాఠాలను, తత్సంబంధమైన అనువాదాలను, సూత్రాలను సేకరించి ప్రచురించారు.

మన సాంస్కృతిక వారసత్వానికి సేవ చేసిన విదేశీయులు కూడా ఉన్నారు. లార్డ్ కర్జన్ వైస్‌రాయ్‌గా ఉన్నప్పుడే పురాతన కట్టడాల పరిరక్షణ చట్టం (Protection of Ancient Monuments Act) వచ్చింది. అది కొంత విధ్వంసాన్ని ఆపింది. ఫెర్గూసన్ దేశంలోని శిల్పసంపదని ఫోటో తీసి దాని గురించి మనకి ఎరుక కల్గించాడు. కనింగ్ హామ్, మార్టిమర్ వీలర్, సర్ జాన్ మార్షల్ - ప్రసిద్ధులైన పురావస్తు శాస్త్రవేత్తలు. దేశపు నలుమూలలనుండీ తాళపత్ర గ్రంథాలను సేకరించిన వాడు మెకన్జీ - ఇదే జరుగక పోతే మనకి మన శాస్త్రాల గురించి ఇంత తెలిసేది కాదు. బ్రిటిష్ వారి పరిపాలనా కాలంలోనే ఎపిగ్రాఫీకి వేరే శాఖను నెలకొల్పారు. పరపాలన వల్ల మనకెంతో మేలు చేకూరింది. కాని హాని కూడ జరిగింది. ఈ పాశ్చాత్య పండితులు వేదాలలోని విషయాలను తీసుకొని మన చరిత్ర వ్రాయబూనారు. అంతకు పూర్వం ఎవరూ ఎరుగని "ఆర్యులు - ద్రావిడులు భిన్న జాతులన్న" వాదాన్ని లేవనెత్తారు. దీని వల్ల స్పర్థలేర్పడ్డాయి. వారి దృష్టిలో వారిది తార్కికదృక్పథం. వారికి ఇంద్రియగ్రాహ్యం కాని దేదైనా సరే కాల్పనికమే. ఈ దృక్పథమే వారి నిర్ణయాలకు ఆధారం. దీని వల్ల ప్రాచీన ఋషులు ఆధునికుల కంటె తక్కువ వారని అనగలిగారు. మన మతగ్రంథాలను వారు విశ్లేషించేటప్పుడు కూడా క్రైస్తవ మతం మన మతం కన్నా గొప్పదని చూపటమే వారి ధ్యేయం. పైకి మాత్రం తటస్థంగా పరిశోధన జరుపుతున్నట్టు కనబడుతూ నిరంతరం మన మతాన్ని ఆక్షేపించేవారు.

సంస్కృతానికి, వారి భాషలకీ కల సారూప్యాన్ని గమనించి అనేకులు మన గ్రంథాలను కేవలం భాషాశాస్త్రం దృష్టితోనే అధ్యయనం చేశారు.

వారి అవిశ్రాంత పరిశోధననీ, వారు వేదాల మహనీయతకు తెచ్చిపెట్టిన ప్రాచుర్యాన్నీ మనం కొనియాడ వచ్చు. కానీ వేదమంత్రోచ్చారణ వల్లా, వేదోక్త కర్మల నిర్వహణ వల్లా విశ్వశ్రేయస్సున నెలకొల్పవచ్చనే ముఖ్యాంశాన్ని వారు గ్రహింపలేదు - సరికదా, మానవుని బుద్ధికి అందని వేదాల గురించి ఆ బుద్ధితోనే, విశ్లేషింపబూనారు. సామాన్యుని నిత్య జీవితంలో శబ్దంగా కార్యరూపంలో సజీవశక్తిగా ఉండవలసినది, ఉద్గ్రంథాలలో నిర్జీవంగా నిక్షిప్తమై పోయి గ్రంథాలయాలలో ఉండటానికి మాత్రం పనికి వచ్చింది - పురాతన వస్తుజాలాన్నీ అస్థిపంజరాలనీ ప్రదర్శించే మ్యూజియంలోని జంతువులవలె !

**వేద కాలం గురించిన పరిశోధన తప్పు :**

వేదములు అనాది - అంటే మొదలు లేనివి - అనే విషయంపై పాశ్చాత్యుల ధోరణిని విశదీకరించటానికే వారి ప్రస్తావన తెచ్చానిక్కడ. వేదాలకు మొదలు అంటూ ఏదీ లేదన్న సత్యం వారి మెదడుకి ఎక్కదు. శాస్త్ర పరిశోధన తటస్థవైఖరిని ఆశిస్తుంది - అయినా మన పవిత్ర గ్రంథాల మహనీయతని వారిలో కొందరు అంగీకరింపలేక పోయారు. అటువంటి అపోహ లేకపోయినా మరికొందరు తర్కమూ, హేతువాదమూ విధించే పరిధులను దాటలేకపోయారు. వేదాలు అనాది - అనే భావాన్ని అంగీకరింపలేక "విద్యావంతులైన" కొందరు హైందవులు కూడ గాఢమైన "పరిశోధన"కి ఉపక్రమించారు.

ఈ పరిశోధనానుసారం కాలనిర్ణయానికి రెండు విషయాలుపకరిస్తాయి. మొదటిది, భూగోళ శాస్త్రపు ఆధారాలు. రెండవది రచనలో వాడిన భాషా శైలి. ఈ పద్ధతి వల్ల వేదాల కాలం గురించి నిరపేక్షణీయమైన నిర్ణయాలకు వారు రాగలిగారా? రాలేక పోయారు. ఒకో పరిశోధకునికీ ఒకో అభిప్రాయం. తిలక్ వేదాలు క్రీ.పూ. 6000 నాటి వన్నారు. కొందరు క్రీ.పూ. 3000 నాటి వంటే మరికొందరు ఇంకా సమీపంగా క్రీ.పూ. 1500 నాటి వన్నారు.

ఇతర మతగ్రంథాల విషయంలో ఇటువంటి భేదాభిప్రాయాలు లేవు. బౌద్ధుల 'త్రిపీటకము' అనే గ్రంథం గురించి ఏ అభిప్రాయభేదాలూ లేవు. అది అశోకుని రోజుల నాటిది, కాని అందులోని బుద్ధుని ప్రవచనాలు అంతకు ముందు కొన్ని శతాబ్దాల ముందువి - రమారమి 2500 సంవత్సరాల పూర్వపువి - బుద్ధుని జీవితకాలం నాటివి. అట్లాగే బైబిల్ (న్యూటెస్టమెంట్) గురించి కూడా ఏకాభిప్రాయమే ఉంది. అది దాదాపు 2000 సంవత్సరముల నాటిది. మన వేదాల గురించే ఏ విధమైన నిశ్చితాభిప్రాయానికీ ఆధారాలు లేవు. వేదాల కాలం గురించి నిర్ణయించటానికి పైన నేను చెప్పిన రెండు పద్ధతుల గురించి ఇంకొంచెం వివరిస్తాను -

వేదాలలో కొన్ని చోట్ల నక్షత్రాల ఉనికి గురించి ప్రస్తావన ఉంది. గ్రహాల కూడలి ననుసరించి, జ్యోతిషశాస్త్ర లెక్కలప్రకారం కొందరు వేదాలు క్రీ.పూ. 6000 నాటివనో, మరెప్పటివనో అంచనాలు వేస్తారు.

కాని అటువంటి గ్రహాల కూడలి క్రీ.పూ. 6000 నాటివేననీ, ఇంకెప్పుడూ సంభవించ లేదనీ ఎట్లా అనగలం? అటువంటి కూడలి ప్రస్తుతపు విశ్వసృష్టికే పరిమితం కాకుండా అంతకు పూర్వ మెప్పుడో కూడా సంభవించి ఉండవచ్చు కదా. వీటిలో వేటి గురించి వేదాలు ప్రస్తావిస్తున్నట్టు? కాబట్టి కాలాతీతులైన ఋషులు అనుగ్రహించిన వేదాలకు ఈ కాలమానాలు వర్తించవు. వేదాలలోనే ఉన్నాయనబడే జ్యోతిష్యపు ఆధారాలు విషయాన్ని ఏ మాత్రమూ సులభగ్రాహ్యం చేయవు.

వేదాల కాలనిర్ణయానికి ఇంకొక మార్గం - వాటిలో వాడబడిన భాష. భాషకి శైలీ, లిపీ ప్రధానమైన అంశాలు. ఇప్పుడు భారతదేశంలో ఉన్న లిపులన్నిటికీ మూలం బ్రాహ్మీ లిపి. ఉదాహరణకి : పైపైన చూస్తే ఇప్పటి తమిళలిపికీ దేవనాగరి లిపికీ పోలిక కనబడక పోవచ్చు - కాని లిపిశాస్త్రజ్ఞులు మౌలికమైన బ్రాహ్మీ లిపి ప్రతివందేళ్లకూ ఏయే పరివర్తనలు చెందిందో చూపే పట్టికలను తయారు చేశారు. దీనిని బట్టి వివిధ ప్రాంతాలలో వివిధ సందర్భాలలో అనేక మార్పులు వచ్చాయనీ, ప్రస్తుతం ఒక లిపికీ మరొక లిపికీ పోలిక కనబడక పోయినా, అన్నిటికీ మూలం బ్రాహ్మీ లిపియేనని తెలుస్తుంది. ఒకోసారి నాకు పరిహాసానికి ఇట్లాతోస్తుంది: మూలానికి మీసాలు మొలవగా ఇప్పటి లిపులన్నీ తయారైనాయని ! ఆ పట్టికను మీరు గమనిస్తే నేనన్నది మీకింకా బాగా అర్థమవుతుంది. దేవనాగరిలో ఉ (उ) ఊ (ऊ) అనే అక్షరాలు ఈ విషయాన్ని నిరూపిస్తాయి. అలాగే, తమిళలిపి చూస్తే ఆదిమలిపికి కొమ్ములు మొలిచాయేమో ననిపిస్తుంది. పూర్వపు రాజుల శాసనాలు, ప్రకటనలూ రాళ్లపైనా రాగిరేకులపైనా చెక్కబడ్డాయి. వీటిని పరీక్షిస్తే కాలక్రమేణా వచ్చిన మార్పులు స్పష్టంగా తెలుస్తాయి. ఒక శాసనం ఏ కాలందో తెలుసుకోవటానికి లిపి ఉపయోగిస్తుంది.

వేదాల విషయం తీసుకుంటే ఇవి ఎక్కడా ఏ రాతిపైనా చెక్కబడ లేదు. అందువల్ల వాటి కాలనిర్ణయానికి "లిపి" ఉపయోగించే ప్రసక్తే లేదు. ఇక మిగిలిన దల్లా భాషా శైలిని పరీక్షించడం.

మాటల వల్ల మనకి అర్థమయ్యే విషయాలూ, అవగాహనకీ శబ్దం యొక్క ప్రభావం - కాలక్రమేణా మార్పు చెందుతూనే ఉన్నాయి. ప్రాచీన తమిళ సాహిత్యంలో వాడిన పదాలు ఇప్పుడు అర్థమే కావు. ఇదే పరిస్థితి ఇతర భాషలలోనూ ఉంది. కొన్ని శబ్దాలు కాలానుగుణంగా మారి పోయాయి - వాటి అర్థం కూడా మారిపోయింది.

తరువాత వచ్చిన వాఙ్మయం వల్ల వేదాలు సులభ గ్రాహ్యాలు కావు. ఈ రకమైన మార్పు ఇతర భాషలలో కూడా ఉంది. ఉదాహరణకి, ప్రాచీనకాలం నాటి ఇంగ్లీషు - అంటే వెయ్యి సంవత్సరాల పూర్వపుది - ఆధునికులకు అర్థం కాదు. అమెరికాలో గత మూడువందల

ఏళ్లల్లోను ఇంగ్లీషు ఎంతో మార్పు చెందింది. దానిని అమెరికా ఇంగ్లీషు అనవలసిన స్థితి వచ్చింది.

వాడుక వల్ల ఉచ్ఛారణలో మార్పులు ఏ రీతిగా ఎంత వేగంగా ఉంటాయో పరిశోధకులు కనుగొన గలిగారు. కానీ మాటల అర్థంలోని మార్పులను ఇంత నిశితంగా కనుగొన లేకపోయారు. కాబట్టి ఈ పరిశోధకులు వేదాల కాలం నిర్ణయించటానికి వేదాలలోని పదాల ఉచ్ఛారణలో వచ్చిన మార్పులని ఒక ఆధారంగా తీసుకున్నారు. వారి దృష్టిలో పదజాలం యొక్క ఉచ్చారణ బాగా మారటానికి రెండు వందల సంవత్సరాలు పట్టుతుంది. వారి దృష్టిలో, వాడుకలో లేని మాటల ఆధారంగా వేదాలలోని పదాలలో ఎన్ని మార్పులు వచ్చాయో గమనించవచ్చు. ఈ లెక్క ప్రకారం, ఒక మాట పది మార్పులు చెందితే ఆ మాట 2000 సంవత్సరాలదని నిర్ణయించారు. వేదాలలోని ఒక మాట ముప్పై మార్పులు చెందితే వేదకాలం 3000 క్రీ.పూ. అని అన్నారు. అంటే, వేదాలు అంతకు పూర్వ ముండటానికి అవకాశం లేదని - ఈ విధంగానే లెక్కలు కట్టారు.

ఈ సిద్ధాంతమే నిరాధారమైనది. నిత్యం వాడుకలో ఉన్న పదాలు ఉచ్ఛారణలో మార్పు చెందుతాయి, వాటి అర్థంకూడా మారుతూంటుంది. వేదాలను ప్రతిదినం పఠిస్తున్నా మొదట ఏ ఉచ్ఛారణ ఉన్నదో అదే ఇప్పుడు కూడ ఉంది. వేదాలలో శబ్దాలను మార్పు లేకుండా ఉంచుకోవటానికి ఎంతో శ్రద్ధ చూపారు. అందువల్ల ఈ పరిశోధకులు ఊహించినట్టు వేద శబ్దాలు మామూలు మాటల వలె ఏ మార్పూ చెందలేదు.

ఈ పరిశోధకుల ఉద్దేశంలో వేదాలలో ప్రథమంగా ఋగ్వేదమూ ఆ తరువాత వరుసగా యజుర్వేదము, సామవేదము, అధర్వవేదమూ వచ్చాయి. ప్రతివేదంలోనూ మొదటి భాగం 'సంహిత'లు, తరువాతి 'బ్రాహ్మణాలు' ఆఖరిగా ఆరణ్యకాలు. ఈ విధంగా ఆలోచించి పరిశోధకులు వేదాల కాలాన్ని గణిస్తారు. వేదాలలోని పదాలు వాల్మీకి రామాయణంలో, మహాభారతంలో, చివరికి కాళిదాసు కృతులలో ఎట్లా పరివర్తన చెందాయో పోలుస్తారు. ఇటువంటి సాక్ష్యాలనెన్నింటిని పరిశీలించినా అదంతా వృథాయే. దానికి కారణం, వాళ్లు అసలు విషయాన్ని మరువటమే. వేదాలలోని పదాలు అన్ని కట్టుబాట్లనూ ఉల్లంఘించి మారుతాయనే అనుకొందాం. ఆ మార్పులు కేవలం రెండు వందల సంవత్సరాలలో అసంభవం. కొద్ది పాటి మార్పు జరగాలన్నా కొన్ని వేల సంవత్సరాలు పడుతుంది. సాధారణ వాడుకలో, సాహిత్యంలోనూ జరిగే పరివర్తన వేదవాక్కులకి వర్తించదని ఒప్పుకొంటే, వేదాల కాలాన్ని ఈ విధంగా లెక్క కట్టటం తప్పని తెలుస్తుంది.

"హిందీ" అనబడే భాషకి ప్రత్యేక ప్రతిపత్తి కొద్ది శతాబ్దాల క్రితమే లభించింది. అయినా అది బాగా విస్తరించింది. ఈ స్వల్ప కాలంలోనే ఆ భాష ఎంతో మారింది - దీనికి కారణం - అది సంస్కృతము, ఉర్దూ, పార్శీ, ఇంగ్లీషు భాషలనుండి మాటలను తనలో కలుపుకోవటం. సంస్కృతం హిందీ కంటే ఎక్కువగా దేశమంతా వ్యాపించినా అది వాడుక

భాష కాకపోవటం వల్ల మార్పు చెందలేదు. సంస్కృత సాహిత్యం విషయమే ఈ విధంగా అయితే, ఎంతో భద్రంగా కాపాడుకొంటూ వచ్చిన వేదపదాల విషయం వేరే చెప్పాలా? కాబట్టి ఈ పరిశోధకుల అంచనా ప్రకారం ఒక సామాన్యభాషలో వెయ్యి సంవత్సరాలలో వచ్చే మార్పులు వేదాల విషయంలో ఒక లక్ష సంవత్సరాలు పట్టవచ్చు.

వేద శబ్దాల ఆదిమస్వచ్ఛత అట్లాగే నిలిచి పోవటానికి కారణమిది : సరియైన ఉచ్చారణ వల్లనే వేదమంత్రాలు శక్తి మంతమవటం. ఇందులో దోషాలు దొర్లకుండా కాపాడు కోవటానికీ, ఒక తరం నుండి వేరొక తరానికి ఆ స్వచ్ఛతతోనే అందించటానికే - సమాజంలో ఒక వర్గం అంకితమై ఉండటం.

ఈ మౌలిక విషయాన్ని గ్రహించక పోతే, అసలు ఏమి జరిగిందో, ఏ పరిశోధనా కనుగొనలేదు. వేద మంత్రోచ్చారణలోని భిన్న రీతులు ఆ శబ్దస్వచ్ఛతని భద్ర పరచు కోవటంలోని సాఫల్యానికి నిదర్శనాలు.



# 4

# నిర్దుష్టంగా వల్లించే పద్ధతులు

వేదములలో ఏ చిన్న పొరపాటూ రాకుండా ఉండటానికి మన పూర్వీకులు ఎన్నో పద్ధతులను అవలంబించారు - ఇవేవీ లిఖితరూపంలో కూడా లేవు. వేదమంత్రాల వల్ల పరిపూర్ణమైన లాభం పొందాలంటే ఆ మంత్రోచ్చారణలో ఏ పొరపాటూ రాకుండా ఉండాలి అంటే మంత్రాలని వల్లించేప్పుడు ఏ పదమూ మారకూడదు. నియమానికి వ్యతిరేకంగా ఏ స్వరమూ మారకూడదు. అందు వల్లనే అనేక కట్టుబాట్లున్నాయి.

ఒక్కొక్క పదాన్ని ఎంత కాలంలో పలుకాలో తెలిసేట్టు "మాత్రలు" కల్పించారు (మాత్ర అంటే ఒక్కొక్క హ్రస్వ అచ్చును పలికే కాలం) శరీరంలో ఏ భాగంలో ప్రకంపన కలగాలో, ఏ విధంగా శుద్ధమైన శబ్దం వస్తుందో తెలుపటానికి శ్వాసకి సంబంధించిన నియమాలను 'శిక్ష' అనే వేదాంగంలో చెప్పారు. తైత్తిరీయ ఉపనిషత్తు ఈ 'శిక్ష'తో ప్రారంభమవుతుంది.

*"శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణ స్వరః । మాత్రాబలం । సామసన్తానః ।"*
(శిక్ష, వర్ణము, స్వరము, మాత్ర, బలమూ, సామమూ, సన్తానములతో సంబంధము కలది)

ఒక్కొక్క మంత్రాన్ని వివిధ రీతులలో, వివిధ గతులలో వల్లించటం నిర్దుష్టతకి దోహదం కలిగిస్తుంది. ఇవి వాక్య, పద, క్రమ, జట, మాల, శిఖ, రేఖ, ధ్వజ, దండ, రథ, ఘన వంటివి. కొందరి పండితులని "ఘనపాఠి" అంటాం. అంటే వాళ్లు వేదాల్ని ఘనమనే పద్ధతిలో వల్లించగల నిష్ణాతులు అని అర్థం. ఘనపాఠి ఎవరైనా "ఘన" పద్ధతిలో వేదాన్ని వల్లిస్తూంటే ఆయన పదాలని రకరకాలుగా ముందుకీ వెనుకకీ మారుస్తున్నట్లు కనిపెట్టవచ్చు. ఇది వినటానికి సొంపుగా ఉండటమే కాక, మనస్సుకి ఆహ్లాదాన్ని కూడ కలిగిస్తుంది. వేదమంత్రాలకి సహజంగానే గల శోభ ఇంకా పెంపొందినట్టు అనిపిస్తుంది. క్రమం, జట, శిఖ, మాల పద్ధతులలో వేదాన్ని వల్లించినా అట్లాగే అనిపిస్తుంది. వీటి ముఖ్య ఉద్దేశమిది: ఆది నుండీ వస్తున్న పదాల అర్థంగాని, ఉచ్ఛారణగాని మారకుండా పొరపడకుండా ఉండటమే.

మంత్రాలని ఒక వాక్యం వలె వల్లెవేయటాన్ని "వాక్యపాఠమ"నో "సంహిత పాఠమ"నో అంటారు. ఒక వాక్యరూపంలో మంత్రాలను వల్లించేప్పుడు కొన్ని కొన్ని పదాలను కలప వలసి వస్తుంది. మంత్రాలలోని ప్రతి పదాన్నీ దేనికదిగా, విడిగా వల్లించటాన్ని "పదపాఠమం" టారు. సంహిత పాఠం తరువాతనే పదపాఠం వస్తుంది. పదపాఠంలో వాక్యాలకి పదవిభజన జరుగుతుంది. దీని వల్ల వేదాధ్యయనం చేసేవారికి ప్రతి పదమూ తెలుస్తుంది. దీని

తరువాతిది "క్రమ పాఠం". ఈ పద్ధతిలో మొదటి పదాన్ని రెండవ దానికీ, రెండవ పదాన్ని మూడవదానికీ, మూడవ పదాన్ని నాల్గవ దానికీ చేర్చుకొంటూ వాక్యం పూర్తయ్యే వరకూ వల్లిస్తారు. ఈ పద్ధతి వల్ల విద్యార్థికి ప్రతి పదమూ అర్థమవటమే కాక, రెండేసి పదాలను కలిపి ఏ విధంగా వల్లించాలో, ఆ కలపటంలో వచ్చే మార్పు లేమిటో కూడా తెలుస్తాయి.

కొన్ని ప్రాచీన శాసనాలలో, ముఖ్యంగా దానాలకి సంబంధించిన వాటిలో, ఆ సంబంధిత వ్యక్తుల పేర్ల చివర "క్రమవిత్" అన్న పదముంటుంది. "వేదవిత్" వలెనే "క్రమవిత్" అంటే ఆ వ్యక్తికి క్రమ పద్ధతిలో వల్లించటం వచ్చని అర్థం. ఇటువంటి శిలాశాసనాలు దక్షిణ భారతంలో కోకొల్లలు.

దీని తరువాతిది 'జటాపాఠం'. ఈ పద్ధతిలో మొదటి పదాన్నీ రెండవ పదాన్నీ కలిపి వల్లిస్తారు. ఆ తరువాత ఆ రెండు పదాలని తిరగవేసి వల్లెవేస్తారు, తరువాత మళ్లీ మామూలు వరుసలో చెప్తారు. 'క్రమపాఠం'లో పదాల క్రమం ఇట్లా ఉంటుంది : 1-2, 2-3, 3-4, 4-5 ఇత్యాది. కాని జటాపాఠంలో వరుస ఇట్లా ఉంటుంది 1-2-2-1-1-2 ఈ క్రమాన్నే ముందుకీ వెనుకకీ వల్లె వేస్తారు. శిఖాపాఠంలో మూడేసి పదాలని ఈ విధంగా కలుపుతారు.

"ఘన" పాఠం వీటి కంటె కష్టం. ఇవికాక ఇంకొక అయిదు పద్ధతులు కూడా ఉన్నాయి. పదాల వరుసను మారుస్తూ రకరకాల జోడింపులు చేస్తూ వల్లె వేస్తారు

ప్రాణాలను కాపాడే మందుని ప్రయోగశాలలో ఎంత జాగ్రత్తగా భద్ర పరుస్తారో విశ్వకళ్యాణానికి ఉపయుక్తమయే వేదాలకు ఏ విధమైన మార్పూ, క్షీణింపూ కలుగకుండా, లిఖిత పూర్వకంగా కూడా కాకుండా, కేవలం వల్లె వేయించే పద్ధతులలో మన పూర్వులు భద్ర పరచారు. పదాలను ముందుకూ వెనుకకూ వల్లె వేసేప్పుడు విద్యార్థి స్వరాలకేమాత్రమూ భంగం రానీయకూడదు. పదాల సమ్మేళనం స్వరాలనే విధంగా ప్రభావితం చేస్తుందో కూడా విద్యార్థి నేర్చుకోవాలి.

మంత్రంలోని పదాలు సహజమైన వరుసలో వస్తాయి కనుక సంహితపాఠాన్ని పదపాఠాన్నీ - ప్రకృతి పాఠమంటారు. మిగిలిన వాటిని వికృతి (అంటే, అసహజం) పాఠమంటారు. క్రమపాఠంలో పదాలు వరుసగా ఒకటి, రెండు, మూడు వలె రావు. కాని రెండు తరువాత ఒకటి, మూడు వెనుక రెండు వలె తిరగవేసి వల్లించక్కరలేదు. అందువల్ల దానిని వికృతి (అసహజం లేక కృత్రిమం) అనలేము. వికృతులు ఎనిమిది రకాలు.

*జటా మాలా శిఖా రేఖా ధ్వజో దండో రథో ఘనః*
*ఇత్యష్టౌ వికృతయః ప్రోక్తా క్రమ పూర్వా మహర్షిభిః*

---

* ఘన పద్ధతిలో పదాల క్రమం ఈ విధంగా ఉంటుంది : 1-2-2-1-1-2-3-3-2-1-1-2-3; 2-3-3-2-2-3-4-4-3-2-2-4 ఇత్యాది.

పదాన్నీ, శబ్దాన్నీ, ఉచ్చారణనీ, స్థాయినీ, వాటి వాటి సమ్మేళనాలని వేదాలలో స్వచ్ఛంగా పరిరక్షించటం కోసమే వల్లె వేయించటంలో ఈ క్లిష్టమైన పద్ధతులు వచ్చాయి. రకరకాలుగా పదాలను పునశ్చరణ చేస్తూండటం వల్ల వాటి సంఖ్యనుకూడా కాపాడుకొన్నారు - తద్వారా వాటి నిర్మలతను కూడా. ఎంత క్లిష్టమైన పద్ధతులలో వల్లె వేస్తే అంత పుణ్యమని కూడా నిర్దేశించి, విద్యార్థులు వాటిని నేర్చుకొనేట్టు చేశారు.

మన పూర్వీకులు వేదమంత్రాల స్వచ్ఛతను నిలపటానికి అన్ని పద్ధతులనూ అవలంబించారు. అందువల్ల కాలక్రమేణా వేదమంత్రాల ఉచ్చారణలో మార్పులు వచ్చాయి - అవి ఎంత కాలంలో వచ్చాయి అంటూ ఆధునికులు పరిశోధనలు జరుపటం సమర్థనీయం కాదు. వీటి వల్ల సత్యం ఏ మాత్రమూ అర్థం కాదు.

**భగవద్వాణి :**

వేదాలు ఆవిర్భావం చెందాయని ఒప్పుకోవాలి. మన దేశంలోనే కాదు, అన్యమతస్థులు కూడా వాళ్ల పవిత్రగ్రంథాలు ఆవిర్భవించాయనే అంటారు. జీసస్ తన ప్రవచనాలు తనవి కావనీ అవి భగవంతుని మాటలే అనీ తాను ప్రచారకుడను మాత్రమేననీ అన్నాడు. అట్లాగే మహమ్మదీయులు కూడా. అల్లా పల్కులనే మహమ్మదు ప్రచారం చేశాడంటారు.

'ఆవిర్భావం' గురించి మన అభిప్రాయాలనే వాళ్లు కూడ చెప్తూంటారు. వాళ్ళవి కూడ "ఆవిర్భవించిన పాఠాలే" అంటారు. భగవంతుని పలుకులు యోగుల వల్ల మనకి అందాయి. ప్రతిమతంలోనూ భగవంతుని పలుకులు యోగలకూ, మహర్షులకూ ప్రవక్తలకూ విశదమయాయి - వాటినే మానవాళి పురోగతికై వాళ్లు అనుగ్రహించారు.

ఏ విషయాన్నైనా ఎంతో నిశితంగా, ఏకాగ్రతతో గమనిస్తే దాని నిజస్వరూపం బయట పడుతుంది. దీనినే సహజ స్ఫురణ అనో, ప్రత్యక్షజ్ఞానమనో, అంటాం. ఐన్‌స్టైన్‌కి సాపేక్ష సిద్ధాంతం విపులమైన విశ్లేషణా ఆలోచన వల్ల కాక సహజస్ఫురణ వల్ల తట్టిందంటారు. మనమీ విషయాన్ని నిజమేనని ఒప్పుకుంటే, మానసికంగా ఉన్నతులు, వినీతులు, ఆధ్యాత్మికంగా ఉన్నతులూ అయిన ఋషులు అంతరాంతరాలలో మంత్రాలను గ్రహించారని అంగీకరించక తప్పదు !



# 5

# వేదములు అనంతములు

సృష్టి, సృష్టికి పూర్వమూ, సృష్టికి అతీతము - కేవలం ప్రకంపనల మయమైతే అవెంత వ్యాప్తి చెందినవో ఊహించలేము. అయితే, విశ్వంలోని వివిధ వ్యాపకాలన్నీ వేద మంత్రాలలో ఎట్లా నిక్షిప్తమయినాయన్న ప్రశ్న వస్తుంది.

వేదాలు ఎంతో విస్తృతమైనవి, మనకి లభ్యమైన వేదాలు పరిమితం. ''అనంతావై వేదాః'' (వేదాలు అనంతం) అని వేదాలలోనే ఉంది. వేదాలు పరిపూర్ణంగా ఋషులకు విశదమయ్యాయని చెప్పలేం. అనంతమైన వేదాలలో కొద్ది భాగమే వారికి విశదమయింది. నాలుగు వేదాలు - సహస్రాధికమైన వేదశాఖలు కల భాగమే వారికి విశదమయింది.

పరమాత్ముని నిశ్వాసమే బ్రహ్మసృష్టికి స్ఫూర్తి - ఆ నిశ్వాసం అంతరిక్షంలో ఇప్పుడూ ఉంది - ఎన్ని ప్రళయాలు సంభవించినా, ఎంతమంది బ్రహ్మలు వచ్చి వెళ్లినా దీనికి లయమూ, అంతమూ లేవు. ప్రతి ప్రళయం వెనుకా వచ్చే ప్రతి బ్రహ్మ ఆదిమ శబ్దతరంగాలైన వేదమంత్రాల సహాయంతోనే సృష్టి కార్యం కొనసాగిస్తాడు.

వాటికి మూలం ప్రకంపన. ఈ ప్రకంపననే బ్రహ్మ వేదాలుగా గ్రహించి, ఉచ్చరిస్తే సృష్టి సంభవిస్తుంది.

కొన్ని శబ్ద తరంగాలను మొక్కల దగ్గర విడిస్తే మొక్కలు త్వరగా ఎదుగుతాయనీ, కాపు బాగుంటుదనే అంటారు. మరికొన్ని రకాల శబ్దాలు పెరుగుదలకు హాని కలిగిస్తాయి. అంటే శబ్ద తరంగాల వల్ల సృష్టిస్థితిలయములు కలుగుతాయని మామూలు మొక్కల విషయంలోనే ఋజువైంది.

వేదమంత్రాలను తన తపస్సుతో ధ్యానగరిమతో ఉపయోగించి బ్రహ్మ విశ్వాన్ని సృష్టించాడు.

మనం నిత్యం పఠించే పంచాక్షరీ మంత్రాన్ని కేవలం ఒక్కసారి మాత్రమే జపించి పుణ్యాత్ములు రోగాలని ఎట్లా నయం చేయగలగుతున్నారు? వాళ్లకి ఏకాగ్రత ఎక్కువవటం వల్లా సరియైన పద్ధతిలో ఆ మంత్ర ప్రకంపనలని ప్రేరేపించే శక్తి కలగటం వల్లనే కదా. అంతే కాక మంత్రాన్ని స్వచ్ఛంగా, ఏ స్వరభేదమూ లేకుండా జపించాలి. అప్పుడే సత్ఫలితాలు లభిస్తాయి. పరమాత్మ నుండే బ్రహ్మ ఉద్భవించటం వల్ల వేదాలపైన ఆయన అధికారం సంపూర్ణం.

ఆకాశం నుండి లభించిన విద్యుచ్ఛక్తితో ఎన్నిటినో చేస్తున్నారిప్పుడు. అదే విధంగా నిర్గుణుడు, చైతన్యమూర్తీ అయిన బ్రహ్మ నుండే విశ్వసృష్టి జరుగుతుంది. ప్రళయవేళల ఆ చైతన్యం నిశ్చలమవుతుంది. మల్లయోధుడు నిద్రించేప్పుడు అతని బలం మనకు తెలియదు.

మల్లయుద్ధం చేసేప్పుడో, మరియే ఇతర పని చేసేప్పుడో అతని బలం మనకి కనబడుతుంది. ఆ విధంగానే సృష్టివేళ విశ్వంలోని శక్తి ఎన్నో కార్యాలని నిర్వహిస్తుంది. ఆ నిశ్చలమైన దాని నుండి ఈ శక్తి బయల్వెడలు తుంది. బ్రహ్మ అటువంటి శక్తినుండి వచ్చిన వాడే. తపస్సు రూపంలో జనించిన వాడవటం వల్ల, వేదాలనన్నిటినీ వాటి పటుత్వంతో ఆయన గ్రహించగలిగాడు. వేదాలు అనంతం - సృష్టికూడ బహుముఖమే, వైవిధ్యంతో కూడినదే.

బ్రహ్మం రూపందాల్చినప్పుడు ఆయన అంతరంగంలో వేద శబ్దాలన్నీ జనించాయి. సృష్టి ఎట్లా చేయాలో ఆయనకి చూపాయి. సహజస్ఫురణతో విదితమయాయి.

వేదాలు అనంతమనటానికి ఒక కథ ఉంది. భరద్వాజ మహర్షి మూడు జన్మలలో వేదాలను అధ్యయనం చేశాడు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై 'నీకింకొక జన్మనిస్తాను. ఏమి చేస్తావు దానితో" అని అడిగితే, భరద్వాజుడు ఆ "అదనంగా లభించే జన్మని కూడ వేదాధ్యయనానికే. వినియోగిస్తాన"న్నాడు - అన్ని వేదాలనూ, ఎన్ని జన్మలనెత్తినా పూర్తిగా అధ్యయనం చేయట మసంభవమని, ఋషి పట్ల జాలితో అతను ఎందుర్కొంటున్న సమస్యఎంత జటిలమైనదో తెలియ జేయటానికై పరమేశ్వరుడు మూడు పెద్ద పర్వతాలని సృష్టించి వాటి నుండి గుప్పెడు మట్టిని తీసుకొని, "నీవిప్పుడు అధ్యయనం చేసిందంతా ఈ పిడికెడు మట్టితో సమానం. నీ వింకా అధ్యయనం చేయవలసినది ఈ పర్వతాలంత మేర ఉన్నది" అన్నాడట. భరద్వాజునికి సంబంధించిన ఈ గాధ వేములలో కాఠక భాగంలో ఉంది.

వీటివల్ల వేదాలు అనంతమని విశదమవుతుంది. వేదాలను నాలుగు భాగాలుగాను, శాఖలను వెయ్యికిపైగానూ క్రోడీకరించటం తరువాత ఎప్పుడో జరిగింది.

మంత్రాలు తపస్సంపన్నులైన ఋషులకు అభివ్యక్త మైనవే. అందువల్ల ఆయా మంత్రాలు ఆయా ఋషులకు చెందినవైనాయి. ఆ మంత్రాలను ఆలకించటానికి వారికి దివ్యమైన చెవులున్నాయి. యోగశాస్త్రం ప్రకారం మనస్సులోని మౌనాన్ని విశ్వాంతరాళంతో సంధానపరుస్తే, అంతరిక్షంలో తేలుతున్న శబ్దాలన్నీ వినబడుతాయి. విశ్వమంతటితో తాదాత్మ్యం చెందగలవారికే ఇది సాధ్యం. అందువల్లనే, ఋషులు లోక శ్రేయస్సుకై ఆ మంత్రాలను బయట పెట్టారే గాని వాటిని సృష్టించలేదు. ఈ మహోపకారాన్ని చేసి మానవాళికి అజ్ఞాతంగా సంస్థితమైన వాటిని తెలియజేశారు. గంగను రప్పించిన వానికి ప్రణమిల్లుతాం. గంగను అతను సృష్టించాడా? అతడు,. గంగను తీసుకు వచ్చాడంతే. అయినా, ఎంతో దూరంనుంచి తీసుకువచ్చాడని కృతజ్ఞత తెల్పుతాం. మనకందు బాటులో లేని మంత్రాలను మనకు అనుగ్రహించిన ఋషులను ఎంతగా కొనియాడాలో !

**మంత్ర యోగము :**

పదునాలుగు భువనాలూ ఒక సామ్రాజ్యం - దీనికి అధినేత ఒక సార్వభౌముడు - జగత్తులోని సమస్త వస్తు జాలమూ ఆయన ప్రజలు. సార్వభౌమునికి గాని భృత్యులకు గాని

కాలమానంలో ఆది అంటూ ఏదీ లేదు. ఒక రాజ్యమూ, ఒక రాజూ ఉన్నప్పుడు కొన్ని శాసనాలుంటాయి. ఈ మూడింటికీ 'మొదలు' అంటూ లేదు కాబట్టి, ఈ శాసనాలకూ ఆది లేదు.

ఆది లేని శాసనమే వేదం. సామ్రాజ్యానికి మొదలంటూ లేకపోయినా అప్పుడప్పుడు తాత్కాలికంగా అంత మొంది, సృష్టితో కూడ మళ్లీ జనిస్తూంటుంది. కాని సార్వభౌముడైన పరమాత్మకు గాని, శాసనమైన వేదానికి గాని మొదలూ లేదు, తుదీ లేదు.

మన మెరిగిన దృశ్యమానమైన ప్రపంచం సృష్టింపబడుతుంది - వృద్ధి నొందుతుంది. కొన్ని లక్షల సంవత్సరాల తరువాత ప్రళయంలో లయమవుతుంది. మళ్లీ సృష్టింపబడుతుంది. ఇట్లాగే ఇది జరుగుతూంటుంది. అయినా, సార్వభౌముడూ శాసనమూ అచలంగా ఉంటాయి. ప్రతి సృష్టికీ ముందు కొందర్ని నియమిస్తాడు సార్వభౌముడు. వారికి తగిన అధికారమిచ్చి వారు తమ విధులను నిర్వహించేందుకు వీలు కల్పిస్తాడు.

పైన చెప్పినట్టు, యోగ శాస్త్రం ప్రకారం మానవుని చెవికి, అంతరిక్షానికీ లంకె ఉంది. ఇది ఏర్పడితే "దివ్య కర్ణాలు" సమకూడినట్టే. ఇవి గలవారు పరమాత్ముని అనుగ్రహం వల్ల అనాదిగా విశ్వంలో గల శబ్ద తరంగాలను గ్రహింపగలిగారు. వేదాలనూ మొట్టమొదటిగా ఎరిగిన వారు వారే. ఆ మహర్షుల సొత్తే మంత్రాలు.

మనమెన్నో శబ్దాలను వింటాం, పలుకుతాం. ఒక్కొక్క నాడి ప్రకంపించేప్పుడల్లా, మనస్సులో ఒకోరకమైన భావావేశం కలుగుతుంది. కొన్ని ఉద్రేకాన్ని, మరికొన్ని బద్ధకాన్ని, ఇంకాకొన్ని అసంతుష్టినీ ప్రేరేపిస్తాయి. దీనినే వేరొక విధంగా చెప్పాలంటే - ఉద్రిక్తమై ఉన్నప్పుడు ఒకనాడి ప్రకంపిస్తుంది, అదే విధంగా కోపంగా ఉన్నప్పుడింకొక నాడి ప్రకంపిస్తుంది.

ఈ రీతిగా ప్రతిభావావేశమూ వివిధ నాడుల ప్రకంపనలని కలిగిస్తుంది. ఇది అందరికీ అనుభవసిద్ధమే. మనశ్శాంతి వల్ల నెమ్మదిగా ఉంటుంది. ఇది ముఖంలో కనబడుతుంది. ఉద్రేకమూ, కోపమూ అలాగే ముఖంలో తెలుస్తాయి. నాడి కొట్టుకొనే వేగంవల్లనే ఈ చిహ్నాలు వస్తాయి. మనస్సులో కలిగే ఆవేశం వల్ల నాడి కొట్టుకొనే వేగంలో మార్పు కలిగితే ఆ నాడి యొక్క వేగాన్ని అదుపులో పెట్టటం వల్ల ఆ ఆవేశాన్ని గాని, కోపాన్ని గాని అదుపులో పెట్టవచ్చు. అందువల్లనే ఆత్మసాక్షాత్కారానికి మార్గాలలో ఒకటైన రాజయోగం, మనస్సుని అదుపులో పెట్టటానికి ప్రాణాయామాన్ని ముఖ్యమైన సాధనగా ఉపయోగిస్తుంది. మంత్రయోగం కూడ ఇంకొక మార్గం. ఒక మాటని ఉచ్చరించేప్పుడు అది ఊపిరీ, గొంతూ, నాలుకా, పెదవులూ, నోరూ - ద్వారా ప్రసరిస్తుంది. అప్పుడే ఆ పదం శబ్దమై వినబడుతుంది. ఊపిరి వెళ్లే ఆ దారిలో గల నరాలకూడలు కంపిస్తాయి - దాని వల్ల శబ్దోచ్ఛారణ జరుగుతుంది. సరియైన శిక్షణతో, సరియైన విధంగా ఉచ్చరింపబడిన వేద మంత్రాలు మనస్సులో సద్భావాలని కలిగిస్తాయి - వాటి వల్ల ఆ మంత్రాలను పలికే వ్యక్తికీ లోకానికీ శ్రేయస్సు కలుగుతుంది. దానికి తోడు నీచమైన భావాలు దూరమవుతాయి.

దేనినైతే నిత్యం మననం చేయటం వల్ల వ్యక్తి రక్షితుడౌతాడో అదే మంత్రమంటే. ("మననాత్ త్రాయతే ఇతి మంత్రః") మంత్ర జపం పదే పదే చేయటం బ్రాహ్మణుని కర్తవ్యం. దాని వల్ల ప్రకంపనలూ పదే పదే వ్యాపిస్తాయి. ఆ శక్తే వ్యక్తికీ, సమిష్టికీ శ్రేయోదాయకం.

మంత్ర జపం వల్ల పూర్తి సాఫల్యం పొందాలంటే దానికి నిర్ణీతమైన పద్ధతి ఉంది. ఆరు విధాల మంత్రాలని వల్లెవేయటం వర్జనీయమని విజ్ఞులు చెప్పారు.

*"గీతీ శీఘ్రీ శిరః కంపీ తథా లిఖిత పాఠకః*
*అనర్థజ్ఞః అల్పకంఠశ్చ షడైతే పాఠకాధమాః"*

గీతీ అంటే పాటవలె మంత్రాన్ని ఆలపించేవాడు. ఇది సరికాదు. సామవేదాన్ని ఆలపించాలి - కాని ఆ పాడటం కూడ విధ్యుక్తంగానే చెయ్యాలిగాని ఎవరికి తోచినట్టు వారు చేయకూడదు. అంతేకాక, శబ్దానికీ, ఆ శబ్దంలోని మార్పులకీ శక్తి ఉండటం వల్ల సరియైన స్వరంలో కాక ఇంకొక విధంగా పఠించటం తప్పే కాకుండా, హానికరం కూడా. అందువల్ల మంత్రాన్ని నిర్ణీతమైన విధంగానే చెప్పాలి. శీఘ్రీ అంటే వేగంగా మంత్రాన్ని చెప్పి హఠాత్తుగా నిలిపేవాడు. ఇది కూడా తప్పే. వేదపదాలను నియమిత కాలానుగుణంగానే ఉచ్చరించాలి లేకపోతే వాటి ఫలితం పూర్తిగా లభింపదు. శిరః కంపీ అంటే మంత్రాన్ని చదువుతూ అనవసరంగా తలని ఆడించేవాడు. మనిషి ఏకాగ్రతతో నిటారుగా కూర్చుని నాడుల ప్రకంపనం సహజంగానే జరగనివ్వాలి. గాయకుని వలె తలని ఆడించటం వల్ల ఆ ప్రకంపనలకు భంగం కలుగుతుంది. లిఖిత పాఠకః అంటే వ్రాసుకొన్న దానిని చదివే వాడు. ఇది వరకు చెప్పినట్టు మంత్రాన్ని గురువు ఉచ్చరిస్తూంటే శ్రద్ధగా ఆలకించి, సరియైన విధంగా జ్ఞాపకముంచుకోవాలి. అనర్థజ్ఞః అంటే మంత్రం యొక్క అర్థం తెలియని వాడు. మంత్రాల సాఫల్యం పరిపూర్ణంగా పొందాలంటే వాటి అర్థాన్ని కూడ ఎరిగి ఉండాలి. అల్పకంఠ అంటే హీనస్వరంతో ఉచ్ఛరించేవాడు. శబ్ద తరంగాలకి సత్ఫలితాలుండాలంటే ఏదో గొణుగు తున్నట్టు కాక, స్పష్టంగా వినబడాలి.

**శబ్దమూ, పదార్థమూ - వాటి ప్రయోజనం :**

ఒక విషయాన్ని కొంచెం హాస్యధోరణిలో చెప్తాను. సంస్కృతంలో ఒక పదానికి "తరం" అని చేరిస్తే మరొకదాని కన్నా శ్రేష్ఠమని అర్థం వస్తుంది. "వీర్యవత్" అంటే శక్తి మంతమని అర్థం. 'వీర్యవత్తరం' అంటే అసాధారణమైన శక్తిమంతుడని అర్థం. చాందోగ్యోపనిషత్తులో (1.1.10) ఓం కారాన్ని అర్థం తెలుసుకొని జపిస్తే ఉత్కృష్ట ఫలితాలు పొందవచ్చని ఉంది. "వీర్యవత్తరం" అన్న పదం ఇక్కడ వాడబడింది. ఈ పదం వాడటం వల్ల స్ఫురించేది ఇది: "అర్థం తెలుసుకోకుండా జపిస్తే తక్కువ ఫలితాలు వస్తాయ"ని : తన భాష్యంలో ఆది శంకరులవారు అర్థం తెలుసుకొని జపం చేసేవారికి లభించిన ఫలితాలు లభించకపోయినా ఇతరులకి కూడ కొంతైనా సత్ఫలితం వస్తుందని అన్నారు.

అర్థం తెలిసి చేసినా తెలియక చేసినా విజ్ఞులైన పెద్దలు చెప్పారన్న విశ్వాసంతో ఏ పనిచేసినా సత్ఫలితాలే వస్తాయి. వేదజపంలో సరియైన ఉచ్చారణ వల్ల ఉత్పన్నమయే తరంగాలే సత్ఫలితాలని ఇస్తాయి. శబ్దం కలిగించే ఫలితాలే ప్రధానం. అర్థం తెలియటం వల్ల కలిగే ఫలితాలు అప్రధానం.

అందువల్ల నాకిట్లా అనిపిస్తుంది. అర్థం తెలియటం వల్ల 'వీర్యవత్' ఫలితాలు, అర్థం తెలియక పోవటం వల్ల 'వీర్యవత్తర' ఫలితాలు లభిస్తాయని ! అర్థం తెలియకుండా ఉంటేనే ఉత్కృష్టమైన ఫలితాలు వస్తాయనటంలో అర్థమేమిటి?

ఒక కలెక్టర్ ఉంటాడు. ఆయనకి ఒక పంటకాపు వినతి పత్రాన్ని సమర్పించాలి. దానిని లాయరుతో వ్రాయించుకొంటాడు. కాని, తానే స్వయంగా కలెక్టర్‌కి సమర్పించుకొంటాడు. నిరక్షరాస్యుడైనా పత్రాన్ని సమర్పించేప్పుడు అనుకూలమైన ఉత్తరువు ఇవ్వమని విన్నవించు కొంటాడు. ఆ పేదవానికి విషయం తెలియక పోయినా, తన న్యాయబుద్ధిపై విశ్వాసముందని కలెక్టర్ గ్రహిస్తాడు. అనుకూలమైన ఉత్తరువుని జారీ చేస్తాడు. మంత్రాల విషయమూ అంతే. వాటి భావం సంపూర్ణంగా భగవంతునికే తెలుస్తుంది. కాని మనం వాటిని సమీపించేప్పుడు గడుసుతనం చూపకూడదు. లాయరు వాదనలో తప్పుంటే కలెక్టరుకి కోపం వస్తుంది. కాని ఆ వాదనలోని తప్పు పంటకాపుకి కూడా తెలిసే ఉంటుందని కలెక్టరుకి కోపం మరీ ఎక్కువౌతుంది. అతనికి తెలియక పోవచ్చు ననుకొంటే పంటకాపు పట్ల కలెక్టరు సుముఖంగానే ఉంటాడు. అందువల్ల, 'నాకెలాగూ అర్థం తెలియదు వల్లె వేయటమెందుకు?'' అనకూడదు. అమాయకత్వముంటే వల్లె వేయటం అధికఫలమిస్తుంది. ఈ మాటలని తమాషాకి అన్నాను. ఈ రోజులలో తెలివితేటలు ఎక్కువై పోయాయి. విద్యావంతులు కాని వారి వినయాన్ని కించెపరుస్తున్నప్పుడు, నా కనిపిస్తుంది : వివేకంలేని విశ్వాసమే, విశ్వాసంలేని వివేకం కంటే నయమని.

కాని నిజానికి వినయంతో కూడిన వివేకముండాలి. మంత్రాల విషయంలో వాటి అర్థంకంటె సరియైన ఉచ్చారణే ప్రధానమైనా, మంత్రాలు మన ధర్మశాస్త్రాలు కావటం వల్ల వాటి అర్థమెరిగి ఉంటేనే వాటి ప్రకారం నడచుకోగలుగుతాం. కాబట్టి మంత్రాల పఠనానికి ఇంకా పటుత్వం కలిగించటానికి వాటి భావాన్ని కూడా తెలుసు కోవటానికి ప్రయత్నించాలి.

వేదాలని గంభీరతతో ఉచ్చరించాలి. అప్పుడే ఆ శబ్దాలు స్పష్టంగా వినబడుతాయి. వేదమంత్రాలు, ఆ పఠించే వాని నాడులలో మంచి ప్రకంపలనే కాక, వినే వారిలో కూడ అటువంటి వాటినే కలిగిస్తాయి. అవి వాతావరణంలో విస్తరిస్తాయి. కాబట్టి ఎల్ల వేళలా శ్రేయోదాయకాలే. మంత్రాలు అంతటా వ్యాపించటానికి వీలుగా వాటిని బిగ్గరగా వల్లె వేయాలి.

**వేదముల శక్తి :**

ఇంతకు పూర్వం చెప్పినట్టు వేదాల లక్షణాలు ఇవి (1) అవి అనాది (2) అవి అపౌరుషేయాలు (3) అవి సృష్టికి మూలం. అంతే కాదు. వాటిని పఠించేప్పుడు వచ్చే శబ్దం

మన నాడులను ప్రకంపింప చేస్తుంది. వాతావరణాన్ని ప్రభావితం చేస్తుంది. వ్యక్తికీ సమిష్టికీ మేలు కలిగిస్తుంది. ఇక్కడ "సమిష్టి" అంటే కేవలం మానవులనే అర్థం కాదు.

వేదాల వలె జంతువుల క్షేమానికీ, వృక్షాలక్షేమానికీ ఏ యితర మత గ్రంథాలూ ప్రాధాన్యమియ్యవు. రెండుకాళ్లవే కాక, నాలుగు కాళ్లవి కూడ వర్ధిల్లాలి. ("శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే".) ఇంతేకాదు - పొదలూ, వృక్షాలూ, పర్వతాలూ, నదులూ - ఒకటేమిటి - సృష్టి అంతా వర్ధిల్లాలంటాయి.

వేదాలకి ఎంతో అర్థగాంభీర్యముంది. మహనీయమైన కవిత్వమే కాక వాటిలో సమాజం సక్రమంగా ఉండటానికి నియమాలూ, ఆధ్యాత్మిక సత్యాలూ ఆఖరికి వైజ్ఞానిక సూత్రాలు కూడా ఉన్నాయి.

శబ్ద ప్రధానాలైన వేదమంత్రాలకి - మనకి అలవాటైన రీతిలో అర్థాలుండవలసిన అవసరం లేదు.

మనం రాగాలాపన వింటూంటాం. ఇందులో రాగంలోని స్వరాలనే విస్తరిస్తూ ఆలపిస్తారు, సాహిత్యముండదు. అయినా, ఆలాపన వింటూన్నప్పుడు మనకి భావావేశం కలుగుతుంది. వాద్య సంగీతం వినిపించటం వల్ల చెట్లు ఎక్కువగా ఫలవంతమవుతాయని ప్రయోగాల వల్ల నిరూపించారు. అంటే, శబ్దానికి సృజనాత్మకత ఉన్నదన్న మాటే కదా? ఇక్కడ గమనించవలసిన విషయమిది : వాద్య సంగీతంలో మాటలు ఉండవు, వాటి అర్థమూ ఉండదు. కేవలం ఆ నాదానికి ఫలితం ఉంటుందన్న మాట.

వేదాల విషయంలో విలక్షణమైన విషయమిది : వేదమంత్రములలోని పదములకు అర్థ గాంభీర్యమున్నది. అదే సమయములో శబ్దమునకు కూడ అనంతమయిన విలువ యున్నది. ఇదే వేదముల విషయములో విశేషము.

ఆ కారణం వల్ల వేదమంత్రాలు శబ్దార్థ సమన్వితాలు. మందు చేదుగా ఉండవచ్చు కాని ఆరోగ్యానికి అవసరం, పిండివంట తీయగా ఉండవచ్చు కాని ఆరోగ్యానికి హానికరం. రుచిగా ఉంటూ ఆరోగ్యాన్ని మెరుగు పరచేదేదైనా ఉంటే ఎంత బాగుణ్ణు! వేద మంత్రాలకి ఈ రెండు ప్రయోజనాలూ ఉన్నాయి.

ఇహపరాలలో సుఖపడటానికి అవసరమైన ఉద్బోధలు వేదాలలో ఉన్నాయి. మనిషి పుట్టినప్పటి నుండీ, ఆఖరి శ్వాస విడిచే వరకూ, ఆ పిమ్మట ముక్తి నొందటానికి కూడా, అతని నడవడికి మార్గదర్శక మవుతుంది. అంతేకాదు - అది వ్యక్తి ముక్తితో ఆగిపోదు. సమాజమెట్లా ఉండాలి, సామాన్యుని విధులేమిటి, బ్రాహ్మణుని నడత ఎట్లా ఉండాలి, రాజ్యాన్ని ప్రభువు ఎట్లా పాలించాలి, స్త్రీల నడవడి ఎట్లా ఉండాలి - ఈ విషయాలన్నీ వేదాలలో క్రోడీకరింపబడి ఉన్నాయి.

# 6

# యజ్ఞం

అగ్ని సహాయంతో, మంత్రోచ్చారణతో విధ్యుక్తమైన కర్మలు చేయటమే యజ్ఞమంటే. "యజ్ఞ' మన్న పదం "యజ్" అనే ధాతువునుండి వచ్చింది. దీని అర్థం - "ఆరాధించు". లేక, "సమర్పించు". క్రతువుని మనసారా, పరమాత్మ పట్ల, దేవతల పట్ల సంపూర్ణమైన భక్తి భావంతో నిర్వహించటమే యజ్ఞమంటే.

"మననం చేసేవాడిని రక్షించేది మంత్ర"మని చెప్పుకొన్నాం. పఠించేవాడిని కాపాడటం మంత్రం యొక్క విధి. మననమంటే మనసారా జపించటం. సాధారణంగా మంత్రాలని వినబడేట్టు ఉచ్ఛరించ వలసినా కొన్నిటిని మాత్రం అట్లా పలుకనక్కరలేదు. నిశ్శబ్దంగా జపించినా మంత్రాలు ఆయా నాడులను అనుకూలంగా ప్రకంపింప చేస్తాయి. దానినే బిగ్గరగా వల్లె వేస్తే దాని కొక మహనీయత ఉన్నట్టు తెలుస్తుంది - అర్థం తెలియక పోయినా పరవశింప చేస్తుంది. మనస్సులో ఉన్నది, వల్లెవేసినప్పుడు బయటకు వస్తుంది, అది శరీరకదలిక ద్వారా కార్యరూపం దాలుస్తుంది. వేదోక్తమైన విధినిర్వహణకు మనస్సు, వాక్కు, కాయమూ ఒకే విధంగా పని చెయ్యాలి - అన్నీ పరిపూర్ణంగా పాలుపంచు కొంటున్నట్లవుతుంది. అంటే, మననం శబ్ద రూపంలో నోటి ద్వారా బయటకు వచ్చి, శరీరం చేసే పని ద్వారా యజ్ఞమవుతుంది. అందువల్ల యజ్ఞము వేదోక్తమైన ముఖ్యమైన విధులలో ఒకటి.

**ఇతర మతాలలో లేదు :**

ఇటువంటి కర్మకాండ ఇతరమతాలలో లేదు. వేదాలపై ఆధారపడి యుండటం వల్ల మన మతాన్ని వైదిక మతమంటారు. దీనికీ, ప్రపంచంలో ఉన్న ఇప్పటి మతాలకీ ఒక ముఖ్య భేదముంది. క్రైస్తవమతం, ఇస్లాం ఇత్యాది మతాలు "అందరూ ఆరాధించవలసిన దైవమొక్కడే" అని అంటాయి. వేదాలు కూడా అన్ని ఆత్మలూ తనలోనే ఉన్న ఒకే ఒక దేవుడున్నాడంటాయి. కాని, "ఒక దేవుడు" అన్న భావాన్ని అనుభవసిద్ధం చేసుకోవటానికి చింతనద్వారా కలిగే జ్ఞానమవసరం. ఆ స్థితిని చేరుకోవటానికి వినీతి ఎంతో అవసరం. భగవంతునితో ఏకమైనప్పుడు మనకి గోచరించే జగత్తు మాయమవుతుంది : ఆ స్థితిని చేరుకోవాలి. ప్రాపంచక విషయాలలో తేలిపోయే మన జీవితాలను ఎంతో క్రమ శిక్షణకు లోను చేస్తేనే గాని ఆ స్థితిని చేరుకోలేం. ఈ వ్యాపకాలలో చిక్కుకొన్న మనం ధర్మమార్గాన పోవాలి, మనస్సుని క్షాళనం చేసి, పరిణతిని కలిగించే క్రతువులని చెయ్యాలి. ఆ స్థితిని చేరుకొన్న తరువాత ప్రాపంచక బంధాలు తెగిపోతాయి. ఆ గమ్యాన్ని చేరటానికి వేదాలు

అనేక మార్గాలనూ, ఉపాయాలనూ సూచించాయి. వీటిలో యజ్ఞమనే కర్మ అతిముఖ్యమైనది. ఒకే ఒక దేవునికి కాక, అనేక దేవతలకు ఉపహారాలిస్తూ ఫలితాన్ని భగవంతునికి సమర్పించటమే యజ్ఞమంటే. యజ్ఞమన్నది మన మతానికి ప్రత్యేకం. ఏ ఇతర మతంలోనూ ఇది లేదు.

వేదమంత్రాలని పఠిస్తూ వివిధ పదార్థాలని అగ్నికి ఆహుతి చెయ్యాలి యజ్ఞంలో. దీనిని "హోమ" మంటారు. అగ్నికి ఆహుతి చేసినా అన్నిటినీ అగ్నికే సమర్పిస్తున్నామని అర్థం కాదు. ప్రత్యేకంగా అగ్నికి సమర్పిస్తున్నట్టు మంత్రం చెప్పినప్పుడే అవి అగ్నికి చెందుతాయి. ఇతర దేవతలకి అంటే రుద్రునకూ, విష్ణువునకూ, ఇంద్రునకూ, వరుణునకూ, వాయువునకూ, సోమునకూ సమర్పించిన వాటిని వారికి చేరుస్తాడు అగ్నిదేవుడు. మిగిలిన మతాలకీ, వైదిక మతానికీ గల ముఖ్యమైన వ్యత్యాసమిదే. మనంకూడా ఒకే దేవుణ్ణి విశ్వసించినా, ఆయనకే కాక ఇతర దేవతలకి కూడ అగ్ని ద్వారా ఉపహారాలర్పిస్తాం.

మానవసేవ భగవంతునికి ప్రీతిపాత్రమంటాం. సంఘసేవకులు "మానవసేవే మాధవసేవ - సమాజానికి సేవ భగవంతునికి సేవ" అంటారు. ఆ విధంగానే యజ్ఞాల ద్వారా, భగవంతుని సృష్టియైన దేవతలకు యజ్ఞమూలకంగా సేవ చేయటం కూడ భగవంతుని అనుగ్రహాన్ని సంపాదించి పెడుతుంది.

భగవంతు డొక్కడే అనీ, ఆయనే అనేక దేవతల రూపాలను ధరిస్తాడనీ వేదాలు నొక్కి చెప్పుతాయి. ఏ దేవతని వర్ణించినా, ఆ దేవత పరమాత్మ అంటాం. వేదాలు కూడా దైవమొక్కడే అని చెప్తాయి. భగవంతునికీ దేవతలకీ గల భేదాన్ని మాత్రమే అవి సూచిస్తాయి. ఎందరో దేవతలని భగవంతునిగా పేర్కొంటాయి కాబట్టి "వేదాలు అనేక దేవుళ్ళున్నారని అంటాయి" అనుకోవటం తప్పు. ఒకే దేవుడు అనేక దేవతలుగా కనబడుతాడని అర్థం. విశ్వనియంత్రణకై అనేక దేవతలను సృష్టించాడు భగవంతుడు. ఈ దేవతలు వేరు వేరు విధులను నిర్వహించాలి - మన వలనే దేవతలు కూడ సృష్టింపబడ్డారు. మనని కూడ తననుండే సృష్టించాడు ఈశ్వరుడు. అద్వైత సిద్ధాంతం ప్రకారం జీవాత్మా, పరమత్మా ఒకటే. అందువల్ల పరమాత్మ దేవతలకు కూడ ప్రతినిధే. అద్వైత సిద్ధాంతాన్ని ఆకళింపు చేసుకొనే స్థితికి చేరుకొనే వరకూ - మనకూ దేవతలకూ భేదముందనుకొంటూ యజ్ఞాలూ, పూజలూ లోకశ్రేయస్సుకోసం చేస్తూండాలని వేదాలు నిర్దేశించాయి. ప్రకృతిలోని శక్తులూ, సర్వభూతాలూ పరమాత్ముని ఆదేశానుసారం, దేవతల ఆధీనంలో, ప్రవర్తిస్తాయి. కాబట్టి మనమూ, మనచుట్టూ ఉన్న ప్రపంచమూ ప్రకృతి శక్తులనుండి లబ్ధిని పొందాలంటే ఆయా అధిష్ఠాన దేవతలను సంతృప్తి పరచాలి. దేవతలు యజ్ఞాల వల్ల సంతుష్టులవుతారని వేదాలు చెప్తాయి. ఆధ్యాత్మికంగా మేల్కొన్నప్పుడూ పరమాత్ముని స్వయంగా గ్రహించినప్పుడూ విడిగా దేవతలని సంతృప్తి పరచవలసిన అవసరముండదు. మనం ద్వైత భావంతో ఉన్నంత కాలమూ ప్రతి దేవతనీ పూజించాలి. ఇది వేదవాక్కు.

### కర్మల వల్ల మూడు విధాలైన ప్రయోజనాలు :

కర్మలకు ప్రయోజనాలు మూడు విధాలుగా ఉంటాయి. ఈ లోకంలో మనమున్నంత కాలం మనకీ మనచుట్టూ ఉన్న వారికీ దేవతల అనుగ్రహం వల్ల క్షేమం కలగటం. రెండు: చనిపోయిన తరువాత దేవలోకంలో ఆనందంగా గడపగలగటం. దేవలోకంలో నివాసం శాశ్వతం కాదు. మన పుణ్యాన్ని బట్టే అక్కడ నివాసముంటుంది. దేవలోకంలో లభించే సౌఖ్యం భక్తునికి గాని జ్ఞానికి గాని కలిగే ఆనందంతో పోల్చలేం. "మనీషా పంచకం"లో ఆది శంకరులు ఇంద్రుని ఆనందంకూడా, ఆత్మసాక్షాత్కారం పొందినవాని ఆనందంలో సహస్రాంశం కూడా ఉండదన్నారు. అయినప్పటికీ, ఈ భూమి మీద జీవితంతో పోలిస్తే స్వర్గలోకంలోని నివాసం ఎంతో హృద్యం. ఈ సౌఖ్యం లభించటం యజ్ఞాల నిర్వహణవల్ల కలిగే ఫలితాలలో రెండవది. ఇక మూడవది : ఇది అన్నిటికంటె ముఖ్యమైనది. గీతలో దీని గురించి ఇట్లా ఉంది - ప్రతిఫలాపేక్ష లేకుండా యజ్ఞాన్ని నిర్వహించాలి. ఈ లోకంలో గాని, దేవలోకంలో గాని కలిగే సౌఖ్యం - యజ్ఞాలకి ప్రతిఫలమే. దీనిని కోరకుండా, లోక కల్యాణం కోసం, స్వార్థ చింతన లేకుండా, మమతా రహితంగా యజ్ఞాన్ని నిర్వహిస్తే అది శీఘ్రగతిని మనస్సుని పరిశుద్ధం చేస్తుంది. ఇదే తరువాత జ్ఞానమార్గాన్ని చూపుతుంది. దాని గమ్యం మోక్షం - అంటే, జన్మ రాహిత్యం సచ్చిదానందం అంటే పరమాత్మలో లీనమవుతాం.

అద్వైతానికి సారాంశం ఆత్మ సాక్షాత్కారమూ, శుద్ధ జ్ఞానమూ నని చెప్పారు ఆదిశంకరులు. వారే, "వేదో నిత్య మధీయతాం తదితం కర్మ స్వనుష్ఠీయతాం" అన్నారు. (వేదాలను నిత్యం అధ్యయనం చెయ్యి, వాటిలో చెప్పబడిన కర్మలను శ్రద్ధగా చెయ్యి) ఇదే మూడవ ఫలితం. ఈ లోకంలోగాని, స్వర్గలోకంలోగాని సుఖంగా ఉండగలుగుతామని వారు చెప్పలేదు. స్వలాభాపేక్ష లేకుండా కర్మలను చేయటం వల్ల చక్కని అవగాహన, చిత్తశుద్ధీ కలుగుతాయనే వారి ఉద్దేశం.

### మానవులకు, దేవతలకు పరస్పరలాభం :

యజ్ఞ యాగాదులను చేయటం వేదాలలోని ముఖ్యాంశం. దీని గురించి కృష్ణ భగవానుడు గీతలో చెప్పాడు. బ్రహ్మ లోకంతో బాటు, మానవులు చేయవలసిన యజ్ఞాలను కూడ సృష్టించాడు. "యజ్ఞాలను చేస్తూ ఉండు వాటి వల్ల కలిగే ఫలితాలతో సుఖంగా ఉండు. యజ్ఞాన్ని కామధేనువుగా భావించు" అంటుంది భగవద్గీత.

జగత్సృష్టికి మూలం వేదమంత్రాలే. కనుకనే, ఆ మంత్రాల పఠనం వల్ల ఉద్భవించే తరంగాలకి దేవతలే ప్రత్యక్షమవుతారు. యజ్ఞంలో మంత్రాలను పఠించటం పోస్టలు కవరుపై చిరునామా వ్రాయటంతో సమానం. ఆ మంత్ర పఠనంతో బాటు ఉపాహారాన్ని సమర్పిస్తేనే సందేశాన్ని దేవతలకు అగ్ని చేరవేస్తాడు.

జంతువులలో పిల్లి, కుక్క, గుఱ్ఱం, ఏనుగు, సింహం - క్రమంగా ఒకదాని కంటె ఒకటి బలాఢ్యం. ఆ విధంగానే సృష్టిలో కూడా మర్త్యుల కంటె ఎక్కువ శక్తి మంతులున్నారు. వారే

దేవతలు. ఈ లోకంలో పంచభూతాలతో బాటు ఉన్నా దేవలోకంలో మాత్రం ప్రత్యేకమైన రూపాలతో ఉంటారు. మంత్రాలను సవ్యంగా పఠించటం వల్ల కలిగే సత్ఫలితాలలో ఒకటి దేవలోకంలోని వారి రూపాలను స్పష్టంగా చూడగలగటం. అంతే కాక, వారనుగ్రహించే ప్రసన్నతను కూడ అనుభవించగలగటం. మంత్రజపం కలిగించే తరంగాల వల్లనే పరమాత్మలో వారు దర్శనమిస్తారు. అంటే మంత్రాలు దేవతల శబ్దరూపాలన్న మాట.

యజ్ఞంలో ఒక్కొక్క దేవతకి సంబంధించిన మంత్రాన్ని పఠించినప్పుడు ఆ దేవతప్రత్యక్ష మవుతాడు. ఆధ్యాత్మికంగా ఉన్నతి చెందిన వాళ్లు, వాళ్లని చూడ గలుగుతారు. కంటికి కనబడక పోయినా, వారి ఉనికి స్పష్టంగా తెలుస్తుంది. అయినా, వారికి నేరుగా ఉపహారాలివ్వటం నేరం. మంత్రోచ్చారణ జరుపుతూ అగ్నికి సమర్పించటం వల్లనే ఆ ఉపహారాలు దేవతలకు ఆమోద యోగ్యమైన రూపాన్ని పొందుతాయి. మనమిచ్చిన ఉపహారాలలో చాలా భాగం అగ్నిలో ఆహుతైపోగా మిగిలినది మనం ప్రసాదంగా తీసుకోగా అవి గమ్యాన్ని ఎట్లా చేరగలుగుతాయని మనమాశ్చర్య పోనక్కరలేదు. మన వలె దేవతలకు పంచభూతాత్మకమైన (అంటే, భూమి, నీరు, వెలుగు, గాలి, ఆకాశం కల) దేహాలు ఉండవు. మనం తీసుకునే ఆహారం వంటి పదార్థం వారికవసరం లేదు. మనలో కూడా మనం భుజించే ఆహారం ఒంట బట్టేలోగా జీర్ణకోశం దానిని అనేక విధాల మారుస్తుంది. ఆ విధంగానే, యజ్ఞంలో అగ్ని, మనమిచ్చే ఉపహారాలని దేవతలకు కొనిపోయే ముందు ఎంతో సూక్ష్మ రూపంలోకి మారుస్తుంది. ఈ మార్పుకూడా మంత్రాల ప్రభావం వల్లనే జరుగుతుంది.

ఒక ఉదాహరణ చూడండి : పాశ్చాత్యుల ఆచారం ప్రకారం విందుకి కూర్చున్నప్పుడు ఆరోగ్యాన్ని శ్రేయస్సునీ కోరుతూ శుభాకాంక్షలు పలుకుతారు. (టోస్ట్) తినేది ఒకరైతే సత్ఫలితాలు వేరొకరికని వారి విశ్వాసం. ఇదెట్లా సాధ్యం? ఇవన్నీ సుహృద్భావానికి చిహ్నాలు. చిత్తశుద్ధితో, విశ్వాసంతో చేస్తే ఆ సద్భావనే సత్ఫలితాలనిస్తుందన్నమాట.

పరమాత్మని భావాలే తరంగాలుగా మనకి మంత్ర రూపంలో వచ్చాయి - అవి శ్రేయోదాయకాలే అయి ఉంటాయి కదా. మంత్రానుసారం సమర్పింప బడిన ఉపహారాలు దేవతల శక్తిని వృద్ధి చేస్తాయి. మనకంటె ఎక్కువే అయినా దేవతల శక్తి కూడా పరిమితమే. వాళ్లకీ కోరికలూ, అవసరాలూ ఉంటాయి.

దేవతలని యజ్ఞాలే సంతృప్తి పరచగలవు. వాళ్లు ఈ లోకంలో మన జీవితాలని మెరుగు చెయ్యాలంటే యజ్ఞాల ద్వారా వారిని సంతృప్తి పరచాలి. వారి పటిష్ఠతను వృద్ధి చెయ్యాలి. వారి శ్రేయస్సుని మనసులో ఉంచుకొని యజ్ఞం చేస్తే వారు కూడ మనపై ప్రసన్నులౌతారు. దేవతలు మనపై ఆధారపడినా, వారు మనకంటె ఉన్నతులని మనం మరువరాదు. వారికి తగిన గౌరవం చూపాలి. అన్యమతస్థులు ఒకే ఒక దేవునికి నివాళులర్పిస్తారు, ఆరాధిస్తారు. అనేక దివ్యశక్తులను క్రతువుల వల్ల సంతృప్తి పరచటం

వారెరుగరు. మన మతంలో సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు మాత్రం దేవతల నాశ్రయింపక భగవంతుడ్నే నేరుగా ప్రార్థించ వచ్చు. ఇతరులు దేవతలని సంతృప్తిపరచి వారి అనుగ్రహానికి పాత్రులవాలి. ఆ సంతృప్తిని కలిగించటానికే యజ్ఞయాగాదులు, ఉపహారాలు ఇత్యాది నిర్వహించాలి.

దీనికే ఒక సామాన్యమైన ఉపమాన మివ్వవచ్చు. దేశం యొక్క రాజుని అందరూ నేరుగా కలిసికోలేరు. తమ తమ సమస్యల పరిష్కారానికి ప్రజలు ప్రభుత్వోద్యోగులను ఆశ్రయిస్తారు. ఆ అధికారులు వ్యక్తిగతంగా కాక ప్రభుత్వమో, రాజో నిర్దేశించినట్టు వ్యవహరిస్తారు. తమ అవసరాలను తీర్చేది పరోక్షంగా ప్రభుత్వాధినేతే, కాని ఆయనని నేరుగా ప్రజలు కలుసుకోలేరు.

అదే విధంగా మన మతంలో కొన్ని ఆచారాలు నిర్దేశింప బడ్డాయి. పరమేశ్వరుడే సార్వభౌముడు. మానవాళి అంతా ప్రజానీకం. వరుణుడు, వాయువు వంటి వారంతా అధికారులు. మన అవసరాలను వారి ద్వారా తీర్చుకోవాలి మనం.

దేవతలను పటిష్ఠం చేయటానికి యజ్ఞాలను చేస్తాం. మనమిచ్చే నైవేద్యాలు వారికి ఆహారం. మనం స్వార్థం లేకుండా త్యజించినవే వారికి చేరుతాయి. అగ్నికి ఆహుతి చేసే వాటిని మనసారా దేవతలకు సమర్పించాలి. అందువల్లనే, ద్రవ్యాన్ని సమర్పించేప్పుడు "నాది కాదు" ("న మమ") అంటాం. దేవతలకు ఆహారం అగ్ని ద్వారా అందుతుంది. ఇట్లాగే అగ్ని ద్వారా, మంత్రాల ద్వారా మన పితృదేవతలకు కూడ ఉపహారాలర్పిస్తాం.

**యజ్ఞాల ప్రాధాన్యమూ, ప్రయోజనమూ :**

మన మతంలోనే ఈ క్రతువులు ఉండటానికి కారణం విశ్లేషించే ముందు, అసలు మానవజీవితం ఎట్లా సాగుతుందో గమనిద్దాం. ఒక ప్రాంతంలో ఏ పదార్థమైనా ఎక్కువగా లభిస్తే దానిని ఆ పదార్థం సమృద్ధిగా లేని ప్రాంతానికి పంపి, ఆ రెండో ప్రాంతం నుంచి మనకి లేని దానిని తెచ్చుకుంటాం. వడ్రంగులు, మేస్త్రీలు వంటి శిల్పులు మనకి పనిచేసి పెట్టితే వారి జీవనాధారానికి డబ్బునిస్తాం. ఆవుని మేపుతాం, పాలు ఇస్తుంది. ప్రభుత్వానికి పన్నులు చెల్లిస్తాం. మన భద్రతనీ, ఇతర అవసరాలనీ ప్రభుత్వం చూస్తుంది. ఆ విధంగానే పరలోకాలలో కూడా ఇచ్చి పుచ్చు కోవటాలున్నాయి. ఇంజనీర్లు వర్షపునీటిని కాలువ ద్వారా పారనీయగలరు, జలాశ్రయాలలో నిలువ చేయగలరు. అంతేకాని, వర్షాన్నే కల్పించలేరు. మనకి వర్షాలు కావాలంటే దేవలోకానికి కొన్ని పదార్థాలని పంపాలి. ఈ పరస్పర సంబంధాలనే గీత ఇట్లా సూచిస్తుంది.

"సహయజ్ఞాః ప్రజాసృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వమేషవో ऽ స్త్విష్టకామధుక్।

*దేవాన్ భావయతానేన తేదేవా భావయన్తునః ।*
*పరస్పరం భావయంతః శ్రేయఃపర మవాప్స్యథ ।*

(యజ్ఞాల వల్ల దేవతలను సంతుష్టిపరచు, దేవతలు వర్షాలు మొదలైన వాటితో నిన్ను సంతుష్టుని చేయనీ, ఈ విధంగా ఒండొరులకు సహాయపడుతూ అందరూ వర్ధిల్లుగాక).

**మార్గాలు వేరు, గమ్యం ఒక్కటే :**

క్లుప్తంగా చెప్పాలంటే, ప్రతిదేవతకీ మంత్రసమేతంగా ఉపహారం సమర్పించటమే యజ్ఞం. ఒక విధంగా చెప్పాలంటే, సామవేద మంత్రాలే దేవతా స్వరూపాలు. యజ్ఞంలో సమర్పించిన ఆహారదినుసులవలె ఈ మంత్రాలలోని పదాలే ఆయా దేవతలకు పోషకాలై వారిని బలవత్తరం చేస్తాయి. కాబట్టి మంత్రాలకి అనేక ప్రయోజనాలున్నాయి. ప్రభుత్వాదాయాన్ని పెంపొందించేందుకు మనం వివిధ రకాల పన్నులను కట్టుతూంటాం. అయినా ఒకో పన్ను ఒకో చోట కట్టాలి - అంటే, ఆదాయపు పన్ను, భూమిశిస్తు, అమ్మకం పన్ను, వాహనాలపై పన్ను వంటివి. ఒకో అధికారి ఒకో రకమైన రసీదునిస్తాడు. అలాగే ప్రతిక్రతువుకీ ప్రత్యేకమైన మంత్రమూ, దేవతా, ఉపహారమూ, సమయమూ - ఉన్నాయి. ఒకో యజ్ఞాన్ని నిర్వహించటానికి ఒకో నియమావళి ఉన్నా అన్నిటి ధ్యేయమూ పరమేశ్వరుని ప్రసన్నం చేసుకోవటమే. మనం ఎక్కడ చెల్లించినా, పన్ను ప్రభుత్వాదాయంలోనే జమ అవుతుందని మనమెరుగుదుము. అట్లాగే వేరువేరు దేవతలకై మనం చేసే వివిధమైన యజ్ఞాలు ఆ దేవతల ద్వారా పరమేశ్వరుని చేరుతాయనే అనుకోవాలి.



# 7

# చతుర్వేదములు

"అనన్తావై వేదాః" (వేదాలు అనంతం) - కాని ఆ అనంతమైన వేదాల నుండి కొన్ని మంత్రాలనే ఋషులు గ్రహించ గలిగారు. ఇహపర సౌఖ్యానికీ, ముక్తికీ, లోకకళ్యాణానికీ ఇవి చాలు. వేదాలు నాలుగంటూ మనమనుకొన్నా ఈ నాలుగింటికే భిన్నమైన పాఠాలూ, భిన్నరీతులలో పఠించే పద్ధతులూ ఉన్నాయి. వీటిని పాఠాంతరాలంటారు.

ఒక్కొక్క పఠనాపద్ధతినీ, పరిష్కృతపాఠాన్ని "శాఖ" అంటారు. వేదమనే వృక్షానికి శాఖలన్నమాట యివి. వేదం శాఖోపశాఖలు గల మహా వట వృక్షం వంటింది. అసంఖ్యాకమైన శాఖలున్నా వాటిలో కొన్నింటిని మాత్రం కలిపి నాలుగు శాఖలుగా వర్గీకరించారు. ఇవి ఋక్, యజుః, సామ, అధర్వ - వీటినే ఋగ్వేదము, యజుర్వేదమూ ఇత్యాది అంటారు. ఇవి ఆయా సమూహాల ప్రాముఖ్యతను సూచిస్తాయి.

ఆధునిక పరిశోధకుల ఉద్దేశంలో, ఋగ్వేదం, యజుర్వేదం కంటె ప్రాచీనం. కాని మన శాస్త్రాల ప్రకారం, మన విశ్వాసానుసారం, వేటికీ కాలమానంలో ఆది అంటూ ఏమీ లేదు. సృష్ట్యాదికే వేదాలు లభ్యాలు కావటం వల్ల! "ఈ వేదం ముందు, ఆ వేదం తరువాత" అంటూ చెప్పే పరిశోధకుల మాటలు విశ్వసనీయాలు కావు -

అట్లాగే, వేదభాగాలైన సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యకాలు ఏ క్రమంలో వచ్చాయో చెప్పే "పరిశోధకులూ" పొరబడ్డారు. ఋషులు కాలాతీతులై, త్రికాలజ్ఞులైన తరువాతనే వేదాలని గ్రహించి మనకివ్వ గలిగారు. ఈ విషయాన్ని గుర్తు పెట్టు కొంటే, కాలమానంలో వేదాల గురించీ, వాటి క్రమం గురించీ వేసే అంచనాలు అనుచితమని తెలుస్తుంది. ఆయా ఋషులు అలౌకిక చేతనా స్థితిని బట్టి వారికి కలిగిన వేదమంత్రాల గ్రహింపు మారియుండ వచ్చు అంతే. అసలు, ఋగ్వేదంలోనే యజుర్వేదానికీ, సామవేదానికీ సంబంధించిన ప్రస్తావనలున్నాయి. ఇతర వేదాల ప్రస్తావన గల పురుషసూక్తం, ఋగ్వేదం తొంభైయవ ఋక్ సమూహం పదవమండలులో ఉంది. దీనిబట్టే తెలుస్తుంది, కొన్ని వేదాలు ముందూ, మరి కొన్ని వెనుకా కావని.

ప్రతి శాఖలోనూ మూడు భాగాలుంటాయి. ఇవి సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము. ఇది కూడ ఒక విధమైన వర్గీకరణమే. "వేద అధ్యయనం" అని మనమన్నప్పుడు సాధారణంగా సూచింపబడేది "సంహిత" భాగ పఠనమే. "సంహిత" వేదశాఖకి మూలమూ, జీవమూ అవటమే దీనికి కారణం.

'సంహిత' అంటే సంకలింపబడి, ఒక క్రమంలో ఏర్పచబడినది అని అర్థం. ఏ సంహితైనా, ఆ వేదంయొక్క అంతరార్థాన్ని మంత్రాల ద్వారా తెల్పుతుంది.

**ఋగ్వేదము :**

ఋగ్వేదసంహిత అంతా పద్యరూపం. వీటిని ప్రథమంలో ఋక్కులనే వారు. తరువాతి కాలంలో శ్లోకమనటం ప్రారంభించారు. వివిధ దేవతలను స్తుతిస్తాయివి. ఒక్కొక్క ఋక్కూ ఒక్కొక్క మంత్రం. కొన్ని ఋక్కుల సమూహాన్ని సూక్తమంటారు.

ఋక్ సంహితలో 10, 170 ఋక్కులున్నాయి. నాలుగు వేదాల సంహితలలోనూ 20,500 మంత్రాలున్నాయి. ఋగ్వేదంలో 1028 సూక్తాలున్నాయి (ఋక్కుల సమూహాలు) వీటిని పది మండలాలూ, ఎనిమిది అష్టకాలుగా వర్గీకరించారు. అగ్నిపై సూక్తంతో ప్రారంభించి దానితోనే ఆఖరవుతుంది. వేదాలన్నిటిలోనూ ఋగ్వేదంలోనే దేవతాస్తోత్రాలధికంగా ఉంటాయి. ఆరంభంలోనూ (ఉపక్రమంలోను) అంతంలోను (ఉపసంహారంలోను) అగ్ని దేవుని స్తుతి ఉండటం వల్ల ఆ వేదం యొక్క ఉద్దేశం అగ్నిని పూజించటమే అనుకొంటారు కొందరు. కాని 'అగ్ని' అంటే ఆత్మ చైతన్యం, ఆత్మ మేల్కొనేప్పుడు కలిగే తేజస్సు అని భావించటం మంచిది

ఋగ్వేదంలోని ఆఖరి సూక్తం అగ్నికి సంబంధించినదే అయినా, అందరి శ్రేయస్సునూ కోరే శ్లోకాలున్నాయి అందులో. "అందరూ కలిసి ఏకమానసులై ఆలోచింతురు గాక. అందరి హృదయాలూ ప్రేమతో బంధింపబడుగాక. అందరికీ ఒకే లక్ష్యముండుగాక. అందరూ ఏకొన్ముఖులై సంతుష్టులగుదురు గాక" - ఈ వాక్యాలతో ఋగ్వేదము సమాప్తమవుతుంది.

సకల దేవతాస్తోత్రాలు కలిగి యుండటమే ఋగ్వేదపు విశిష్టత. సామాజిక వర్తనమెట్లా ఉండాలో మిగిలిన వాటన్నిటి కంటె ఉత్తమంగా చెప్తుంది : అందువల్లనే విజ్ఞులు దానిని ఆరాధిస్తారు. ఉదాహరణకి : పెళ్ళికి సంబంధించిన కర్మలు సూర్యుని కుమార్తె యొక్క వివాహముననుసరించి నిర్దేశింపబడ్డాయి. ఊర్వశీపురూరవుల సంభాషణల వంటి విశేష సన్నివేశాలు కూడ ఋగ్వేదంలో ఉన్నాయి. తరువాతి కాలంలో కాళిదాసు వంటి మహాకవులు వీటినే విస్తరించారు.

ఋగ్వేదంలో, ఉషస్సునుద్దేశించిన భాగాలను రసజ్ఞులు మహోన్నతమైన పద్యకావ్యాలుగా శ్లాఘిస్తారు. వేదాలన్నిటిలోనూ అగ్రస్థానం ఋగ్వేదానికి కలగటానికి ఏదో కారణముండి ఉండాలి. ఋగ్వేదంలో ఋక్కులు నాద భరితమయిన సామవేద మంత్రములకు మాతృకలవంటివి. "ఋచ్యధ్యూఢం సామ"

**యజుర్వేదం :**

"యజుస్" అన్న పదం "యజ్" అన్నధాతువు నుంచి వచ్చింది. "యజ్" అంటే పూజించుట లేక ఆరాధించుట. 'యజ్ఞ'మనే పదం కూడ ఈ ధాతువు నుంచే వచ్చింది.

"ఋక్" అంటే స్తోత్ర మయినట్లుగానే, "యజుస్" అన్న పదం యజ్ఞానికి కావలసిన కర్మకాండని సూచిస్తుంది. ఋగ్వేదంలో స్తోత్ర రూపంలో ఉన్న మంత్రాలకి, యజ్ఞం

చేయటానికి వీలయిన రూపాన్ని యజుర్వేదం కల్పిస్తుంది. అంతేకాక, రకరకాల యజ్ఞాలని కొనసాగించే పద్ధతులని కూడ వచన రూపంలో యజుర్వేదం సూచిస్తుంది.

స్తోత్రంతో ఆరాధించటం నేర్పుతుంది ఋగ్వేదం. ఈ మంత్రాలనే, ఈ స్తోత్రాలనే యజ్ఞం చేయటానికి ఎట్లా ఉపయోగించుకోవాలో యజుర్వేదం నేర్పుతుంది.

మిగిలిన వేదాలకు వలెనే, యజుర్వేదానికి కూడా ఎన్నో శాఖలున్నాయి కాని వీటిలో ముఖ్యమైనవి రెండే. వీటికి కూడా ఎన్నో పాఠాంతరాలున్నాయి.

ఈ రెండు శాఖలను - శుక్లయజుర్వేదము, కృష్ణయజుర్వేదము అంటారు. 'శుక్ల' అంటే తెల్లని, 'కృష్ణ' అంటే నల్లని, శుక్ల యజుర్వేద సంహితని "వాజసనేయ సంహిత" అంటారు. 'వాజసని' అంటే సూర్యుడు. సూర్య భగవానుని వద్ద నేర్చుకొని యాజ్ఞవల్క్యముని లోకానికి ఈ సంహితను ఎరుక పరచాడంటారు. అందువల్లనే దీనిని 'వాజసనేయ సంహిత' అంటారు.

సూర్యుని వద్ద యాజ్ఞవల్క్యుడు వాజసనేయ సంహితను నేర్చుకోవటం గురించి ఒక కథ ఉంది. వ్యాసుడు వేదాలనన్నిటినీ నాలుగుగా విభజించినప్పుడు యజుర్వేదానికి ఒక శాఖే ఉండేది. దీనిని వ్యాసమహర్షి వైశంపాయనునకు భద్రపరచమనీ, తన శిష్యుల ద్వారా ప్రచారం చేయమనీ యిచ్చాడట. యాజ్ఞ వల్క్యుడు వైశంపాయనుని వద్ద దీనిని అధ్యయనం చేశాడు. గురుశిష్యుల నడుమ ఒక భేదాభిప్రాయం రావటంతో, వైశంపాయనుడు యాజ్ఞవల్క్యుని తాను నేర్పిన సంహితను తిరిగి యిచ్చేయమని కోరాడు. ఇది న్యాయమేనని గ్రహించి యాజ్ఞవల్క్యుడు ఆ విధంగా చేశాడు. ఆ తరువాత సూర్య భగవానుడిని తనను శిష్యునిగా స్వీకరింపుమని కోరాడు. సూర్య భగవానుడు అంగీకరించి, యజుర్వేదానికి పాఠాంతరం నేర్పాడు. ఆ విధంగా దానికి వాజసనేయి అనీ, శుక్లయజుర్వేదమనీ పేరు వచ్చింది. దీనికీ పేరు రావటం వల్ల, అంతకు పూర్వం వైశంపాయనుడు నేర్పిన దానిని కృష్ణయజుర్వేదమన్నారు.

కృష్ణ యజుర్వేదములో సంహిత బ్రాహ్మణ భాగాలు స్పష్టముగా విభజింప బడిలేవు.

యజుర్వేదం యొక్క ఘనత అంతా వైదిక కర్మలను, కర్మకాండను విశదీకరించటంలోనే ఉన్నది. దర్శపూర్ణమాసం, సోమయాగం, వాజపేయం, రాజసూయం, అశ్వమేధం - వంటి యాగాల నిర్వహణాక్రమాన్ని వివరంగా కృష్ణయజుర్వేదంలోని తైత్తిరీయ సంహిత తెల్పుతుంది. అంతేకాక, ఋగ్వేదంలో కానరాని కొన్ని స్తోత్రాలు కూడ యజుర్వేదంలో ఉన్నాయి. ఉదాహరణకి ఇప్పుడు ప్రాచుర్యంలో ఉన్న శ్రీ రుద్రం యజుర్వేదం లోనిది. ఋగ్వేదంలో అయిదు సూక్తాలు "పంచరుద్రం" గా ఉన్నాయి, నిజమే. కాని యజుర్వేదంలో ఉన్న దానినే శ్రీ రుద్రమంటారు. అందువల్లనే అప్పయ్య దీక్షితులవారు అనబడే శివభక్తుడు, తాను యజుర్వేదంలో జన్మించి యుంటే పరమ శివుడ్ని యజుర్వేదం ద్వారానే ఆరాధించగలిగే వాణ్ణి కదా అని వాపోయారు. ఆయన సామవేదాన్ని అనుసరించే కుటుంబంలో జన్మించారు. ప్రస్తుతం అత్యధికులు యజుర్వేదాన్నే అనుసరిస్తున్నారు. ఉత్తర భారతంలో శుక్ల యజుర్వేదాన్ని

ఎక్కువగా ఉన్నది. దక్షిణ భారతంలో కృష్ణ యజుర్వేదాన్ని. ఋగ్వేదంలోని పురుషసూక్త, కొద్ది మార్పులతో యజుర్వేదంలో కూడ ఉంటుంది. కాని "పురుషసూక్త" మన్నప్పుడు యజుర్వేదంలోని పురుషసూక్తమనే అర్థం చేసుకోవాలి.

అద్వైత సిద్ధాంతావలంబులకు యజుర్వేదం అత్యంత ప్రధానం. ఏ సిద్ధాంతానికైనా ఒక సూత్ర ముండాలి - దానికొక భాష్యముండాలి - దానికొక వార్తికముండాలి (అంటే విపులమైన వ్యాఖ్యానం)

సిద్ధాంతాన్ని క్లుప్తంగా చెప్పేది సూత్రం. ఆ సూత్రానికి వివరణ ఇచ్చేది భాష్యం. భాష్యానికి ఇంకా వివరమైన వ్యాఖ్యానమిచ్చేది వార్తికం. అద్వైత సిద్ధాంతంలో వార్తిక కర్త (అంటే, వార్తికం వ్రాసినవాడు) ఆది శంకరుల శిష్యుడు సురేశ్వరులే - ఈ పదం ఇంకెవ్వరికీ వర్తించదు. ఆయన ఏ భాష్యానికి వార్తికం వ్రాశాడు? ఉపనిషత్తులని సూత్రాలన్నామంటే ఆదిశంకరులు వాటికి భాష్యం వ్రాశారు. ఆయన వేదవ్యాసులు (బాదరాయణుడు) రచించిన బ్రహ్మ సూత్రాలకి కూడ భాష్యం వ్రాశారు.

ఆచార్యుల వారి ప్రత్యక్ష శిష్యులు సురేశ్వరులు. ఉపనిషత్ భాష్యంపై వార్తికం రచించారు. ఆయన తన వ్యాఖ్యానాన్ని ప్రధానమైన పది ఉపనిషత్తులమీదా కాకరెండింటిమీదే వ్రాశారు. అవి తైత్తిరీయ, బృహదారణ్యక ఉపనిషత్తులు. ఈ రెండూ క్రమంగా కృషయజుర్వేదానికీ శుక్లయజుర్వేదానికీ సంబంధించినవి. రెండూ యజుర్వేదానికీ సంబంధించినవి కావున అద్వైత సిద్ధాంతావలంబులకు యజుర్వేదమెంతో ముఖ్యం.

**సామవేదం :**

"సామ" అంటే మనస్సుకి శాంతినివ్వటం. అంటే, శాంతంతో మనస్సు సౌఖ్యం పొందేట్టు చేయటం. శత్రువుని జయించటానికి ఉపయోగించే ఉపాయాలు నాలుగు విధాలు. అవి సామ, దాన, భేద, దండోపాయాలు. వీటిలో మొదటిది "సామ", శత్రువుని ప్రేమతో, అనునయంతో లొంగదీసుకోవటం. ఋగ్వేదంలోని ఋక్కులకు సామవేదంలో మనోహరమైన సంగీతం కూర్చబడింది. ఋగ్వేద మంత్రాలను ఉదాత్త, అనుదాత్త స్వరాలతో పఠిస్తారు. కాని సామవేదంలో దీర్ఘ స్వరాలతో గానం చేస్తారు భారతీయ సంగీత సంప్రదాయంలోని సప్తస్వరాలకి ఆధారమూ, మూలమూ సామగానమే అనవచ్చు. సామగానం వల్ల (అంటే సామవేదంలో నిర్దేశింప బడినట్లు) స్తోత్రాలను గానం చేయటం వల్ల సకల దేవతలనూ తృప్తి పరచవచ్చు. యజ్ఞాలను నిర్వహించేటప్పుడు మనం సమర్పించే ఉపహారాలతోనే కాక, ఉద్గాత అనబడే ఋత్విక్కు చేత చేయబడే సామగానం చేతకూడ దేవతలు మనలను అనుగ్రహిస్తారు.

ప్రధానంగా, ఋగ్వేదంలోని మంత్రాలే అయినా ఆధ్యాత్మిక ఉన్నతికీ, దేవతల అనుగ్రహానికి పాత్రులవటానికీ ఎంతో అనుకూలంగా స్వరపరుప బడ్డాయవి. సామవేదం

యొక్క ప్రత్యేకత యిదే. అందువల్లనే భగవద్గీతలో కృష్ణ భగవానుడు "వేదాలలో సామవేదం నేను" అంటాడు. లలితాసహస్రనామస్తోత్రంలో లలితా దేవికి గల నామాలలో "సామగాన ప్రియ" అన్న దొకటి. అంటే, సామవేదాన్ని గానం చేస్తే ప్రసన్నమవుతుందని భావం.

**అథర్వవేదం :**

"అథర్వణుడు" అంటే పురోహితుడు, ఆచార్యుడు. 'అథర్వణుడు' అనే పేరుతో ఒక ఋషి ఉండేవాడు. అథర్వవేదంలోని మంత్రాలు ఆ ఋషి వల్లనే లోకానికి తెలిసినవి. కష్టాలని పారద్రోలటానికీ, ఈ వేదంలో శత్రువులని సంహరించటానికీ ఉపయోగపడే మంత్రాలెన్నో ఉన్నాయి. అవి వచన రూపంలోనూ, పద్యరూపంలోనూ ఉన్నాయి. ఇతర వేదాలలో పేర్కొనబడని దేవతలకి సంబంధించిన మంత్రాలు అథర్వవేదంలో ఉంటాయి.

అథర్వవేదంలో సృష్టికి సంబంధించిన మంత్రాలు కూడ చాలా ఉన్నాయి. సృష్టి ఎంత అద్భుతమైనదో వర్ణించే గీతం "పృథ్వీ సూక్తం". ఇది అథర్వవేదంలోనిది.

యజ్ఞాల నిర్వహణను పర్యవేక్షించే బ్రహ్మ అథర్వవేదానికి ప్రతినిధి. ప్రశ్న, ముండక, మాండూక్య ఉపనిషత్తులు ఈ వేదంలోనివి.

సత్యాన్వేషకుడైన ముముక్షువునకు మాండూక్యోపనిషత్తు మోక్షాన్ని స్తుందన్న నానుడి ఒకటుంది. దీనిబట్టి ఈ వేదం యొక్క ప్రాముఖ్యం గ్రహించవచ్చు.

సర్వశ్రేష్ఠమైన గాయత్రి మంత్రం ఋక్, యజుః, సామవేదాల సారమంటారు. అంటే, అథర్వ వేదానికి వేరే మంత్ర ముందన్న మాట - అందువల్ల, అథర్వ వేదాన్ని అధ్యయనం చేసేముందు వేరొక ఉపనయనం చేసుకొని బ్రహ్మోపదేశం పొందుతారు.

ఉపనయనంలో బాలురకు ఉపదేశింపబడే గాయత్రిని "త్రిపదాగాయత్రి" అంటారు. అంటే, "మూడు పాదాలు కలది" అని అర్థం. ఒక్కొక్క పాదమూ ఒక్కొక్క వేదసారం. కాని అథర్వవేదానికి వేరే గాయత్రి ఉంది. అందువల్లే అథర్వవేదాన్ని పఠించే ముందు, అథర్వ గాయత్రి ఉపదేశం పొందాలి. ఋక్, యజుః, సామవేదాలకు ఒకే గాయత్రి ఉండటం వల్ల ఆ మూడింటిలో ఒక వేదాన్ని అధ్యయనం చేసినవాడు మిగిలిన రెండింటినీ అధ్యయనం చేయాలంటే మళ్లీ ఉపనయనం చేసికోనక్కర్లేదు.

ఒకప్పుడు అథర్వవేదం ఉత్తర భారతంలో బాగా ప్రాచుర్యంలో ఉండేది. ఆ వేదశాఖలని ఎరిగిన వారు మాత్రమిప్పుడు బహుకొద్ది మందే ఉన్నారు. దక్షిణ భారతంలో అసలు లేనే లేరు. ఆ కారణం వల్ల ఈ వేదశాఖ పారాయణం చాలా దయనీయమైన స్థితిలో ఉన్నదిప్పుడు. ఒరిస్సా బ్రాహ్మణులలో పద్దెనిమిది శాఖలున్నాయి. అందులో ఒకటి "అథర్వనిక" అంటే, అథర్వ వేదానికి చెందిన వారని అర్థం. ఇప్పటికీ అథర్వ వేదాన్ని అనుసరించే వారు కొద్దిగా గుజరాత్, సౌరాష్ట్ర, నేపాలులో ఉన్నారు.

నియమాలను పాటించటంలోనూ, పఠనాపద్ధతిలోనూ నాలుగు వేదాలూ పైకి వేరువేరుగా కనబడినా అన్నిటికీ ఒకే లక్ష్యం ః అది విశ్వశ్రేయస్సు, ప్రతి యొక్కరి ఆధ్యాత్మిక ప్రగతీను.

"ఇదే మార్గం" "ఇదే దైవం" అంటూ ఏ వేదమూ పేర్కొనదు - ఇదే వేదాల ప్రత్యేకత. ఏ మార్గాన్ని విశ్వాసంతో, చిత్తశుద్ధితో అవలంబించినా ఏ దైవాన్ని ఏ విధంగా ఆరాధించినా ఒకే గమ్యాన్ని చేరుస్తాయంటాయి వేదాలు. పైగా, విభిన్న మార్గాలను అనుసరించవచ్చంటూ ప్రపంచంలో మరే యితర పవిత్ర గ్రంథమూ సూచించదు. ప్రతి మతమూ తన మార్గమే కైవల్యాన్నిస్తుందంటుంది. సత్యాన్వేషణకి ఏ మార్గానన్నా అనుసరించవచ్చున్న విశాల దృక్పథం వేదాలకే ఉన్నది. వేదాల గొప్ప తనమంతా యిదే.

**బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు ః**

వేదాల గురించి ముచ్చటించేప్పుడు మన మింత వరకూ "సంహిత"ల గురించే చెప్పుకొన్నాం. వేదంలో ముఖ్యమయిన భాగం "సంహిత" విభాగమే. అదికాక, ప్రతి వేదానికి బ్రాహ్మణ, ఆరణ్యక భాగాలు కూడా ఉన్నాయి. బ్రాహ్మణాలు వైదిక కర్మలను, వాటిని ఆచరించవలసిన పద్ధతులను చెప్పుతాయి.

సంహితలోని మంత్రాలను యజ్ఞంలో ఉపయోగించటానికి బ్రాహ్మణాలు మార్గ దర్శకపు సూచనలనిస్తాయి. అంటే, ప్రతి మాటకూ అర్థం చెప్పి మంత్రాన్ని సద్వినియోగం చేసుకొనేందుకు ఉపకరిస్తాయి.

'ఆరణ్యక' అన్న పదం 'అరణ్య'మన్న మాటనుండి వచ్చింది. సంహిత విభాగంగాని, బ్రాహ్మణ విభాగంగాని పట్టణాన్ని విడిచి అడవులలో వ్యక్తి ఏకాంతాన్ని వెతుక్కోవాలని ఎక్కడా చెప్పవు. యజ్ఞాలూ ఇతర క్రతువులూ గృహస్థుల కోసం నిర్దేశింపబడినవే. కాని వైదిక కర్మలు కేవలం భౌతికమైన సంపదనే కాక, దీక్షాదుల వల్ల చిత్తశుద్ధి కూడ కలిగించటానికి ఉద్దేశింపబడ్డాయి. ఈ చిత్తశుద్ధి కలిగిన తరువాత ఏకాగ్రతకీ, ధ్యానానికీ దోహదకారి యైన ఏకాంతాన్ని అరణ్యాలలో కల్పించుకోవాలి. వేదపారాయణమూ, యజ్ఞ నిర్వహణమూ, నియమపాలనమూ ఇవన్నీ నిజతత్త్వాన్ని తెలుసుకోవటానికి కావలసిన ధ్యానానికి సమాయత్త పరచే ప్రాథమిక దశలు.

సంహితలోని మంత్రాలకీ, బ్రాహ్మణాలలోని కర్మలకీ వెనుక గల అంతరార్థాన్ని, సిద్ధాంతాన్నీ వివరించటమే ఆరణ్యకాల ఉద్దేశం. వేదాలలో నిక్షిప్తమైన నిగూఢ భావాలను విశద పరచటమే ఆరణ్యకాల ప్రయోజనం. ఆరణ్యకాల ప్రకారం - యజ్ఞ నిర్వహణకంటే యజ్ఞాలు ఎందుకు జరపాలో తెలుసుకోవటం ముఖ్యం. అరణ్యాలలో ఒంటరిగా ధ్యానం చేసుకొనే ఋషుల కృషియే ఆరణ్యకాలని ఆధునిక పరిశోధకులంటారు. ఆరణ్యకానికీ, ఉపనిషత్తుకీ సమ్మేళనమైన బృహదారణ్యకోపనిషత్తు అశ్వమేధ యజ్ఞాన్ని గురించిన విశ్లేషణతో ప్రారంభిస్తుంది !

# 8

# ఉపనిషత్తులు

ఆరణ్యకాల చివర ఉపనిషత్తులుంటాయి. 'సంహిత'ని ఒక వృక్షంతో పోలిస్తే బ్రాహ్మణాలు దాని పుష్పాలు, ఆరణ్యకాలు పక్వంచెందని కాయలు, ఉపనిషత్తులు పక్వం చెందిన ఫలాలు. పరమాత్మకీ జీవాత్మకీ భేదం లేదన్న సత్యాన్ని జ్ఞానమార్గం ద్వారా తెలుసుకోవట మెట్లాగో ఉపనిషత్తులు తెల్పుతాయి. ఉపనిషత్తులలో కూడా వివిధ విద్యలకీ, యజ్ఞాలకీ, దేవతారాధనలకీ సంబంధించిన ప్రస్తావనలున్నా ప్రధానంగా వాటిలోని విషయం తత్త్వవిచారం, బంధ విమోచనం కలిగిన మానసిక స్థితీని.

వేదాలకి రెండు భాగాలున్నాయంటారు. మొదటిది కర్మకాండ - అంటే క్రతువుల నిర్వహణకి సంబంధించినది. రెండవది - జ్ఞానకాండ అంటే జ్ఞానానికి సంబంధించినది. వీటినే పూర్వ మీమాంస అనీ, ఉత్తరమీమాంస అనీ అంటారు.

కర్మకాండని విశ్లేషించిన తరువాత జైమిని మహర్షి అది వేదతత్త్వానికి అంతిమ ఫలమన్నాడు. ఆ విశ్లేషణ శాస్త్రమును పూర్వ మీమాంస అంటారు. జ్ఞానకాండను విశ్లేషించిన వేదవ్యాసుడు దానినే వేదాల సారమన్నాడు. ఈయన రచన బ్రహ్మసూత్రాలు - ఇవి సూక్తుల వలె ఉంటాయి. కర్మకాండతో పోలిస్తే జ్ఞాన కాండలోని ఉపనిషద్భాగం చాలా సంక్షిప్తం, క్లుప్తమూను. జైమిని పూర్వమీమాంసలో వెయ్యి అధికరణాలున్నాయి, బ్రహ్మ సూత్రాలలో కేవలం నూటతొభై రెండు మాత్రమున్నాయి. ఏ వృక్షానికైనా ఎన్నో ఆకులూ, కొద్దిగా పూలూ, ఫలాలూ ఉన్నట్టే వేదమనే వృక్షానికి కర్మకాండ రూపంలో అనేకమైన ఆకులు, ఉపనిషత్తుల రూపంలో కొద్దిపాటి పళ్లూ ఉన్నాయి. కేవలం మేధతోనే పరిశీలించిన పాశ్చాత్యతత్త్వజ్ఞులు పరమసత్యపుటంచులను గ్రహించటానికి అవసరమైన ప్రగాఢమైన కృషిని చేయలేదు. మేధ వల్ల కలిగిన నిశ్చితాభిప్రాయాలకు అనుభవ సిద్ధమైన ప్రమాణాలు కావాలి. ఇతర తాత్త్వికరచనలకు లేని విశేషమైన లక్షణం ఉపనిషత్తులకుంది. తాత్త్విక భావాలను మంత్రాలలో ఇమిడ్చాయి. ఆ మంత్రాల పఠనం వల్ల ఏర్పడే ప్రకంపనలు ఆ తాత్త్విక భావాలను అనుభవనీయం చేస్తాయి.

ఇతర తత్త్వాలు కేవలం బుద్ధి ప్రేరకాలైన పరిశోధనల వలె ఉండగా, "కర్మకాండ" వేదాల తత్త్వాన్ని గ్రహించేందుకు వీలైన జీవనవిధానాన్ని నిర్దేశిస్తుంది. వాటి ననుసరించి జీవిస్తే మనస్సు శుద్ధమవుతుంది. ప్రాపంచక వ్యవహారాల నుంచి అప్పుడు మనస్సుని ఉపసంహరించ వచ్చుకూడా. ఆ తరుణంలో నిష్ఠతో ఉపనిషత్తులని అధ్యయనం చేస్తే అది కేవలం బుద్ధి సూక్ష్మతని పెంచే వ్యాసంగం కాక, ఒక జీవన విధానంగా - జీవితానుభవంలో ఒక అంశంగా నిలిచిపోతుంది.

ఈ తాత్త్వికానుభూతి శిఖరాన జీవాత్మ - పరమాత్మల అద్వైత స్థితి అవగాహన అవుతుంది. ఆ స్థితిని చేరటానికి కర్మానుష్ఠానానికి అలవాటు పడిన వ్యక్తి అన్ని వ్యాపకాలనూ

విడచి సన్న్యాసి కావాలి. ఆ దశలో అతనికి మహావాక్యప్రబోధం జరుగుతుంది. ప్రతి వేదంలోనూ కొన్ని మహావాక్యాలున్నాయి. ఇవి మహనీయమైన సూక్తులు. కాని ఒక్కొక్క వేదం నుంచి ఒక్కొక్కటి చొప్పున నాలుగు మహావాక్యాలు బాగా ఆలోచింప చేసేవి. శక్తి మంతమైనవీను. జీవునికీ బ్రహ్మానికీ భేదం లేదని ఇవి చూపుతాయి. వీటిని జపిస్తూ దీర్ఘంగా చింతిస్తే ఆ అద్వైత స్థితి అనుభవసిద్ధమవుతుంది. ఈ నాలుగు మహా వాక్యాలూ ఉపనిషత్తులలోనే ఉన్నాయి. ఎన్నో క్రతువులూ, కర్మలూ, రకరకాల ఆరాధనా పద్ధతులూ, సంహితలోను, బ్రాహ్మణాలలోనూ విశదీకరింప బడ్డా జీవనయాత్ర చరమ దశలో అంతిమ లక్ష్యాన్ని చేరుకోవటానికి సాధనాలు ఉపనిషత్తులే.

ఋగ్వేదంలో ఐతరేయ ఉపనిషత్తులో ఒక మహావాక్యముంది. "ప్రజ్ఞానమ్ బ్రహ్మ - ఆనందానుభూతే బ్రహ్మం. శుక్లయజుర్వేదంలోని బృహదారణ్యక ఉపనిషత్తులోని మహావాక్యం "అహం బ్రహ్మాస్మి" (నేనే బ్రహ్మము) - తైత్తిరీయ ఉపనిషత్తు, నాల్గవ అధ్యాయంలో, కొద్ది మార్పు గల మరొక మహావాక్యముంది - "అహమస్మి బ్రహ్మాహమస్మి", సామవేదంలో చాందోగ్యోపనిషత్తులో గురువు శిష్యునకు బోధిస్తున్నట్టు ఒక మహావాక్యముంది : "తత్త్వమసి" (అదే నీవు) అధర్వవేదంలోని మాండూక్య ఉపనిషత్తులోని మహావాక్యం "అయమాత్మా బ్రహ్మ" (ఆత్మే బ్రహ్మం).

ఆధ్యాత్మిక ప్రగతిని కోరే వారనుసరించ వలసిన విధానాన్ని ఆదిశంకరుల వారు "సోపాన పంచక"మన్న పేర అయిదు శ్లోకాలలో చెప్పారు "వేదాలను అధ్యయనం చేసి, వాటిలో నిర్దేశింపబడిన కర్మలను ఆచరించ"మని ప్రారంభించి "మహావాక్యాలననుసరించు, వాటిని నిరంతరం ధ్యానం చేసి, బ్రహ్మీస్థితిని పొందు" మంటారు చివరికి. వేదాల ముఖ్యోద్దేశమూ, పరమార్థమూ ఉపనిషత్తులే. అందువల్లనే వాటిని వేదాంతమన్నారు. "అంత"మంటే 'చివర' అని భావం. వేదాలకు ఉపనిషత్తులు రెండు విధాల 'అంతం' అని చెప్పవచ్చు. ఒక్కొక్క (వేదాన్ని) అంటే శాఖని పరీక్షిస్తే మొదటి సంహిత, తరువాత బ్రాహ్మణ, ఆ తరువాత ఆరణ్యక భాగాలు వస్తాయి, చివరలో ఉపనిషత్తుంటుంది. రెండవ అర్థమిది - వేదాల లక్ష్యం, పరమార్థం ఉపనిషత్తులలోనే ఉన్నది. పాఠ్యప్రణాళికా పరంగానూ, లక్ష్యసాధనగానూ కూడా ఉపనిషత్తులు వేదాలకు అంతమే.

ఊరిలో గుడీ, గుడిగోపురమూ, గోపురశిఖరమూ - ఒకదాని కంటె ఒకటి ఎత్తుగా ఉంటాయి. ఆ విధంగానే వేదాలకు ఉపనిషత్తులు శిఖరం వంటివి.

"ఉప-ని-షద్" అంటే "ప్రక్కన కూర్చుండటం" "శిష్యుణ్ణి ప్రక్కగా కూర్చుండ బెట్టుకొని బోధించినది" అని అర్థం. ఇంకో అర్థం : "బ్రహ్మానికి చేరువగా తీసుకుపోయేది", 'ఉపనయన'మన్న మాటకీ రెండర్థాలున్నాయి "గురువు దగ్గరకు తీసుకుపోయేది". "పరమాత్ముని వద్దకు తీసుకుపోయేది". ఆ విధంగానే 'ఉపనిషత్తు' అన్న మాటకీ రెండర్థాలు చెప్పుకోవచ్చు.

ఉపనిషత్తు సూక్ష్మాతిసూక్ష్మమైన సత్యాలను వివరిస్తూ "ఇది ఉపనిషత్తు" "ఇది ఉపనిషత్తు" అంటూంటుంది. వేదాలలో నిక్షిప్తమైన దానిని "రహస్య"మంటారు. యోగ్యులైన వారికి గోప్యంగా వ్యక్తిగతంగా ఇవ్వవలసిన ఉపదేశాలు ఉపనిషత్తులు.

# 9

# బ్రహ్మసూత్రములు

ప్రతి తాత్త్విక సిద్ధాంతానికీ సూత్రము, భాష్యము, వార్తికమూ ఉంటాయన్నాను. శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, శ్రీకంఠుడు (శైవసిద్ధాంత ఆచార్యుడు) మొదలైన వారు ప్రతిపాదించిన సిద్ధాంతాలను సామూహికంగా "వేదాంతమత"మంటారు. ప్రతి ఆచార్యులూ తన సిద్ధాంతమే ఉపనిషత్తులలో ఉన్నదంటారు. ప్రధానమైన పది ఉపనిషత్తుల మీదా ఆ ఆచార్యులు భాష్యాలు వ్రాశారు. కాబట్టి వేదాంతమతానికి ఉపనిషత్తులు సూత్రాలవంటివి.

నిజానికి ఉపనిషత్తులు సూత్రాలు కావు, సూత్రాలవలె ఉండవు.

సూత్రమెట్లా ఉండాలి? ఒక భావాన్ని సాధ్యమైనంత సంక్షిప్తంగా వ్యక్తకరించగలది సూత్రం. ఈ నిర్వచనం ప్రకారం ఉపనిషత్తులు సూత్రాలు కానేరవు. కాని ఉపనిషత్తుల ప్రతిపాదనలన్నిటినీ సూత్ర రూపంలో దొరికే ఒక పాఠముంది. ఇవి బాదరాయణుడు కూర్చిన "బ్రహ్మసూత్రాలు". బాదరాయణుడంటే వేదవ్యాసుడు. కొంతకాలం బదరీవృక్షచ్ఛాయని నివసించటం వల్ల ఆయనకి బాదరాయణుడన్న పేరు వచ్చింది. బ్రహ్మసూత్రాలపై చాలా భాష్యాలున్నాయి, ఆయా భాష్యకారుల దృక్పథాన్ని బట్టి. జీవుడంటే ఏమిటి? జీవుడుండే జగత్తు అంటే ఏమిటి? దీనికంతటికీ మూలమైన తత్త్వమేమిటి? ఈ మూడు విషయాల గురించీ బ్రహ్మసూత్రాలలో ఉంటుంది. వేదాంత సిద్ధాంతాలకి సంబంధించిన ప్రాథమిక పాఠమదే.

ఇదైనా వ్యాసులవారి వ్యాఖ్యానం కాదు. అప్పటికే ఉన్న ఉపనిషత్ జ్ఞానం ప్రకారమే ఆయన వ్రాశాడు. ఉపనిషత్తులు వేదాలకి ఉత్తరార్థంలోవి కావటంవల్ల వాటిని "ఉత్తరమీమాంస" అంటారు. బ్రహ్మసూత్రాలు కూడ ఉత్తరమీమాంసలో భాగాలే.

ఈ గ్రంథంలో నాలుగు అధ్యాయాలున్నాయి. 555 సూత్రాలున్నాయి. ప్రతి అధ్యాయంలోనూ నాలుగు భాగాలున్నాయి. మొత్తం 192 అధికరణాలు (విభాగాలు) ఉన్నాయి.

సన్న్యాసుల జీవితలక్ష్యం గురించే బ్రహ్మసూత్రాలు చెప్తాయి కనుక వాటిని "భిక్షు సూత్ర"మని కూడ అంటారు. శరీరంలోని ఆత్మ గురించిన చింతన కనుక 'శారీరక మీమాంస' అని కూడా అంటారు.

"సూత్ర"మంటే దారమని కూడా అర్థముంది. స్త్రీలు ధరించే "మంగళసూత్రం" అన్న మాటకూడ దానిలోని "దారం" నుండే వచ్చింది. ఈ భావాన్ని దృష్టిలో ఉంచుకొనే ఆది

శంకరుడు, "వేదాంత వాక్యకుసుమ గ్రథనత్వాత్" అన్నాడు. వేదాంతమనే వృక్షం రాల్చిన వేదాంతకుసుమాలని సూత్రబద్ధం చేయకపోతే, ధరించేదెట్లా? అందువల్లనే "బ్రహ్మసూత్రం" వాటిని బంధించే దారం వంటిది. హిందూ ధర్మమని చెప్పుకొనే సంప్రదాయాలకీ, సిద్ధాంతాలకీ ప్రమాణం బ్రహ్మసూత్రమైతే, ఆ బ్రహ్మసూత్రానికి పూర్వరంగంలో ఉన్న ప్రమాణాలు ఉపనిషత్తులు.

అందువల్లనే వైదికమత శాఖలన్నిటినీ ఔపనిషద ధర్మమంటారు. అంటే ఉపనిషత్తుల మతమని. వేదాలలో ఉపనిషత్తులు అతిముఖ్యమైన భాగాలవటం వల్ల వాటిని "శ్రుతి శిఖరా"లంటారు. శరీరానికి శిరస్సు ముఖ్యమైన భాగం కదా!



# 10

## వేదమునకూ వేదాంతమునకూ సంఘర్షణ ఉన్నదా?

కర్మకాండ విభాగంలో క్రతువుల నిర్వహణ గురించి చెప్పబడింది. కాని జ్ఞానకాండ విభాగంలో, అంటే ఉపనిషత్తులలో, వీటన్నింటినీ విడిచి పెట్టమని ఉంది. కర్మకాండలో మనుష్యులు దేవతారాధన చెయ్యాలని ఉండటమేకాక ఆ ఆరాధనా విధానానికి కూడ వివరణ ఉంది. ఉపనిషత్తులలో యజ్ఞాలని నిర్వహించే వాడు అజ్ఞానపు పశువని కూడా ఉంది. రెండూ వేదాలలో భాగాలే!

వేదారంభంలో ఉన్న విషయాలే చివరి భాగంలో ఖండింపబడుతాయి. ఇది ఆశ్చర్యదాయకమైన విషయం.

ఒక వైపు కర్మాచరణముంటే రెండవ వైపు అంతా జ్ఞానమార్గము దానికి పూర్తిగా భిన్నం. అందువల్ల మామూలు వాడుక భాషలో వేదాలంటే కర్మకాండ అనీ, వేదాంతమంటే (ఉపనిషత్తులు) జ్ఞానకాండమనీ స్థిరపడి పోయాయి.

భగవద్గీతలో కృష్ణభగవానుడు పదేశించినది వేదాంతమే. గౌతమబుద్ధుడూ, మహావీరుడూ వేదాలలోని కర్మకాండను ప్రతిఘటించిన వారిలో ఆద్యులని సాధారణంగా అంటారు. కాని ఇది వాస్తవం కాదు. వీరిద్దరి కంటే ముందు శ్రీకృష్ణుడే ఆ పని చేశాడు. కృష్ణభగవానుడు అర్జునునితో - "సత్వ-రజః-తమో గుణాలకి సంబంధించినది వేదం. ఈ మూడు గుణాలకు అతీతమైన స్థితిని నీవు చేరుకోవాలి" అంటాడు. ("త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున") అంతేకాక, "వేదాలలో చెప్పిన దానిని పరిమితంగా, యథాతథంగా ఆచరించే వాళ్లని ప్రేరేపించేది స్వర్గసుఖాలని పొందాలన్న కోర్కె" (2-44). వైదిక కర్మలు, సమాధి కల్పించే నిశ్చలమానసిక స్థితిని కల్గించలేవు.

> *"వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదిన" 2-42*
>
> *"కామాత్మనః స్వర్గపరాః జన్మకర్మ ఫలప్రదాం" 2-43*
>
> *"వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే" 2-44*

ఇక్కడేదో వైరుధ్యముందనిపించవచ్చు. ధర్మానికి మూలం వేదమని ముందు చెప్పుకొన్నాం. నిజానికి ఇక్కడ వైరుధ్ధ్యమేమీ లేదు. నిత్యవ్యవహారంలో ఉపనిషత్తులలోని తత్త్వం ప్రకారం జీవించటం కష్టం - అంటే ఆత్మయొక్క అభిన్నత్వాన్ని గ్రహించటానికి త్రిగుణాల వల్ల శృంఖలాలను ఛేదించి, ఏకాగ్రతతో, నిశ్చలంగా ఆత్మవిచారం చేయటమన్నమాట. వేదోక్తమైన కర్మల ఉద్దేశం మనలని ఆ స్థితికి క్రమేపీ చేర్చటమే. జగత్తు "సత్య"మని మనం భావించినంత కాలమూ ఈ జగత్తులో సుఖంగా బ్రతకటానికి

దేవతారాధన తప్పదు. తద్వారా సత్యమని మనం భావించే జగత్తుకి కూడ శ్రేయస్సుని చేకూరుస్తాం. దేవలోకం కూడ, ఈ లోకంవలెనే, సత్యమనుకొంటాం. దేవతలను సంతుష్టి పరచి మనమెంతో లబ్ధిని పొందుతాం. ఈ లోకంలో వలెనే దేవలోకంలో కూడా సుఖాలను అనుభవించగలమని ఆశిస్తాం. కాని అంతటితో ఆగిపోతే, మనం లక్ష్యాన్ని మరచినట్లే. భగవంతునిలో శాశ్వతంగా లీనమైపోవటమే లక్ష్యం. దీనిని మరచి లౌకిక ప్రయోజనాలని సంక్రమింప జేసే వైదిక కర్మల మీదే మనస్సు నిల్పటం. అవివేకం.

నిత్యజీవితంలో జగత్తు "మిథ్య" అని అంగీకరించలేం. "నువ్వు అట్లా అనుకోవటంలో తప్పులేద"ని వేదాలు విశ్వకల్యాణానికై చేయవలసిన కర్మలను విశదీకరించాయి. నిర్గుణుడైన పరమాత్మగాని జీవాత్మపరమాత్మల అభేదంగాని మనకి అవగాహన కల్గటం కష్టమవటం వల్ల మనం ఆరాధించటానికి వీలుగా అనేక రూపాలను ధరించిన దేవతలను మనకిచ్చాయి. కర్మలను చేస్తున్నప్పుడూ, దేవతారాధన చేస్తున్నప్పుడూ, ఇవన్నీ మనకి చిత్తశుద్ధినీ, ఏకాగ్రతనీ కలిగించటానికే ననీ, ఆ మానసిక స్థితిని చేరిన తరువాత ఈ జగత్తు మిథ్యగా తోస్తుందనీ, మనకీ పరమాత్మునికీ భేదంలేదనీ, పరమాత్మలో లీనమై అభిన్నమవుతామనీ - గుర్తుపెట్టుకోవాలి.

దేవతల అనుగ్రహం ద్వారా ప్రాపంచక, స్వర్గ సుఖాలకోసమే యజ్ఞాలను చేస్తే అది సాధారణలోక వ్యవహారం వంటిదే అవుతుంది. ఆత్మసాక్షాత్కారం వల్ల కలిగే ఆనందానికి సాటిరాగలది దేవలోకంలో కూడా ఏదీ లేదు.

అంతేకాదు, చేసిన పుణ్యఫలం పూర్తికాగానే దేవలోకాన్ని విడిచి మళ్లీ సంసారవలయంలో పడి పూర్వకర్మానుసారం జన్మలనెత్తాల్సిందే. ప్రస్తుత స్థితిని బట్టి క్రమేపీ ఆధ్యాత్మిక ఉన్నతిని సాధించటానికి వీలుగా వేదాలు కర్మలనూ, ఆరాధనలనూ నిర్దేశించినా అంతిమ లక్ష్యాన్ని గుర్తుంచుకొని మనం పురోగమించాలి.

వేదోక్తమైన కర్మానుష్ఠానాన్ని విడనాడటం అనుచితమే అయినా, దానిని ఏ పరిస్థితులలోనూ విడనాడ కూడదనటం కూడ అనుచితమే. సంప్రదాయ సిద్ధంగా యజ్ఞాలూ, వేదాధ్యయనమూ చేయకుండా నేరుగా ఉపనిషత్తులనే పఠించటం పట్ల మొగ్గుచూపుతున్నారు ఈ రోజులలో. అందువల్ల చాలామందికి ఉపనిషత్తులలోని విషయం తెలియటమే కాక, ఆ విషయం గురించి చర్చలు కూడ చేయగలుగుతున్నారు. అయినా చిత్తశాంతి కలిగిన వారు, అరిషడ్వర్గాలు లేనివారు, ఆత్మసాక్షాత్కారం పొందిన వారు, ఎక్కడా కాన రారెందుచేత? వైదిక నియమాలను పాటించి, యజ్ఞయాగాదులను నిర్వహించి, మనస్సునూ, దేహాన్నీ వారు అంతిమ దశకు సమాయత్త పరుపక పోవటమే దీనికి కారణం.. అందువల్ల, వేదాధ్యయనం చేయక, కర్మానుష్ఠానాన్ని విడిచి నేరుగా ఉపనిషత్తులలోని రహస్యాలను కనుగొనటానికి ప్రయత్నించటమెంత తప్పో, కేవలం కర్మాచరణతో నిలిపివేసి ఉపనిషత్తులను అర్థం చేసుకోవటానికి ప్రయత్నింపకుండా ఉండటం కూడ అంత తప్పే.

శ్రీ కృష్ణుడు బోధించిన కాలంలో అధికసంఖ్యాకులు వైదిక కర్మలను చేసే దశలోనే ఉండేవారు. వారినే ఆయన విమర్శించారు. వేదాలను ఆయన ఆక్షేపించినట్టు కనబడే మాటలన్నీ యదార్థానికి కర్మలను చేయటంతోనే ఆగిపోయిన వారి పట్ల ఆక్షేపణలే. అందువల్ల ఆయన కర్మాచరణను ఖండించాడనటం తప్పు. ఆయన అవతారాలన్నీ వేదాలనూ, అవి నిర్దేశించిన పథాన్ని నమ్ముకొని బ్రతికే వారి పరిరక్షణకు సంభవించినవే. కర్మకాండలోనే ఆగిపోయిన వారినే శ్రీ కృష్ణుడు ఖండించాడు. అప్పటి పరిస్థితులకు అది అనువైనది. ఆయనే ఇప్పుడు భగవద్గీతను బోధించవలసి వస్తే వైదిక కర్మలను, వేదాధ్యయనాన్ని పూర్తిగా విడనాడి నేరుగా ఉపనిషత్తులని ఆశ్రయింప బోయేవారిని విమర్శించేవాడు. ఇది వరకటి పద్ధతి కంటే ఈ కొత్త పద్ధతి ఇంకా గర్హనీయమవటం వల్ల ఆయన ఇంకా కఠినంగానే విమర్శించేవాడు.

ఈ మాటలన్నీ చెప్పటానికి కారణం, వేదానికీ వేదాంతానికీ వైరుధ్యం లేదని తెల్పటానికే. వేదాంతానికి సన్నద్ధం చేయటమే వేదం యొక్క (కర్మకాండ యొక్క) ముఖ్య ప్రయోజనం. త్రిగుణాలను అతిక్రమించి, సంసారాన్ని త్యజించి, ఆరాధనా - ఆరాధ్యమూ వేరువేరు కావన్న గ్రహింపు కలిగి తద్వారా జ్ఞాన మార్గాన్ని చేరుకోవటానికి సమాయత్త పరచటమే వేదోక్తంగా ప్రవర్తించటంలోని ముఖ్యోద్దేశం. జగత్తంతా మిథ్య అంటూ సంసారాన్ని విడిచి అందరూ జ్ఞానులైతే ప్రపంచ శ్రేయస్సుని చూచే దెవరు? జ్ఞానులకు ప్రపంచం మిథ్యగా తోచినా, మనబోటి సామాన్యులకు వాస్తవంగానే కనబడుతుంది. ప్రపంచశ్రేయస్సు ముఖ్యం - జ్ఞానులు యాగాలు చేయరు, వారు విశ్వశ్రేయస్సుకి ఎట్లా దోహదం కాలగరు? జ్ఞాని యొక్క మహోన్నతత దృష్ట్యా వారు లోక శ్రేయస్సు కొరకు యజ్ఞాలు చేయవలసిన అవసరం లేదు. జ్ఞాని జగత్తు లేదన్నా, జగత్తంతా భగవంతుని లీలే అన్నా జ్ఞాని భగవంతుని అనుగ్రహమెప్పుడూ వెదజల్లుతూనే ఉంటాడు.

జ్ఞాని చుట్టూ జనమెందుకు మూగుతారు? ప్రజలకు దూరంగా ఆయన పారిపోయినా, ప్రజలు వారి ననుసరించి పాదాలకు మ్రొక్కుతారెందుచేత? ఆయన ఆశీర్వచనాన్నీ, అనుగ్రహాన్నీ పొందటానికి! ఆయన ద్వారా భగవంతుని కరుణ ప్రవహిస్తుంది - ప్రజలకు ఆయన సమక్షంలో మనశ్శాంతి లభిస్తుంది.

దైవంతో తాదాత్మ్యం చెందిన జ్ఞాని లోకానికే మేలు, చిల్లర దేవుళ్లు చేసేదాని కన్నా ఎంతో ఎక్కువ. ఈ చిల్లర దేవుళ్ల అనుగ్రహానికై ఎన్నో పూజలు చేస్తూంటారు జనం. జ్ఞాని యజ్ఞాలు నిర్వహించనంత మాత్రాన లోకకల్యాణానికి సహాయపడడనరాదు.

కొందరికి, ముఖ్యంగా అన్యమతస్థులకి, వేదాంత చింతనకీ, వైదిక కర్మలకీ పరస్పర వైరుధ్యం కనబడుతుంది. అందువల్లనే వాళ్లు "హైందవులకి సమాజశ్రేయస్సు కంటే వ్యక్తి మోక్షమే ఎక్కువ ప్రధానం - వాళ్ల యోగము, సమాధీ అన్నీ వ్యక్తి ముక్తిని దృష్టిలో పెట్టుకొన్నవే." అంటారు. ఇంకా - క్రైస్తవము, ఇస్లాం, బౌద్ధమతముల వలె హిందూమతం

ప్రేమ, సోదరభావం వంటి వాటిని ప్రచారం చేయదు, సంఘశ్రేయస్సుని దృష్టిలో పెట్టుకోదు అని కూడా అంటారు. ఏమైనా, హిందూమతాన్ని వేదాంతంగానూ, వైదికంగానూ విభజించరాదు. ఆదిలో వేదాధ్యయనం చేసి, యజ్ఞయాగాదులని నిర్వహించి సంఘశ్రేయస్సుకి దోహదమిచ్చిన వ్యక్తే ఉత్తరోత్తరా వేదాంత చింతన వల్ల సత్యాన్వేషి అయి ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతాడు. వైదికకర్మలని ఆచరించటం వల్ల పరిశుద్ధుడై వేదాంతం నిర్దేశించిన ముక్తి మార్గానుగామి కావటానికి అర్హత పొందుతాడు. జ్ఞాని అయిన తరువాత, ఏ కర్మలూ చేయక పోయినా, కేవలం మహనీయమైన తన యునికి వల్లనే లోకకల్యాణానికి సహాయపడతాడు. ఏ మతావలంబియైనా ఆ మతం చెప్పిన ఉపదేశానుసారం నడచుకొని జ్ఞాని కాలేకపోతే ఆ మతం వృథా. కర్మలు, ఆరాధనలూ ఆ స్థితిని చేరుకోవటానికి సాధనలు. వర్ణాశ్రమధర్మాలూ, ఎవరు ఏయే కర్మలు చేయాలో చెప్పే నియమాలూ ప్రతివారూ మానసిక ఉన్నతిని చేరుకోవటానికి ఏర్పర్చినవే - ఆ స్థితిని చేరుకొన్న తరువాత అంతా ఒక్కటే.

కాబట్టి, "మొదటగా వచ్చేది కర్మ-వేదోక్తమైన విధులను నిర్వహించటం. కాని కర్మల అవసరమే లేని స్థితికీ, ఆత్మానుభూతికీ దారి తీస్తాయి ఈ కర్మలు" అన్న భావంతోనే వీటిని చెయ్యాలి. ప్రాపంచిక సౌఖ్యాలను పొందటానికి దేవతారాధన అవసరమే ఆదిలో. కాని దీనిని కూడ ఒక ప్రారంభదశగా ఎంచాలి - ఆరాధింపబడే దైవము, ఆరాధించే తాను ఒకటే నన్న స్థితికి అది దారితీస్తుందన్న గ్రహింపుండాలి. మొదట్లో ఆ భేదభావాన్ని ఉంచుకోవాలి. సాధారణ వ్యవహారాలను సరిగ్గా నిర్వహించాలంటే పనిని వివిధ అంశాలుగా విభజించుకోవాలి కదా, అంతిమ లక్ష్యాన్ని సాధించటానికి. ప్రతి ఒక్కరూ తన విధులను సక్రమంగా నిర్వహించాలి. కర్మలు చేసేప్పుడు వేదాధ్యయనమూ కర్మాచరణమూ వేదాల అవసరమే లేని అనుభూతికి మార్గమేర్పడుతుందని గుర్తుంచుకోవాలి. పువ్వులు లేనిదే ఫలాలు లేవు. పువ్వు మాయమైతేనే గాని ఫలమురాదు. వైదిక కర్మలను ఆచరించక నేరుగా వేదాంతానికి వెళ్లే వారు సరియైన మార్గాన వెళ్లటం లేదు. ఆ విధంగానే, వేదాంతం వరకూ వెళ్లక కేవలం కర్మలతోనే ఆగిపోయే వారూ వికసింపలేరు. ఈ విషయమై సదవగాహన అవసరం.

వేదాలను శృతులన్నప్పుడు సంహితనే కాక బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు కూడా సూచింపబడుతాయి. భగవద్గీత శృతికాదు - వేదాలలో భాగం కాదు. దానిని స్మృతి అంటారు. జ్ఞానానికీ, మోక్షానికీ దారి చూపక పోతే కర్మలూ, ఆరాధనలూ నిరర్థక మంటుంది గీత. శృతుల తర్వాత ప్రధానమైనవి పురాణాలు. ఇవి కూడా కొన్ని చోట్ల వైదిక కర్మలను యాగాలను చేయటమే పరమోత్కృష్టమని నమ్మినట్లు, వారి అహంకారాన్ని శివుడు ధ్వంసం చేసినట్లు శైవపురాణ గాథలు చెప్తాయి. శ్రీ మద్భాగవతంలో కూడ బ్రాహ్మణ పండితులకూ, వారి భార్యలకూ సంబంధించిన కథ ఒకటి ఉంది. అంతగా చదువుకోక పోయినా ఆ బ్రాహ్మణ స్త్రీలు శ్రీ మహావిష్ణువే తమ ఎదుట బాలకృష్ణునిగా ప్రత్యక్షమైనాడని నమ్ముతారు. కర్మానుష్ఠానంలో నిమగ్నమైపోయిన వారి భర్తలకు మాత్రం ఆ అవగాహన కల్గ లేదు. ఆ అవగాహన కల్గలేదే అన్న విచారం మిగిలి పోయింది.

శృతులలో కర్మకాండా, జ్ఞానకాండా ఉన్నాయని అనవచ్చు. జ్ఞానమార్గాన్ని ఉపదేశించే ఉపనిషత్తులు జ్ఞానకాండ లోని భాగాలే కదా! ఉపనిషత్తులు కర్మకి అంతప్రాముఖ్యాన్ని యివ్వవు. కాని, కర్మకాండకూడ కర్మాచరణమే పరమావధిగా భావించనక్కరలేదని చెప్తుంది. త్రైత్తిరీయ కాఠక ప్రశ్నలో ఇట్లా ఉంది: "యజ్ఞాలను చేస్తూ భగవత్సాన్నిధ్యాన్ని అనుభవించని వ్యక్తి ఊరికే మంటని రగిల్చి పొగను లేపుతున్నట్టే. వాడొట్టి మూఢుడు. అతనికి ఆత్మానుభూతి ఎప్పటికీ కాదు". (త్రైత్తిరీయ కాఠకం - 1వ ప్రశ్న, ఆఖరి అనువాకం - 4వ మంత్రం) నిప్పుని రాజేస్తే ఆ మంటపై అన్నం వండటానికి పాత్రని ఆ నిప్పుపై పెట్టాలి. కేవలం యజ్ఞాలనే చేసేవాడు నిప్పునే రాజేస్తాడు గాని, పాత్రని దానిపై పెట్టడు (ఇక్కడ సంస్కృతంలో వాడబడిన పదం - పక్వం - అంటే బాగా వండటం. గట్టి బియ్యపు గింజ ఉడికి మెత్తని అన్నపు మెతుకుగా మారటమనమాట).

వైదిక కర్మలని ఈశ్వరార్పణం చేస్తే భవబంధవిమోచన మవుతుంది, ప్రాపంచిక బంధాన్ని వృద్ధి చేయదు. నిష్కామ్యంగా (అంటే ఫలితాల గురించి పట్టించు కోకుండా) కర్మలనాచరిస్తే చిత్తశుద్ధి కలిగి, త్రిగుణాతీతమైన స్థితికి కొనిపోతుంది.

యజ్ఞమంటే ఇదే. ఆంగ్లంలో 'సాక్రిఫైస్' (త్యాగం) అంటారు. యాగమంటే త్యాగం, విడిచిపెట్టటం. అగ్నికి ఉపహారం సమర్పించేప్పుడు "నమమ" (నాకు కాదు) అంటారు - యజ్ఞంలో స్వార్థరాహిత్యమెంత ముఖ్యమో తెలుస్తుంది దీని బట్టి. నిప్పులో పడవేసిన దానిని తిరిగి పొందటమసాధ్యం కదా. ఒక్క క్షణంలో దాని రూపమే మారిపోతుంది. ఆ విధంగానే "నేను" "నాది" అన్న భావం భస్మం కావాలి. యజ్ఞాల ఉద్దేశం అలాంటి ఉత్కృష్టమైన లక్ష్యము. దానిని విడిచి - తాత్కాలికమూ అల్పమూనైన ఫలితాల కోసం చేయటం శోచనీయం.

కర్మకాండకీ, జ్ఞానకాండకీ భేదం లేదని విశదమవుతుంది. కర్మకాండ తన పరిమితుల నెరిగి జ్ఞానకాండ యొక్క ఉత్కృష్టతను కొని యాడుతుంధి. అవి ఒండొంటికి పూరకాలు. మహోన్నతమైన సత్యాలు, జ్ఞానప్రదాతలూ అయిన "పురుషసూక్తం" "త్ర్యంబక మంత్రం' ' సంహితలోనివే కాని ఉపనిషత్తులలోనివి కావు. ఆ విధంగానే, ఉపనిషత్తులు కూడ "నాచికేతాగ్ని" వంటి కర్మలను వివరిస్తాయి. వైదికకర్మలను చేసేప్పుడు పఠించే మంత్రాలు ఎన్నో తైత్తిరీయ ఉపనిషత్తులో ఉన్నాయి.

భగవద్గీత ఒక స్మృతి - అందులో జ్ఞానలబ్ధికి కర్మఫలాన్ని ఈశ్వరార్పితం చేయాలని ఉంది. ఇది శృతిలో భాగమైన ఉపనిషత్తులలో ఉంది. ఉపనిషత్తులలో ప్రధానమైన "ఈశావాస్య" ఉపనిషత్తులో ఆదిలోనే ఈ వాక్యముంది :

"కుర్వన్నేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః । ఏవంత్వయి నాన్యథేతో ఽస్తి
నకర్మలిప్యతేనరే (ఈశా - 2)

"వైదిక కర్మలని వందసంవత్సరాలైనా ఆచరించు, కాని అవన్నీ ఈశ్వరుని కొరకేనని, స్వలాభం కొరకు కాదని భావిస్తూ ఆచరించు. అప్పుడు కర్మఫలాలు నిన్ను బంధించవు". అంటుంది ఉపనిషత్తు. కాబట్టి ఉపనిషత్తులు కార్యాచరణకి ప్రతికూలమనీ, కర్మ విరుద్ధమనీ భావించటం తప్పు.

కర్మనే లక్ష్యంగా భావించకూడదు. దేవతల నారాధించటం వల్ల పరిశుద్ధమైన చిత్తమూ, లోకకల్యాణమూ లభిస్తాయి. కాని అంతటితో ఆగిపోకూడదు. జ్ఞానోదయం కావాలి. అప్పుడు పరమాత్మను విడిచి జగత్తంటూ ఏదీ లేదనీ తెలియాలి. ఆ దశలో ఆత్మ సాక్షాత్కారం పొందిన జీవికి వేదాలు కూడా అప్రధానములే అవుతాయి. వేదమంటే ఏమిటి? భగవంతుని శాసనం. దేశంలోని పౌరులు ప్రభుత్వ శాసనాన్ని ఎట్లా పాటిస్తారో అదే విధంగా ఆ శాసనాన్ని కూడా పాటించాలి. కాని జ్ఞానియై 'పరమసత్యం'లో నిమగ్నమైన వానికీ కర్మానుష్ఠానమనవసరం.

పరమాత్మునితో తాదాత్మ్యం చెందిన జ్ఞానికి, పరమాత్మనుండే జన్మించిన దేవతలు వేరువేరుగా తోచరు. పరతత్త్వంలో లీనమైనప్పుడు దేవతలలో కూడ లీనమైనట్టే. దేవతారాధన చేసే దశలో తాను ఆరాధ్య దైవతము కంటె భిన్నమనే భావముతో ఉన్నప్పటికినీ, ఆరాధ్యదైవతము పరమాత్మకు అభిన్నమనే భావనలో యుండాలి.

నిత్యవ్యవహారంలో భేదభావంతో ఎన్నో పనులు చేస్తూంటాం, అప్పుడు కూడా ఈ భేదాలన్నీ పోతాయనీ అన్నీ ప్రాథమిక సత్యంలో లీనమై పోతాయనీ భావించుకోవాలి. దేవతలు తన కంటే భిన్నమన్న భావంతోనే ఆరాధించేవాడు, సత్యాన్ని గ్రహించడు.

మానవుల కంటే దేవతలు ఉన్నతులే అయినా, పూర్ణానందాన్ని అనుభవించరు. మానవజన్మనెత్తి జ్ఞాని యైన వాని ఆనందంలో లవలేశమైనా వారికుండదు, తైత్తిరీయ ఉపనిషత్తు (2.5) బృహదారణ్యక ఉపనిషత్తు (2.3.33) మన ఆనందం, పితృలోకంలోని వారి ఆనందం, దేవలోక పుటానందం, దేవతలలో ఇంద్రుడూ, బృహస్పతీ, ప్రజాపతీ పొందే ఆనందం - ఒకరి ఆనందంకంటె వేరొకరి ఆనందం వందరెట్లు చొప్పున ఎక్కువౌతుందన్నట్లు - ఎక్కంవలె వర్ణిస్తాయి * 'జ్ఞానికి గల ఆనందం' చివరికి వస్తుంది. అది బ్రహ్మానందం. - ముక్తుడు అనుభవించే ఆనందం.

---

* ఆనందంలోని తారతమ్యాలిట్లా వివరింపబడింది. మనుష్యనామానందం - ఆరోగ్యవంతుడు, వివేకవంతుడు, సుఖమనుభవింప గలవాని ఆనందం. ఆ తరువాత గంధర్వునిది, దేవగంధర్వునిది, చిరలోకాలోక పితృలది, ఆజానజదేవునిది, కర్మదేవునిది, దేవునిది, ఇంద్రునిది, బృహస్పతిది, ప్రజాపతిది, బ్రహ్మది - వీటిలో ఒక్కొక్కటి ఆ వెనుకదాని కంటె వంద రెట్లు అధికం. దీని బట్టి మామూలు మనిషి పొందే ఆనందానికి బ్రహ్మానందమెన్ని రెట్లో అర్థం చేసుకోవచ్చు. ప్రతి దశలోనూ ఆ ఆనందాన్ని జ్ఞాని అనుభవించగలడంటుంది ఉపనిషత్తు. కోర్కెలు లేక, ఆత్మ సాక్షాత్కారాన్ని చెందిన జ్ఞాని బ్రహ్మానందాన్ని అందుకోగలడు.

కాబట్టి దేవతలకి కూడ కొన్ని పరిమితులున్నాయి. పైగా, అన్ని పరిమితులను దాటగల జ్ఞాన సముపార్జనకి వారు ఉత్సుకులు కారు. మానవులు యజ్ఞాల వల్లనూ, ఇతర పూజల వల్లనూ సమర్పించేవే వారికి చాలు. అందువల్లనే కొన్ని పురాణాలననుసరించి, జ్ఞానులు కావాలనుకొనే వారిని దేవతలు అనుగ్రహింపరు. బృహదారణ్యక ఉపనిషత్తు "మనుష్యులు ఆత్మానుభూతిని పొందటం దేవతలకిష్టముండదు" (1-4-10) అంటుంది. దీనికి కారణమేమిటి? దేవతలకు కావలసిన కర్మలను, యజ్ఞాలను జ్ఞాని చేయక పోవటమే!

అంటే, దేవతలకు అజ్ఞానులంటే ప్రియమా? "అజ్ఞాని" అసలైన జ్ఞానము పొందని వాడని అర్థం, వ్యాకరణంలో ఒక పదముంది - దేవానాంప్రియః అని - అంటే దేవతలకు ప్రియమైన వాడని - అంటే మూర్ఖుడని! దీనికి ఉపనిషత్తే ఆధారం.

అన్నీ ఆత్మమయమై, కర్మలు, దేవతారాధనలూ అవసరంలేని పరిపూర్ణస్థితిని చేరుకొనే విధాన్ని వేదాంతం తెల్పుతుంది. అందువల్ల కనీసం ఈ ఉపనిషత్తులనైనా కాపాడుకొని, అధ్యయనం చేయటం మన విధి.

అనంతమైన వేదాలలో కొన్ని భాగాలని మాత్రమే గ్రహించి ఋషులు మనకీయగలిగారు. ముందు యుగాలలో వారికంటే కలియుగంలోని వారి బుద్ధి చాలా బలహీనం. అందువల్ల వీటిని 118 శాఖలుగా విభజించారు. ఒక్కొక్క శాఖలో కొందరు విద్వాంసులు నిష్ణాతులవటానికి వీలుంటుందని. కాలక్రమేణా, ఒక శాఖని పఠించటమే కష్టమై పోయింది. వేదాధ్యయనాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేసిన ఘనత మనతరం వారికి దక్కుతుంది. అంతటితో ఆపుదాం.

చెప్ప వచ్చిందేమిటంటే, ప్రతి శాఖలోనూ ఒక ఉపనిషత్తుంటుందని. సంహితలు, బ్రాహ్మణాలు అధ్యయనం చేయబడని వేదశాఖలకు సంబంధించిన ఉపనిషత్తులు కూడా ఉన్నాయి. అసలు కొన్నిటి పాఠాలే దొరకటం లేదు ఇప్పుడు. అయినా వాటికి సంబంధించిన ఉపనిషత్తులు ఇంతకాలమూ ఏ మార్పూ లేకుండా లభ్యమయాయి. ఉదాహరణకి - ఋగ్వేదంలోని "శాంఖాయన శాఖ"కి సంబంధించిన సంహిత భాగం దొరకలేదు. కాని ఆ శాఖ చివరగల "కౌషీతకి" ఉపనిషత్తు సజీవంగా ఉంది. ఋగ్వేదపు "భాష్కల మంత్రోపనిషత్తు" ఉన్నది కాని దానికి సంబంధించిన సంహితగాని బ్రాహ్మణంగాని బాష్కలశాఖగాని లభ్యంకావు. కఠోపనిషత్తు కృష్ణయజుర్వేదపు కఠ శాఖకు సంబంధించినది.

ఆరణ్యకానికి అంతిమ భాగం ఉపనిషత్తన్నాను. కఠోపనిషత్తు ప్రసిద్ధమైన, దశోపనిషత్తులలో ఒకటి, కాని దానికి సంబంధించిన ఆరణ్యకం లభ్యంకాదు. పశ్చిమ భారతంలో మాత్రమే అధర్వ వేదాధ్యయనం సాగుతోంది. కొద్దిగానో గొప్పగానో. దక్షిణాదిన అధర్వవేద శాఖలను పఠించరు. కాని దశోపనిషత్తులలో మూడు - అంటే, ప్రశ్న, ముండక, మాండూక్య ఉపనిషత్తులు - అధర్వవేదానికి సంబంధించినవి. అదృష్టవశాత్తూ ఇవి లభ్యాలు. ఇప్పుడూ పఠింపబడుతున్నాయి.

పిండితార్థమేమంటే, కర్మాచరణకి సంబంధించిన భాగం గాని, శాఖగాని పోయినప్పటికీ వేదశాఖకి సంబంధించిన తత్త్వం మాత్రం నిలచింది. ఆ విధంగా జ్ఞాన దాయకాలైన ఉపనిషత్తులని పఠించి, పరిరక్షించారు. ఇది సంతృప్తి దాయకం.

# 11

# దశోపనిషత్తులు

ఆదిశంకరులు పది ఉపనిషత్తులనెన్నుకొని వాటిపై భాష్యం వ్రాశారు. వాటిని దశోపనిషత్తులంటారు. వాటిలోనున్న, అద్వైత సిద్ధాంతాన్ని ఆయన విశదీకరించారు. వారి తర్వాత వచ్చిన రామానుజాచార్యులు, మధ్వాచార్యులు కూడ ఈ పది ఉపనిషత్తుల మీదే భాష్యాలు వ్రాశారు. కాని వీరు తమ సిద్ధాంతాలైన విశిష్టాద్వైతమూ, ద్వైతమూ ననుసరించి భాష్యాలు వ్రాశారు.

పది ఉపనిషత్తుల పేర్లనూ వివరిస్తుంది ఈ శ్లోకం -

*"ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరి*
*ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ"*

ఆదిశంకరులు కూడ భాష్యాన్ని పై క్రమాన్ననుసరించే వ్రాశారు.

**ఈశావాస్య ఉపనిషత్తు :**

ఈశావాస్య ఉపనిషత్తు శుక్లయజుర్వేద సంహితాంతంలో ఉంటుంది. "ఈశావాస్యం" అన్న మాటతో ప్రారంభమవటం వల్ల ఆ ఉపనిషత్తుకి ఆ పేరు వచ్చింది.

ఈశ్వరుడు జగత్తునంతా వ్యాపించియున్నాడనీ, మనం చేసే పన్నులనన్నిటినీ భగవంతునికే అర్పించి, పరమాత్మ తత్వాన్ని అనుభవసిద్ధం చేసుకోవాలనీ ఆరంభంలోనే చెప్తుంది ఈశావాస్య ఉపనిషత్తు.

*"ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాంజగత్।*
*తేనత్యక్తేన భుంజీథా మాగృధః కస్య స్విద్ధనమ్"*

**కేనోపనిషత్తు :**

దీనినే తలవకార ఉపనిషత్తని కూడా అంటారు. సామవేదంలో జైమిని శాఖలో తలవకార బ్రాహ్మణ ముంటుంది కనుక. "దొరకని దాని కోసం కేనలో అన్వేషించు" అని ఒక నానుడి కూడా ఉంది. ఆద్యంతాలు లేని పరమాత్ముని కనుగొనటానికి గర్వోన్నతితో దేవతలు అన్ని చోట్లా వెతికారు. అప్పుడు దివ్యురాలైన అంబిక దేవేంద్రునికి స్వయంగా అనుగ్రహించిన జ్ఞానమే ఈ ఉపనిషత్తులోని విషయం. పరాశక్తి అయిన అంబిక మన శక్తులన్నీ మహాశక్తి నుండి ఉదయించినవేనని చెప్తుంది. ఇతర భాష్యాలలో వలె ప్రతి పదార్థాన్ని యిచ్చి ఆపకుండా ఆదిశంకరులు ప్రతివాక్యానికీ వేరొక భాష్యం వ్రాశారు. ఈ ఉపనిషత్తుని దృష్టిలో ఉంచుకొనే లోకమాత నుద్దేశిస్తూ వారు వ్రాసిన భక్తిగీతం "సౌందర్యలహరి"లో ఆది శంకరులిట్లా అన్నారు - "వేద మాతశిరస్సుపై ఉంచిన పవిత్రమైన

నీ పాదాలను నా శిరస్సుపైన కూడ ఉంచు తల్లీ". వేదాంతం వలె ఉపనిషత్తులని కూడ వేద శిరస్సులనీ, శృతి శిరస్సనీ అంటారు. అంటే, వేదాలకు శిరస్సని (శృతులకు శిరస్సని) అర్థం. ఉపనిషత్తులే వేదాలకి చివరిభాగాలు, అవే అన్నిటి కన్నా ముఖ్యమైన భాగాలు కూడా (శిరస్సు వలెనే). లోకమాత పాదాలు వేదాల శిరస్సుపై ఉండటమంటే, ఉపనిషత్తులపై ఉండటమనమాట.

జ్ఞానరూపిణిగా లోకమాత కేనోపనిషత్తులోనే సాక్షాత్కరిస్తుంది. లలితా సహస్రనామంలో అంబకి "సామగానప్రియ" అన్న నామం కూడా ఉంది. ఆ లోకమాత ఘనతకు సామవేదంలోని ఈ ఉపనిషత్తు ఆవిష్కరిస్తుంది.

"మనకి ఒక పదార్థం కనబడింది" అన్నప్పుడు ద్వైతభావం బయట పడుతుంది. అంటే చూడబడే పదార్థం (దృక్కు) చూచేది ద్రష్ట. దేహాన్ని వేరే పదార్థం వలె మనం చూడగలుగుతాం. "నా ఒంట్లో బాగులేద"నో "బాగుంద"నో అన్నప్పుడు కూడ దేహం ఒక పదార్థమే. అంటే ఈ దేహాన్ని పదార్థంగా చూచేది వేరే ఒకటి ఉన్నదన్న మాట. ఈ చూచేదే ఆత్మ. దీనిని అర్థం చేసుకోలేం, చూడలేం. ఆత్మ ఎప్పటికీ దృక్కుకాలేదు. ఎప్పుడూ ద్రష్టే. దేహాదులను విడచి ఈ "నేను" అన్నది తనంతట తానే సంస్థిత మవ గలదు. కాని దాని ఎరుక కలగట మసాధ్యం - ఎరుక కలిగి ఉండటమంటే అదొక పదార్థమవుతుంది కదా. ఆత్మ విషయంలో ఇది అసంగతం.

ఆత్మని తెలుసుకోవాలంటే, ఆ తెలుసుకొనే వాడు ఆత్మ కంటె భిన్నమవాలి. ఆత్మ కన్నా భిన్నమైనది మన మెరుగ దగినది ఏమైనా ఉందా? లేదు. అందువల్లనే "ఆత్మని తెలుసుకోవటం" "ఆత్మజ్ఞానం" వంటి మాటలలో "తెలుసుకోవటం"మన్నది మనం నిత్యవ్యవహారంలో తెలుసుకొన్నట్టు - విషయమూ, గ్రహింపూ వంటి దేమీలేదు. ఆత్మానుభూతిని పొందటమే నిజమైన జ్ఞానం. అందువల్లనే కేనో పనిషత్తు "నాకు ఆత్మజ్ఞానం కలిగింది. అనే వానికి ఆ జ్ఞానం లేదు. ఆ స్థితిలో ఉంది వేరే ఎరుకలేని వానికే అది ఉంటుంది. దానిని చూచేవాడు నిజంగా చూడలేడు, చూడలేనివాడు చూడగలడు" అంటుంది.

**కఠోపనిషత్తు :**

'కఠ ఉపనిషత్' 'కఠోపనిషత్' 'కఠకోపనిషత్' అనబడే ఉపనిషత్తు కృష్ణయజుర్వేదపు కఠకశాఖలోనిది. యమధర్మరాజుకీ నచికేతుడనే బ్రహ్మచారికీ మరణానంతరం ఆత్మ ఏమౌతుందన్న విషయమైన సంవాదమిది. ఒక కథ వలె ప్రారంభించినా ఒక మహాసత్యాన్ని ఆవిష్కరిస్తుంది. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు ఈ ఉపనిషద్వాక్యాలనే మళ్లీ అంటాడు. ఉదా॥

*'నజాయతేమ్రియతేవాకదాచిన్నాయం భూత్వా ౽ భవితా వా న భూయః*

*అజోనిత్యః శాశ్వతోఽయంపురాణో నహన్యతే హన్యమానే శరీరే" (క 2-18)*

కంకినుండి గింజలను వేరుచెయ్యాలి. కొబ్బరి ఆకుని తీసివేసి ఈనెను మాత్రం బయట పెట్టాలి. దేహమనే బాహ్య పదార్థం నుండి ఆత్మను నిశ్చయంగా, దృఢంగా వేరు చేయాలి - ఆత్మ తనంతట తానే నిల్వాలి. కామం, కోపం, ద్వేషం, భయం - ఇవన్నీ మనస్సుకి సంబంధించినవే, ఆత్మకి కాదు. ఆకలి, దప్పులు దేహానికి సంబంధించినవి, ఆత్మకి కాదు. ఆత్మేతరాలైన వాటిని గుర్తించటం అలవర్చుకోవాలి ఈ అభ్యాసం నిరంతరం కొనసాగిస్తే "నేను" అంటే దేహము, మనస్సేనన్న భావం సన్నగిల్లి, క్రమంగా పోతుంది. ఈ దేహాన్నీ మనస్సునీ కలుషితం చేసే అపవిత్రత బారి నుండి తప్పించుకొని నిర్మలమైన 'ఆత్మ' కాగలం. ఆత్మని చుట్టి ఉన్న తొడుగువంటిది ఈ శరీరమని భావించాలి. ఈ దేహం మనకొక అన్య పదార్థమన్నట్టు గుర్తెరిగి యుండాలి.

ఈ ప్రపంచంలో ఉంటూ, ఈ శరీరంలోనే మనమున్నా మనిపించినప్పుడు "ఈ శరీరం నేను కాను, ఇది నాది కాదు" అని అనుకోవటమలవర్చుకోవాలి. అప్పుడు, ముక్తి అన్నది మరణానంతరం సంభవించేదే అనుకోనక్కరలేదు. మోక్ష మంటే మమత నుండి విముక్తి. జీవన్ముక్తుడు ఈ లోకంలోనే ఉంటూ శరీరధ్యాసలేక ఆత్మారాముడై తన ఆనందానికై బాహిర వస్తుజాలాన్ని ఆశ్రయించడు. వేదాలకీ వేదాంతానికీ గల పరమలక్ష్యం మనిషికి విముక్తి కలిగించటమే. భగవద్గీతలో కృష్ణ భగవానుడు ఈ విషయాన్నే అంటాడు : "ఈ దేహం నుండి ప్రాణము పోయే ముందే, ఈ లోకంలో నివసిస్తూనే, కామ క్రోధాలను నిగ్రహించి, యోగ స్థితిలో (అంటే, పరమాత్మతో ఏకత్వంతో) ఉండేవాడు ఆనందాన్ననుభవిస్తాడు". అంటే, ఈ లోకంలో ఉంటూనే తన ఆత్మయొక్క నిజతత్వాన్ని ఎరిగి, ఆ అనుభవసిద్ధి కలిగి యుంటే దేహం నశించినా ఏమీ కాదు - ఆ దేహమే తానని గాని, తనదనిగాని, అతడు జీవించి యున్నప్పుడు కూడ భావించక పోవటం వల్ల.

అంటే, మృత్యువు దేహాన్ని తన వశం చేసికొనక ముందే అతడు దేహాన్ని విడిచాడన్నమాట. "దేహమ"న్న పదంలో మనస్సుకూడా ఉంది. అది మనది కానప్పుడు మృత్యువు కలిగితే మాత్రమేమిటి? దానికి మనపై ఏ విధమైన ప్రభావమూ ఉండదు.

మృత్యువు నుండి విముక్తి చెందటం వల్ల అమరుడవుతాడు. ఈ స్థితిలో ఉండటాన్ని పురుషసూక్తంలోని మంత్రాలు వర్ణిస్తాయి. ఇవి కర్మకాండ భాగంలో ఉన్నాయి. ఈ విషయమే ఉపనిషత్తులలో పదే పదే ప్రస్తావింపబడింది.

మనకి క్లేశాన్ని కలిగించేది శరీరమూ, తద్వారా మనస్సూ. క్లేశం లేకుండా ఉండటం, ఎల్లప్పుడూ ఆనందంగా ఉండటమే - స్వర్గమన్నా, మోక్షమన్నా. ఇది అన్ని మతాలలోనూ ఉంది. కాని అద్వైత సిద్ధాంతం తప్ప మిగిలిన అన్ని ధర్మాలూ ఆ చిదానంద స్థితిని అనుభవించాలంటే వేరే లోకానికి వెళ్లాలని అంటాయి. ఈ లోకంలో ఉంటూనే, దేహం పట్ల మమకారాన్ని పూర్తిగా విడచి, ఆత్మలో లీనమై యుండటం వల్ల పరలోకాల్లో లభించే ఆనందం కంటే అధికమైన ఆనందాన్ని పొందవచ్చని ఆదిశంకరులు నిరూపించారు,

బ్రహ్మసూత్ర భాష్యాలలో. "తదేతత్ అశరీరత్వం మోక్షాఖ్యమ్" 'అశరీరి' అంటే అశరీరవాణి (ఆకాశం నుండి వినవచ్చేది) అని మనం మాములుగా అర్థం చేసుకొంటాం. కాని 'అశరీరి' అంటే దేహం లేకుండా ఉండటమనే అర్థం. "ఈ దేహాన్ని నేను" అన్న ఎరుకలేకుండా ఉండటమే అశరీరత్వమంటే - శరీరం లేని స్థితి అన్నమాట. మోక్షాన్ని ఆచార్యుడీ విధంగా నిర్వచించారు కోర్కెలని క్రమంగా తగ్గించి, చివరికి లేకుండా చేసుకుంటే శరీరంపై వ్యామోహం పూర్తిగా నశిస్తుంది. అప్పుడు అంతరాంతరాలలోని ఆత్మ ప్రకాశిస్తుంది. దీని కోసం పరలోకాలకు వెళ్లవలసిన అవసరం లేదు. వేదాలు, వేదాంతమూ "ఇహైవ, ఇహైవ" అనటంలో అర్థమిదే!

ఈ ఆనందమయమైన స్థితిని మనం చేరుకోలేక పోవటానికి ముఖ్యమైన అవరోధాలు వాంఛా, కోపమూ అని భగవద్గీత అంటుంది. (భగవద్గీత స్మృతి అని గుర్తుంచుకోవాలి). ఈ మాటలకి ఆధారం, శృతియైన చాందోగ్యోపనిషత్తు

*"మఘవర్త్యం వాఇదం శరీరమాత్తం మృత్యునా తదస్యామృతస్యా*
*శరీరస్యాత్మనోఽధిష్ఠానమాత్తో వై సశరీరః ప్రియాప్రియాభ్యాం నవై సశరీరస్య సతః*
*ప్రియాప్రియయోరపహతిరస్త్య*
*శరీరంవావ సన్తం నప్రియాప్రియే స్పృశతః"*
*(చాందోగ్యోపనిషత్ - భాష్యం - 8-12-1)*

'ప్రియప్రియాలు' అన్న పదాలు వాడబడ్డాయి. ప్రియమంటే వాంఛ, అప్రియమంటే కోపం. "దేహంలేని జీవికి ప్రియాప్రాయలు లేవు" అంటుంది చాందోగ్యం. అంటే, వాంఛలనీ, కోపాన్నీ లేకుండా ఉండాలంటే "నేను శరీరం కాను" అని భావించాలి.

'నేను', 'నాది' అన్న భావం వల్ల ఆత్మకి కలిగే అనుభూతులను మూడు విధాలుగా వర్ణించటం పరిపాటి. ఇవి గౌణాత్మ, మిథ్యాత్మ, ముఖ్యాత్మ. దీనినే ఒక శ్లోక రూపంలో పెట్టారు. దీనిని తమ బ్రహ్మసూత్ర భాష్యంలో ఉటంకించారు ఆదిశంకరులు.

*"గౌణామిథ్యాత్మనోఽసత్వే పుత్రదేహాది బాధనాత్*
*సద్బ్రహ్మ త్మాహమిత్యేవం బోధే కార్యం కథం భవేత్"*
*(బ్రహ్మ సూత్ర భాష్యం - 1-1-4)*

"మనమూ, మన సంతతీ, మన సన్నిహిత మిత్ర వర్గమూ అంతా ఒకటే; వారి వారి సుఖదుఃఖాలు మనవే" ఈ అనుబంధం గౌణాత్మకి లక్షణం. "గౌణ" అంటే గుణం. మనము, మన పిల్లలు, మన మిత్రులూ ఒకరి నుండి మరొకరు వేరని మనకి తెలిసినా మనకీ వాళ్లకీ తేడా లేదన్న భావం బలీయం. శరీరమంటే ఉండే మమకారం ఇంత కంటే బలీయం. - ఇది మిథ్యాత్మ. ఆత్మానుభూతి కలిగి "నేను బ్రహ్మము కంటె భిన్నము కాను" అని అనుభవ పూర్వకంగా తెలిసికొంటే బ్రహ్మమే ఆత్మ అవుతుంది. ఇది "ముఖ్యాత్మ".

మొదటి రెంటినీ (గౌణ, మిథ్య) తీసివేస్తే పిల్లలతో, మిత్రులతో, దేహంతో, ఇంద్రియాలత - బంధం తెగిపోతుంది. అప్పుడు "నేను బ్రహ్మస్వరూపుడ"నన్న జ్ఞానోదయం కలుగుతుంది. దీనిని మించినది లేదని చెప్పటమే ఈ శ్లోకం ఉద్దేశం.

"లేవండి, మేల్కొండి" అని రామకృష్ణ మిషన్‌కి వివేకానందుడిచ్చిన ఉద్బోధ కఠోపనిషత్తునుండే తీసికొనబడింది. ఇటువంటివే ఎన్నో ఉద్బోధలు ఉపనిషత్తుల నుండి గ్రహింపబడ్డాయి. (1) ఆత్మని విద్యవల్లగాని బుద్ధి వల్లగాని అందుకోలేమన్నది (నాయమాత్మా ప్రవచనే నలభ్యో నమేధయా నబహునాశ్రుతేన). (2) ఆత్మ ఈ రథానికి అధిపతి, శరీరం రథం, బుద్ధి సారధి, మనస్సు కళ్లెం, అవయవాలు గుఱ్ఱాలు. (ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు/ బుద్ధిం తు సారథి విద్ధిమనః ప్రగ్రహమేవచః) అనే మంత్రమూ (3) పరమపురుషుడు అంగుష్ఠ మాత్రుడై హృదయ కుహరంలో ఉంటాడన్న సత్యము (4) దీపారాధన చేసేప్పుడు పఠించే మంత్రం - భగవంతుని సన్నిధిలో సూర్యచంద్రులూ, తారలూ, అగ్నీ అన్నీ తమ ప్రకాశాన్ని కోల్పోతాయన్నది - అంటే వారి ప్రకాశానికి మూలాధారం భగవంతుడే అవటంవల్ల అవి భగవంతునిపై కాంతిని ప్రసరింప చేయలేవని అర్థం (5) అల్పమైన మన మేధ ఆ మహనీయమైన బుద్ధి నుండే ఉద్భవించటం వల్ల మనం మేధతో భగవంతుని అవగాహన చేసికోలేము (6) గీతలో శ్రీ కృష్ణ భగవానుని "తల్లక్రిందులైన చెట్టు" గురించి ( ఊర్ధ్వమూలమధః శాఖ) ప్రస్తావన - అంటే సంసారమనే అశ్వత్థ వృక్షం (7) మనస్సు నుండి ఉత్పన్నమయే కోర్కెలనన్నిటినీ ధ్వంసం చేస్తే మనిషికి ఇక్కడే బ్రహ్మానందం కలుగుతుందన్న సూక్తి - ఇవన్నీ తరచూ ఉటంకింపబడేవే, ఇవన్నీ కఠోపనిషత్తులోనివే !

**ప్రశ్న, ముండక, మాండూక్య :**

ఈ మూడు ఉపనిషత్తులూ కఠోపనిషత్తు తరువాత పేర్కొన బడుతాయి.

**ప్రశ్న :**

ఇది అథర్వవేదంలోనిది. సృష్టి ఎట్లా జరిగింది? దేవతలెవరు? శరీరానికి జీవం ఎట్లా కలుగుతుంది? జాగృత్ - స్వప్న - సుషుప్తుల రూపమేమిటి? ఓం కారాన్ని ఆరాధించటం వల్ల ప్రయోజన మేమిటి? పురుషునకీ ఆత్మకీ గల సంబంధమేమిటి? ఈ ఆరుప్రశ్నలకీ సమాధానాలు ఆ ఉపనిషత్తులో ఉండటం వల్ల దానిని ప్రశ్నోపనిషత్తు అంటారు.

**ముండక :**

అంటే గుండు చేయించుకొన్న తల అని అర్థం. పరిణిత మనస్కులు, మమతారహితులు, సన్న్యాసుల వంటివారు ఆచరించవలసినది ముండకోపనిషత్తు. లయవినాశాలులేని "అక్షర బ్రహ్మం" గురించి ఈ ఉపనిషత్తు తెల్పుతుంది. 'అక్షర' అంటే శబ్దమూ, అక్షరమూ అని కూడా అర్థముంది. 'పంచాక్షరం' (అయిదు అక్షరాలు) అష్టాక్షరం (ఎనిమిది అక్షరాలు)

గురించి మనం చెప్పుకొంటాం. అక్షరాలకి మూలం ప్రణవం (ఓంకారం). అక్షరబ్రహ్మని చేరుకోవటానికి ఓంకారం ముఖ్య సాధనం. "ఆత్మ" అనే శరాన్ని "ఓంకార" మనే ధనుస్సు నుండి "బ్రహ్మ"మనే లక్ష్యాన్ని చేరేట్టు అప్రమత్తంగా ఆ శరమూ లక్ష్యమూ ఒకటే అయేట్టు విడవాలి అంటుంది ఈ ఉపనిషత్తు.

*"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే।*
*అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్" (మం 2.4)*

ఈ ఉపనిషత్తులోనే ప్రసిద్ధమైన ఈ ఉపమానం ఉంటుంది : జీవాత్మ పరమాత్మ అనే రెండు పక్షులు శరీరమనే రావి చెట్టుపై ఉంటాయి. జీవాత్మ అనే పక్షి ఫలాలని ఆరగిస్తుంది (అంటే కర్మ ఫలాలని) పరమాత్మ అనే పక్షి కేవలం సాక్షి వలె ఉండి పోతుంది.

"సత్యమేవ జయతే" (సత్య మొక్కటే జయిస్తుంది) అన్న మన దేశ ఉద్బోధ ముండకోపనిషత్తులోనిది.

*సత్యమేవ జయతే నా నృతం*
*సత్యేన పంథా వితతో దేవయానః (3.6)*

జీవన్ముక్తులైన సన్న్యాసులు దేహాన్ని విడచిన తరువాత (అంటే మరణానంతరం) విముక్తులై యుంటారన్న మంత్ర మొకటి ఉంది. సన్న్యాసులను పూర్ణ కుంభంతో ఆహ్వానించేప్పుడు ఈ మంత్రాన్ని కూడా పఠిస్తారు. అనేక పేర్లు కల నదులు సముద్రంలో కలిసి పోయినప్పుడు ఎట్లా వాటి అస్థిత్వాన్ని, కోల్పోతాయో, ఆ విధంగానే జ్ఞానులు తమ నామరూపాలను కోల్పోయి పరమపురుషునితో ఐక్యమొందుతారు అంటుంది ఈ ఉపనిషత్తు.

*యథా నద్యః స్యన్దమానాః సముద్రే*
*ఽస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ ।*
*తథా విద్వాన్నామరూపా ద్విముక్తః*
*పరాత్పరం పురుషముపైతి దివ్యం ।*

**మాండూక్యోపనిషత్తు :**

మండూకమంటే కప్ప. "కప్ప ఉపనిషత్తు" అనే పేరెందుకు వచ్చింది? ఒక కారణమిదై ఉండవచ్చు. మెట్లని ఎక్కేటప్పుడు కప్ప ఒక్కొక్క మెట్టునే ఎక్కనక్కర్లేదు - మొదటి మెట్టు నుంచి నాల్గవ మెట్టుకి గంతు వేయగలదు. మేల్కొని ఉండటం (జాగృత్) కలలుకనటం (స్వప్న) గాఢ నిద్రలో ఉండటం (సుషుప్తి) ఈ మూడు స్థితులనూ దాటి ఆఖరి, నాల్గవ స్థితి అయిన, తురీయస్థితిని చేరుకోవటానికి మార్గం చూపుతుంది, ఈ ఉపనిషత్తు. ఓం కారాన్ని జపించటం వల్ల నాల్గవ స్థితిని (తురీయ స్థితిని) ఒక్కసారిగా చేరుకోవచ్చు నంటుంది. అందుకనే ఆ పేరు వచ్చిందేమో ఆ ఉపనిషత్తుకి.

కొందరు ఆటవికులు కప్పని ఆరాధిస్తారు - ఈ ఉపనిషత్తు వారికి చెందినదని కొందరంటారు. కప్ప రూపంలో ఉన్న వరుణఋషికి ఈ ఉపనిషత్తు గోచరించిందంటారు.

అన్నిటికన్నా చిన్నదీ ఉపనిషత్తు. పన్నెండు మంత్రాలే ఉంటాయి దీనిలో, కాని ప్రాశస్త్యానికీ, సామర్థ్యానికీ ఈ ఉపనిషత్తుకి ప్రత్యేకమైన స్థానముంది. ప్రణవంలోని నాలుగు భాగాలనూ ఆధారంగా చేసుకొని జీవాత్మా - పరమాత్మా ఒకటేనని నిరూపిస్తుంది. సమస్త సృష్టీ లయమయిపోయే ఆఖరి స్థితిని సుందరము, అద్వితీయము (శివమద్వైతం) అని వర్ణిస్తుంది.

(ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః) ఆది శంకరుల గురువు గౌడపాదాచార్యుల వారు ఈ ఉపనిషత్తు గురించి తను "మాండూక్యోపనిషత్ కారిక"లో వివరణ ఇచ్చారు. ఈ ఉపనిషత్ కారికపైన శంకరుల వారు ఒక భాష్యాన్ని రచించారు.

**తైత్తిరీయ ఉపనిషత్తు :**

మిగిలిన ఉపనిషత్తులన్నిటికంటె ఎక్కువగా అభ్యసింపబడేది ఈ ఉపనిషత్తే. కర్మానుష్ఠానంలో పఠింపబడే అనేక మంత్రాలు దీనిలోనివే. ఈ ఉపనిషత్తుకి మూడు భాగాలున్నాయి. అవి : శీక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి.

శీక్షావల్లి - విద్యాబోధన గురించి చెప్తుంది. బ్రహ్మ చర్యంలోని సంయమనం, దాని ఔన్నత్యం, వేదాధ్యయన క్రమం, ప్రణవధ్యానం - ఇటువంటి విషయాలగురించి చెప్తుంది. గురువు చేసే "ఆవహంతి హోమం" ఈ ఉపనిషత్తులోనిదే. శిష్యులు ఏ సంకోచమూ లేకుండా వచ్చి వేదాధ్యయనం చేయవలెనంటూ ఆవాహనం చేసే హోమమిది.

"సత్యం వద, ధర్మం చర" వంటి సూక్తులు ఈ ఉపనిషత్తు లోనివే. వేదాధ్యయనాన్ని, స్వధర్మపాలననీ ఎప్పుడూ విడువరాదు. ఈ సంప్రదాయాన్ని లోకంలో నిలపటానికి వివాహం చేసుకొని సంతానాన్ని పొందాలి - దాని వల్ల ధర్మం ముందు తరాల వారికి అవిచ్ఛినంగా సాగుతుంది. "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్య దేవో భవ" - తల్లినీ, తండ్రినీ, ఆచార్యుణ్ణీ, అతిథినీ - దైవసమానులుగా ఆరాధించమని చెప్పే మంత్రాలు ఈ ఉపనిషత్తులోనివే.

'ఆనందవల్లి' అనే ఈ ఉపనిషద్భాగంలో బ్రహ్మానందంలో అంతమయే ఆనందానుభూతి క్రమము వర్ణింపబడింది. అన్నమయకోశం - ఆహారం వల్ల పుష్టిని పొందే శరీరం. ప్రాణమయ కోశం - దాంట్లో ఉండే ప్రాణం. మనోమయ కోశం - భావాలని కలిగించే మనస్సు. దానిలో విజ్ఞానమయ కోశం - మంచినీ చెడునీ విచక్షింప చేసే విజ్ఞానం ఇవి నాలుగు కోశాలు. వీటన్నిటికీ మధ్యది ఆనందమయ కోశం. ఇందులో ఆత్మ సహజంగా ఆనందమయంగా ఎట్లా ఉంటుందో వర్ణింపబడింది.

ప్రతి కోశాన్ని ఒక పక్షి వలె వర్ణిస్తుంది. పక్షి యొక్క తల, ఎడమ పక్షం, కుడి పక్షం, శరీరం, తోక - ఉపమానాన్నిస్తుంది. తరచు ఉదహరింపబడే "యతోవాచో నివర్తన్తే" అన్నదీ, "బ్రహ్మానుభూతి పొందిన వానికి ఏ భయమూ లేదు, ఆ స్థితిని అందుకోలేక మనస్సు, వాక్కూ తిరోగమనం చేస్తాయి" అనే మంత్రాలూ ఈ ఉపనిషత్తులోనివే.

*"యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ "*
*"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన"*

భృగువల్లి - వరుణుడు తన కుమారుడైన భృగునికి ఉపదేశించినది భృగువల్లి. "ఉపదేశించిన" అంటే కుమారుడిని కూర్చుండబెట్టి పాఠం చెప్పాడని అర్థం కాదు. స్వయంగా చింతనని కొనసాగించి, ఫలితాన్ని అనుభవసిద్ధం చేసికొమ్మని గురువు వరుణుడు, కుమారుని ప్రోత్సహిస్తాడు. స్వయంగా తపస్సు చేసి భృగు అన్నమయకోశమే - అంటే దేహమే - చరమసత్యమని గ్రహిస్తాడు. కాని తపస్సునింకా కొనసాగిస్తూ ఒక్కొక్క మెట్టే ఎక్కుతాడు. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలని దాటి ఆనందమయ కోశాన్ని చేరుతాడు. ఆత్మానందమే పరమసత్యమని గ్రహిస్తాడు.

దేహంతో ఆగిపోయే లోక వ్యవహారం (అన్నమయ) అంటే ఈ ఉపనిషత్తుకి చిన్న చూపుకాదు. లోక ధర్మాన్ని పాటిస్తూనే అంతిమ సత్యాన్ని అర్థం చేసుకోవాలి. ధర్మ బద్ధంగా జీవిస్తూ ఈ జీవితం ఉన్నత స్థితి నందుకోవటానికి ఒక ఉపాయమనే గ్రహించాలి. అందువల్ల ఆనందమయకోశాన్ని చేరుకున్న తరువాత కూడ "ఆహారాన్ని చిన్న చూపు చూడక, ఆహారాన్ని వృథా చేయక, అధికాహారోత్పత్తి చేయి" అని ఈ ఉపనిషత్తు ఉద్బోధిస్తుంది.

"జ్ఞాని తానే ఆహారమూ, భోక్తా- ఆహారానికీ భోక్తకీ సంధాత అనుకొంటూ భగవంతుడూ తానూ ఒకటేనంటూ ఆనందంగా పాడుకొంటాడు" అని ఈ ఉపనిషత్తు అంతమొందుతుంది.

**ఐతరేయ ఉపనిషత్తు :**

ఐతరేయ ఉపనిషత్తు ఐతరేయ ఆరణ్యకాంతంలో ఉంటుంది. ఐతరేయ అనే ఋషిచే బయట పడటం వల్ల ఈ ఉపనిషత్తుకి ఆ పేరు వచ్చింది. జీవుడు తండ్రి నుండి తల్లి గర్భస్థమవటం, పాపపుణ్యాల ననుసరించి అనేక లోకాలలో జన్మలనెత్తటం జనన మరణాల నుండి విముక్తి ఆత్మానుభూతి వల్లనే కలగటం - వీటి గురించి ఈ ఉపనిషత్తు చెప్తుంది. తల్లి గర్భంలో ఉండగానే తన పూర్వ జన్మవృత్తాంతాన్ని ఎరిగి అన్ని అడ్డుగోడలనూ దాటి ఆకాశంలో ఎగిరే గరుడుని వలె విముక్తినొందిన వామదేవుడన్న ఋషి కథ ఈ ఉపనిషత్తులోనిదే. ప్రజ్ఞానము - ఆత్మను గురించిన అపరోక్షానుభూతి గురించి ఈ ఉపనిషత్తు సాదకంగా వివరిస్తుంది. ఒకరు జ్ఞానం ద్వారా ముక్తి పొందుతారన్నది సరికాదు. జ్ఞానమే బ్రహ్మ అని వివరిస్తుంది. "ప్రజ్ఞానం బ్రహ్మ" అన్నదే ఋగ్వేదపు మహావాక్యం.

**చాందోగ్య ఉపనిషత్తు :**

దశోపనిషత్తులలోని ఆఖరి రెండూ, అంటే చాందోగ్య, బృహ దారణ్యకాలు - చాలా పెద్దవి. ఈ రెండూ కలిసి మిగిలిన ఎనిమిదింటి కంటే పెద్దవి.

చాందోగ్యోపనిషత్తు సామవేదంలో చాందోగ్య బ్రాహ్మణంలో ఉన్నది. 'చాందోగ్య' అంటే సామగానం చేసేవాడని అర్థం. దీనికి సంబంధించినదే ఈ ఉపనిషత్తు.

భగవద్గీతలో కఠోపనిషత్తుని బాగా వినియోగించినట్టే వ్యాసుని బ్రహ్మసూత్రాలకి చాందోగ్యోపనిషత్తు లోని మంత్రాలు ప్రమాణాలంటారు.

చాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తులు ఎందరో ఋషుల వాక్కుల సముదాయాలు.

చాందోగ్యం ఆదిలో ఓంకారాన్ని ఉద్గీథగా పేర్కొని, ఆ ఓంకార ఉపాసన గురించి వివరాలనిస్తుంది. అక్షివిద్య, ఆకాశ విద్య, మధువిద్య, శాండిల్య విద్య, ప్రాణ విద్య, పంచాగ్ని విద్య వంటి విద్యలనెన్నిటినో ప్రస్తావిస్తుంది. ఈ విద్యలు పరమాత్మ తత్త్వాన్ని తెలిసికోవటానికి ఉపకరిస్తాయి. అంతంలో, దహర విద్య ఉంటుంది. పరమాకాశ స్వరూపమైన పరమాత్మను తన హృదయాకాశంలో దర్శించడమే, అనుభవించడమే దహరవిద్య.

ఈ ఉపనిషత్తులో సత్యం గురించి చెప్పటానికి ఎన్నో ఆసక్తిదాయకమైన ఉపాఖ్యానాలను ఉపయోగించారు. ఇందులో సత్యకాముని కథ ఉంది. అతనికి తన పుట్టుపూర్వోత్తరాలు తెలియవు. ఈ విషయం దాచడు. ఫలితంగా, గౌతముడు అతను సద్బ్రాహ్మణుడనుకొని శిష్యునిగా స్వీకరిస్తాడు. అంతకి పూర్వమొక గురువు అతనిని ఎన్నో పరీక్షలకు గురిచేస్తాడు - గురుపత్ని కూడ అతని పక్షాన మాట్లాడుతుంది. ఇదంతా పూర్వపు గురుకుల పద్ధతిని మనకళ్ల ఎదుట సినిమా వలె కనబడేట్టు చేస్తుందీ ఉపనిషత్తు. సత్యకామునికి విరుద్ధంగా శ్వేతకేతు వృత్తాంతముంది. ఇతనికి తాను విజ్ఞుడనన్న గర్వమధికం. ఆ బ్రహ్మచారి గర్వాన్ని అణగద్రొక్కిన వాడు అతని తండ్రే, ఉద్దాలక ఆరుణి. జీవాత్మ పరమాత్మలు భిన్నము కావని, "తత్త్వమసి" అన్న మహావాక్యార్థాన్ని అతనికి చిట్టచివరికి చెప్పుతాడు. సామవేదపు ముఖ్యోపదేశం, మహావాక్యమూ యిదే. శ్వేతకేతువు వలె గాక నారదమహర్షి అన్ని శాస్త్రాలనీ నిర్దుష్టంగా పఠించినా, ఆత్మ యొక్క తత్త్వం గురించి తెలిసికోవటానికి చాలా శ్రమ పడుతాడు. సనత్కుమార యోగి ఆ రహస్యాన్ని ఈ ఉపనిషత్తులోనే బోధిస్తాడు. తైతిరీయ ఉపనిషత్తులో ఆనందం గురించి అన్నమయ కోశంతో ప్రారంభించి క్రమంగా ఊర్ధ్వస్థితికి కొనిపోయినట్టే సనత్కుమారుడు కూడ ఆహారశుద్ధితో ప్రారంభించి, అంతఃకరణ శుద్ధి వరకూ కొనిపోతాడు - అంతఃకరణ శుద్ధిద్వార ఆత్మానందానుభూతి సంభవిస్తుంది.

## బృహదారణ్యక ఉపనిషత్తు :

అన్ని ఉపనిషత్తులలోను బృహదారణ్యకోపనిషత్తు పెద్దది. "బృహత్" అంటే 'పెద్ద' అని అర్థం, సాధారణంగా ఏ ఉపనిషత్తైనా ఆరణ్యకం చివర ఉంటుంది. కాని ఈశావాస్య ఉపనిషత్తు శుక్లయజుర్వేద సంహితలోనే ఉంది. ఆ శుక్ల యజుర్వేదంలో మొత్తం ఆరణ్యకంగా, అంటే ఆరణ్యకాంతంలోనే కాక, ఉండేదే బృహదారణ్యకోపనిషత్తు.

దీనికీ రెండు పాఠాలున్నాయి. ఒకటి మాధ్యన్దిన శాఖ, రెండవది కాణ్వశాఖ. ఈ రెండవ దాని పైనే ఆదిశంకరులు భాష్యాన్ని వ్రాశారు.

దీనిలో ఆరు అధ్యాయాలున్నాయి. మొదటి రెండింటినీ కలిపి మధుకాండ అంటారు. ఆ తరువాతి రెంటినీ కలిపి యాజ్ఞవల్క్యుని పేర, మునికాండ అంటారు. ఆఖరి రెంటినీ కలిపి, ఖిలకాండ అంటారు.

మధువంటే ఆనందరసమని అర్థం చేసుకోవచ్చు. సమస్తము బ్రహ్మస్వరూపంగా తెలుసు కొన్న వారికి ప్రపంచం మొత్తం మధుమయంగా కన్పిస్తుంది. ఆత్మ అన్నిటికీ మధువు. అదే మధుకాండ తెలుపుతుంది.

ఆత్మని "నేతి నేతి" ('ఇది కాదు, ఇది కాదు) అంటూ చెప్పేది ఈ ఉపనిషత్తులోనే - అంటే ఆత్మను ఏ విధంగానూ వర్ణింపలేమని చెప్పటం. మన మెరిగిన దేనివంటిదీ కాదు ఆత్మ. దీనినే "నేతి నేతి" వాదమంటారు. వ్యాకరణ సంధి సూత్రాల ప్రకారం 'న' కి 'ఇతి' చేరిస్తే 'నేతి' అవుతుంది. అంటే "ఇది కాదు" అని అర్థం. అంటే "వర్ణనీయము కానిది" అని అర్థం. 'నేతి సిద్ధాంతం' ప్రకారం జగత్తునీ, శరీరాన్నీ, మనస్సునీ త్రోసిపుచ్చాలి. పిదప వాగతీతమై, వర్ణనాతీతమైన ఆత్మని అనుభవ సిద్ధం చేసుకోవాలి. ఆ సాక్షాత్కారమైన తరువాత దృశ్యమానమైన జగత్తూ అందులోని జీవరాశులూ అన్నీ ఆనందమయములేనని, ఆత్మాతిరిక్తములు కాదన్న భావమేర్పడుతుంది.

ఈ రోజులలో ప్రార్థనా శ్లోకంగా పాడుకొనే 'అసతోమా సద్గమయ" అనే దానితో బృహదారణ్యక ఉపనిషత్తు ప్రారంభ మవుతుంది. అంటే "అనిత్యమైన దానినుండి నిత్యమైన దానికి మార్గం చూపు" అని అర్థం.

మొదటి కాండలో గర్గ్యుడు అన్న బ్రాహ్మణుడు, అజాత శత్రువనే క్షత్రియ ప్రభువు నుండి ఉపదేశం పొందటం గురించి ఉంటుంది. అజాతశత్రువూ, జనకుని వంటి రాజులు బ్రహ్మజ్ఞానులని ఈ ఉపనిషత్తునుంచి తెలుస్తుంది. ఆ విధంగానే, జనకుని విద్వత్ సభలలోని చర్చలలో గర్గి వంటి స్త్రీలు పాల్గొన్నారనీ స్త్రీలు కూడ బ్రహ్మవాదులై బ్రహ్మతత్త్వం గురించి చర్చింపగలిగే వారనీ తెలుస్తుంది. ఈ ఉపనిషత్తులోనే యాజ్ఞవల్క్యునికి ఇద్దరు భార్యలున్నట్టు అందులో ఒకామె కాత్యాయని అనీ ఆమె సాధారణ స్త్రీ కాగా రెండవ భార్య మైత్రేయి అనీ ఆమె తత్త్వజ్ఞు రాలనీ (బ్రహ్మవాది) ఉంది. యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి చేసిన

ఉపదేశం ఈ ఉపనిషత్తులో రెండుచోట్ల ఉన్నది. మధుకాండలోను. కొద్ది మార్పులతో మునికాండలోను. ఇది ఉపాఖ్యానికీ. తత్త్వాన్ని జోడించి చెప్పే అద్భుతమైన ఘట్టం.

యాజ్ఞవల్క్యుడు సన్యాసి కాగోరి యింటిని విడనాడాలని నిర్ణయించుకొంటాడు. తన ఆస్తిని ఇద్దరి భార్యలకూ పంచిపెడ్తాడు. తన వంతు వచ్చిన ఆస్తికి కాత్యాయని సంతోషిస్తుంది. కాని మైత్రేయి "ఈ ఆస్తి అంతా ఇవ్వలేని ఆనందాన్ని సన్యాసమిస్తుందని మీరు వెళ్లటానికి నిశ్చయించుకొన్నారు. ఆ ఆనందమెటువంటిది? నాకు తెల్పకూడదా?" అని అడిగింది. దానికి యాజ్ఞవల్క్యుడు. "నీవెప్పుడూ నాకు ప్రీతి పాత్రురాలివే - ఈ ప్రశ్న అడిగి ఇంకా ప్రియమయ్యావు" అని ఉపదేశం మొదలు పెట్టుతాడు. ప్రేమా. మమకారమూ గురించి ఆరంభిస్తాడు.

"భర్త పట్ల భార్య ప్రేమ, భార్య పట్ల భర్త ప్రేమ, సంతానం పట్ల ప్రేమ. సంపద పట్ల ప్రేమ - ఇవన్నీ వాటంతటవి జనించవు. అంటే భర్త పట్లా. భార్యపట్లా. పిల్లల పట్లా. సంపద పట్లాను. ఆ ప్రేమించటం తనకు కలిగించే సంతృప్తి వల్లనే జనిస్తాయి. ప్రేమానుభూతి ఆత్మకి సంతృప్తి కలిగిస్తుంది కనుకనే మనిషి ప్రేమలో పడుతాడు. దీని బట్టి ప్రేమా. సంతోషమూ ఆత్మ యొక్క నైజమని తెలియటం లేదా? కేవలం దాని నైజం గురించి తెలిసికోవాలంటే, తనకి దగ్గరైనవి, ప్రియమైనవి అన్నిటినీ విడనాడి సన్యాసం స్వీకరించాలి. దాని తత్త్వం తెలిసికొన్న తరువాత, దానిని మినహాయిస్తే ఏమీ లేదని తెలుస్తుంది. అప్పుడు అన్నీ దగ్గరే అవుతాయి. అంతకు పూర్వం, ప్రియమైన వాటిపై మమకారమున్నట్టే, అప్రియమైన వాటి పట్ల విముఖతా ఉండేది. వీటన్నిటినీ విడిచి, ఆత్మానుభూతిని పొందితే, ఈ హెచ్చు తగ్గులూ, భేదభావమూ అదృశ్యమవుతాయి. అన్నీ ఆత్మస్వరూపాలే అని తెలుస్తుంది. కొన్నిటిపైన గల విముఖతా, ద్వేషమూ పోయి వాటిపట్ల కూడ ప్రేమ ఏర్పడుతుంది". ఈ విధంగా కొనసాగుతుంది బోధన.

సన్యాసికాకముందు యాజ్ఞవల్క్యుడు జనకమహారాజు విద్వత్సభలో కహోళునితో, ఉద్దాలక ఆరుణితో, గర్గితో తాత్త్విక చర్చని జరిపి, తరువాత జనక మహారాజుకి బోధ కలిగించారని మునికాండ తెల్పుతుంది. "అంతర్యామి" గురించిన సిద్ధాంతం (అంటే. సూక్ష్మ రూపంలో పరమాత్ముని ఉనికి). యాజ్ఞవల్క్యుడు ఉద్దాలక ఆరుణికి యిచ్చిన సమాధానంలో ఉంది. ఇదే రామానుజాచార్యుల వారు ప్రతిపాదించిన విశిష్టాద్వైతానికి ముఖ్య లక్షణం. ఈ సిద్ధాంతం ప్రకారం జగత్తంతా శరీరానికి పోలిస్తే అందులో పరమాత్మ జీవం వలె ఉంటాడు. దృశ్యమానమైన ప్రపంచమంతా మాయేనని అద్వైతం చెప్తుంది. యాజ్ఞవల్క్యుడు కొంత వరకు ఈ సిద్ధాంతాన్ని ఆమోదించినా, ఎక్కువగా అద్వైతం గురించే చర్చిస్తాడు. మైత్రేయికి తన బోధనను పూర్తి చేసేప్పుడు పూర్తిగా అద్వైతం గురించే చెప్తాడు.

"దృష్టిని, శ్రవణాన్ని, రుచినీ, వాసననీ, ఆలోచననీ "అది" ఎట్లా కల్పిస్తుంది? "అది" ఎట్లా చూడబడుతుంది, వినబడుతుంది, అఘ్రాణింప బడుతుంది, భావింపబడుతుంది. ఏ

మాధ్యమంలో" ఈ విధంగా ప్రశ్నిస్తూ అభిన్నమైన ఏకత్వాన్ని గురించి చెప్తాడు. జనకునికి కూడ అద్వైత బోధనే చేస్తాడు.

ఎక్కడెక్కడో చెదురుగా ఉన్న సందేశాలు ఆఖరి కాండలో చేర్చబడ్డాయి. అందుచేతనే దానిని "ఖిల" కాండ అంటారు. (ఏదైనా చెల్లా చెదురైతే, ఖిల మైందంటారు. 'అఖిల'మంటే చెదరిపోక ఒక చోటకి చేర్చబడినది అని అర్థం)

ఖిల కాండలో ఒక ఉపాఖ్యానముంది. సాధకుల అంతస్థుని బట్టి ఒకే సందేశాన్ని మూడు విధాల అన్వయించు కోవచ్చునని చూపుతుంది. ప్రజాపతి నుండి దేవతలు, మానవులు, దానవులు సందేశాన్ని కోరుతారు. తన బోధనగా "ద" అన్న అక్షరాన్ని మాత్రం చెప్తాడు. ఆత్మనిగ్రహం లేని దేవతలు దీనిని "దమయత" అంటే నిగ్రహం లేక అదుపుగా అర్థం చేసుకొంటారు. ఆస్తిని కూడ బెట్టటమే స్వభావంగా గల మానవులు "ద" అంటే "దానమ"ను కుంటారు. కౄరత్వమే స్వభావంగా గల రాక్షసులు "ద" అంటే "దయధ్వం" అంటే దయ, కరుణ కలిగి యుండుట మనుకుంటారు!

బృహదారణ్యక ఉపనిషత్తు చివరిలో ఉన్న ఒక మంత్రమంటే నాకు మక్కువ. ఎంతో ఉపశమనాన్ని కలిగిస్తుంది నాకు. ఆ మంత్రమేమిటి?

అనారోగ్యంతో, జ్వరంతో ఎవరైనా బాధపడుతూంటే అది అతని తపస్సుగా గ్రహించాలి. ఇట్లు ఎవరు జ్వరాది దుఃఖములను సహించుకొని, తాను ఆచరించవలసిన తపస్సుగా భావించి యుండునో ఆతడు ఉత్తమ లోకములను పొందుతాడు.

దీని భావమేమి? ఇక్కడ చెప్పబడే విషయమేమిటి? ఈ మంత్రమిచ్చే సమాశ్వాసమేమిటి? చెప్తాను వినండి. వ్రతాలని ఆచరించి శరీరాన్ని అదుపులో పెడితే శరీరం పట్ల మమకారం పోవటమే కాక, పాపాలకు పరిహారం కూడ జరుగుతుంది. తపస్సు పూర్వజన్మలో చేసిన పాపాలకు కూడ ప్రాయశ్చిత్తమే అవుతుంది. దేహంతో చేసిన పాపాలకు పరిహారం దేహశోషణ వల్లనే చెల్లుబడి అవుతుంది. అందువల్లనే మహాత్ములు కూడ ఈ రకమైన తపస్సు చేసినట్లు పురాణాలలో ఉంది.

విశ్వజనని అంబిక, పరమేశ్వరుని మాటను పాటించక దక్షుని యజ్ఞానికి వెళ్ళింది. అక్కడ పరాభవింపబడటంతో ఆత్మాహుతి చేసుకొన్నది. హిమవంతుని కుమార్తెగా మళ్లీ జన్మనెత్తింది. భర్త సలహాని పాటించని పాపపరిహారం కాకపోతే తిరిగి తాను భర్తను పొందజాలననుకొంది. దీనినే ఎంతో కోమలంగా, అందంగా కాళిదాసు "కుమారసంభవం"లో వర్ణించాడు. శీతాకాలంలో హిమాలయశిఖరాలు ఎంత చల్లగా ఉంటాయి! - అటువంటి చలిలో మంచు గడ్డలపైనా, ఘనీభవించిన నీరు గల తటాకాలలో ఆమె నిలబడి తపస్సు కొనసాగించేది. వేసవిలో మండుటెండ ఉండగా తన చుట్టూ నాలుగువైపులా మంటలను ఏర్పర్చుకొని ఆ నడుమ కూర్చుని తపస్సు చేసేది! ఈ నాలుగు మంటలూ, పైన మండే

సూర్యుడూ, వీటితో "పంచాగ్ని తపస్సు" అయింది. ఎందరో మహనీయులిటువంటి తపస్సు నాచరించారు. అటువంటి కఠోరదీక్షలో సహస్రాంశమైనా పూనటానికి సంకల్పంగాని, సమర్థతగాని మనకు లేవు. మన పాపాలెట్లా పోతాయి?

టైఫాయిడ్, న్యుమోనియా వంటి జబ్బులు వచ్చినప్పుడు 105-106 డిగ్రీల వరకూ జ్వరం వస్తుంది, శరీరం ఆ తాపానికి తట్టుకోలేక పోతుంది. పంచాగ్ని తపస్సు నెలాగూ చేయలేము - భగవంతుని అనుగ్రహం వల్ల ఆ జ్వరం వచ్చిందనుకోవాలి - ఇదే మనకి ఓదార్పు కావాలి.

అందువల్ల ఏ రోగమైనా, ఏ గాయమైనా తపస్సుగా భావించాలి. అభ్యాసంతో ఈ దృక్పథం బలీయమవుతుంది. అస్వస్థతనీ అనారోగ్యాన్నీ స్థైర్యంతో భరించటమలవడుతుంది. మన ప్రమేయం లేకుండా మన పాపాలను పోగొట్టే ఇటువంటి అవకాశాన్ని మనం వదులుకో కూడదు. అప్పుడు మీద పడిన బాధను ఉపేక్షింపగల ఉదారమైన స్థితిని "తితీక్ష"ని చేరిన వారమవుతాము. ఈ విషయాన్నంతా ఉపనిషత్తులోని ఆ మంత్రం క్లుప్తంగా చెప్తుంది. "ఎన్నో పాపాలను చేశామే - ఏ వ్రతాన్నీ తపస్సునీ ఆచరించటం లేదే, వాటిని చేసే శక్తి లేదే" అని మనం చింతిస్తున్నప్పుడు భగవంతుడు మనకొరకు లేపనంవలె, ఉపశమనంవలె పంపిన మంత్రమిది.

బృహదారణ్యక ఉపనిషత్తు, దశోపనిషత్తులలో ఆఖరిది. అందులో ఆఖరి అధ్యాయంలో వేదాంతానికే ప్రాధాన్యమివ్వటం, కర్మకాండను వ్యతిరేకించటం కాదని చెప్పటానికా అన్నట్టు పంచాగ్ని విద్య గురించీ, సత్సంతానాన్ని కోరే గృహస్థుల విధుల గురించీ, ప్రస్తావన ఉంది.



# 12

# వేదముల ప్రయోజనమూ ఉద్దేశమూ

ఇంకొక ప్రశ్న కూడా ఉంది. ఎన్నో విషయాలను వేదాలు విపులంగా ప్రస్తావిస్తాయి. అటువంటప్పుడు ఉపనిషత్తులలో అన్నట్టు వేదాల యొక్క ముఖ్య ఉద్దేశం ఆత్మసాక్షాత్కారమని ఎట్లా అనగలం?

వేదాలు అగ్నిహోత్రాన్నీ, సోమయాగాన్నీ, సత్రయాగాన్నీ ఇష్టినీ మరి ఇతర కర్మలనూ పొగుడుతాయి. ఇవే వేదాల లక్ష్యమని ఎందుకనుకో కూడదు? ఇంకా వేరే విషయాలు కూడా వేదాలలో ఉన్నాయి - వివాహాలకి సంబంధించిన తంతు, మరణానంతరం సంస్కారాల పద్ధతులు, శ్రాద్ధకర్మ, ప్రభుత్వాన్ని నడపటం, విద్వత్ సభలలో నడుచుకోవటం ఇత్యాదివి. వీటిలో ఏది ప్రధానం?

యజ్ఞాలూ ఆరాధనా విధానాలనే కాక వేదాలు ధ్యానపద్ధతులనీ, ఉపాసనా విధాలనీ, కూడా వివరిస్తాయి. ఆత్మ దేహమునకు ఏ విధంగా చేతనను కలగిస్తుంది, దేహానికి చివరిలో ఏమి జరుగుతుంది, మరొక దేహాన్ని ఆత్మ ఎట్లా ప్రవేశిస్తుంది - వీటన్నిటి గురించీ వివరాలున్నాయి వేదాలలో.

ఇవే కాక, ఆరోగ్యం కాపాడుకోవటానికి వైద్య పద్ధతుల గురించీ, వైరులను శాంతపరచి, వారు తలపెట్టే అపాయాల బారి నుండి తప్పించుకోవటానికి శాంతులు కూడా వేదాలు చెప్తాయి. ఈ వివరాలనన్నిటినీ చూచిన తరువాత అసలు వేదాల ముఖ్య ఉద్దేశమేమిటని అనుమానం వస్తుంది.

ఉపనిషత్తులలో "సామూహికంగా వేదాలు ఒకదాని గురించే ప్రస్తావిస్తాయి" అని ఉన్నది (కఠోపనిషత్తు 2.15) ఈ ఒకటీ ఏమిటి? వైదిక సాభిప్రాయ మనుసరించి 'ఓం' అన్న శబ్దం ఆ ఒక్కదానికీ ప్రతీక.

కొందరు పాశ్చాత్య పండితుల అభిప్రాయమిది :

సూర్యచంద్రులను, ప్రకృతి దృశ్యాలను చూచి శాస్త్రజ్ఞానం లేని ఆ రోజులలో ప్రాచీన భారతీయులు ఎవరికి వారే ఆ ప్రకృతి శోభను గూర్చి తమతమ అవగాహనను వెలిబుచ్చారు. వీరిలో కొందరే గీతాలుగా పాడగలిగారు. ఇటువంటి పాటలనూ వాక్కులనూ సంకలనం చేసి మంత్రాలని పేరు పెట్టారు. ఈ సంకలనాలకే వేదాలని పేరు పెట్టారు.

వేదాలన్నీ ఒక దాని గురించే మాట్లాడుతాయని ఉపనిషత్తులు పేర్కొన్నా ఒక దాని గురించే కాక ఎన్నిటి గురించో అని ప్రస్తావిస్తాయి.

రామాయణంలో ఈ శ్లోకముంది

"వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్సాక్షాత్ రామాయణాత్మనా"

"వేదవేద్యే" అంటే వేదాల వల్ల తెలిసికొన గలిగేవాడు. అంటే ఎవరు? పరమపురుషుడు. వేదాలవల్లనే ఎరుగగలం. ఆయన లోకంలో జన్మించారు. ఆయన దశరథుని కుమారునిగా, రామునిగా వచ్చినప్పుడు వేదాలు రామాయణమన్న రూపాన్ని ధరించాయి -

ఈ శ్లోకమర్థమిది - వేదముల పరమ లక్ష్యం, గమ్యస్థానం పరమపురుషుడు - పరమసత్యం - ఓంకార మన్న పేరుతో ఉండేది. కృష్ణభగవానుడు భగవద్గీతలో "వేదైశ్చ సర్వైః - అహమేవ వేద్యః" (వేదాల ద్వారానే నన్నెరుగగలవు) అంటాడు.

వీటన్నిటినీ గణనలోకి తీసికొన్న తరువాత, వేదాలు అనేక విషయాల గురించి ప్రస్తావించినా, వాటికి ప్రధాన విషయమొక్కటే - పరమపురుషుడే - నని స్పష్టమవుతుంది.

అయితే, ఆ ఒక్కని గురించీ వర్ణించటానికి అన్ని విషయాలను వేదాలు ఏ కారణం వల్ల ప్రస్తావించవలసి వచ్చింది?

అనేక జీవుల ద్వారానే ఆ ఒక్కని గురించీ ఎరుగగలము. యోగం (మనస్సు దేహం యొక్క నిగ్రహం) ధ్యానం (చింతన) తపస్సు (దీక్షను పాటించటం) యజ్ఞం, కర్మానుష్ఠానం (వివాహాది కర్మలను పాటించటం) ప్రభుత్వ విధులు, సామాజిక జీవనం - ఇవన్నీ చిట్టచివరకి ఒకే కేంద్రం వైపు పయనిస్తాయి. అదే వేదాల సారం. మిగిలినవన్నీ మారుతాయి, కాలక్రమేణా కథలుగా మారిపోతాయి. జగత్తు ఎన్నో రూపాలతో మనకి గోచరిస్తుంది - ఒకటిగా మాత్రమే కాదు. వేదాలు ఎన్నో విషయాలగురించి ప్రసంగించటానికి కారణం వాటిలో ఏదైనా మనల్ని కేంద్రం వైపు తీసుకుపోగలదని.

వేదాలు ఒకే ఒక పరమావధి గురించి చెప్తాయి - ఆయనని చేరుకోవటానికి మనం కొన్ని నియమాలను పాటించాలి; వాటి వల్ల ఆ పరమపురుషుడెప్పుడూ మన మనస్సులో ఉంటాడు. యజ్ఞాలు చేయటం, తపస్సు చేయటం, దానం చేయటం, దేవాలయాలను పునరుద్ధరించటం, నీటి బావులను త్రవ్వటం, సమాజసేవ, వివాహాది క్రతువులను చేయటం - ఇవన్నీ చిత్త శుద్ధి కోసం, చంచలమైన మనస్సుని అదుపులో పెట్టటం కోసమే.

అయా విధుల నిర్వహణకి గల ఒకే ఒక ఉద్దేశం - క్రమశిక్షణ ద్వారా భగవంతుని కనుగొనటం.

వేద అంటే ఎరుకకలిగి ఉండటం - "దీని నెరిగినట్లైతే అన్నిటినీ ఎరిగినట్టే" అని ఆత్మకు నిర్వచనం చెప్తాయి ఉపనిషత్తులు'. ఆరంభంలో కర్మ, అంతంలో జ్ఞానమూ వచ్చినా అసలు గమ్యం ఈశ్వరుడే, బ్రహ్మమే, ఆత్మే.

కర్మలు పలురకాలు, జ్ఞానం ఒక్కటే - కాని ఈ రెండింటిలోని విషయమూ ఒకటే. ఇంద్రియాలు బయటి వాటినే గుర్తించగలవు, అందుకోగలవు - ఆత్మని మాత్రం చూడలేవు.

చేతిలో ఉన్నదానిని విడిచి బయట వాటి వైపు మనస్సు మళ్ళితే అతడు ఎక్కడో చూస్తున్నాడంటాము. నిజానికి చేతిలో ఉన్నది ఆత్మ ఒక్కటే. దానిని చూడకపోవటం, ఇతరమైన వాటిని చూడటమే అవుతుంది. బయటవాటిని చూడవద్దని చెప్పినా మనస్సు లెక్కపెట్టదు. బయటకు పోతూనే ఉంటుంది. అందుకే, బయటకు వెళ్లే పనులను చేస్తున్నా, అంతర్ముఖ మవటాన్ని అలవర్చు కోవాలి. మనస్సూ ఇంద్రియాలూ వాటికి ఇష్టం వచ్చిన వైపు లాగనీయకుండా వైదిక కర్మలను ఇతోధికంగా చేస్తూండాలి. అంతర్ముఖమయే శక్తిని ఇదొక్కటే కలిగిస్తుంది. అధ్యయనం వల్లా, విశ్లేషణ వల్లా, బాహిరజగత్తు గురించి సరిగ్గా అవగాహన కలగటం వల్లా, దేనినైనా గ్రహించగల శక్తి గల బుద్ధి "దానిని" చేరుకో గలుగుతుంది. అదే జరిగితే వేరే తెలిసికో వలసిందేదీ లేదు! ఈ ఉద్దేశంతోనే వేదాలు అన్ని కర్మల గురించీ, విధులను గురించీ చెప్తాయి. ఈ కర్మలను నిత్యం చేస్తూండటం వల్ల భౌతిక దేహంపై మమకారం సన్నగిల్లాలి. గ్రహింపువల్లా, సత్యాన్వేషణ వల్లా, సంయమనం వల్లా, మనస్సూ బుద్ధీ లయమొందాలి. అపవిత్రమైన పనుల వల్ల దేహంపై వ్యామోహం పెరుగుతుంది. వీటి వల్ల మనస్సు స్థిరత్వం కోల్పోతుంది. కాని వైదిక కర్మలు లోకకల్యాణాన్ని ఉద్దేశించి మంత్రాల ప్రాతిపదికగా ఏర్పడినవి. వీటిని ఆచరించటం వల్ల మనస్సూ దేహమూ లయబద్ధమై ప్రశాంతిని చెందుతాయి. చివరికి పరిణితి కలిగించి, అంతర్ముఖ మవటానికి దోహదమవుతాయి. అట్లా అంతర్దృష్టి కలగటం వల్ల మనిషికి మోక్షము - ఆనందము లభిస్తాయి. మోక్షమంటే - విముక్తి చెందిన స్థితి. అంటే - శరీరమూ, మనస్సూ విముక్తి చెందగలిగితే, సంసారం నుండి విముక్తి చెందినట్టే!

వేదాల ఉద్దేశం మనిషి జీవన్ముక్తుడవటమే - అంటే ఈ లోకంలో ఉండగానే మోక్షమొందటం. వాటి మహనీయతంతా యిదే. ఇతర మతాలలో వలె, మోక్షం మరణానంతరమే సంభవించే దయితే ఈ లోకంలో ఉన్నంత కాలం దాని నైజం మనకు తెలియదు. దానిని అనుభవసిద్ధం చేసుకొన్న వారు తిరిగి వచ్చి తమ అనుభవాన్ని మనకు చెప్పరు కదా! అప్పుడు అపనమ్మకానికీ, సందేహానికీ తావుంది. కాని ఈ లోకంలోనే ఉంటూ వాంఛలనూ, అవసరాలనూ త్యజించి ఆత్మవిచారంలో నిమగ్నమైతే ఇక్కడే మోక్ష ప్రాప్తి కలుగుతుంది. వేదాలు ఘోషించేది యిదే. అంటే అవి చెప్పేది తిరుగులేని సత్యం గురించే కదా!

మిగిలిన మార్గాలన్నీ తాత్కాలికమైన ఉపశమనాన్నే కలిగిస్తాయి - మలేరియా జ్వరం వస్తే క్వినైన్ మాత్రలు వేసుకొన్నట్టు. జ్వరం మళ్లీ రాకుండా ఉండాలంటే మూలకారణ మేమిటో తెలుసుకొని దానిని నిర్మూలించాలి. వేదాలు మూలవిషయానికి వెళ్ళి - జీవుడూ, పరమాత్మ నుండి జీవుడు ఉద్భవించటమూ, ఈ రెంటి భేదభావాన్నీ నిర్మూలనం చేసి తాత్కాలికమైన ఉపశమనాన్ని కాక శాశ్వతమైన విమోచనాన్ని కలిగిస్తాయి.

కర్మకాండ నిర్దేశించే విధులుకూడ [illegible]శమునాల వంటివే. అయితే, అశాంతిలో కొట్టుకొనే వానిని ఒక్కసారిగా ఆత్మారామునిగా, అంటే తన అంతరంగంలోనే సౌఖ్యమున్నదని ఎరిగి, శాంతునిగా మార్చటం అంత తేలిక కాదు. అందువల్లనే తాత్కాలిక ప్రయోజనాలని కలిగించే కర్మలని నిర్దేశించారు. వాటినాచరించటం వల్ల మనస్సు పరిశుద్ధమవుతుంది. శాశ్వతమైన మనశ్శాంతి కలగటానికి అది మూలాధారం. యజ్ఞాలని చేయటం, వ్రతాలని ఆచరించటం, సమాజసేవ చేయటం - వీటి గురించి ఎంత విపులంగా చెప్పబడినా వాటినే గమ్యాలుగా ఎంచరాదు. దేహమంటే మమకారాన్ని తగ్గించటమే ఈ కర్మల ఉద్దేశం. వాటిపై మనస్సుని నిలపటం వల్ల ఏకాగ్రత కలుగుతుంది, మనస్సు క్షాళనమవుతుంది. కాబట్టి, వేదాలలో ఎన్నో విషయాల చర్చ ఉన్నా వాటి లక్ష్యం వేదాంతంలో చెప్పిన చింతనయే.

వార్తా పత్రికలలో ఎవరి వ్యాసాన్నైనా, ఉపన్యాసాన్నైనా చూచినప్పుడు అందులోని విషయమేమిటో తెలిసికోవాలనిపిస్తుంది. అంత పెద్ద వ్యాసాన్నిగాని, ఉపన్యాససారాన్ని గాని మొదట్నుంచీ చివర వరకూ చదవటానికి తీరిక లేనప్పుడు - మొదటి భాగాన్ని కొంత చదివి, ఆఖరి భాగానికి వెళ్తాం. అప్పుడు విషయమేమిటో తెలుస్తుంది. మొదలూ తుదీ చదివితే మొత్తం విషయమేమిటో గ్రహించవచ్చు. ఆ విధంగానే వేదారంభంలోనూ వేదాంతంలోనూ చర్చింపబడిన అంశం ఈశ్వరతత్త్వమే. నేనిదివరకు చెప్పినట్టు వేదాలలోని ప్రధానమైన విషయమదే.

ప్రభుత్వం ఎన్నో శాసనాలను జారీ చేస్తుంది. ఆయా చట్టాల ఉద్దేశమేమిటన్న భేదాభిప్రాయాలూ, సంశయాలూ కలుగుతూంటాయి. అప్పుడు కొన్ని వ్యాఖ్యాన సూత్రాల ననుసరించి ఆ సందేహాలను విశదీకరించి నివృత్తి చేస్తారు. ఆ విధంగానే సనాతన ధర్మమైన వేదాలని వివరించటానికి, వ్యాఖ్యానసూత్రం వంటిది మీమాంసా శాస్త్రం. మీమాంస పధ్నాలుగు విద్యలలో ఒకటి - దీనిగురించి తరువాత వివరంగా చెప్తాను. కాని వాటికి సంబంధించి ఒక్క విషయాన్ని చెప్తానిక్కడ.

ఏ వేదమంత్రం యొక్క ఉద్దేశమైనా గ్రహించటానికి ఆరు పద్ధతులున్నాయి. ఇవి - ఉపక్రమం, ఉపసంహారం, అభ్యాసం, అపూర్వత, ఫలం, అర్థవాదం, ఉపపత్తి. వేదాల విషయంలోనే కాక ఈ ఆరు సూత్రాలను ఏ వ్యాసానికైనా, ఏ ఉపన్యాస పాఠానికైనా వర్తింపజేసి విషయాన్ని గ్రహించవచ్చు. ఉపక్రమమంటే ప్రారంభం. ఉపసంహారమంటే అంతం. మొదటి పద్ధతి ఈ రెంటినీ గమనించటం - దీనినే ఉపక్రమ - ఉపసంహార పద్ధతి అంటారు. ఈ రెండూ ఒకే విషయం గురించి చెప్తే మొత్తం విషయమదేనని గ్రహించవచ్చు. అభ్యాసమంటే ఒక విషయాన్ని పదేపదే చెప్పటం. ఉదాహరణకి, వ్యాయామం చేసేప్పుడు ఒకేరకమైన వ్యాయామాన్ని తిరిగి తిరిగి చేస్తూంటారు, దానిని దేహాభ్యాసమంటారు.

ఏ వ్యాసంలోనైనా, ఉపన్యాసంలోనైనా ఒకే విషయం గురించి పదే పదే చెప్తూంటే విషయం యొక్క సారాంశమదేననీ, మనస్సుకి బాగా హత్తుకోవటానికే తిరిగి తిరిగి దాని ప్రస్తావనే జరుగుతోందని గ్రహించవచ్చు.

అపూర్వత అంటే అంతకు పూర్వం చెప్పబడనిది అని అర్థం. అంటే విషయసారాంశమదే నన్న మాట.

"ఫలం" అంటే ప్రతిఫలం. "ఈ విధంగా చేస్తే ఈ ఫలితం లభిస్తుంది" అనో, "ఈ పని చెయ్యి, ఇటువంటి ఫలితం వస్తుంది" అనో అనటం. అంటే కోరిన ఫలితంవైపు మనలను నడిపించటం. ఈ పద్ధతిని "ఫలం" అంటారు.

అర్థవాద పద్ధతిలో ఎన్నో విషయాలను స్పృశిస్తారు. వీటి నాధారంగా ఒక కథ చెప్తారు. తద్వారా ఏదో ఒక విషయాన్ని వివరించవచ్చు. ఆ వెలువడిన విషయమే అసలు విషయసారాంశమని గ్రహించవచ్చు. "ఉపపత్తి" అన్న పద్ధతిలో ఒక విషయం గురించి ప్రస్తావించి - ఆ విషయం యొక్క మూలమూ, ఉద్దేశమూ, ఔచిత్యమూ గురించి చెప్తారు. వీటి వల్ల ఆ విషయం స్పష్టమవుతుంది.

"వేదాల ముఖ్యోద్దేశం అగ్ని ఉపాసన. ఉపక్రమంలో "అగ్నిమీళే"తో ప్రారంభిస్తుంది. ఉపసంహారం కూడ అగ్నితోనే అంతమొందుతుంది. అరంభంలోనూ, ఆఖరిలోనూ అగ్ని గురించే ప్రస్తావన ఉంది. కాబట్టి వేదాల ముఖ్యోద్దేశం అగ్ని" అని వేదాల ఆరంభాన్ని, అంతాన్నీ చూచిన వారనవచ్చు.

ఇందులో కొంత సత్యమున్నా, యధార్థం మాత్రం కాదు. అగ్ని ఆత్మ చైతన్యానికి ప్రతీక, జ్ఞానోదయ మన మాట. ఆత్మ చైతన్యమంటే ఎరిగినవాడు, ఎరుగబడింది, ఎరుక అన్నీ ఒకటే నన్న గ్రహింపు. వేదాల సారమిదే అసలు.

కాని, అగ్ని ఉపాసనే వేదాల లక్ష్యం కాదు. ఏ దేవతారాధనైనా మరొక దేవతారాధన కంటె గొప్పదని వేదాలు చెప్పవు - వేదాల ఘనత అంతా అదే.

"అనేక దేవతల రూపాలను ధరించే ఆత్మనే భక్తితో ఆరాధించు" అంటుంది వేదం (బృహదారణ్యక - 14.8)

"ఆత్మనే దర్శించాలి, ఆత్మనే ఆలకించాలి, ఆత్మనే మననం చెయ్యాలి" అంటాడు యాజ్ఞవల్క్యుడు, మైత్రేయికిచ్చిన ఉపదేశంలో.

వీటి బట్టి వేదాల ఉద్దేశమేమిటో మనం గ్రహించవచ్చు. "గమ్యం" అన్నప్పుడు మనకు స్ఫురించేది యిది : "మనమొక ప్రదేశంలో ఉన్నాం. ఇక్కడ నుండి వేరొక ప్రదేశానికి వెళ్లాలి". దూరంగా ఉన్నదానిని సూచించటమే గమ్యమంటే. "ఇతః" అంటే 'ఇది' మనమున్న స్థితి - ఇక్కడ నుండి "దాని" వద్దకు వెళ్లాలి - "తతః". నిజానికి గమ్యం ఇక్కడ లేదా? తప్పకుండాను. బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాత, "అది" "ఇది" అంతా బ్రహ్మమే. అసలు "అది", "ఇది" అనే భేదభావమే యుండదు. ఇప్పుడు మనం "ఇది" అనేది "అది" అవుతుంది - నిత్యమైన 'అది'!

"అది" అన్న అర్థంలో 'తతః' అన్నట్లే పరమాత్ముడ్ని కూడ "తతః" - అది, అంటారు. ప్రతి కర్మ చివరిలోనూ "ఓం తత్ సత్" అంటాం. దాని అర్థమిది "తత్ అనబడేదే సత్యము" అని "తత్" అంటే సత్యము, నిజము.

కొన్ని పదాలకి "త్వం" చేరుస్తాం - పురుషత్వం, మహత్వంలో వలె. ఇక్కడ "త్వం" అంటే నైజము, ప్రకృతి అని అర్థం. 'మహత్ యొక్క లక్షణం మహత్వం, పురుషుని ప్రకృతి పురుషత్వం. సరే, కాని చివరి యాత్రాంతాన్ని "తత్త్వం" అంటాం ఎందుచేత? తత్త్వమంటే "దాని యొక్క ప్రకృతి" కదా. తత్త్వ విచారం, తత్త్వోపదేశం - ఈ పదాలన్నీ "తత్" యొక్క నైజం గురించి బోధనలనే సూచిస్తాయి.

వేదాలు దూరంగా ఉన్న పరమపురుషుడిని "తత్" అంటే మనకి ప్రయోజనమేమిటి? దూరంగా ఉన్నవాడు సమీపంలోనే ఉన్నాడు "దూరాత్ దూరే అంతికే చ" అంటుంది వేదం. అవగాహన కానంతసేపూ దూరంగా ఉంటుంది అర్థమయితే దగ్గరే (లోపలే) ఉంటుందని అర్థం. దీనికి ఉదాహరణగా ఒక కథ ఉంది. పెళ్లీడుకొచ్చిన పిల్లకి తల్లిదండ్రులు అప్పటి సంప్రదాయానుసరించి సన్నిహిత బంధువుల పిల్లవాడిని పెళ్ళికి ఎంపిక చేస్తారు. కాని ఆ పిల్ల ఒప్పుకోక అందరి కన్నా శ్రేష్ఠుడినే వరిస్తానంటుంది. తల్లిదండ్రులు ప్రక్కకి తప్పుకొంటారు.

అందరి కన్నా ఉన్నతుడు రాజే కాబట్టి తాను రాజుని తప్ప ఇంకెవరినీ పెళ్లాడనంది ఆ పిల్ల. అప్పట్నుంచి రాజుని వెంబడింపసాగింది. ఒకనాడు పల్లకిలో పోతున్న రాజుకి దారిలో సన్యాసి కనబడితే, దిగి ఆయనకి ప్రణామాలు చెప్పి తన ప్రయాణం కొనసాగించాడు. దీనినంతా గమనించిన ఆ పిల్ల "అందరి కంటే రాజే గొప్పవాడను కొన్నాను, పొరబడ్డాను. ఆయన కంటే సన్యాసి ఎంతో గొప్పవాడు. కాబట్టి నేను సన్యాసినే పెళ్లాడుతాను" అనుకొని సన్యాసి వెంటపడింది.

ఒకనాడు సన్యాసి ఒక అశ్వత్థవృక్షం క్రింద ఉన్న వినాయకుని ప్రతిమకు నమస్కారం పెట్టటం చూచింది. ఆ పిల్ల, తన అభిప్రాయాన్ని మళ్లీ మార్చుకొంది. సన్యాసి కంటె ఉత్తముడు గణేశుడని ఆయననే వివాహమాడటానికి నిశ్చయించుకొంది. సన్యాసిని విడిచి, వినాయకుని ఎదుట కూర్చొంది.

చెట్టుక్రింద ఉన్న ప్రతిమ కావటం వల్ల అక్కడ గుడి లేదు. ఎవ్వరూ వచ్చేవారు కారు. ఒకనాడు అటుపోతున్న ఒక కుక్క ఆ ప్రతిమపై మూత్రం విడిచింది. ఆ ప్రతిమ కంటె గొప్పదనుకొని ఆ పిల్ల ఆ కుక్క వెంటబడింది. ఆదారిన పోతున్న ఒక పిల్లవాడు ఆ కుక్కపై రాయిని విసిరి గాయపరచాడు. ఆ బాధకి అది ఇంకా వేగంగా పరుగెత్తటం మొదలు పెట్టింది. దీనినంతా గమనిస్తున్న ఒక యువకుడు ఆ మూగజీవిని ఊరికే కొట్టిన పిల్లవాడిని చివాట్లువేశాడు. ఆ పిల్లవాడిని మందలించిన యువకుడే అందరికంటె గొప్పవాడనుకొంది ఆ పిల్ల. అతనినే వివాహమాడుతానంది. ఇంతకూ, ఆ యువకుడు ఎవరో కాదు - తల్లిదండ్రులు ఎంపిక చేసిన వాడే! ఎక్కడో ఉన్నాడనుకొన్న వాడు సమీపానే ఉన్నాడు. అదీ కథ.

"ఈశ్వరుడెక్కడో ఉన్నాడని దేశమంతా వెతుకుతున్నావు. ఎరుగనంత వరకు నీకు ఆయన దూరస్థుడే. ఎంత వెతికినా కనబడడు. నీకు దగ్గరే ఉంటాడు. అన్నిటి కంటే దూరంగా, అన్నిటి కంటే దగ్గరగా ఉంటాడు" అంటుంది శృతి.

భూమ్యాకాశాలు క్షితిజరేఖ వద్ద కలుసుకున్నట్లు కనబడుతాయి. అక్కడ ఒక తాటి చెట్టున్నట్టు కనబడుతోందనుకుందాం. మనమున్న స్థలం నుంచి ఆ తాటి చెట్టుకు చేరితే, భూమి ఆకాశాన్ని తాకటం చూడగలమనుకుంటాం. కాని ఆ ప్రదేశాన్ని చేరుకొన్న తరువాత క్షితిజం ఇంకా దూరమైనట్లని విస్తుంది. మనం అటువైపు పయనించిన కొద్దీ ఇంకా దూరమవుతున్నట్లుంటుంది. ఏవో కొండగుర్తులను పెట్టుకొని దాని నెప్పుడైనా చేరుకోగలమా అసలు? కాబట్టి అది ఎక్కడ ఉన్నట్టు? నువ్వున్న చోటనే ఉంది. ఎక్కడో దూరంగా ఉన్నాడని "తత్" అంటూ మనం చెప్పుకునే భగవంతుడు నీకు దగ్గరగానే - నీలోనే ఉన్నాడు. "నీవు అదే" (తత్త్వమసి) అని అనిపించేట్టు చేస్తాయి వేదాలు. వేదాల యొక్క మహోపదేశం "తత్త్వమసి" ఇక్కడ 'తత్వం' అంటే "తత్" యొక్క లక్షణంకాదు. 'త్వం' అన్న పదాన్ని రెండు విధాల అర్థం చేసుకోవచ్చు. ఒకటి లక్షణంగా రెండవది "నువ్వు" అన్న నామవాచకంగా. తత్వమసి అన్నప్పుడు "తత్" అంటే "అది", "త్వం" అంటే "నీవు", "అసి" - "అయి ఉన్నావు". "తత్", "త్వం" రెండూ కలిసి "తత్త్వమ్" అయ్యాయి.

పరమాత్మ యొక్క నైజాన్ని సూచించే "తత్త్వం" అన్న పదం మామూలు భాషలో, అందరికీ ఆమోద యోగ్యమైన నిశ్చయాన్ని 'తత్త్వం' అంటారు. ఏ విషయానికైనా గల అంతరార్థాన్ని తత్త్వమంటారు.

"నేను" అని నువ్వనుకునే దాని గురించిన జ్ఞానమే, భగవంతుని గురించిన జ్ఞానం. ఈ అవగాహనే లేక పోతే భగవంతుని గురించి భావించటం కూడా అసాధ్యమే. "జ్ఞానం నానుండి ఉద్భవిస్తుంది ఆలోచన నాతో వస్తుంది" "ఆలోచన వల్ల కలిగే జ్ఞానమూ ఎక్కడో దూరంగా ఉందని నువ్వనుకొనే "అది" (తత్) ఒక్కటే" అని వేదాలు చెప్పుతాయి.

'అది', 'తత్' 'ఇదం' అని మనమనే దానికి మూలమంటూ ఉంది. దేని గురించైనా 'అది' అని మనమన్నామంటే దానికి మూలమంటూ ఏదో ఉండి తీరాలి. విత్తు లేకుండా చెట్టులేదు. ప్రపంచంలోని పర్వతాలు, సముద్రాలూ, ఆకాశం, భూమి, గొడ్లూ, మానవులు, కోపము, భయమూ, ప్రేమ, ఇంద్రియాలు, శక్తీ - వీటన్నిటికీ మూలముంది. కనబడటం; వినబడటం, వాసన తెలియటం, ఉష్ణమూ, శీతలమూ తెలియటం - ఇవన్నీ మనస్సుకి తెలుస్తాయి. ఇంద్రియాలకి అనుభవమవుతాయి. వీటన్నిటినీ "అది" అంటాం. ఇప్పటి వరకూ సంభవించిన శాస్త్ర ఆవిష్కరణలు, ఇక ముందు సంభవించేవీ అంటే ఎరిగి ఉన్నవన్నీ "ఇదం" - వీటన్నిటికీ ఏదో మూలముంది. మూలం లేకపోతే "ఇదం" లేదు. దేనికైనా మూలం, ఒకనీతి, ఉండాలి మూలం లేకుండా ఏదీ లేదు.

మానవ శరీరం "విత్తు"నుండే ఉద్భవిస్తుంది. చెట్టుకి కూడ మూలం విత్తే. కాబట్టి దృశ్యమానమైన జగత్తుకి మూలమేదో ఉండాలి. ఈ జగత్తులో అంతర్లీనమై యున్న శక్తి కూడ ఏదో ఒక మూలం నుండి ఉద్భవించినదే అయిఉండాలి.

అప్పుడే మొలకెత్తిన చింత చెట్టు యొక్క విత్తనాన్ని తీసి చీలిస్తే, చిన్న చింత మొక్కని పట్టుకొని ఆ విత్తులోని రెండు భాగాలూ ఉన్నట్టు కనబడుతుంది. దీనికే మహావృక్షంగా ఎదిగే శక్తి ఉంది. అన్ని విత్తులకీ ఈ శక్తి ఉంది - చింత విత్తులో దీనిని ప్రత్యక్షంగా చూడగలం.

మంత్రాలలో "బీజాక్షరాల"ని ఉంటాయి. ఒక మహావృక్షం ఒక చిన్న విత్తులో ఉన్నట్టే, ఈ అక్షరాలలో అంతులేని శక్తి దట్టింపబడి యుంది. ఈ అక్షరాలని ఏకాగ్రతతో కొన్ని లక్షలసార్లు జపిస్తే వాటిలోని శక్తిని మనలో లీనం చేసుకోగలం.

ఈ జగత్తులో అంతర్లీనమై ఉన్న శక్తి, సమర్థత, వివేకమూ వాటి మూలమైన భగవంతునిలో కూడా ఉన్నాయి. ఆ విత్తు లేక పోతే అవి ఉద్భవించలేవు.

సృష్టిలో కలవాటినన్నిటినీ "అది" అంటాం - ఇది మూలం లేకుండా, విత్తులేకుండా, కారణం లేకుండా ఉదయించలేదంటాయి వేదాలు. ఈ మూలశక్తి జగత్తులో వ్యాప్తమై ఉంది. ఆ మూలమెక్కడ ఉంది? అది లోపలే ఉంది. "అది" బయటకు "ఆత్మ" గా పైకి చూస్తుంది.

అద్దంలో మన ప్రతిబింబాన్ని చూసుకుంటాం. చుట్టూ నాలుగు అద్దాలను ఒక దాని కొకటి సమకోణ స్థానంలో పెట్టితే లెక్కలేనన్ని ప్రతిబింబాలు కనబడుతాయి. అన్ని ప్రతిబింబాలనీ చూచేవాడూ, వాటికి కారకుడూ ఒక్క మనిషే. ఆ విధంగానే సృష్టిలోని కోటానుకోట్ల జీవరాశులలో ఉంటూ, సృష్టివైపు బయటకు చూచే "అది" భగవంతుడు తప్ప మరేదీ కాదు!

దృష్టే దృశ్యానికి మూలము, కారణమూను. జగత్తుకి కారణం "జ్ఞానం". ఈ జ్ఞాన మెక్కడుంది? మనలోనే ఉంది. అవిభాజ్యమై, పరిపూర్ణమైనదీ మనలో ఖండాలుగా కనబడుతుంది. రంగురంగుల విద్యుద్దీపాలున్నాయి - చిన్నవి, పెద్దవి, నీలంవి, ఆకుపచ్చనివి. అవి వివిధ ఆకారాలలో కూడా వస్తాయి. కాని వాటన్నిటిలోనూ కలది ఒకే విద్యుచ్ఛక్తి. అంతటా ఉన్న విద్యుచ్ఛక్తే బల్బులో కూడా ఉంది. అది వెలిగేట్టు చేస్తుంది, పంకాని తిరిగేట్టు చేస్తుంది. ఈ వ్యాపకాలన్నిటికీ కారణమొకే శక్తి. అది విశ్వవ్యాప్తమై, అవిభాజ్యమైన ఒకే విద్యుచ్ఛక్తి. కాని తీగె ద్వారా ప్రసరింప జేసినప్పుడు విడిపోయినట్లవుతుంది. ప్రకృతిలో మెరుపు మెరిసినప్పుడూ, జలపాతంగా నీరు క్రిందపడినప్పుడూ - ఆ శక్తి తనంతట తానే వ్యక్తమవుతుంది. కాబట్టి తత్వాన్ని, పరమతత్వాన్ని, నీలో మెరుపుతీగె వలె మెరవనీ. కర్మానుష్ఠానంతో, అంటే యజ్ఞ యాగాదులతో దేవతారాధనతో, ఆరంభమై, మహావాక్య

ఉద్దేశం గురించి గాఢమైన చింతనతో అంతమొందే అభ్యాసాలన్నిటికీ ఇదే లక్ష్యం. వేదాలు నిర్దేశించే సాంఘిక వ్యవస్థా, గృహస్థులూ, ప్రభుత్వము పాటించవలసిన విధులూ, కళలూ, వైద్యము, భూగర్భశాస్త్రమూ - ఇతర విద్యలూ - ఇవన్నీ ఆత్మసాక్షాత్కారానికి దారి చూపే సోపానాలు. "తత్" "త్వం" ల కలయిక మొదట్లో క్షణికంగా, ఒక మెరుపువలె తెలుస్తుంది. ఈ పరిస్థితినే కేనోపనిషత్తు (4.4) వర్ణిస్తుంది: "బ్రహ్మజ్ఞానం మెరుపులో మెరుపువలె ఉంటుంది. లిప్తపాటు మాత్రమే తెలుస్తుంది. "తస్యైష ఆదేశః యదేతద్విద్యుతో వ్యద్యుతదా". అభ్యాసాలను విడనాడకుండా ఆచరిస్తూంటే నిత్యం విద్యుత్తుని ఉత్పాదం చేసే జలపాతం వలె ఆ చైతన్యస్థితిలో ఎల్లప్పుడూ ఉండవచ్చు. అదే మోక్షం - జీవన్ముక్తి. మరణించిన తరువాత ఆ చైతన్యం పరమాత్మలో లీనమై పోతుంది. జీవించి యుండగా ముక్తి, మరణానంతరం మోక్షమంటూ భేద మేర్పరచుకున్నా - జ్ఞానికి రెండూ ఒకటే.

వేదాల పరమోద్దేశం ఒకటే. మనల్ని బ్రహ్మానుభూతిని అనుభవసిద్ధం చేసి కొమ్మని, చిదానందం పొందమని చెప్పటమే.

వార్తాపత్రికల ద్వారా ప్రపంచం నలుమూలలా జరిగే విషయాలని తెలుసుకుంటాం. వార్తలు విలేఖరుల ద్వారా సేకరింపబడుతాయి. ఏ ఆధునిక సాధనాలూ, ఆఖరికి మానవుని మేధ కూడ, గ్రహింపలేని విషయాలు కొన్ని యున్నాయి. వీటి గురించి తెలుసుకోవాలను కుంటే ఇంకొక రకమైన వార్తా పత్రికలు కావాలి.

ఆధునిక ప్రచార సాధనాల ద్వారా ప్రసరింప వీలు లేనిదీ టెలిగ్రాఫ్‌కీ, టెలీప్రింటర్‌కీ అందనిదీ వేదమంత్రాల ద్వారా ప్రసారమవుతుంది. అతిలోక శక్తులు గల ఋషులు వీటిద్వారా, మామూలు బుద్ధి గ్రహింపలేని విషయాలను ప్రసరింప జేశారు.

వేదాలలో చాలా ముఖ్యమైన విషయాలున్నాయి. అయినా కొన్నిటిని దాటేయవచ్చు, ఉపేక్షింప వచ్చు. కొన్నిటిని "ఉపేక్షింపవచ్చు" నన్నప్పుడు ఆ విషయాలు అప్రధానమని గాని, వేదాలలో తప్పులున్నాయని గాని నా భావం కాదు.

ఒక ముఖ్యమైన విషయాన్ని ప్రస్తావించేప్పుడు వేదాలు దానికి పూర్వం ఎన్నో ఇతర విషయాలని గురించి చెప్పి ఆ ముఖ్యమైన విషయానికి మనలను సమాయుత్త పరుస్తాయనో. దృష్టాంతంగా పేర్కొంటాయనో మన పెద్దలు చెప్పారు. ఆ ముఖ్యమైన విషయాన్నేదో గ్రహించాలి. మిగిలిన వివరాలన్నీ దాని గ్రహింపుకి ఉపయోగపడేవేనని గుర్తుంచు కోవాలి. కొన్ని విషయాలు ప్రాథమిక, మధ్యమిక స్థితులలో అవసరమైనా పోను పోను, ఉత్తమస్థితికి వెళ్లిన కొద్దీ, ఆత్మజ్ఞానం వృద్ధి అవుతున్న కొద్దీ, దశలవారీగా వాటిని విడిచివేయాలి. ఈ మాటని వేదాలే అంటాయి. అందుచేత, ఒక దశలో ఆమోదయోగ్యమైనది మరొక దశలో కాకపోవచ్చు.

వేదాలలో కొన్ని సత్యాలున్నాయి. పరమతాత్పర్యాలు. వాటిని యథాతథంగా అంగీకరించాలి. మిగిలిన వాటిని అప్రధానాలుగా భావించవచ్చు, లేదా విడిచిపెయవచ్చు - అర్థవాదమూ, అనువాదమూ అంటారు వీటిని.

ఒక ధర్మాన్ని గాని, ఒక సత్యాన్నిగాని మనం స్థూలంగా అర్థం చేసుకోవటానికి వీలుగా కథలనీ, ఉపాఖ్యానలనీ వేదాలు చెప్తాయి. అటువంటి సందర్భాలలో ధర్మాన్నిగాని, సత్యాన్నిగాని మనం గ్రహించి ఉపాఖ్యానాలను అర్థవాదమంటూ విడిచి పెట్టాలి. అంటే అర్థవాదం కేవలం ఉపమాన ప్రాయంగానే తీసుకోవాలి గాని యథాతథంగా కాదు.

అనువాద మంటే ఏమిటి? మనమెరుగని విషయం గురించి చెప్పేప్పుడు మనమెరిగిన విషయం చెప్పటం మొదలుపెట్టి కొనసాగిస్తాయి వేదాలు. మనకి తెలియని విషయాన్ని గమ్యంగా పెట్టుకొని తెలిసిన విషయాన్నే పదే పదే చెప్తాయి. అంటే మనకి తెలిసినవీ, తెలియదగినవీ అయిన ఉదాహరణలిస్తాయి. వీటి గురించి తెలుసుకోవటానికి వేదాల సహాయమవసరం లేదు. ఇతర ప్రమాణాల వల్ల ఎరుగరానివీ, వేదాలు చెప్పేవీ - అదే "విధి" ఉపదేశము.

దీనినే మరొక విధంగా చెప్పవచ్చు. సామాన్యంగా తెలియటానికి అవకాశమున్న విషయాలనే, వేదాలలో తిరిగి తిరిగి చెప్పినా, వాటికి వేదాలు ప్రమాణం కానేరవు. తెలియని వాటిని తెలియచెప్పటమే వేదాల లక్ష్యం. మనకి తేలికగా అర్థమవటానికి మాత్రమే మనకి సుపరిచతమైన విషయాలతో వేదాలు ప్రారంభిస్తాయి. ఇదే అంతిమ లక్ష్యమైతే, అజ్ఞాతమైన దాని గురించి చెప్పటంలో అర్థం లేదు. అంతేకాదు, తెలియని వాటి గురించే వేదాలు ప్రస్తావిస్తూంటే "నాకు తెలిసిన దానినే స్వీకరిస్తాను, తెలియని దానిని నిరాకరిస్తాను" అని ఎట్లా అనగలం? అయితే, తెలిసిన దేమిటి, తెలియనిదేమిటి?

లోకంలోని వస్తుజాలం గురించి రెండు అభిప్రాయాలున్నాయి. మనకి తెలిసిన వన్నీ ఒకటేనా, లేక వేరువేరా అన్న సందేహం కలుగుతుంది. ఆ రీతిగా వస్తువులని రెండు వర్గాలుగా విభజిస్తాం. భౌతికజ్ఞాన సహాయంతో లోకంలోని వస్తువులన్నీ వేరువేరని నిర్ణయిస్తాం. అట్లా వేరు వేరని ఎరుక కలిగి యుండటం వల్లనే లోకవ్యవహారం సాగుతుంది. నీటినీ, నూనెనీ వేరువేరుగా భావించాలి. దీపం వెలిగించాలంటే నూనెని ఉపయోగించాలి నీరెందుకూ పనికి రాదు. దీపం పెద్దదిగా వెలిగి, ఇల్లు నిప్పంటుకుంటే ఆ మంటని ఆర్పటానికి నీరు అవసరమవుతుంది. నూనెని పోస్తే మంట మరీ పెద్దదవుతుంది. కాబట్టి ఏ పనిని చేయాలన్నా వివిధ వస్తువులని మనస్సులో గుర్తుంచుకోకపోతే ఏ పనీ సవ్యంగా జరుగదు. ఈ విధమైన వ్యత్యాసభావాన్ని ద్వైతం లేక ద్వయీ భావమంటారు. ఈ ద్వైతభావమే వేదోక్తమైన కర్మలకూ, ఉపాసనలకూ మూలం. కాబట్టి, అటువంటి సందర్భాలలో వేదాల ప్రభావం ద్వయీ భావమే నన్నది స్పష్టం. దీనిని అద్వైతి వ్యతిరేకించ నవసరం లేదు.

దృశ్యమానమైన జగత్తు విషయంలో ద్వయీ భావం వాస్తవమే. కాని మనమనుకొనే ఈ ద్వైతం తోనే ఆగిపోతాయా వేదాలు? అట్లా ఆగిపోతే, వేదాల లక్ష్యం ద్వైతమనే అనుకోవచ్చు. కాని సంహితంలో కొన్ని చోట్లా, వేదాంత మంతటా వేదాలు అద్వైతం గురించే చెప్తాయి.

మన ధర్మశాస్త్రాలలో రెండు పద్ధతులున్నాయి. ఒకటి పూర్వపక్షమూ, రెండు సిద్ధాంతమూ. భిన్నాభిప్రాయం కల వారి వాదనని పూర్వపక్షమంటారు, ఒకరికి గల అభిప్రాయానికి వ్యతిరేక భావం పూర్వపక్షాన్ని ముందు చెప్పి తరువాత దాని ఖండన మొదలవుతుంది. అంటే, కావాలనే ఎదిరి వాదాన్ని చెప్పి తరువాత దానిలోని లోపాలను ఎత్తిచూపటం.

"దర్శనాలు" అనబడే మన తత్త్వగ్రంథాలను పాశ్చాత్యులు కూడ చాల మెచ్చుకొంటారు. దీనికి కారణమిది. అవి ప్రతిపక్షుల అభిప్రాయాలను ఏ మాత్రమూ దాచక పూర్తిగా వివరించి, ఆ తరువాత తమ అభిప్రాయాలను పేర్కొనటం.

వేదాలలోని జ్ఞానకాండ - అంటే ఉపనిషత్తులు - అద్వైతం గురించే చెప్తుంది. కాని ద్వైతం గురించి చెప్పే కర్మకాండ తరువాతనే ఉంటుంది.

మనందరికీ సుపరిచితమైన ద్వైత భావాన్ని మొదట చెప్పి ఆ తరువాతనే అద్వైత ప్రసక్తి వేదాలు చేయటం వల్ల వేదాలు అద్వైత సిద్ధాంతాన్నే బలపరుస్తాయని తేటతెల్ల మవుతుంది. ఇదే లక్ష్యమని కూడ తెలుస్తుంది.

పూర్వ పక్షంలో వలె ద్వైతానికి ఖండన లేదే అనవచ్చు. దానికి కారణమిది. ద్వైత భావానుసారం చేసే కర్మలు, ఆరాధనలూ అద్వైతం చెప్పే "అనుభవాని"కి వ్యతిరేకం కావు. పైగా, అవి గమ్యాన్ని చేరటానికి ఉపకరించే సాధనలు. పూర్తిగా ధ్వంసం చేయటానికి శత్రువుని పెట్టినట్టు పూర్వ పక్షంలో ఇవి లేవు. ద్వైత సిద్ధాంతం వ్యతిరేక భావంగా ఎక్కడా చెప్పబడలేదు. ఖండింపబడలేదు.

మొదట పువ్వు వచ్చి అది రాలి పోయి ఫలం మిగిలిస్తుంది. మొదట ద్వైత భావాన్నుంచుకోవాలి. తరువాత అద్వైతానికి చేరి దానిని విడిచిపెట్టాలి. పువ్వూ, ఫలమూ ఒకరికొకరు శత్రువులు కారుకదా! చివరికి వచ్చేది ఫలమే కాబట్టి పువ్వునెవ్వరూ నిరసించరు.

ఇతర సిద్ధాంతాలు కూడ అర్హస్థానాలలో ఉండి, ఉచిత రీతిలో తమవాదాలని బయటపెట్టి నట్లైతే అద్వైత సిద్ధాంతం వాటిని కూడ ఖండించవలసిన అవసరం వచ్చేది కాదు. అవి హద్దు మీరిన తరువాతనే వాటి ఖండన అవసరమయింది. ఆదిశంకరుడు, ఇతర అద్వైతులు ఈ భావంతోనే ఇతర సిద్ధాంతాలను చూచారు. అదృష్టవశాత్తూ విజ్ఞానశాస్త్రాభివృద్ధి తాత్త్విక సిద్ధాంతాలకు ఏ కీడూ చేయలేక పోయింది. నిజానికి ఆధునిక శాస్త్రం అద్వైత సిద్ధాంతాన్ని సమీపిస్తోంది. ఆ సిద్ధాంతాన్ని అంతకు పూర్వం వేద ప్రమాణం వల్ల తప్ప వేరే విధంగా అవగాహన చేసికోవటం సాధ్యమయేది కాదు. ఆరంభంలో, విజ్ఞాన శాస్త్రానుసారం భూమిమీది పదార్థాలన్నీ ఒకదాని నుండి వేరొకటి భిన్నం. ఆ తరువాత అన్ని పదార్థాలకీ

మూలం 72 ధాతువులు మాత్రమే నన్నారు. ఆ ధాతువుల మిశ్రమాలే అసంఖ్యాకమైన పదార్థాలన్నారు. అణుశాస్త్రం అభివృద్ధి అయిన తరువాత ఈ 72 ధాతువుల మూలమూ ఒకటే నన్నారు. అదే "శక్తి".' మన పరిభాషలో తత్త్వ చింతనలో బాగా పురోగమించి, సత్యాన్ని గ్రహించిన వారు శక్తి అనబడేది చైతన్యమేననీ దాని పరిధిలో అచేతన పదార్థాలే కాక ఎరుకకు ప్రతీకయైన జీవాత్మకూడ ఉందనీ గ్రహించారు.

ఈ విశ్వవ్యాప్తమైన చైతన్యం ఇంద్రియగ్రాహ్యం కాదు. శాస్త్రజ్ఞునికైనా, తత్త్వవేత్తకైనా! అది అనేక రూపాలలో మనకి కనబడటమే ద్వైతం. ద్వైతమే పరమసత్యమైతే వేదాలని సంప్రదించ వలసిన అవసరం లేదు.

ఇంద్రియాలకూ, బుద్ధికీ కనబడే వాటి గురించి అవి ప్రస్తావించవలసిన అవసరం లేదు. వేదాల సార్థకత - మనమెరిగిన విషయాలను చెప్తూ, చివరికి మనమెరుగ వలసిన దానిని తెల్పటంలోనే ఉంది. జీవాత్మ పరమాత్మలో లీనపోయి అద్వైతమైన బ్రహ్మమవటమే అసలు సత్యం!



# 13

# ఉపనిషత్తుల ఉపదేశసారం

అంతిమ దశను చేరుకోవటానికి ఉపనిషత్తులు చేసే ఉపదేశానికి సారాంశమేమిటి?

ఆధునిక విజ్ఞాన శాస్త్రం ప్రకారం దృశ్యమానమైన జగత్తు దేశ-కాలాలనే భావాల సంయోగం వల్లనే సాధ్యం. ఈ భావాలనధిగమిస్తేనే సత్యం తెలిసికోవటం సాధ్యమంటాయి ఉపనిషత్తులు. "దేశ" మనే భావం పోవటానికి వెనుక క్షితిజం వద్ద నిలబడటం గురించి యిచ్చిన ఉదాహరణ చాలు. ఆ విధంగానే "కాల"మన్న భావాన్ని కూడా అధిగమించాలి.

వీటి గురించి సిద్ధాంతీకరించటం చాలా? గ్రహింపు మన వల్లనౌతుందా? ఇది సాధ్యమేనని ఋజువు చేయటానికి నిత్యజీవితంలో ఒక ఉదాహరణ చాలు. కాలక్షేపానికి ఆఫ్రికాలో జరిగే యుద్ధాన్ని గురించి చదువుతాం. కాని ఏ కాశ్మీరులోనో, పాకిస్తాన్‌లోనో యుద్ధమవుతోందనుకోండి అప్పుడు ఆఫ్రికా (కాంగో)లో జరిగే యుద్ధం గురించి ఆసక్తి తగ్గి సమీపాన జరిగే యుద్ధం గురించి ఆసక్తి ఎక్కువ అవుతుంది. ఆ పత్రికా సంపాదకుడు కూడా ఆఫ్రికాలో జరిగే యుద్ధాన్ని ఏ మూలో అచ్చువేస్తాడు. పాకిస్తాన్‌లో జరిగేదాన్ని మొదటిపేజీలో పతాకశీర్షికలతో అచ్చువేస్తాడు. అప్పుడు ఈ వార్తమనకింకా ముఖ్యమనిపిస్తుంది. అంతకన్నా ఆసక్తిదాయకంగా సమీపంలోని రెండు రాష్ట్రాల నడుమ సరిహద్దు తగాదా, దౌర్జన్యకాండా ఉంటుంది. అప్పుడు పాకిస్తాన్ వార్తని కూడ ప్రక్కకి పెట్టి ఈ సరిహద్దు తగాదాకి మనమా కర్షితుల మవుతాం. పొరుగు వీధిలో అల్లరి జరిగితే, రాష్ట్రాల మధ్య సరిహద్దు తగాదాని ప్రక్కకు పెట్టుతాం. వార్తా పత్రికను అవతల పారేసి ప్రక్కవీధికి పరుగెత్తుతాం. మనమక్కడ ఉండగా, మన యింట్లోనే, పిల్లల మధ్యో, అత్తా కోడళ్ల మధ్యో తగాదా జరుగుతోందని ఎవరైనా వచ్చి చెప్పితే ఆ వీధి అల్లరిని విడిచి, యింటికి పరుగెత్తుతాం.

అంతర్జాతీయ వ్యవహారాల సందర్భంలో ఆఫ్రికా యుద్ధం ముఖ్యమే అవవచ్చు, అక్కడ్నుంచి పాకిస్తాన్‌లో యుద్ధమూ, రాష్ట్రాల సరిహద్దు తగాదా, పొరుగు వీధిలో అల్లరీ, యింటిలోని గొడవా - చిన్నచిన్నవిగా చివరికి ఏ ప్రాధాన్యమూ లేనివిగా అయిపోతాయి. కాని మన ఆసక్తి ఈ క్రమానికి వ్యతిరేకంగా సంఘటన దగ్గరైన కొద్దీ ఎక్కువ అవుతూవచ్చింది. ఎందుచేత? దూరం తగ్గిన కొద్దీ మన ఆసక్తి అధికమవుతూండటమే దీనికి కారణం.

ఆ ఉపమానాన్ని విడిచి లోదృష్టి వైపు మళ్లుదాం. మన అంతరంగంలో జరిగే సంఘర్షణల గురించి తెలుసుకుంటే - మిగిలిన సంఘర్షణలన్నీ ఆఫ్రికాలోని యుద్ధంవలె అప్రధానమవుతాయి. ఈ అంతః కలహాలను సమాధాన పరచుకొని శాంతి సామరస్యాలని నెలకొల్పటానికి ప్రయత్నిద్దాం. ఆ "శాంతం"లో దేశ - కాలాలు మాయమవుతాయి. నిద్రలో ఈ "దేశ" భావముంటుందా? ఉండదు. ఆ ఎరుకే, ఆ అనుభూతే ఉండదు. జ్ఞానోదయం

కలిగితే - ఆ జ్ఞానమయస్థితిలోనే, అనుభూతిలోనే ఉండటం సాధ్యం. అప్పుడు అందులో స్థలానికి స్థానముండదు.

"కాల"మన్న భావం కూడా ఇటువంటిదే. తండ్రి పోయినప్పుడు ఎంతో దుఃఖిస్తాం. ఇప్పుడా కన్నీళ్ళేమై పోయాయి? దగ్గరవారు పోయినప్పుడు పొందిపొర్లే దుఃఖం ఆ మర్నాటి వరకూ ఉండదు. ఎందుచేత? ఉద్యోగంలో ప్రెమోషన్ వచ్చి నప్పుడు గాని, లాటరీ గెలిచినప్పుడు గాని కలిగే సంతోషాతిరేకం కూడ కాలక్రమేణా వాడిపోతుంది. ఎందుచేత?

'దేశం'లో వలెనే 'కాలం' విషయంలో కూడా సంఘటన దగ్గరైన కొద్దీ మన స్పందన బలీయమవుతుంది. సమీపకాలంలో జరిగిన సంఘటన వల్ల మనమెక్కువగా ప్రభావితులమవుతాం.

బయటి విషయాల గురించి ఆలోచిస్తున్నప్పుడు ఈ దేశ-కాలాల ఎరుకని కలిగియుంటే, మన ప్రమేయం లేకుండానే ఆ ఆలోచనలు అప్రధానమయి పోతాయనీ, వాటికి మనపై ప్రభావమేమీ ఉండదనీ గ్రహిస్తాం. ఇది ఎంతో ఆశాజనకమైన విషయం. మన ఆలోచనలనే లోపలికి తిప్పి గట్టిగా ప్రయత్నిస్తే ఈ దేశకాలాల ప్రభావం నుండి బయటపడటం సాధ్యమే. నిద్రలో, దేశకాలాల గురించి ఎరుకలేక పోయినా, ఆ స్థితి గమనికే యుండదు. తాయుమానవర్ చెప్పినట్టు జ్ఞానం కలిగితే "నిద్రపోకుండా నిద్రపోయే" స్థితిని - అంటే దేశకాలాలని కావాలనే అధిగమించి, చిదానంద స్థితిని చేరవచ్చు.

అప్పుడు ఆఫ్రికాలో యుద్ధమే కాదు, మననే ఎవరైనా కత్తితో పొడిచినా ఏమీ పట్టించుకోకుండా, దూరంగా జరిగే యుద్ధం వలె, ఉండటం సాధ్యమవుతుంది. దగ్గర బంధువు - భర్తో, భార్యో, బిడ్డో, తన కళ్ల ఎదుటే పోయినా కూడా దాని ప్రభావమెంతో సన్నగా ఉంటుంది - ఏ పది సంవత్సరాల క్రితమో సంభవించిన తండ్రి మరణం వలె!

సరే, అద్వైతమూ, ద్వైతమూ, వీటి లక్షణాలనీ ప్రక్కకు పెడ్దాం కాస్సేపు. మనం గాఢంగా కోరుకొనేది ఏమిటి - శాంతి!

మంచీ, చెడూ రెండూ మనల్ని ప్రభావితం చేస్తాయి. ఏడుపూ, నవ్వూ రెండూ సంకటాన్నే కలిగిస్తాయి. రెండూ లేకుండా ఉంటేనే నయం. మరీ ఎక్కువగా నవ్వినా డొక్కలు నొప్పి పెట్టుతాయి, నీరసింప జేస్తాయి. కోపంగా, "నన్నింక నవ్వించవద్దం"టాం. నాట్యమాడటం సంతోషదాయకమే కావచ్చు. కాని శరీరమలసి పోతుంది. ఒక దశలో "చాలు" ననిపిస్తుంది. ఒంటరిగా, ప్రశాంతంగా ఉండాలనిపిస్తుంది. మనకి కావలసిందదే - అద్వైతమూ కాదు, ద్వైతమూ కాదు.

మనకి అనుభూతుల బారి నుండి విముక్తి కలిగించే ఉత్తమ దేశికులు ఈ కాలమూ, దేశమూను. ఇప్పుడు జరిగే సంఘటనలు ఎప్పుడో, ఎక్కడో జరుగుతున్నట్టు భావించే శక్తిని ప్రసాదించమని మనం భగవంతుని వేడుకోవాలి.

ఈశావాస్య ఉపనిషత్తు ఇట్లా అంటుంది. "అది (ఆత్మ) కదులుతుంది (కాని) కదలదు - అది దూరస్థం కాని మన దగ్గరే, లోపలే, ఉంటుంది."

*"తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే।*
*తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః"* (ఈ. 5)

ఇక్కడ దేశమూ, కాలమూ కలిగించే మానసికావస్థల గురించే కాక వాటి ప్రభావం నుండి విముక్తులం కావాలన్న ఆసక్తినీ కలిగిస్తుంది. ఈ ఉపనిషత్తులోనే దీని తర్వాత వచ్చే మంత్రాలలో, దేశ కాలాలు ఆత్మస్థితాలే అని గమనించమని యుంటుంది. ఇది గ్రాహ్యమైతే, ఇక కోపం లేదు. మోహం లేదు, దుఃఖం లేదు - ఒక్కమాటలో చెప్పాలంటే, మానసిక సంక్షోభం లేదు. ఆ తరువాత ఇంకొక మంత్రం - ఆత్మ విశ్వవ్యాప్తమవటం వల్ల దూరాన్ని అధిగమించిందనీ, ఆ పిదప ఆత్మ కాలాతీతమనీ కూడా చెప్తుంది.

మొత్తం మీద ఉపనిషత్తులు కూడ ఆధునిక విజ్ఞానశాస్త్రం ప్రతిపాదించే దృశ్యమాన జగత్తు దేశ కాల సంయోగ జన్యమనే సత్యాన్ని ఒప్పుకుంటుంది. అయితే ఆధునిక విజ్ఞాన శాస్త్రం విషయంలో ఇది ఒక సిద్ధాంతము మాత్రమే. ఉపనిషత్తులు ఇది స్వానుభవంలో అనుభవించ వలసిన అనుభూతి అంటాయి. వేదాలకు శిరోభూషణాలైన ఉపనిషత్తుల సందేశమిదే !



# 14

# వేదశాఖలు

వేదాలు అనంతములు (అనంతా వై వేదాః). వేదాంతమంటే వేదాలయొక్క అంతం. "అనంతమైన వేదాలకి అంతమేమిటి"?

వేదాల ముఖ్యోద్దేశం ఆత్మసాక్షాత్కారం. ఇదే ఆధ్యాత్మిక సత్యాలకు చివరిమెట్టు. దీని గురించి చెప్పటం వల్ల వేదాంతమయింది. మరో విధంగా చెప్పాలంటే, వేదాల అన్వేషణకు అంతమన్నమాట. వేదాల చివరిలో ఉంటుంది వేదాంతం.

బ్రాహ్మణుడుగా పుట్టిన ప్రతివాడూ ఏ కారణాలనీ అడుగకుండా, విధిగా తమ వేదశాఖని అధ్యయనం చెయ్యాలి. అభ్యసించాలి. వేదశాఖకి సంహిత, బ్రాహ్మణము, ఆర్యణకము, చిట్టచివర ఉపనిషత్తు ఉంటాయి. వేదశాఖకి చివరిది ఉపనిషత్తు.

అనంతమైన వేదాలను శాఖలుగా విభజించటంలో అంతరార్థమేమిటి? ఆధ్యాత్మిక ప్రగతి సుసాధ్యం కావటానికి మనిషికి అన్ని విషయాలూ బోధించాలి. మొదటిది, వేదాధ్యయనం, వేదాలని వల్లె వేయటం. ఆ తరువాత యజ్ఞాలూ ఇతర కర్మలూ అభ్యసించాలి, ఆచరించాలి. వీటికి సంబంధించిన మంత్రాలను నేర్చుకోవాలి. ఆ తరువాత యజ్ఞాల ప్రయోజనం గురించి తెలుసుకోవాలి. చిట్టచివరికి పరమాత్మ తత్త్వాన్ని పఠించి, అనుభవసిద్ధం చేసుకోగలగాలి. వేదాన్ని పఠించే విద్యార్థికి ఇవన్నీ నేర్పాలి.

ఆత్మసాక్షాత్కారానికి సరిపడినంత నేర్పాలి. అన్ని వేదశాఖలనూ క్షుణ్ణంగా తెలుసుకోవటం అసాధ్యం. కొన్ని వేల సంవత్సరాలు పఠించిన తరువాత కూడ భరద్వాజ ముని వంటి వారికి వేదమనే పర్వతం నుండి గుప్పెడు మట్టి మాత్రమే లభించిందట. కాబట్టి, మనిషికి మనస్సు క్షాళనమై, పరమాత్మలో లీనమవటానికి సరిపడినంతమేరకు అనంతమైన వేదాలని కూర్చి వర్గీకరించారు. ఇవే వేదశాఖలు.

పుట్టినప్పటి నుండి చనిపోయే వరకూ బ్రాహ్మణుడు నిర్వహించ వలసిన విధులను వేదశాఖ వివరిస్తుంది. ఆరంభంలో శాఖను అధ్యయనం చెయ్యాలి. అంటే; సంహితలోని మంత్రాలను కంఠస్థం చెయ్యాలి. ఆ తరువాత బ్రాహ్మణాలలోని మంత్రాల సహాయంతో యజ్ఞాలను చెయ్యాలి. ఆ పిదప వెలుపలి కర్మకూ లోపలి అనుభవానికీ గల అంతరాన్ని కలిపే ఆరణ్యకాలను మననం చెయ్యాలి. ఆ తరువాత ఆంతరసత్యం గురించి తెలిపే ఉపనిషత్తులని జీర్ణం చేసుకోవాలి. అంతరము, బాహ్యము అన్న భేదభావం సమసిపోయే మోక్ష స్థితిని అందుకోవాలి.

ప్రతి శాఖకీ ఇదే ప్రణాళిక, ఇదే ఉద్దేశం. పరిణితాత్మునికి ఒక్క మంత్రమే చాలు సత్యాన్ని గ్రహించటానికి. కాని సామాన్యుడు ఎన్నో కర్మలను ఆచరించాలి, ప్రతిదశలోనూ

అధ్యయనం, మననం చేస్తూనే ఉండాలి. అందువల్లనే ప్రతిశాఖలోను సామాన్యుడు ముక్తినొందటానికి కావలసిన మంత్రాలు, కర్మలు, ఆధ్యాత్మిక ఆదేశాలు ఉన్నాయి.

### బ్రాహ్మణేతరుల మాట ఏమిటి?

బ్రాహ్మణేతరులు మాత్రం పురోగమించవద్దా? వైదిక కర్మలు, అనుష్ఠానాలు వారికి కావు. కాని వారికి తమ విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చటం, మానసికోన్నతికి, ఆత్మసాక్షాత్కారానికి దారి తీస్తాయి. ఏ వర్గానికి చెందినా, విధ్యుక్త ధర్మాన్ని నిజాయితీతో నెరవేర్చి, ఫలితాన్ని భగవంతునికి వదిలితే గమ్యం చేరవచ్చు. కృష్ణ భగవానుడు గీతలో ఇలా అన్నాడు.

"స్వ కర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దన్తి మానవాః" (18 : 46)

యుద్ధాన్ని చేసి దేశాన్ని రక్షించటం కొందరి ధర్మం. మరొకడు వ్యాపారి. ఇంకొకడు పశులకాపరి, గోవులను పరిరక్షిస్తాడు. మరొకడు కాయకష్టం చేస్తాడు, కూలి వాళ్లని సమకూరుస్తాడు. తన రంగంలో పనిచేసుకొంటూ భగవత్సాక్షాత్కారాన్ని పొందవచ్చు.

లోకంలో అందరూ సుఖప్రదంగా ఉండటానికి అనువైన వృత్తులనూ ధర్మాలనూ కొందరు ఆచరిస్తూంటే బ్రాహ్మణుని విధి ఏమిటి?

జీవితంలో అన్నిటికన్నా ముఖ్యమైనది సమాజశ్రేయస్సు కోసం దైవానుగ్రహం సంపాదించటం. అటువంటి అనుగ్రహాన్ని సంపాదించటం బ్రాహ్మణుని విధి. భగవంతునికి సామంతులనదగ్గ దేవతల అనుగ్రహాన్ని కూడ బ్రాహ్మణులు అందరికీ లభించేట్టు పాటుపడాలి. అతడు పఠించే వేదమంత్రాలూ, చేసే వైదిక కర్మలూ సమాజంలోని అందరి శ్రేయస్సుకీను-తన ఉన్నతికోసమే కాదు.

అలౌకిక శక్తులతో వ్యవహారం కాబట్టి అతను మంత్రాలను నేర్చుకోవాలి. ఆ మంత్రాలిచ్చే శక్తి సంపాదించాలి. దానికై మిగిలిన వారి కంటె ఎక్కువ నియమమూనిష్ఠా అనుసరించాలి. బ్రాహ్మణునికి వలె అంతటి దీక్ష యితరులకి అవసరం లేదు. బ్రాహ్మణుని విధ్యుక్త ధర్మం లోక శ్రేయస్సు కొనమే ప్రార్థన చేయటం, కృషి చేయటం అన్న విషయాన్ని గుర్తుంచుకుంటే కొన్ని విద్యలకు బ్రాహ్మణుల కొరకే నియుక్తమైనాయన్న తప్పుడు అభిప్రాయం పోతుంది.

అంతేకాక, ఇతర కళలను శాస్త్రాలను పనులను చేయటాన్నీ కూడ బ్రాహ్మణుడు అభ్యసించాలి. అట్లా చేస్తేనే ఇతరులకు తమ విధులను గురించి బోధించ గలుగుతాడు. బోధనే అతని వృత్తి. మిగిలిన వృత్తుల గురించి ఎరుక కలిగి యుండాలి వాటిని నేర్పటానికి మాత్రమే. తనకి విధింపబడని వృత్తులను చేపట్టరాదు. దేశ రక్షణ, వ్యాపారము, వ్యవసాయము ఇతర వృత్తులను అతడు చేపట్టక ఆయా వృత్తులను ఆశ్రయించిన వారికి తగిన శిక్షణ ఇవ్వకలిగి, తద్వారా వారి శీలాన్నీ, మనస్సునీ, బుద్ధినీ రూపొందించ గలగాలి. అందుచేత, బ్రాహ్మణునిది గురుతరమైన భాద్యత. ఈ భాద్యతని నిర్వహించే వానికి చిత్తశుద్ధీ, పరిణత

బుద్ధి లేకపోతే సత్ఫలితముండదు. అతని మనస్సూ, బుద్ధీ బాగా వికసించి యుండకపోతే ఇతరులకు ఉన్నతి నెట్లా కలిగించ గలుగుతాడు? కాని అతనికి ఒక పెద్ద ఆటంకముంది. తాను ఎప్పుడూ బుద్ధితోనే పనిచేస్తాను కదానని తాను ఇతరుల కంటే అధికుడనన్న భావం కలిగితే అది పెద్ద ఆటంకమవుతుంది. ఈ కారణాల వల్ల బ్రాహ్మణుడు ఎంతో పరిశుద్ధతతో ఉండాలి. అతని అహంకార మధికమవటానికి ఎన్ని కారణాలున్నా. అతను ఎంతో వినమ్రుడై, స్వార్థరహితుడై యుండాలి. అందువల్లనే అతని అహంకారమూ, ఇతర వికారాలు సమసిపోయి, సాధువవటానికి - అతనికి నలభై సంస్కారాలు విధించారు.

మంత్రాలు సత్ఫలితాలవ్వాలంటే ఎంతో నిగ్రహము, సంయమనము కలిగి యుండాలి. ఏ మంత్రాన్ని ఎప్పుడు, ఎట్లా పఠించాలో, అంటే అధ్యయనం ఎప్పుడు చెయ్యాలి, ఏ తిథి నాడు పఠించాలి, దానితో బాటు సమర్పించాల్సిన ఉపహారమేమిటి - ఇటువంటి, నియమాలెన్నో యున్నాయి. వీటి ప్రకారం నడుచుకోక పోతే, ఆ వ్యక్తికి సంబంధించినంత వరకూ, ఆ మంత్రశక్తి క్షీణిస్తుంది. ఉదాహరణకి గ్రహణసమయంలో మంత్రాన్ని పఠిస్తే దాని పటిమ వృద్ధి అవుతుంది. ప్రతి ఒక వేదశాఖ ఈ మంత్రాల తత్త్వమూ, ఫలితమూ వేదవిదితునికి ఆత్మసాక్షాత్కారము కలిగే విధము గురించి సమగ్రంగా వివరిస్తుంది.

**వాడుకలో ఉన్న శాఖల వర్గీకరణ :**

పూర్వకాలంలో మనుష్యులకి ఎంతో బుద్ధికుశలతా శారీరక దార్ఢ్యమూ ఉండేవి. వారికి యోగశక్తీ, మేధాసంపదా ఉండేవి కనుక ప్రతివారూ ఎన్నో వేదశాఖలను వల్లించగల సమర్థులై ఉండేవారు. కొందరి ఋషులకు వేదాలు వారి మనస్సులలో సద్యఃస్ఫూర్తితో విశదమైనాయి. అసాధారణమైన ప్రజ్ఞగల ఇతరులు గురువుల వద్ద మనం ఊహించలేనన్ని శాఖలను అభ్యసింప గలిగేవారు. ఆ తరువాత చాలా సందర్భాలలో వేదమంత్రాలు వారి మనస్సులలో ద్యోతకమయ్యేవి.

గురువు వద్ద నేర్చిన దానిని వారెంతో అభివృద్ధి చేసుకో గలిగేవారు. వేదాలని సాగరంతో పోలిస్తే ఎవ్వరికీ వాటి సంపూర్ణ అవగాహన ఉండేది కాదన్నది సత్యం. కాని ప్రాచీన కాలంలో చాలామంది అధికభాగాన్ని క్షుణ్ణంగా నేర్చుకొన్నారు.

కాలక్రమేణా మనుష్యులు యోగశక్తులను కోల్పోయారు. కలియుగం రావటంతో ఆ శక్తి యించుమించు మాయమై పోయింది. పూర్వపు మహనీయులతో పోలిస్తే - ఆయుర్దాయం, ఆరోగ్యము, బుద్ధిగ్గరిమ - అన్నీ క్షీణించి పోయాయి.

ఇదంతా భగవంతుని లీల. దీనికి కారణం అనుహ్యం. శ్రద్ధగా వేదాలను అధ్యయనం చేసి, యజ్ఞాలను ఆచరించి, ధ్యానం చేసి, ఆత్మసాక్షాత్కారాన్ని పొందిన వారు వాటి సత్ఫలితాలను భావితరాల వారికి అందివ్వకుండా ఎందుకు వెళ్లిపోయారో చెప్పలేం. ఒక పద్ధతిని అవలంబించకుండా జగన్నాటక సూత్రధారి ఈ నాటకాన్ని ఆడిస్తున్నాడనుకోవటమే దీనికి సమాధానం.

డార్విన్ వంటి శాస్త్రజ్ఞులు జీవన పరిణామపు అంతిమ దశయైన మానవుని చేరే వరకూ అభివృద్ధి చెందుతూనే వచ్చిందన్నారు. కాని ఆ పిదప, ఆధ్యాత్మికతా, మేధాసంపదా, నైతిక విలువలూ, యోగ బలమూ, మనోబలమూ ఆ అభివృద్ధి క్రమానికి విరుద్ధంగా క్షీణిస్తూనే వచ్చాయి. అన్నిటా తిరోగమనమే. కలియుగంలో ఇది ఘనీభవించింది.

కృష్ణభగవానుడు నిర్యాణం చెందినప్పటినుండే క్షీణదశ ప్రారంభించింది. లోకం అంధకారావృతమైంది అప్పుడే. ఆ అంధకారం ఆయనపై కూడా పడింది. ఆయన అర్ధరాత్రి వేళ, కారాగారంలో జన్మించారు. కాని ఆయన లోకానికే దీపశిఖ, దయా కరుణల జ్యోతి స్వరూపుడు. ఆయన నిర్గమనంతో జ్ఞానం దెబ్బతిన్నది - దానిపై అంధకారం ఆచ్ఛాదనమయింది. దుష్ట శక్తులకు ప్రతీకయైన కలిపురుషుడు ఆధిక్యత వహించాడు. ఇది కూడా మనకి అవగాహనకాని పరమేశ్వరుని లీలే!

ఎంతో దివ్యత్వంతో, కాంతిమత్వంతో కృష్ణభగవానుడు ఉదయించాడు. కాని అంధకారమలుము కుంటుందేమో నని ప్రజలు భయపడే పరిస్థితిని కల్పించాడు. కలికాలంలో వేదాలు ప్రకాశించలేవు. కలిపురుషుని విధ్యుక్తధర్మాలతో పొత్తుకుదరదు వాటికి.

కాని కొంతవరకైనా వేదాలను, అంటే అవి పూర్తిగా మాయమైపోకుండా, పరిరక్షించటమే ఉద్దేశం. ఈ పనిని ఆయన తన అంశగల వ్యాసునితో చేయించాడు. ఆ రోజులలో ఆయన పేరు వేదవ్యాసుడు కాదు కృష్ణుడే. ఆయన ద్వీపంపై జన్మించటం వల్ల కృష్ణద్వైపాయను డయ్యాడు. ఆయనకే బాదరాయణుడన్న పేరు కూడ ఉంది.

మహర్షుల వల్ల లోకంలోకి వచ్చిన 1180 వేదశాఖలూ ద్వాపరయుగాంతం వరకూ లభ్యములే. వీటినన్నిటినీ కృష్ణద్వైపాయనుడూ అధ్యయనం చేశాడు. నీటి వరదవలె అన్ని వేదాలూ కలిసిపోయి ఉండేవి ఆ రోజులలో. పూర్వపు ఋషులకే వాటినన్నిటినీ గ్రహించే శక్తి ఉండేది. గ్రాహ్య శక్తి సన్నగిలిన మనకోసం వ్యాసుడు వేదశాఖలను నాలుగు ముఖ్యభాగాలుగా వర్గీకరించాడు - ఒక్కొక్క దానిలో మళ్లీ ఎన్నో శాఖలున్నాయి. ఆ నాలుగు వర్గాలూ నాలుగు వేదాలుగా చెప్పబడుతున్నాయిప్పుడు. తపస్సు వల్ల ఆయనకి సంక్రమించిన మానవాతీతమైన యోగశక్తి వల్లనే యిది జరిగింది.

ఋగ్వేదశాఖలు పూజకీ ఆరాధనకీ అనుకూలము. యజుశ్శాఖలు కర్మలనూ యజ్ఞాలను నిర్వహించే విధానాన్ని చెప్తాయి, సామశాఖలు దేవతలను తృప్తి పరచడానికుద్దేశించిన సంగీతరూపమయిన మంత్రములు అథర్వశాఖలు యజ్ఞాల నిర్వహణనూ, శత్రువుల నుండి మనుష్యుల రక్షణను నేర్పే మంత్రాలనూ చెప్తాయి.

సామవేదానికి అత్యధికమైన శాఖలుండేవి - వాటిలోని కీర్తనల గానం దేవతలకెంతో ప్రియం. మొత్తం 1180 శాఖలలో వెయ్యిశాఖలు సామవేదానికి చెందినవే. ఋగ్వేదానికి 21 యజుర్వేదానికి 109 (శుక్ల యుజుర్వేదానికి 15, కృష్ణ యజుర్వేదానికి 94) అథర్వవేదానికి 50 శాఖలుండేవి.

కృష్ణద్వైపాయనుడే ఉత్తరోత్రా వేదవ్యాసుడుగా ప్రసిద్ధుడైనాడు. కలియుగంలో మానవులకు బుద్ధికుశలత తక్కువగా ఉంటుందనీ, పదకొండు వందల శాఖలలో ఒక్కొక్కరు ఒక శాఖని మాత్రం అధ్యయనం చేయగలిగితే చాలనీ భావించాడు. అట్టి భావన కూడా భగవంతుని లీలే. అంతకు పూర్వం ప్రతివారూ సాధ్యమైనన్ని వేదాలనీ, వేదశాఖలనీ అధ్యయనం చేయటం సంప్రదాయం. దానిని ఒక శాఖాధ్యయనానికి పరిమితం చేశాడు. ఒక్కొక్కరు చతుర్వేదాలలో ఒక శాఖని అధ్యయనం చేసి అందులో చెప్పబడిన కర్మలను చేయగలిగితే చాలునని అనుకున్నాడు. చతుర్వేదాలను, వాటి శాఖలను ప్రచారంలోకి తీసుకు వచ్చేపనిని తన శిష్యులకు అప్పగించాడు. ఋగ్వేద శాఖలు పైలునికీ, యజుశ్శాఖలు వైశంపాయనునకీ, సామశాఖలు జైమినికీ, అధర్వశాఖలు సుమంతునికీ ఇవ్వబడ్డాయి. ఈ నలుగురూ వేదవ్యాసుని శిష్యులు మాత్రమే కాదు, మహర్షులు కూడా.

"వ్యాస" అన్న మాటకి అర్థం వ్యాసమనీ, కూర్పు అనీ. ప్రత్యేకంగా అధ్యయనం చేయటానికి ఏదో ఒక విషయాన్ని మాత్రమే తీసికోవటం వల్ల వ్యాసమయింది. ఒక విషయాన్ని వర్గీకరించి, విషయప్రధానంగా ఏర్పర్చటం కూడా వ్యాసమే. ఎన్నో వేదశాఖలను వర్గీకరించి, విషయానుక్రమంగా ఏర్పర్చిన కారణంగా కృష్ణ ద్వైపాయనుడు వేదవ్యాసుడైనాడు. వేదాల ప్రాచుర్యానికై ఆయన చేసిన మహత్తరమైన కృషి వల్లనే ఆయన వేదవ్యాసుడన్న పేరుతోనే ప్రసిద్ధుడైనాడు.

ఒక్కొక్కరు ఒక్కొక్క శాఖను అధ్యయనం చేయగలిగితే చాలునని ఆయన అనినంత మాత్రాన, పెక్కుశాఖలను చదవకూడదని ఆంక్ష విధించి నట్టు అర్థం కాదు. ఆయన ఉద్దేశం కనీసం ఒక శాఖనైనా అధ్యయనం చేయాలనే. వేదవ్యాసుని అనంతరం కొన్ని వేల సంవత్సరాల వరకూ ఒక్కొక్కరు మొదట ఒక వేదశాఖనీ, తరువాత మరొక వేదశాఖనీ, ఆ పిదప మరొక వేదశాఖనీ అధ్యయనం చేసేవారు. ద్వివేది, త్రివేది, చతుర్వేది అన్న పేర్లు ఆ విధంగానే వచ్చాయి. క్రమంగా వీరు రెండు శాఖలను, మూడు శాఖలను, నాలుగు శాఖలను అధ్యయనం చేసిన వారని అర్థం.

వ్యాసుడు వేదాలను వర్గీకరించిన తరువాత అయిదువేల సంవత్సరాలు గడిచాయి. ఈ అంచనా చారిత్రిక సాక్ష్యాలపై ఆదారపడింది కొంత వరకు. శాస్త్రాలు వ్యాసుని కాలం గురించి నిర్దుష్టంగా చెప్పే వివరాన్ని పాశ్చాత్యపండితుల ప్రభావం వల్ల ఆధునిక చరిత్రకారులు అంగీకరింపక పోవచ్చు. వారి లెక్క ప్రకారం మహాభారతం క్రీ.పూ. 1500 నాటిది!

ఉత్తర భారతంలో కొందరికి చతుర్వేది అనీ త్రివేది అనీ ద్వివేది అనీ యింటి పేర్లుంటాయి. "దూబె" "దావె" అన్నవి 'ద్వివేది'కి అపభ్రంశహ్రస్వరూపాలు. నాలుగు వేదాలను అధ్యయనం చేసిన వారి వారసులు "చతుర్వేది" అన్న పేరు కలవారు. బెంగాలులో వీరినే చటోపాధ్యాయ అనీ, చటర్జీ అనీ అంటారు. కొన్ని ప్రదేశాలలో 'త్రివేది' అన్న పేరు "తివారీ"గా కూడ వాడుకలో ఉన్నది. ఈ రోజులలో ఒక వేదాన్నైనా క్షుణ్ణంగా

అభ్యసించిన వారిని కానరాము. అయినా, ఈ యింటి పేరు కలిగియుండటం ఆ వంశపూర్వీకు లెవరో, ఎప్పుడో, ఒకటికన్నా ఎక్కువ వేదాలను అధ్యయనం చేశారన్న దానికి నిదర్శనం. ఆ యింటి పేర్లు కలవారు ఆదర్శప్రాయులైన తమ పూర్వీకులను అనుసరించ గలిగితే బాగుంటుంది.

అశ్రద్ధ వల్ల గత అయిదు వేల సంవత్సరాలలోనూ ఎన్నో వేదశాఖలు వాడుకలో లేకుండా పోయాయి. 1180 శాఖలు క్రమేపీ తగ్గుతూ వచ్చాయి ఇప్పుడు కేవలం ఏడో ఎనిమిదో శాఖలు మాత్రం మిగిలిన దురదృష్ట స్థితికి వచ్చాము. ఋగ్వేదానికి గల 21 శాఖలలో ఒక్కటే మిగిలియుంది. ఇది ''సాకల'' శాఖ. దీంట్లోనే ఐతరేయ ఉపనిషత్తుండటం వల్ల దీనిని ''ఐత్తరేయశాఖ'' అని కూడా అంటారు. శుక్ల యజుర్వేదంలోని 15 శాఖలలోను ఇప్పుడు రెండే ఉన్నాయి. అవి : మహరాష్ట్రలోని ''కాణ్వ'' శాఖ, విదర్భ ఉత్తరభారతాలలో ఉన్న ''మాధ్యన్దిన'' శాఖ, కృష్ణయజుర్వేదంలోని 94 శాఖలకీ తైత్తిరీయ శాఖ మాత్రమే ప్రచారంలో ఉంది. ఇది దక్షిణ భారతంలో ఎక్కువ ప్రాచుర్యంలో ఉంది. కృష్ణయజుర్వేదంలో మరొక శాఖ, మైత్రాయనీ శాఖ - మహరాష్ట్రలో నామమాత్రంగా ఉంది. సామవేదంలోని వెయ్యి శాఖలలోను 997 సామశాఖలు పోయాయి. తమిళనాడులో ఒక శాఖ ''తలవకార శాఖ'' జైమిని పరంపరలోనిది మాత్రముంది. రాణాయనీయ శాఖ కర్నాటకలో మాత్రమే ఉంది. ''కౌథుమ శాఖ'' గుజరాత్, కేరళలలో ఉంది. అధర్వవేదశాఖలు దొరకవనే భయపడ్డాం. కాని విద్వాంసుల నిర్విరామ కృషిఫలితంగా గుజరాత్‌లో సినోర్ అన్న ఊళ్లో అధర్వశాఖలోని శౌనక శాఖని బాగా అధ్యయనం చేసిన వ్యక్తి దొరికాడు. ఆ వేద శాఖ కూడ పోకూడదన్న భావంలో దక్షిణాది నుండి విద్యార్థులను అక్కడికి పంపి ఆ శాఖను అధ్యయనం చేయించాము.

ఋగ్వేదానికి చెందిన ఐతరేయ బ్రాహ్మణాన్ని, కౌషీతకి బ్రాహ్మణాన్ని సంపాదించాము. దీనినే సంగాయన బ్రాహ్మణమని కూడ అంటారు. వీటికి సంబంధించిన ఆరణ్యకంలో ఐతరేయ ఉపనిషత్తు కౌశీతకి ఉపనిషత్తు ఉన్నాయి. ఇవన్నీ వాడుకలో ఉన్నాయి.

శుక్లయజుర్వేదానికి సంబంధించిన బ్రాహ్మణాలలో శతపథ బ్రాహ్మణ మొక్కటే వాడుకలో ఉన్నది. కొన్ని భేదాలున్నా ఇది మాధ్యన్దిన శాఖనీ, కాణ్వశాఖనీ పోలియుంటుంది. వేదాలన్నిటికీ మార్గదర్శిగా ఉండే బృహద్గ్రంథమిది. శుక్లయజుర్వేదానికి సంబంధించిన ఆరణ్యక మొక్కటే లభ్యం - అది బృహదారణక్యం. ఇది ఉపనిషత్తు కూడా. ముందే చెప్పినట్టు ఈశావాస్య ఉపనిషత్తు ఈ వేద సంహితలో ఉంటుంది.

కృష్ణయజుర్వేదపు 'తైత్తిరీయ' బ్రాహ్మణం వాడుకలో ఉంది. ఈ వేదపు ఆరణ్యకంలో తైత్తిరీయ ఉపనిషత్తు, మహానారాయణ ఉపనిషత్తు ఉన్నాయి. ఇప్పుడు వాడుకలో ఉన్న పెక్కు సూత్రాలు, మంత్రాలు ఈ మహానారాయణ ఉపనిషత్తులోనివే.

మైత్రాయణి ఆరణ్యకం, అదే పేరుగల ఉపనిషత్తు, కృష్ణ యజుర్వేదంలోనివే. కఠశాఖ (సంహిత) దానికి సంబంధించిన బ్రాహ్మణం, ఆరణ్యకం ఏమీ ఇప్పుడు లేవు. కాని వాటి చివరలో ఉండే కఠోపనిషతు మాత్రం ఇప్పుడు బాగా ప్రచారంలో ఉంది. పఠింప బడుతోంది.

ఇట్లాగే కృష్ణ యజుర్వేదానికి సంబంధించిన శ్వేతాశ్వతర సంహిత చివర ఉండే శ్వేతాశ్వతర ఉపనిషత్తు మాత్రమే ఉంది - మిగిలిన భాగాలేమీ లేవు.

997 సామశాఖ సంహితలుపోయినా - 7, 8 బ్రాహ్మణాలు మాత్రం ఎలాగో మిగిలాయి. అవి - తాండ్యబ్రాహ్మణ, సంహితోపనిషత్ బ్రాహ్మణ, వంశ బ్రాహ్మణ, షడ్వింశ బ్రాహ్మణ, సామవిధాన బ్రాహ్మణ, చాందోగ్య బ్రాహ్మణ, జైమినీయ బ్రాహ్మణ. ఈ వేదానికి ఆరణ్యక మొకటి తలవకార ఆరణ్యకమే తలవకార బ్రాహ్మణమని కూడ ప్రసిద్ధి. జైమినీయ బ్రాహ్మణలో ఉంటుందిది. దీని చివరే కేనోపనిషత్తు ఉంటుంది. అందుచేతనే కేనోపనిషత్తుని తలవకార ఉపనిషత్తని కూడా అంటారు. సామవేదపు చాందోగ్య బ్రాహ్మణం నుండే చాందోగ్య ఉపనిషత్తు వచ్చింది.

అథర్వవేద సంహితలు చాలా మట్టుకు పోయాయి. కాని ప్రశ్న, ముండక, మాండూక్య ఉపనిషత్తులూ, ఇవికాక నృసింహతాపిని ఉపనిషత్తూ ఇప్పుడున్నాయి. పఠింపబడుతున్నాయి. ఈ వేదానికి సంబంధించిన బ్రాహ్మణం గోపథబ్రాహ్మణ మొక్కటే ఇప్పుడుంది.

ఈ పరిస్థితిలో మన ధర్మమేమిటి? 1180 వేదశాఖలకీ ఇప్పుడు మిగిలిన ఏడెనిమిది సంహితలైనా నశించి పోకుండా భావితరాల వారికి దక్కేట్టు చూచుకోవలి. ఇప్పుడు మిగిలియున్న ఈ కొద్ది పాటి వేదశాఖలనూ, ఉపనిషత్తులనూ పరిరక్షించుకోవటానికి తగినన్ని సత్వరచర్యలు తీసికోవాలి. అట్లా చేయకపోవటం క్షంతవ్యం కాని అపరాధమవుతుంది.



# 15

# వేదాంగములు : శిక్ష

## వేదపురుషుని నాసికా స్థానము

వేదాలకు గల ఆరుఅంగాలలో ప్రధానమైనది - శిక్ష. వేదపురుషునికి ముక్కువంటిది. వాసనని చూడట మొక్కటే ముక్కు కర్తవ్యం, నిజానికి అది చాలా స్వల్పమైనపని. అంతకంటే ముఖ్యమైన గాలిపీల్చటం ఈ అంగం ద్వారానే సాగుతుంది. ముక్కు ఊపిరి పీల్చటానికి ప్రాణాన్ని నిలుపుకోవటానికి ఉపయోగ పడ్డట్టే, శిక్ష కూడ వేదమంత్రాలకు ఊపిరి వంటిది.

వేదమంత్రాల ఆయువు పట్టేది? వేదమంత్రంలోని ప్రతి అక్షరాన్నీ శుద్ధంగా, కాలపరిమాణం ప్రకారం ఉచ్చరించాలి. దీనినే అక్షరశుద్ధి అంటారు. కాల పరిమాణమే కాక, ఏ స్థాయిలో పల్కాలో కూడా నిర్దేశింపబడి యుంది. హెచ్చు, తగ్గు, సమము - వీటిని ఉదాత్తం, అనుద్ధాం, స్వరితమంటారు. ఇవన్నీ సరియైన ప్రమాణాలలో ఉన్నప్పుడే ధ్వని స్వరశుద్ధమై, స్వచ్ఛంగా ఉంటుంది. అందువల్ల, మంత్రాలు సత్ఫలితాలనివ్వాలంటే అక్షరశుద్ధీ, స్వరశుద్ధీ పరిపూర్ణంగా ఉండాలి. మంత్రాల ఉచ్చారణకి ఎంతో ప్రాముఖ్యముంది. ఈ ఉచ్చారణకి, స్వరానికి, స్థాయికీ సంబంధించిన నియమాలు వాటి అర్థాలకంటే ముఖ్యము.

అర్థము తెలియకపోయినా మంత్రాన్ని సరిగ్గా ఉచ్చరిస్తే సత్ఫలితాలు సిద్ధిస్తాయి. మంత్రాల సరాలైన వేదాల ఆయువు పట్టు శబ్దమే నన్నమాట.

తేలుకాటుని నయం చేసే మంత్రాన్ని తీసుకుందాం. దాని అర్థం వెల్లడి చేయరాదు. అందులోని పదాలకెంతో పటుత్వముంది. వేరువేరు శబ్దాలకు వేరువేరు ఫలితాలున్నాయి. శ్రాద్ధ మంత్రాలని సంస్కృతంలోనే ఎందుకుచ్చరించాలి? ఇంగ్లీషులోనో, మరే యితర భాషలోనో ఎందుకుచ్చరించకూడదు? అట్లా చేస్తే - అంటే ఇంగ్లీషులోనో, తమిళంలోనో ఉచ్చరిస్తే శబ్దమే మారిపోతుంది - దానితో వాటి పటుత్వమంతా మాయమవుతుంది. మంత్రాలని పఠించే వారి పళ్లుకొన్ని ఊడితే, వారు శబ్దాలని సరిగ్గా పలుకలేరు - మంత్రపఠనమూ, దానితో బాటు దాని ఫలితమూ పోతాయి లేదా తరిగిపోతాయి. ఉచ్చారణా, దాని స్వచ్ఛతా వేదాలకెంతో ముఖ్యం.

ఈ స్వచ్ఛతని నిలుపు కోవటానికేమి చెయ్యాలి? స్వరశాస్త్ర నియమాలను శిక్ష పేర్కొంటుంది. శిక్ష ప్రయోజనం వేదాక్షరాల పరిమితులని నిర్ణయించటం.

పదాల ఉచ్చారణని నియంత్రించేది స్వరశాస్త్రం. ఇతర భాషాలన్నిటి కంటే వేదభాషకి ఈ స్వరశాస్త్రం ప్రధానం - దీనికి కారణం, స్వరభేదంతో వేదభాషలో ఫలితాలే మారిపోవటం!

అందువల్ల వేదాల స్వరశాస్త్రమైన "శిక్ష" వేదపురుషుని ఆరు అంగాలలోనూ అతిప్రధానమైనదిగా భావింపబడుతుంది.

వేదాలకి శిరోభూషణములైన ఉపనిషత్తులలో శిక్ష ప్రస్తావన ఉంది. తైత్తిరీయ ఉపనిషత్తు "శీక్షావల్లి" అన్న అధ్యాయంతో ప్రారంభమవుతుంది. ఇక్కడా, ఇతర చోట్లా "శిక్ష'ని "శీక్ష"గా పేర్కొనటం కద్దు. తన భాష్యంలో ఆదిశంకరుడు "దైర్ఘ్యం ఛాందసం" అంటారు. అంటే దీర్ఘమవటం. వేదభాషలో హ్రస్వ "ఇ" దీర్ఘ "ఈ" గా మారుతుంది. ఛందస్సుకి అనుగుణంగా. వేదాల భాషని సంస్కృతం అనికాక ఛందసమంటారు.

హార్మోనియం, వేణువు వంటి వాద్యాలలో కొన్ని లెక్కల ప్రకారం గాలిని రంధ్రాల ద్వారా బయటకు వదులుతారు. వాటి వల్ల వివిధ స్వరాలు పల్కుతాయి. మానవుని గొంతుకకు కూడ అటువంటి ఏర్పాటే ఒకటి ఉంది. కేవలం గొంతుక మాత్రమే కాదు. నాభికి దిగువ నున్న "మూలాధారం" నుండి గాలిని అనేక విధాల పైకి పంపటంలో వాక్కు, నాదము ఫలితాలవుతాయి. మానవునికి భగవంతుడు ఉద్దేశించిన వాద్యము, మానవ కల్పితములైన వాద్యాల కంటె అంటే వేణువు, హార్మోనియం వంటివి, ఎంతో గొప్పది. ఈ వాద్యాలు కొన్ని రకాల ధ్వనులనే పలుకగలవు. "అ" "క" "చ" "గ" వంటి అక్షరాల ధ్వనులను పలుకలేవు. మానవుని గొంతుకే ఈ ధ్వనులను పలుకగలదు. పక్షులూ, జంతువులూ కొన్ని పదాలను పలుకగలిగినా వేనవేల ధ్వనులను పలికించగల మనిషికి సాటిరావు.

సృష్టిలో మానవునికొక్కనికే ఆ శబ్దాలను పలికించే సామర్థ్యం ఉండటం వల్ల మానవుని ప్రాముఖ్యం స్పష్టమవుతూనే ఉంది. అంతటి గొప్ప సంపదను అనవసర ప్రసంగాలతో వృథా చేయటం శోచనీయం. ఈ సామర్థ్యాన్ని దివ్యులని మనకనుకూలం చేసుకొనేందుకూ, లోక కల్యాణానికీ, మన ఉన్నతికీ ఉపయోగించుకోవాలి. ఈ మూడు పనులను చేయటానికి వేదమంత్ర ధ్వనులను గ్రహించి ఋషులు మనకి అనుగ్రహించారు. ఈ రహస్యాన్ని గుర్తుంచుకొంటే శిక్షాశాస్త్రం యొక్క ప్రాముఖ్యం పద ఉచ్చారణకి గల ప్రాముఖ్యమూ తెలుస్తాయి. గాలి నాభి క్రింద ప్రారంభించి, ఎన్నో స్థానాలను స్పృశించి, మెలికలు తిరిగి నోటి ద్వారా బయటకు ఎట్లా వెళ్లాలో అతి సూక్ష్మంగా 'శిక్ష'లో వివరింపబడింది. ఈ వివరణకి భాషాశాస్త్రజ్ఞులు ఆశ్చర్యాన్ని, గౌరవాన్ని ప్రకటిస్తూంటారు. శబ్దం యొక్క స్వచ్ఛతని ఆ రీతిగా కాపాడారు.

గాలి మనలో అన్ని విధాల పయనిస్తూంటే, అదే ఒక యోగ శాస్త్ర మవుతుంది. నాడుల ద్వారా ప్రసరించేప్పుడు గాలి కొన్ని ప్రకంపనలను కలిగిస్తుంది - వాటి వల్ల కొన్ని భావాలేర్పడుతాయి కొన్ని శక్తులూ ఉద్భవిస్తాయి, వీటికి బయటి ప్రపంచంపై ప్రభావముంటుంది. ఈ విషయాలను ముందే చెప్పుకొన్నాం. అందువల్లనే ప్రాణాయామం చేసి యోగశక్తులను సంపాదించినవారు, మంత్ర జపాన్ని చేసి ఆత్మ సాక్షాత్కారాన్ని పొందిన వారితో సమానులు.

శిక్షాశాస్త్రం ప్రతి అక్షరాన్నీ ఎట్లా పలకాలి, ఏ స్థాయిలో పలకాలి, ఏ అక్షరమెంత సేపు ఉచ్చరించాలి ఎన్ని మాత్రలకాల ముండాలి అని నిర్ణయిస్తుంది. హ్రస్వాక్షరాలు, దీర్ఘాక్షరాలను బట్టి ఏ అక్షరాన్ని ఎన్ని మాత్రల కాలముచ్చరించ వలెననేది నిర్ణయించబడుతుంది. సంధులను విడదీయకుండా పదాలను ఉచ్ఛరించటం, వేదమంత్రాల పఠనకు అవసరమైన సూచనలూ "శిక్ష"లో ఉంటాయి. "క" అన్న శబ్దం మెడకి గొంతుకకి నడుమ స్థానంలో ఉత్పన్నమవాలి. నాసిక దగ్గర "జ్ఞ" వంటి శబ్దాలుత్పన్నమవాలి. "త" వంటివి నాలుక కొన్ని పళ్లని తాకటం వల్ల రావాలి. "న" వంటివి నాలుక అంగిలిని తాకటం వల్ల రావాలి. "మ'' వంటివి పెదవుల కలయికతో రావాలి. "వ" వంటివి క్రింది పెదవి క్రింది పళ్లను కప్పటం వల్ల రావాలి. ఇట్లాంటివే ఎన్నో సూచనలున్నాయి. ఈ శాస్త్రం ఎంతో నిర్దిష్టమైన పద్ధతిలో ఉంటుంది. కొన్ని శబ్దాల ఉచ్చారణకు శరీరంలోని ఏయే భాగాలు, ఏయే కండరాలు కదలాలో నిర్దేశింప బడ్డాయి. వాటి ప్రకారం అభ్యాసం చేస్తే కేవలం స్వరశాస్త్రము నుండి దాటి, మంత్ర యోగాన్ని, శబ్దయోగాన్ని చేరుకుంటాం.

**మూలభాష సంస్కృతమే :**

నేను వేదముల విషయంలో ఒక పదం యొక్క అర్థంకంటె, శబ్దమే ముఖ్యం అని చెప్పాను. ఇక్కడే ఇంకొక విషయం కూడా చెప్పాలి. వైదిక భాష "ఛందస్సు". అందుండి ఉదయించినది సంస్కృతం. వీటిలో కొన్ని పదాలని ఉచ్ఛరించేప్పుడు వాటి అర్థం కూడా స్ఫురిస్తుంది.

"దంత" అన్న పదం తీసుకొందాం. ఈ మాటకర్థం పన్ను (దంతం). ఈ పదాన్ని పలకటానికి పళ్లనే ఎక్కువగా ఉపయోగించాలి, నాలుక ఉపయోగం అప్పుడప్పుడే. పళ్లులేని వాళ్లు దీనిని పలుకటం ఎంత కష్టమో తేలికగా తెలుసుకోవచ్చు. ఆ మాటని శుద్ధంగా పలుకలేరు.

భాషా శాస్త్రజ్ఞులు ఆయా భాషలు ఎప్పుడు పుట్టాయో పరిశోధిస్తూ కొన్ని కొన్ని చిన్న చిన్న విషయాలను కూడ పట్టించు కొంటారు. వాళ్లు కూడ గమనించవలసిన విషయమొకటి యుంది. సంస్కృతం, గ్రీక్, లాటిన్, జర్మన్ - వీటిని ట్యుటానిక్ వర్గపు భాషలంటారు (ఇంగ్లీషు కూడ వీటిలో చేరినదే). ఆధునిక ఫ్రెంచి, మరికొన్ని భాషలు కెల్టిక్ వర్గానికి చెందినవి. భాషాశాస్త్రజ్ఞుల ప్రకారం ఇవన్నీ ఒకే మాతృభాషనుండి జనించాయనీ ఆ భాష ఇండో-యూరపియన్ వర్గానికి చెందినదే అని అంటారు. కాని ఆ మాతృభాష ఏమిటో నిశ్చయంగా పండితులు చెప్పలేక పోయారు. సంస్కృతం (ఇందులో వైదిక భాష అయిన ఛందస్సు కూడా కలుస్తుంది) ఆ మాతృభాష అని మాత్రం ఒప్పుకోరు. "దంత" వంటి మాటలు ఈ దృక్పథాన్ని సమర్థిస్తాయి. ఆంగ్లంలోని "డెంటల్" అన్న పదానికి కూడ "దంతాలకు సంబంధించిన" అని అర్థం. "దంత్"కీ "డెంట్"కీ పోలిక ఉంది. ఫ్రెంచి, లాటిన్ భాషలలోని పదాల శబ్దం కూడ "దంత" వలెనే ఉంటుంది. అంటే "త" అన్న శబ్దం "ద" అన్న శబ్దం కంటె ప్రముఖం సంస్కృతంలో వలెనే.

"సరే, శబ్దాలలో పోలిక ఉండవచ్చు. అంత మాత్రాన సంస్కృతమే మాతృభాష ఎట్లా అవుతుంది" అనవచ్చు. పైన చెప్పినట్టు "దంత" అన్న సంస్కృత పదాన్ని సరిగ్గా ఉచ్ఛరించటానికి అన్ని పళ్లూ అవసరం. "డెంటల్" వంటి ఇతర భాషలలోని పదాలని ఉచ్ఛరించటానికి ప్రయత్నించు. అప్పుడు పళ్లతో పెద్ద పని లేదని తెలుస్తుంది. పదం యొక్క అర్థాన్ని శబ్దమే సూచించాలనుకొంటే ఇది సంస్కృతంలోని "దంత"లోనే సంభవిస్తుంది. అందువల్లనే అది మూలం, "డెంటల్" అన్నది తజ్జనితం.

కొన్ని చోట్ల వర్ణక్రమాన్ని మారిస్తే సన్నిహిత పదం వస్తుంది. "సింహం" యొక్క ముఖ్యలక్షణమేమిటి? - "హింస" పెట్టటం. 'హింస" బదులు 'సింహ' వచ్చింది. దేవతలు, దానవులు, మానవులు - అందరకీ కాశ్యపుడనే ఆది ఋషి, పితరుడు. ఆయన కాపేరు ఎట్లా వచ్చింది? ఆయన సత్యాన్ని దర్శించాడు. అంటే ఆయన భగవంతుని నిజరూపాన్ని దర్శించాడు. జ్ఞానాన్ని సంస్కృతంలో దృశ్యం అని అంటారు. దర్శించేవాడిని సంస్కృతంలో "పశ్యకా" అంటారు. కొద్ది మార్పులతో ఇదే 'కాశ్యప' అయింది.

**ఉచ్చారణా నియమాలు :**

శిక్షాశాస్త్రం శబ్దాలని పలకటానికి సంబంధించిన వివిధ నియమాలను ఇస్తుంది. ఇవి ఉచ్చారణ, స్వరం, మాత్ర, బలం, సామం, సంతానం (పదాలను సంధి చేయటం) వీటిని పాటించటం వల్ల శబ్దం శుద్ధంగా ఉంటుంది. అంతేకాదు, శరీరంలో ఏయే భాగాలనుండి శబ్దోచ్చారణ ఉదయించాలి, ఎటువంటి ప్రయత్నం చెయ్యాలి అని కూడ చెప్తుంది. ఇదంతా సశాస్త్రీయం, ఆచరణీయం కూడా. కొన్ని అక్షరాలను నెమ్మదిగా ఉచ్ఛరించాలంటే పెదవులను ఏ విధంగా కలపాలో ఈ శాస్త్రం చెప్తుంది. తదనుసారంగా చేస్తే శబ్దోచ్చారణ నిర్దుష్టంగా ఉంటుంది.

ఈ సందర్భంలో ఇంకొక విషయం కూడా జ్ఞాపకం వస్తుంది "ప" "మ" "వ" అన్న అక్షరాలను పలికేప్పుడే పెదవుల ప్రమేయం ఉంటుంది. 'క', 'జ్ఞ' 'చ' 'గ', 'ణ', 'థ', 'న' వంటి అక్షరాలను పలికేటప్పుడు పెదవుల ప్రమేయం లేనేలేదు. పెదవుల అవసరం లేకుండా పలుకగల అక్షరాలతోనే రామాయణాన్ని ఎవరో తయారు చేశారు. దాని పేరు "నిరోష్ఠ రామాయణం". ఓష్ఠ అంటే పెదవి. దీని నుండే "ఔష్ట్రకం", అంటే ఒంటె - అన్న మాట వచ్చింది. ఒంటెకి చాలా పెద్ద పెదవులుంటాయి. నిరోష్ఠమంటే పెదవులు లేకపోవటం. ఆ రచయిత తన ప్రజ్ఞని చూపించుకోవటానికే ఈ కావ్యాన్ని వ్రాసి యుంటాడు. ఇంకొక కారణం కూడా ఉండవచ్చు. శారీరక పారిశుద్ధ్యమంటే ఆయనకి ఎంతో పట్టింపు ఉండేదేమో! భగవంతుని నామాలను ఉచ్ఛరించేప్పుడు ఆ శబ్దాలను అశుచి చేయటమిష్టం లేకపోయిందేమో!

పాణిని మహర్షి (వైయ్యాకరణుడు) 'పాణనీయశిక్ష'లో వైదిక పదాలను ఎంత శ్రద్ధతో ఉచ్ఛరించాలో ఒక శ్లోకంలో ఇట్లా పేర్కొంటాడు.

*వ్యాఘ్రీ యథా హరేత్ పుత్రాన్*
*దంష్ట్రాభ్యాం చ న పీడయేత్*
*భీత పతనభేదాభ్యాం*
*తావద్ వర్ణాన్ ప్రయోజయేత్!*

వేదాక్షరాలను స్పష్టంగా పలకాలి. శబ్దాలకి మచ్చరాకూడదు. శబ్దం అణగిపోకూడదు. హీనమై పోకూడదు. పెరుగుతున్నట్టు ఉండకూడదు. శబ్దాలను అశ్రద్ధగా, పేలవంగా ఉచ్చరించకూడదు కటువుగానూ ఉచ్చరించకూడదు. పులి 'తన పిల్లలను ఎట్లా పట్టుకొంటుంది? పులులూ, పిల్లులూ తమ సంతానాన్ని పళ్లతో పట్టుకొంటాయి. పిల్ల జారిపోకుండా పళ్లు గట్టిగా పట్టుకొంటాయి అయినా పిల్లకి ఏ విధమైన బాధా, గాయమూ కాదు. ఆ విధంగానే మాటలను సున్నితంగా, ధృఢంగా పలకాలి అంటాడు పాణిని.

ఆ పాణినియే వ్యాకరణమనే వేదాంగానికి ఎంతో అమూల్యమైన సేవ చేశాడు. పాణినియే కాక ఇతర యోగులు "శిక్ష" గురించి వ్రాశారు. దాదాపు 30 గ్రంథాలున్నాయి ఈ విషయమై. వీటిలో పాణినిదీ, యాజ్ఞవల్క్యునిదీ అతి ముఖ్యమైనవి.

**భాషలకు లిపి :**

రేఖాచిత్రణ (అంటే గీతలు, చుక్కలూ, వృత్తాలు) ద్వారా అక్షరాల శబ్దాలకి రూపకల్పన జరుగుతుంది. ఏ భాషకైనా లిపి ఇట్లాగే ఉత్పన్నమవుతుది. ఇంగ్లీషు, తత్సంబంధమైన భాషలకు రోమన్ లిపిని ఉపయోగిస్తారు. 'బ్రాహ్మి' అనే లిపి ఒకటుండేది ఒకప్పుడు. అశోకుని శాసనాలు ఆ లిపిలో ఉంటాయి. ఆ లిపినుండే ఈ నాటి సంస్కృత భాషకీ (నాగరి, గ్రంథ) దక్షిణ భారత భాషలకీ లిపి వచ్చింది. బ్రాహ్మి లిపికి గల రెండు వర్గాలలొ "పల్లవ గ్రంథ" అన్న పేరుగలది దక్షిణాదిన వాడుకలో ఉండేది - ద్రవిడభాషల లిపులన్నీ దాని నుండే పుట్టాయి.

ఆధునిక భారతీయ లిపులన్నీ బ్రాహ్మిలిపి నుండే పుట్టాయి. కాని ఆదిమ బ్రాహ్మిలిపిని చూస్తే ఏమీ గుర్తుపట్టలేం. "తెలియని దాని"కి సంకేతంగా "బ్రాహ్మిలిపి" అనటానికి కారణమిదే.

"ఖరోష్ఠి" అన్న పేరు గల లిపి ఒకటుంది. "ఖర-ఓష్ఠం" అంటే గాడిద పెదవులు. గాడిద పెదవులు ముందుకు తోసుకువచ్చినట్టే ఈ భాష అక్షరాల వలయాలు ముందుకు తోసుకు వస్తాయి. ఇది పర్షియన్ భాషాలిపి.

యూరప్‌లో "రోమన్ లిపి" చాలా భాషలలో వాడుతారు. ఆ విధంగానే భారతదేశంలో బ్రాహ్మిలిపి కూడాను. ఉత్తర భారతంలో వాడబడే దేవనాగరి లిపి దీనికి నిదర్శనం.

ఏ భాషకి సంబంధించిన స్వరశాస్త్రాన్నైనా అధ్యయనం చేస్తే ఇంకా ఎన్నో విషయాలు అర్థమవుతాయి మనకు. "వ" అన్న శబ్దాన్ని సూచించటానికి ఇంగ్లీషులో రెండు అక్షరాలున్నాయి

- వి, డబుల్యూ (V, W). రెండెందుకున్నాయా అనిపిస్తుంది! ఒక ఇంగ్లీషు ప్రొఫెసర్ ఆ తేడాని వివరించాడొక సారి. "వి"ని వాడేప్పుడు క్రింది పెదివిని మడచిపై పళ్లని దానికి తాకించి ఉచ్చారణ చేయాలి. డబుల్యూని పలికేప్పుడు మాత్రం పళ్లని ఉపయోగించ కూడదు. పెదవులని మాత్రం కొంచెం మూసి, గుండ్రంవలె చేసి, ఉచ్చరించాలి. అందువల్లనే మన భాషలలోని "సరస్వతి", "ఈశ్వర" వంటి మాటలని వ్రాసేప్పుడు "వి" (V)ని వాడాలి, డబుల్యూ (W)ని కాదు. మిగిలిన భారతీయభాషలన్నిటి కంటె సంస్కృతంలోనే పదాల ఉచ్చారణ వ్రాసినట్టే ఉంటుంది - ఇంగ్లీషులో అంతా గందరగోళంగా ఉంటుంది. ఈ మధ్య పేపర్లలో "లెజిస్లేచర్ వౌండ్ అప్" అని చదివాను. 'వైండ్' అన్న పదానికి భూతకాల రూపమైన పదాన్ని "వూండ్" (అంటే గాయం)గా చదివాను పరాకుగా, అదే వర్ణక్రమం వేరొక అర్థాన్ని కలిగించింది. "వౌండ్ అప్" అంటే మూసి వేయుట. "వైండ్" అన్న పదాన్ని కూడా "విండ్" అని పలికితే 'గాలి' సూచింపబడుతుంది. 'వైండ్'గా పలికితే "చుట్టూ కట్టట"మని అర్థం వస్తుంది. ఇటువంటి తికమక చాలా ఉంది ఇంగ్లీషులో.

ఒక్క సంస్కృతంలోనే, ఉచ్చారణ వర్ణక్రమాన్ని అనుసరించి ఉంటుంది ఎప్పుడూ - దీనికి రెండే రెండు మినహాయింపులున్నాయి. ఆ మినహాయింపులివి : ఒక మార్పు విసర్గ "ప" ముందు వచ్చేప్పుడు కలిగేది. సాధారణంగా విసర్గ "హ" అన్న శబ్దం కలిగి ఉంటుంది. రామః అన్నప్పుడు ఇందులోని "హ" అన్న ధ్వని పూర్తిగా కాకుండా తేలికగా పలకాలి. ఆ విసర్గే "ప" ముందు వస్తే "ఫ"గా పలకాలి. ఇక్కడ మాత్రం అక్షరాన్ననుసరించే పలకటం తప్పు. బ్రహ్మ, వహ్ని ब्रह्म वन्हि వంటి మాటలను వ్రాసినట్టుగానే పలుకకూడదు. వాటిని బ్రమ్హ, వన్హి వలె పలకాలి. సంస్కృతంలోవి ఈ మినహాయింపులే - మిగిలిన వేళల్లో ఎప్పుడూ పలకటం వ్రాయుటాన్నే అనుసరిస్తుంది.

**అన్ని ధ్వనులూ కల భాష :**

పైన చెప్పిన దాని బట్టి "ఫ" అన్న శబ్దం సంస్కృతంలో ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఆ భాషలో లేని శబ్దం లేదు. "ళ" (zha) అన్న ధ్వని తమిళంలో తప్ప ఇంకెక్కడా లేదనుకుంటాం. మాతృభాష, వేదభాష అయిన సంస్కృతంలో ఈ శబ్దముంది. యజుర్వేదంలో పెక్కుచోట్లా, తలవకార సామవేదంలో వచ్చే "త" శబ్దాన్ని "ళ"గ పలుకాలి. ఋగ్వేదంలో కూడ ఈ ధ్వనిని ఉచ్చరించాల్సి వస్తుంది. ఋగ్వేదంలో మొదటి సూక్తంలో వచ్చే మొదటి మాట. "అగ్నిమీలె" అన్న పదాన్ని "అగ్నిమీళె" అని పలుకాలి. తమిళంలోని "ళ" వలె గాక - దానికి సన్నిహితంగా.

ఫ్రెంచి భాషలో కూడ "ళ" (zha)కి దగ్గరలో ఉన్న శబ్దముంది. కాని ఆ భాషలోనూ, సంస్కృతంలోనూ ఈ శబ్దాన్ని పలికే అక్షరం వేరే లేదు. ఫ్రెంచిలో 'జె' 'జి' అన్న అక్షరాలను ఉపయోగిస్తే "ళ" అన్న ధ్వని వస్తుంది. సంస్కృతంలో "ల" అన్న అక్షరమే "ళ" ధ్వనికి కూడ పనికి వస్తుంది. చైనీయుల భాషలో కూడ "ళ" ఉందంటారు.

"రామః"కి "పండిత" జోడిస్తే "రామః పండితః" అవుతుంది. సంస్కృతంలోని ఈ "ఫ' ' శబ్దాన్ని "ఉపధ్మానీయ" మంటారు. గొట్టంలోంచి నిప్పుని ఊదటమని అర్థం దీనికి. అప్పుడే "ఫ" అన్న శబ్దం వస్తుంది.

**భారతీయ - విదేశీయ భాషలూ, లిపులూ :**

భారతీయ భాషలలో ఒక సామ్యముంది. అక్షరాలను వ్రాసినట్టే ఉచ్చారణ కూడా ఉండాలి. ఇంగ్లీషులో "World" అన్న పదాన్ని తీసికొందాం. మొదటి అక్షరాన్ని "వి"గా గాని "వొ"గా గాన్ని పలుకరాదు - రెంటికీ మధ్యస్తంగా పలకాలి - ఇదేమిటో ఎక్కడా లేదు. "often" అన్న పదంలో "t" నీ, "walk" అన్న మాటలో "l" నీ పలుకరాదు. కాని దీనిని లిపిలో తెలుపటానికి వీలుకాదు. ఇతర భాషలలో కూడ అస్పష్టంగా ఉండే ఇటువంటి ధ్వనులే ఉన్నాయి. వీటిని "అవ్యక్తము"లంటారు. భారతీయ భాషలలో అన్ని ధ్వనులూ స్పష్టంగానే ఉంటాయి.

అక్షరానికీ తత్సంబంధమైన ధ్వనికీ పొంతనలేని నియమాలెన్నో ఉన్నాయి ఇతర భాషలలో. "c" అన్న అక్షరం, "క" ధ్వని సూచిక. అంతే కాదు c, k, q లకు సంబంధించిన ధ్వనులు కూడ అట్లాగే ఉండవచ్చు. భారతీయ భాషలలో ఇట్లా ఉండదు. "ఫ" అన్న శబ్దాన్ని సూచించటానికి ఇంగ్లీషులో మూడు విధానాలున్నాయి - fairy, philosophy, rough. 'c' అన్న అక్షరం సాధారణంగా "స" అని ధ్వనిస్తుంది. కాని ఆ అక్షరంతో మొదలయే చాలా పదాలలో "క" వలె ధ్వనిస్తుంది. cell, celluloid, cinema లలో "స" ధ్వని పల్కుతుంది. "fat" అన్నప్పుడొక విధంగానూ, "fast" అన్నప్పుడు వేరొక విధంగానూ పలుకుతుంది 'a' అన్న అక్షరం. కొన్ని వర్ణక్రమాలకు, వాటి ఉచ్చారణకు పొంతనే ఉండదు. ఇంగ్లీషులో "nation", "station" అని వ్రాసినప్పుడు "tion" అన్న అక్షరాలని "షన్" వలె పలకాలి. ఇంగ్లీషుకీ, రోమన్ లిపిని పాటించే ఇతర భాషలకీ 26 అక్షరాలే ఉండటం వల్ల వాటిని నేర్చుకోవటం తేలిక. ప్రాథమిక తరగతిలో ఒక ఏడాది పాటు శ్రమపడితే వాటిని నేర్చుకోవచ్చు కాని ఇంగ్లీషు విషయంలో M.A. డిగ్రీ వచ్చిన తర్వాత కూడ సరియైన ఉచ్చారణ తెలిసికోవటానికి డిక్షనరీ అవసరముంటూనే ఉంటుంది.

భారతీయ భాషలకి యున్న ఈ సౌలభ్యం సంస్కృతానికి మరీ అధికంగా ఉంటుంది. అంటే, విదేశీయ భాషలు సంస్కృతం కంటే తక్కువని నేనటం లేదు. ఆయా భాషల ప్రత్యేక లక్షణాలను మాత్రం వివరిస్తున్నాను. పరాత్పరుడు శబ్దబ్రహ్మాత్మకుడన్న భావం సంస్కృతంలో ప్రస్ఫుటమవుతుందని చెప్పటమే నా ఉద్దేశం. అన్ని భాషలూ అందరికీ ఉమ్మడి సొత్తేనని అందరూ భావించాలి. అప్పుడు ఒకరినొకరు కించపరచుకో వలసిన సందర్భం రాదు. ఏ భాషైనా భావవ్యక్తీకరణ సాధనమే నన్న ప్రాథమిక సూత్రాన్ని గుర్తుపెట్టుకొంటే మాతృభాష పట్ల ప్రత్యేకమైన అభిమానమూ, ఇతరుల భాషల పట్ల ద్వేషమూ మాయమవుతాయి.

విశాల హృదయమూ, అంతర్జాతీయ దృక్పథమూ ఉండాలంటూ ఒక వంక ఉద్బోధలూ, వేరొక వంక భాషా విషయంలో సంకుచితత్వాన్ని ప్రదర్శించే భావాలుండటం శోచనీయం.

**అక్షమాల - జపమాల :**

"రుద్రాక్షమాల" అంటే రుద్రాక్షలుకల జపమాల అని అర్థం - రుద్రుని కళ్లనుండి వచ్చినవి రుద్రాక్షలు అని జనశృతి. ఇక్కడ "అక్ష" అంటే 'కన్ను' అని అర్థం. 'అక్ష మాల' అంటే ఏమిటి? ఇక్కడ "అక్ష"ని కన్నుగా అన్వయించుకోవటం తప్పు. "అ" నుండి "క్ష" వరకూ గల అక్షరాలకి ప్రతీక. సంస్కృతంలో మొదటి అక్షరం "అ" చివరిది "క్ష". సంపూర్ణతని సూచించటానికి ఇంగ్లీషులో "A to Z" అంటారు, సంస్కృతంలో "అకారాది క్ష కారాంతః" అంటారు. అంటే "అ"తో ఆరంభించి "క్ష"తో అంతమవటం. అక్షరాలన్నీ కలిపి 50, అందువల్ల అక్షమాలలో 50 పూసలుంటాయి.

**శబ్దోచ్చారణ యొక్క ప్రాముఖ్యత :**

మంత్రపఠనంలో అప్రమత్తత అవసరమని ముందు చెప్పాను. శబ్దోచ్చారణలో పొరపాటు జరిగితే మంత్రం సరియైన ఫలమివ్వకపోగా హానిని గాని, వ్యతిరేక ఫలితాలని గాని ఇస్తుంది. తైత్తిరీయ సంహితలో ఈ విషయాన్ని తెల్పే కథ ఒకటుంది. (2.4.12)

త్వష్టుడుకి ఇంద్రునితో వైరం. ఇంద్రుని సంహరించగల కుమారుడు కావాలని కోరుకొంటాడు. అందుకని "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అన్న మంత్రాన్ని జపిస్తూ ఒక హోమాన్ని చేశాడు. ఈ మంత్రాన్ని సరిగ్గా పఠించే పద్ధతిలో పలికితే, "త్వష్టుని కుమారుడు పెరిగి ఇంద్రుని వధించుగాక" అనే అర్థం వస్తుంది. ఆ శబ్ద ప్రాబల్యం వల్లనే ఆ కుమారుడు పెరిగి ఇంద్రుని వధింపగలిగే వాడు. కాని శబ్దోచ్చారణలో త్వష్టుడు పొరపాటు చేశాడు. అందువల్ల అర్థం తారుమారైంది. అక్షరాలూ, పదాలూ మారకపోయినా స్వరోచ్చారణ దోషం వల్ల, త్వష్టుడు ఆశించిన దానికి సరిగ్గా వ్యతిరేకం జరిగింది. అతని కుమారుని ఇంద్రుడే చంపివేశాడు. అందువల్ల వృత్రుడన్న అతని కుమారుని వధకు త్వష్టుడే కారణమయినాడు.

వేదాలలోని ఈ ఉదంతాన్ని చెప్తూ, సరియైన పద్ధతిలో మంత్రాలని పలకాలంటుంది ఈ శ్లోకం :

*"మంత్రో హీనస్వరతో వర్ణతో వా*
*మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ*
*స వాగ్వజ్రో యజమానం హినస్తి*
*యతేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్"*

**కొన్ని స్వల్ప భేదాలు :**

ఇప్పటి వరకూ వేద శబ్దమెంత శుద్ధంగా ఉండాలో వివరించాను. దీనికి నిదర్శనమిదే; రామేశ్వరం నుండిహిమాలయాల వరకూ భారతదేశంలో ఏ విధమైన సామాజిక సంపర్కమూ

లేని ప్రదేశాలలో కూడా వేదాలకి గల పాఠాలని నూటికి తొంభైతొమ్మిది పాళ్లు ఒకే విధంగా అక్షరంగాని పదంగాని వ్యత్యాసం లేకుండా ఉంటాయి. ఇక్కడ వేదాలు ఒక తరం నుంచి మరొక తరానికి లిఖిత పూర్వకంగా కాక, వాక్కు వల్లనే సంక్రమించిన విషయంకూడ గుర్తుంచుకోవాలి. అంటే, స్వల్ప వ్యత్యాస ముందని దీని అర్థమా? అవును, ఉన్నది. ఒక ప్రాంతంలో ఉన్న ప్రతిశాఖకీ మరొక ప్రాంతంలో కల పాఠంలో కొద్ది వ్యత్యాసముంటుంది. ఇది ఆమోదనీయమేనా? ఏ మార్పు ఉన్నా అది విపరీతాలకు దారితీస్తుందని చెప్పిన తర్వాత ఈ 1% వ్యత్యాసం మాత్రమెట్లా సహించటం? శుద్ధమైన రూపము ఒకటే ఉంటే 1% మార్పుకూడా అనుకొన్న ఫలితాన్నివ్వకపోవచ్చు, వేరొక ఫలితాన్నివ్వవచ్చు. ఈ ప్రశ్నకి సమాధానముంది.

మంత్రాలలోని పదాలను మారిస్తే ఫలితం విపరీతమవుతుంది. నిజమే - జబ్బుని కుదర్చటానికి మందుని మార్పుచేస్తే వైద్యం మారినట్టే ఇది కూడ. కాని ఇది రోగికే వర్తిస్తుంది, తనంతట తానే అతడు ఔషధాన్ని మార్చుకోకూడదు, వైద్యుడు మార్చవచ్చు. ఒక వ్యాధిని కుదర్చటానికి ఎన్నో మందులుంటాయి. అటువంటి సమయాల్లో వైద్యుడు ఒక మందుకి బదులు మరొక దానిని సూచించటంలో తప్పేమీ లేదు. ఒకే జబ్బైనా రోగి దేహస్థితిని బట్టి ఔషధంలోని పదార్థాల మిశ్రమాన్ని కూడ వైద్యుడు మార్చవచ్చు.

ఆ విధంగానే ఉద్దేశపూర్వకంగానే ఋషులు వివిధశాఖలలోని పదాలను మార్చారు. తమ తరువాత వచ్చేవారు వల్లించటానికి వీలుగా ఈ మార్పు చేయబడింది. "ప్రాతిశాఖ్య" పాఠాలలో ఈ మార్పులకు సంబంధించిన నియమాలు వివరింపబడ్డాయి. "ప్రాతిశాఖ్య" అన్న మాటకి అసలైన అర్థం "ప్రాంతీయం" అని. మాటలలోని తేడాలు స్వల్పము - ఆ తేడాలు గణనీయము కావు. సన్నిహిత పదాలు, ఇంచుమించు ఒకే విధంగా ఉచ్చరింపబడే పదాలనే వాడారు.

**వైదిక శబ్దాలూ - ప్రాంతీయభాషలూ :**

వేద పదాలలో ప్రాంతీయ భేదాలను దృష్టిలో పెట్టుకొని వివిధ భారతీయ భాషలలో గల తేడాలను గమనిస్తే సాంస్కృతిక భేదాలకు మూలకారణం వైదిక శబ్దాలన్న ఆశ్చర్యకరమైన విషయం బయట పడుతుంది. భాషా శాస్త్ర సంబంధమైన నా పరిశోధనలివి. "ద" "ర" "ల" "ళ" - ఇవన్నీ ఒక దానికొకటి దగ్గరి శబ్దాలు. చిన్న పిల్లవాడిని "రైలు" "రామ" అనమంటే "దైలు" "దామ" అంటాడు. "ద" "ర"లకు శబ్దపరంగా సాన్నిహిత్య ముండటమే దీనికి కారణం. "ద" "ర"గా మారగలదు. కనుక 'ల', 'ద'గా మారగలదు కదా! "ల", "ళ"లు దగ్గర శబ్దాలు. 'ల'కి, తమిళ శబ్దం "ళ" (zha)కి గల సాన్నిహిత్యాన్ని వేరే చెప్పనక్కర్లేదు.

ఒక్కొక్క వేదం బాగా ప్రాచుర్యంలో ఉన్న ప్రాంతాలనూ, ఆయా భాషల లక్షణాలనూ గమనిద్దాం.

ఈ రోజులలో వేదాలు ఆర్యులవనీ, ద్రవిడసంస్కృతి దానికి భిన్నమనీ ఒక ప్రచారం జరుగుతోంది. కాబట్టి సమిష్టిగా ద్రవిడ ప్రాంతమని చెప్పబడే మూడు ప్రాంతాలను తీసికొందాం. అంటే తమిళం, తెలుగు, కన్నడ భాషలను తీసికొందాం. సంస్కృతంలో "ప్రవాల"మనే శబ్దముంది. ఇదే - తమిళంలో "పవళం", తెలుగులో "పగడం" కన్నడంలో "హవళ". "ప్రవాల", తమిళంలో 'పవళం' అయింది తెలుగులో 'పగడ'మయింది. 'వ', 'గ' గా మారింది. 'ప్రవాల' కన్నడంలో "హవళ"గా మారినప్పుడు మొదటి అక్షరమే మారుతుంది. "ప్ర" అన్న అక్షరం తెలుగులో, తమిళంలో "ప"గా మారటం పెద్ద మార్పుకాదు. కాని కన్నడంలో అది "హ" అవుతుంది. ఇది ఆ భాష ప్రత్యేక లక్షణం. ఇతర భాషలలోని "ప" కన్నడంలో - 'హ' గా మారుతుంది. "పంప" "హంప"గా ఇంకా "హంపి"గా మారుతుంది. ఆర్య, ద్రావిడ అంటూ రెండు జాతులుగా కాకపోయినా భాషలను సంస్కృతంలో సంబంధమున్న భాషలనీ, కేవలం ద్రావిడ భాషలనీ వర్గీకరిస్తారు. ఇప్పటి పరిశోధనలనను సరించే ఈ వర్గీకరణం. ఇంకా కొంత పరిశోధన జరిగితే ఈ వర్గీకరణ మనవసరమే మో ననీ, అన్ని భాషలకూ మాతృక ఒకటేనేమో ననీ కూడ నిరూపించవచ్చు. పశ్చిమ భారతంలో, కర్నాటకతో సహా, ప్రాచుర్యంలో ఉండేది ఋగ్వేదం. ఋగ్వేదంలో "ళ" శబ్దం ఎక్కువ వాడుకలో ఉంది. ద్రావిడభాష అని అందరూ అనుకునే కన్నడలోకి "ళ" అట్లా వచ్చింది.

తూర్పు తీరాన్నీ, దానిని ఆనికొని ఉన్న ఆంధ్ర ప్రాంతాన్నీ తీసికొంటే 98% యజుర్వేదాన్ని పాటిస్తారు. మిగిలిన 2% వారు ఋగ్వేదాన్ని. ఆంధ్రలో "సామవేదం" వారు లేరనే చెప్పవచ్చు. యజుర్వేదమే ఇక్కడ ప్రమాణమవటం వల్ల ఋగ్వేదంలోని "ళ" సహజంగానే "ద"గా మారంది. తెలుగులో కూడ ఇతర భాషలలోని "ళ" 'ద'గా మారంది.

ఆంధ్రలో వలె కాకపోయినా తమిళనాడులో కూడ తర్వాతి కాలంలో యజుశ్శాఖాధ్యయులు అధిక సంఖ్యాకులయినారు. తమిళనాడులో 80% యజుశ్శాఖేయులు, 15% సామవేదం వారు మిగిలిన 5% ఋగ్వేదులుగా అనుకోవచ్చు. ఇది ఇప్పటి పరిస్థితే అయినా పూర్వం సామవేదమనుసరించే వారే అత్యధికులు తమిళనాడులో సామవేదంలోని 1000 శాఖలను అనుసరించే వారు తమిళనాడులో ఉండే వారనటం తప్పుకాదు.

ప్రస్తుతపు కేరళలో వాడుకలో నున్న భాష మళయాళం. తెలుగు, కన్నడములతో బాటు ఈ భాషని నేను పేర్కొనక బోవటానికి కారణం, పల్లవుల వలె ఇది కూడ ఈ సమీప కాలానికే చెందటం. వెయ్యిసంవత్సరాల క్రితం వరకూ కూడ కేరళ తమిళనాడులోనే ఉండేది - అక్కడ తమిళాన్నే వాడేవారు. ఆ తరువాత మళయాళం తమిళం నుండి జనించింది. తమిళంలోని 'ళ' (zha) తెలుగులో 'ద' గాను, కన్నడంలో 'ళ' గాను మారినా, మళయాళంలో మాత్రం ఆ రూపంతోనే ఉంది. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే ఆయా ప్రాంతాలలో వేదాల ఉచ్చారణలననుసరించి, ప్రాంతీయ భాషలు తమకి ప్రత్యేక లక్షణాలైన అక్షరాలను ఏర్పర్చుకున్నాయి.

ఇప్పటి వరకూ నేను చెప్పినదంతా ద్రావిడులనబడే వారి భూమికి సంబంధించినది. ఇక అఖిలభారత, అంతర్జాతీయ పరిస్థితి దృష్ట్యా పరిశీలించుదాము.

ఉత్తర భారతంలో "య" బదులు "జ"ని, 'వ' కి బదులు "బ"ని వాడటం పరిపాటి. వాడుక భాషలోనే కాక కావ్య భాషలో కూడ ఇట్లాగే జరుగుతుంది. 'వ', 'బ' గా మారటం బెంగాలులో బాగా కనబడుతుంది. "య" 'జ'గా మారటం ఉత్తర ప్రదేశ్, పంజాబ్ ఇంకా ఉత్తర ప్రాంతాలలో కనబడుతుంది. పాణిని సూత్రమైన "వ బయోరభేదం" ('వ', 'బ'లను ఒక దాని స్థానంలో మరొకటి వాడవచ్చు) బాగా ఆచరణలో ఉన్నట్టు బెంగాలులో తెలుస్తుంది. బెంగాలులో 'వ' ప్రతిచోటా 'బ'గా మారుతుంది. అసలు 'వంగ' అన్నదే 'బెంగాలు'గా మారంది. "వంగవాసి", "బంగవాసి"గా మారింది. ఈ తప్పుని వారే గుర్తించారు. ఈ తప్పుని దిద్దటానికి బెంగాలులో ఒక పరీక్షని కూడ పెట్టారు. దాని పేరు "వంగ పరిషత్" అన్ని ప్రచురణలలోనూ "బ" కి బదులు "వ"ని వాడాలని వారి సంకల్పం. ఆ సంకల్పంలో అప్రయత్నంగా, అనవసరమైన చోట్ల కూడా "బ"'ని "వ"గా మార్చారు. 'బంధు' (అంటే చుట్టం)ని 'వంధు'గా మార్చారు. 'వంగబంధు' సరియైన మాట. అది "బంగబంధు"గా మారితే దానిని తప్పుగా ఇప్పుడు 'వంగు వంధు"గా మార్చారు.

ఉత్తరభారతంలోనూ, మరికొన్ని ప్రాంతాలలోనూ "వ"కి బదులు 'బ'ని వాడుతారు. బిహార్, నిజానికి విహార్. ఈ ప్రాంతంలో బౌద్ధ విహారాలు పుష్కలంగా ఉండేవి. "రాష్ బిహారి" నిజానికి "రసవిహారి" "వ"ని "బ"గా పలుకటానికి కారణమేమిటి? ఒక శాఖకి చెందిన ఆ ప్రాంతీయులట్లా పలకాలని ప్రాతిశాఖ్య నిర్దేశిస్తుంది. ఈ నియమం వేద మంత్ర పఠనానికి సంబంధించినది - కాని అదే వాడుక భాషకీ, సాహిత్యభాషకీ విస్తరింపబడింది. అంటే, ఆ ప్రాంతంలో ఒకప్పుడు 'శిక్ష' నియమాలను ఎంతో నిష్ఠతో పాటించే వారనమాట.

దేశం మొత్తమ్మీద యజుశ్శాఖవారు అత్యధికులని అన్నాను. ఈ వేదానికి రెండు పాఠాలు - అంటే కృష్ణ యజుర్వేదం, శుక్లయజుర్వేదం ఉన్నాయని కూడ అన్నాను. దక్షిణ భారతంలో కృష్ణయజుర్వేదం బహుళ ప్రచారంలో ఉంటే, ఉత్తర భారతంలో శుక్ల యజుర్వేద ముంది.

శుక్లయజుర్వేదానికి గల అనేక శాఖలలో ఒకటి మాధ్యన్దిన శాఖ. దీనిని ఉత్తర భారతంలో నిష్ఠగా అనుసరిస్తారు. తత్సంబంధమైన ప్రాతిశాఖ్య ప్రకారం "య" స్థానంలో "జ"ని వాడవచ్చు. అట్లాగే "ష" స్థానంలో "క"ని వాడవచ్చు. అందువల్లే దాక్షిణాత్యులు "యత్ పురుషేణ హవిషా" అంటే ఉత్తర దేశీయులు "జత్" పురుషేణ హవికా" అంటారు. కాలక్రమేణా ఉత్తరదేశంలో ఈ మార్పు చాలా మాటలకి వ్యాపించింది. "యమున", 'జమున"గాను, 'యోగి', 'జోగి'గాను 'యుగ', 'జుగ'గాను, 'యాత్ర', 'జాత్ర'గాను మారాయి. 'ష' 'క'గా మారినప్పుడు 'ఋషి' 'ఋకి'గా మారింది. 'క్ష', 'ష' సన్నిహిత బంధువులు కదా. అందువల్లనే ఉత్తర దేశంలో 'క్ష', 'క' అవుతుంది. 'క్షీరం' 'కీర్' అవుతుంది. ఇట్లాంటివే ఎన్నో ఉదాహరణలివ్వ వచ్చు.

ఇక అంతర్జాతీయ స్థాయికి వెళ్దాం. క్రైస్తవం, బైబిలు జన్మించిన పాలస్తీనాకూ, ఇజ్రెయిల్, సెమిటిక్ దేశాలకూ వెళ్దాం. క్రైస్తవుల ఓల్డ్ టెస్ట్‌మెంట్ - ముస్లింల కొరాన్‌కి మూలం. మొదటి దాంట్లో ఉన్నవి రెండవ దాంట్లో ప్రత్యక్షమవుతూంటాయి. కాని అరేబియాలో ఉచ్చారణ మారుతూంటుంది. 'జోసెఫ్' 'యూసఫ్'గాను, 'జెహోవ' 'యహోవ'గాను మారుతాయి. క్రైస్తవం, ఇస్లాంలకు మాత్రమే పరిమితం కాదు. క్రైస్తవదేశాలలో కూడ కొన్ని భాషలలోనే 'య' శబ్దం ప్రముఖంగా ఉంటుంది. కొన్నిటిలో 'జ' శబ్దం ఎక్కువౌతుంది. గ్రీస్ వెళ్లితే 'జ' శబ్దం స్పష్టమవుతుంది.

దీనంతటికీ మూలం వేదాలలో కనిపిస్తుంది. వేదాలలోని "యహ్వాన్" అన్న దేవతే జహోవ (యహోవ), దేపిత - జూపిటర్, సంస్కృతంలో అసంపూర్ణమైన హల్లులు మొదట్లో వస్తే మరొక భాషలో చెప్పేప్పుడు దానిని వదిలివేస్తారు "దౌపతిర్", "యౌపితర్"గాను జూపిటర్‌గాను మారుతుంది.

"యహ్వాన్", "ద్యౌపితర్" లలోని 'య' 'జ'గా మారటం వల్ల 'జెహోవ' జూపిటర్ ఏర్పడ్డాయి - దీని అర్థమేమిటి? ప్రపంచమంతా వేదవిహితమైన విధులు వ్యాప్తమై యున్న రోజులలో, గ్రీస్ ప్రాంతంలో "మాధ్యన్దిన శాఖ" (యజుర్వేదం) బాగా ప్రాచుర్యంలో ఉండేదని తెలియటం లేదా?

వేదపద ఉచ్చారణ ప్రాంతీయ భాషను ప్రభావితం చేసిందా లేక ప్రాంతీయ భాష వేదపద ఉచ్చారణనా?

ఒక్కొక్క ప్రాంతంలో వేదాలలోని పదాలే ఆ ప్రాంతపు వాడుక భాషలో, కావ్యభాషలో వాడబడేవి. దీని బట్టి వేదాలన్ని దేశాలలోనూ వ్యాప్తి చెందాయని తెలుస్తుంది.

వేదాల శిక్షానియమాలు ప్రాంతీయభాషలకు ప్రధాన ఉఛ్ఛారణలయాయి. దీనికి కారణం ప్రాతిశాఖ్య నియమాలు ఏ ఒక్క ప్రాంతానికీ చెందినవి కాకపోవటం. వేదశాఖ ప్రచారంలో ఉన్న ప్రాంతాలన్నిటి కొరకూ ఏర్పడింది. కాశ్మీరులోనైనా కామరూపం (అస్సాం)లోనైనా జైమిని సామని పఠించేవారు "ష" అని పలికితే ఇతరులు "ద" అనో "ళ" అనో పలుకుతారు.

గుజరాతీయైనా, మారాఠీ అయినా, మరేదైనా మాతృభాష కావచ్చు శుక్లయజుర్వేదాన్ని పఠించేవాడు "ద"నే పలుకుతాడు. ప్రాతిశాఖ్య ఏ ప్రాంతానికీ పరిమితం కాదు, ఉచ్చారణ నియమాలను నిర్దేశిస్తుంది. కాలక్రమేణా ఏ శాఖ ఏ ప్రాంతంలో వాడుకలో ఉంటే, ఆ అక్షరానికి గల ప్రత్యేక లక్షణం ప్రాంతీయ భాషకి కూడ ప్రాకింది.

**శిక్షా శాస్త్రం గురించి గమనింపదగ్గ మరికొన్ని అంశాలు :**

వేద శబ్దాలను, ఉచ్చారణ పద్ధతులను మార్చరాదన్నాను. శాఖా భేదాల వల్ల చిన్న చిన్న మార్పులను శిక్షాశాస్త్రం అనుమతిస్తుంది. ఆ విధంగానే స్వరస్థాయికి సంబంధించిన మార్పులూ ఆమోదయోగ్యాలే.

వేదాలను వల్లించటంలో సంహిత, పద, క్రమ పద్ధతులున్నాయని చెప్పాను. ఆయా భిన్న రీతులని ప్రాతిశాఖ్య అనుమతిస్తుంది. ఇవి శిక్షాశాస్త్ర భాగాలు.

ఇదేదో శబ్దాలకి సంబంధించిన చర్చ అని తేలికగా చూడకూడదు. సంస్థితమైనది శబ్దమే. అందువల్లనే వేదపురుషుడు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు జరిపే నాసిక, శిక్షాశాస్త్రం.

సంస్కృతంలోని 50 అక్షరాలు (శబ్దాలు) వేదాలనుండి వచ్చినవే. 'జ్ఞ" అన్న అక్షరాన్ని విడిగా తీసుకుంటే 51 అవుతాయి. వీటిని "మాతృక" అంటారు. ఈ మాటకి చాలా అర్థాలున్నాయి. మాతృ అంటేమాత - దీని అర్థం విశ్వమాత. ఆ పరాశక్తి ప్రతిబింబాలే ఈ 51 అక్షరాలూను. జగత్సృష్టి పరాశక్తి వల్లనే జరిగితే, సృష్టికి శబ్దమే మాధ్యమమైతే 51 అక్షరాలూ పరాశక్తి స్వరూపాలే అవుతాయి కదా! శిక్షాశాస్త్రం ప్రకారం ఈ 51 శబ్దాలూ పరాశక్తి శరీరభాగలే - అంతేకాదు, ఏ అక్షరం ఏ శరీరభాగానికి ప్రతీకో కూడ ఆ శాస్త్రం చెప్తుంది. మన దేశంలో కల శాక్తేయుల 51 స్థావరాలకూ, ఆ విశ్వ దేహపు 51 భాగాలకు సంబంధముంది.

శిక్షాశాస్త్రం వేదపురుషుని నాసికగా భావింపబడటమే కాక అక్షరాలన్నీ కలిసి పరాశక్తి - విశ్వమాత - రూపంగా భావింపబడటం ఆ శాస్త్ర ప్రాధాన్యతని మరీ ఎక్కువ చేస్తుంది !



# 16

# వేదాంగములు : వ్యాకరణము

వేదపురుషుని ముఖస్థానము (నోరు) వ్యాకరణము. వ్యాకరణ సంబంధమైన రచనలెన్నో ఉన్నాయి. ఎక్కువ ప్రాచుర్యంలో ఉన్నది - పాణిని రచన. అది సూత్రాలతో నిండి యుంటుంది. ఆ సూత్రాలకు విపులమైన వ్యాఖ్య (వార్తికం) రచించినది వరరుచి. పతంజలి మహర్షికూడ ఒక వ్యాఖ్యానం రచించాడు. ఈ మూడు గ్రంథాలూ వ్యాకరణ శాస్త్రంలో ముఖ్యములు.

ఇతర శాస్త్రాలకీ వ్యాకరణానికీ భేదముంది. ఇతర శాస్త్రాలలో సూత్రాలు భాష్యాల కంటె ప్రధానాలు. వ్యాకరణం విషయంలో అట్లా కాదు. సూత్రాల కంటె భాష్యమే ప్రధానం.

సూత్రాలు వివరణ ఇవ్వక సూచికల వలె ఉంటాయి. ప్రతి శాస్త్రానికీ భాష్యముంటుంది, ప్రతిభాష్యానికీ, విషయం బట్టి ఒక పేరుంటుంది. వ్యాకరణభాష్య మొక్కదానినే మహాభాష్య మంటారు, దాని ప్రాధాన్యతను బట్టి. ఈ మహాభాష్యాన్ని రచించినది పతంజలి మహర్షి.

**వ్యాకరణమూ, శివుడూ :**

శివాలయాలలో "వ్యాకరణ దాన మండప" మంటూ ఒక మండపముండేది. ఇది ఉండటానికి కారణమేమిటి? వైష్ణవాలయాలలో ఉండక పోవటానికి కారణమేమిటి? భాషకీ శివునికీ, ఆ మాటకొస్తే వ్యాకరణానికీ శివునికీ, సంబంధమేమిటి? నిజానికి, దక్షిణామూర్తి రూపంలో శివుడు మౌని. దీని గురించి వివరిస్తాను. ఈ శ్లోకం చూడండి:

> "నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారం
> ఉద్ధర్తు కామః సనకాది సిద్ధాన్ ఏతత్ విమర్శే శివసూత్ర జాలం"

"అచలుడై శివుడు మౌనంగా ఉంటాడు. నృత్యానంతరం శివుడు తన ఢమరుకాన్ని మ్రోగించినప్పుడు భాషాశాస్త్రం పుట్టింది" ఈ శ్లోక తాత్పర్యమిది.

నర్తనమాడే శివుని పేరు నటరాజు. ఆయనను మించిన నర్తకుడు లేడు. తాండవాధినేత ఆయన. మహానటుడాయన. నటరాజు ప్రతిమని చూస్తే ఆ తలనుండి ఏదో బయటకు వస్తున్నట్లు కనబడుతుంది - అది గంగతో, నెలవంకతో - అలంకృతం, అవే శివుని జడలు. శివుడు నాట్యమాడుతూన్నంతసేపూ ఆ జడలు కూడ తిరుగుతూంటాయి. నర్తనమాగిపోగానే ఆ జడలు రెండువైపులా పరచుకుంటాయి. ఆ క్షణాన్నే శిల్పి ఊహించి రాతి ప్రతిమగా, లోహపు ప్రతిమగా చెక్కుతాడు.

నటరాజు చేతిలో డమరుకముంటుంది. మామూలుగా జోస్యం చెప్పుండేవాళ్ల చేతులలో ఉండేదాని కన్నా పెద్దదిగా ఉంటుంది. నర్తనం చేసేప్పుడు శివుడు ఆ డమరుకాన్ని కూడ లయబద్ధంగా ఆడిస్తాడు. పై శ్లోకంలో "ననాదఢక్కాం" అన్న మాటకిదే అర్థం.

వాద్యాలనన్నిటినీ మూడు విధాలుగా విభజించ వచ్చు. అవి (1) చర్మవాద్యాలు - అంటే చర్మాన్ని ఉపయోగించేవి - ఢక్క, మృదంగం, మద్దెల, చెండ (కేరళలో) వంటివి (2)- తంత్రీవాద్యాలు - వీణ, వయోలిన్ వంటివి - తంత్రులనుపయోగించేవి (3) వాయురంధ్ర వాద్యాలు - వీటిలో గాలిని కొన్ని రంధ్రాల ద్వారా బయటకు ఊదుతారు - వేణువు వంటివి.

చర్మవాద్యాలను పలికించటానికి చేతివేళ్లనిగాని, కఱ్ఱలనిగాని ఉపయోగిస్తారు. వాద్యం అంతం కావస్తున్నప్పుడు వేగంగా వాయిస్తారు. "చోపు" అంటారు దీనిని. ఆ విధంగానే నృత్యం చివరికి వస్తున్నపుడు ("నృత్తావసానే") చోపు ధ్వని వినబడింది.

నటరాజు నృత్యమాడుతున్నప్పుడు సనక, పతంజలి వ్యాఘ్రపాదుడు వంటి ఋషులు తన్మయతతో తిలకిస్తూంటారు. వారు మహర్షులవటం వల్ల సామాన్యులు చూడలేని, ఆ నర్తనని చూడగలుగుతారు. నటరాజుని నర్తనం చూడటానికి దివ్యచక్షువులు కావాలి కదా! దేవతలు, ఋషులు,యోగులు తమ తపశ్శక్తి వల్ల నటరాజు నర్తనాన్ని చూచే శక్తిని సంపాదించారు. దేవుడ్ని చూడటానికి కావలసిన సామర్థ్యాన్ని "దివ్యదృష్టి" అంటారు. దీనినే భగవద్గీతలో "దివ్య చక్షు" వన్నారు.

సనకాది ఋషులు నటరాజు నర్తనాన్ని తమ కళ్లతోనే చూస్తూ ఆనందిస్తున్నారు. పెద్ద డోలుని విష్ణువు వాయిస్తూంటే, బ్రహ్మ తాళం వేస్తున్నాడు. నర్తనం పూర్తి కావస్తున్న సమయానికి ఢక్క నుండి, పధ్నాలుగు దరువులున్న "చోపు" వస్తుంది. పై శ్లోకంలోని "నవపంచవారం" అన్న పదం ఈ పధ్నాలుగు (తొమ్మిదికి అయిదు కలిపితే వచ్చేవి) దరువులనీ సూచిస్తుంది.

డమరుకపు దరువుల విద్యలుకూడ పధ్నాలుగే. హిందూ ధర్మానికి ప్రాతిపదిక పధ్నాలుగు విద్యలైతే, నటరాజుకూడ డమరుకంతో పధ్నాలుగు దరువులనే ఇచ్చాడు. ఆ పధ్నాలుగు దరువులూ సనకాది ఋషులకు ఆధ్యాత్మిక ప్రగతిని ఇంకా కల్పించాయి అంటుంది ఈ శ్లోకం. ఈ సనకాదులెవరు? ఆలయాలలో దక్షిణామూర్తి చుట్టూ నలుగురు వృద్ధులు కూర్చున్నట్టుగా ప్రతిమలుంటాయి. ఆ నలుగురూ సనక, సనందన, సనాతన, సనత్ కుమారులనే మహర్షులు. ఆ పధ్నాలుగు దరువులూ ఈ ఋషులకు శివరూప మెరగటానికి సోపానాలయాయి. ఆ శబ్దాలనే "శివభక్తి సూత్రాలంటారు". వీటిపై నందికేశ్వరుడొక భాష్యాన్ని వ్రాశాడు. ఆ శివతాండవాన్ని తిలకించిన వారిలో పాణిని ఒకడు. పాణిని గురించి కథా సరిత్సాగరంలో ఉంది. పాటలీపుత్రంలో (ఈనాటి పాట్నానగరం) వర్షోపాధ్యాయ, ఉపవర్షోపాధ్యాయ అని ఇద్దరుండే వారు. వారిలో రెండవవాడు చిన్నవాడు. అతని కుమార్తె ఉపకోశ్ల. పాణినీ, వరరుచీ వర్షోపాధ్యాయుని శిష్యులుగా విద్యనభ్యసిస్తూండే

వారు. వీరిద్దరిలో పాణిని కొంచెం మందబుద్ధి. విద్య బాగా సాగలేదు. అందుచేత తపస్సు చేసుకోమని చెప్పి అతనిని హిమాలయాలకు పంపాడు గురువు. శిష్యుడు తపస్సు చేసి శివుని అనుగ్రహం సంపాదించాడు. నటరాజుని నర్తనాన్ని తన కళ్లతోనే చూడగలిగే భాగ్యాన్ని పొందాడు.

నర్తనం చివరిలో డమరుకపు పధ్నాలుగు దరువుల సహాయంతో పరమ శివుడు వ్యాకరణ సూత్రాలకు బీజం నాటాడు. ఆ పధ్నాలుగు సూత్రాలను పాణిని కంఠస్థం చేసికొని "అష్టాధ్యాయి" అనే ప్రాథమిక గ్రంథాన్ని రచించాడు. దీనిలో ఎనిమిది అధ్యాయాలుండటం వల్ల దీనిని "అష్టాధ్యాయి" అంటారు.

ఆ పధ్నాలుగు సూత్రాలనీ "మహేశ్వర సూత్రా"లంటారు. ఈ పధ్నాలుగు సూత్రాలను శ్రావణ పౌర్ణమి నాడు ఉపాకర్మ చేసేప్పుడు పఠిస్తారు. (ఈ ఉపాకర్మని తమిళంలో ఆవని అవట్టం అంటారు) నటరాజ డమరుక దరువుల నుండి ఉద్భవించిన మహేశ్వరసూత్రాలు వ్యాకరణానికి మూలం. శివునికీ, వ్యాకరణానికీ సంబంధమిదే. అందుచేతనే శివాలయాలలో వ్యాకరణమంటపాలుంటాయి.

**వ్యాకరణ గ్రంథాలు :**

శివునికి చంద్రవస్తముడనీ, చంద్రశేఖరుడనీ, ఇందుశేఖరుడనీ పేర్లుండటానికి కారణం ఆయన శిరస్సున చంద్రుడ్ని ఆభరణంగా పెట్టుకోవటమే. రెండు వ్యాకరణ గ్రంథాలకి 'ఇందుశేఖర' సంబంధమైన పేర్లున్నాయి. అవి - శబ్దేందు శేఖరం, పరిభాషేందు శేఖరం. వ్యాకరణ శాస్త్రాన్ని పఠించిన వారు ఈ రెండు గ్రంథాల వరకూ నిష్ణాతులైతే వారిని "శేఖరరత్నాల వరకూ చదవార"ని సగౌరవంగా అంటారు.

శిక్షా శాస్త్రానికి దాదాపు ముప్పై గ్రంథాలున్నట్లే వ్యాకరణ శాస్త్రానికి కూడ ఎన్నో గ్రంథాలున్నాయి. వీటిలో సుప్రసిద్ధము లైనవి - పాణిని సూత్రాలు, పతంజలి భాష్యం, వరరుచి వార్తికం.

విక్రమాదిత్య చక్రవర్తి ఆస్థానంలోని "నవరత్నాల"లో వరరుచి ఒకడు. ఆయన వ్యాకరణం పై గ్రంథాలు రచించాడు. ఆయనే వార్తికాన్ని రచించాడో లేదో నన్న విషయంపై భిన్నాభిప్రాయాలున్నాయి.

భర్తృహరి రచించిన "వాక్యపదేయం" కూడ వ్యాకరణంపై ఒక ముఖ్యమైన రచనే. వ్యాకరణంపై ముఖ్యమైన గ్రంథాలని "నవవ్యాకరణ"మంటారు. ఈ తొమ్మిదింటినీ శ్రీరామభక్తుడైన ఆంజనేయ స్వామి క్షుణ్ణంగా పఠించాడు - ఆయన ప్రత్యక్షగురువు సూర్యభగవానుడే. ఈ రచనలలో ఒకటి "ఇంద్రం". దీనిని ఇంద్రుడే వ్రాశాడంటారు. ఇదే తమిళ వ్యాకరణ గ్రంథమైన "తొల్కాప్పియా"నికి మూలమంటారు.

**భాషాశాస్త్ర పరిశోధనా, మతము :**

శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం - ఈ నాలుగు వేదాంగాలు భాషకి సంబంధించినవి. మతగ్రంథములు. చెప్పవలసిన విషయాలు కేవలం ధర్మం, భగవంతుడు, ఆరాధనా విధానాలు, విజ్ఞానదాయకాలైన ప్రవచనాలు, నైతిక విలువలు - ఇటువంటివి. కాని భాష, వ్యాకరణం, స్వరశాస్త్రం వంటి విషయాల గురించి కాదనే వారుండవచ్చు.

"వేదం" అన్న శీర్షిక క్రింద కేవలం ధర్మానికి సంబంధించిన విషయాలే చెప్పబడ్డాయి. ముందు ముందు కల్పం, మీమాంస, న్యాయం, పురాణం, ధర్మశాస్త్రం గురించి చెప్తాను. ఇవన్నీ మత సంబంధమైన విషయాలే కాని ఈ రెంటి నడుమా మతంతో సంబంధంలేని భాషాశాస్త్రం, స్వరశాస్త్రం వ్యాకరణమూ ఏమిటి? దీనికి కారణమిది - వేదాల ప్రకారం ప్రతిదానికీ పరమాత్మతో సంబంధముంది. అందువల్ల కేవలం ధార్మికమైన విషయాలకీ ఇతర విషయాలకీ భేదం లేదు. అందువల్లనే దేహారోగ్యానికి సంబంధించిన వైద్యవిద్య ఆయుర్వేదమూ, యుద్ధంలో ఉపయోగపడే ధనుర్విద్యా కూడ ఆత్మవికాసానికి సంబంధించిన వాటిగానే పరిగణింపబడ్డాయి. అవి కూడ పధ్నాలుగు విద్యలలో చేర్చబడ్డాయి. అర్థ శాస్త్రం పేర్కొనే ఆర్థిక శాస్త్రం, రాజకీయ శాస్త్రం కూడ ఆత్మ విద్యలో భాగాలే !

వాటికి ధార్మిక గ్రంథాల ప్రతిపత్తినివ్వటానికి కారణమిది: జీవితానికి సంబంధించిన అన్ని అంశాలూ నియమబద్ధమైతేనే ఆత్మసాక్షాత్కారం సంభవమనీ, అందుకు ఇవి మార్గ దర్శకాలనీను.

శిక్ష, వ్యాకరణాలలో పరమాత్మ యొక్క మహోన్నత రూపమైన "శబ్దం" గోచరిస్తుంది. ముక్తి నొందటానికి మనకి ఉపయోగపడే భాషలకు శబ్దంతో సంబంధం ఉంది - అందుచేతనే శిక్ష, వ్యాకరణం రూపొందింపబడ్డాయి.

"శబ్ద బ్రహ్మవాదం" అంటే శబ్దమూ, పరమాత్మా సంబంధితాలు - అన్న వాదాన్ని వ్యాకరణం సూచిస్తుంది. దాని శాఖలలో ఒకటి "నాదబ్రహ్మ ఉపాసన" - నాదంలో బ్రహ్మని చేరే పద్ధతి.

ఇదే శుద్ధ సంగీతానికి ప్రాతిపాదిక, శబ్దాలను సరిగ్గా మేళవించి భాషగా వాడినప్పుడు మన భావాలను వ్యక్తీకరించటంతో బాటు చిత్తశుద్ధికి కూడ కృషి చేయవచ్చు. భాషాసంబంధమైన ఈ శాస్త్రాలు ఈ మేరకు ఉపయోగిస్తాయి.

స్వతంత్రభారతంలోని మధ్య ప్రదేశ్‌గా వ్యవహరింప బడుతున్న ప్రాంతంలో "ధర్" అనే రాజ్యముండేది. భోజరాజు రాజధానియైన 'ధారా' నగరమిదే. భోజరాజు దాతృత్వానికి ప్రసిద్ధుడు. ధారా నగరంలో ఒక మసీదుంది. ఆ మసీదు గోడలపై సంస్కృతపు వ్రాతలు చెక్కబడ్డాయని తెలిసింది. అది ముస్లింల కట్టడమవటం వల్ల ఆ వ్రాతలను అధికారుల

అనుమతి లేకుండా చూడ వీలయేది కాదు. చాలాకాలానికి గాని ఎపిగ్రాఫికల్ డిపార్టుమెంటు వారికి ఆ అనుమతి లభించలేదు. ఆ తరువాత వారా వ్రాతల గురించి పరిశోధన జరిపారు.

గోడపై పెద్ద చక్రం చెక్కబడింది. దానిపై ఎన్నో శ్లోకాలు చెక్కబడ్డాయి. ఇవన్నీ వ్యాకరణమే. వ్యాకరణశాస్త్రాన్నంతా శ్లోకాలుగా ఆ చక్రం మీద చెక్కారు. భోజరాజు కాలంలోని ఈ సరస్వతీ దేవాలయం, మసీదయింది.

వాగ్దేవి, చదువుల వేల్పు అయిన, సరస్వతీ మందిరంలో భాషా శాస్త్రం వ్యాకరణంగా ఎల్లప్పుడూ ఉండాలని ఆ శిల్పుల ఉద్దేశం. వ్యాకరణం వేద పురుషుని నోరు కదా! ఆ చక్రాన్ని చూచినంత మాత్రాన వ్యాకరణ శాస్త్రమంతా తెలుస్తుందంటారు. వ్యాకరణం ఆరాధ్యం కావటం వల్ల ఆ ఆలయంలో వ్యాకరణ చక్రాన్ని నెలకొల్పారు. ఆ ఆలయం మసీదయిన చాలాకాలానికి ఆ వాగ్దేవి కటాక్షం వల్లే ఆ చక్రం మనకి లభించింది. ఎపిగ్రఫీ డిపార్ట్‌మెంటు వారు ఆ చక్రాన్ని అచ్చులో ప్రచురించారు. ఆంగ్లంలోకి అనువదించారు.

వ్యాకరణాది శాస్త్రాలను పూర్వపు రాజులూ ప్రభుత్వాలూ కేవలం శాస్త్రాలుగా వెనుకకు పెట్టెయ్యక వాటిని ఆరాధ్యాలుగా పరిగణించే వారని దీని బట్టి తెలుస్తుంది. దీని బట్టి, భాషా స్వచ్ఛతకీ, భాషా నాగరికతకీ పూర్వం మన దేశంలో ఎంత ప్రాముఖ్యముందో కూడ తెలుస్తుంది.



# 17

# వేదాంగములు : ఛందస్సు

**వేదపురుషుని పాదములు :**

ఆరువేదాంగాలలో ఛందస్సు ఒకటి. వేదపురుషుని పాదాలుగా భావింపబడుతుంది. 'ఛందస్సు'కి మరొక అర్థం కూడా ఉంది. ఆ మాటకి అర్థం 'వేదాల'నే. కృష్ణభగవానుడు వేదాలని సృష్టి అనే వృక్షానికి పత్రాలంటాడు (ఛందాంసి యస్య పర్ణాని)

ఇక్కడ ఛందస్సనే పదాన్ని వేరొక అర్థంలో వాడుతాను. ఛందస్సంటే పద్యరూపమనే అర్థంలో.

ఋగ్వేదమూ, సామవేదమూ రెండూ పద్యాలమయం. యజుర్వేదంలోని మంత్రాలు వచనంలో ఉన్నా అవికూడ పద్యాలని కలిగియుంటాయి. పద్యరూపంలో (ఛందో మయంగా) ఉండటం వల్లనే వేదాలని ఛందస్సంటారు.

మనకి కోటు కుట్టాలంటే దర్జీ కొలతలని తీసుకుంటాడు. బట్టని ఆ కొలతల ప్రకారం కత్తిరించి, కుడతాడు. కొలతలు తీసికోకపోతే కోటు సరిపోకవచ్చు. ఆ విధంగానే మన భావాలను కవిత్వరూపంలో వ్యక్తం చేయాలంటే, అవి కవిత్వపు సొగసులు సంతరించుకోవాలంటే, సరియైన కొలతలు అవసరం. కోటుకి కొంత పొడవూ, కొంత వెడల్పూ ఉండాల్సినట్టుగానే పద్యానికి నిర్ణీతమైన నిడివీ, అక్షరాలూ ఉండాలి. అప్పుడే సరిగ్గా నప్పుతుంది. ఛందస్సు ఈ సూత్రాలను విధిస్తుంది. పద్యాలకు ఉండవలసిన పరిమితులను నిర్ణయిస్తుంది. ఈ విషయమై ఆధికారకమైన ముఖ్యగ్రంథం పింగళుడు రచించిన "ఛందస్సూత్రాలు".

వేదపురుషుని పాదాలు ఛందస్సన్నాం. మంత్రజపంలో ప్రవేశమున్నవారు ఋషి యొక్క పేరు చెప్పి శిరస్సుని తాకుతారు, ఆ మంత్రం యొక్క ఛందస్సు పేరు చెప్పుకొని ముక్కుని తాకుతారు, అధిష్ఠాన దేవత పేరు చెప్పుకొని హృదయాన్ని తాకుతారు.

కవిత్వరూపంలో ఉన్న వేద మంత్రాలన్నీ "ఛందస్సు". ఇతరములు, అంటే వేదంలో భాగం కాని వాటిని శ్లోకాలంటారు. వచనాన్ని గద్యమనీ, ఛందస్సుని పద్యమనీ అంటారు సంస్కృతంలో. ఆంగ్లంలో కవిత్వమంటారు. అంటే, వైదిక కవిత్వాన్ని ఛందస్సంటారు. అంతేకాక, లయబద్ధమైన ఏ కవిత్వాన్నైనా ఛందస్సనే అంటారు. వీటన్నిటిలోనూ "అనుష్టుప్" విరివిగా వాడబడుతుంది. పురాణాలలోనివీ, వాల్మీకి రామాయణంలోనివి - శ్లోకాలు అనుష్టుప్ ఛందస్సులోనే ఉన్నాయి.

ఒక్కొక్క వృత్తంలో ఎన్ని పాదాలుండాలో, ఒక్కొక్క పాదంలో ఎన్ని అక్షరాలుండాలో తెలిపే నియమాలున్నాయి. "ఆర్య" అని ఒక ఛందస్సుంది - ఇది హ్రస్వ - దీర్ఘ స్వరాలని కూడ పరిగణనలోకి తీసుకుంటుంది. ఈ ఛందస్సులో "రామ" అన్న పదానికి రెండు మాత్రలుండవు - మూడుంటాయి. దీనికి కారణం "రా" దీర్ఘమవటం. దీనిని రెండు మాత్రలుగా లెక్కిస్తారు, 'మ' హ్రస్వమవటం వల్ల ఒక మాత్ర.

ఇతర వృత్తాలకు వేరే నియమాలున్నాయి. వాటిలో హ్రస్వ-దీర్ఘ స్వరాలకు భేదముండదు. ప్రతిపాదంలోని అక్షరాలూ నిర్ణీతమైన సంఖ్యలో ఉంటాయి.

**పాదం :**

ఛందస్సు వేదపురుషుని పాదమన్నాను. సంస్కృతంలో పాదాన్నే పదమని కూడ అంటారు. ఇంగ్లీషులో కూడ పద్యాన్ని పాదాలుగా విభజిస్తారు. ఒక్కొక్క పాదంలో ఎన్ని అక్షరాలుండాలో నియమిస్తారు. పాదం కాలి చివరి భాగం, పద్యంలో ఒక భాగం కూడ. "పాద"మన్న మాటకి చాలా భాషలలో ఒకే అర్థముంది. మానవాళి కంతటికీ ఏ విషయంలోనైనా సాదృశ్యముండటం హర్షణీయం. మంత్రంలోగాని, శ్లోకంలోగాని నాల్గవభాగం పాదం. మానవదేహంలో 'కాలు' కూడ నాల్గవ వంతే. నడుం వరకూ సగం. మిగిలిన ఆ క్రింది భాగంలో చెరి ఒక కాలూ చెరి ఒక సగం - అంటే ఒక్కొక్క కాలు నాల్గవ వంతన్న మాట.

వేదమంత్రంగాని, వేదంలోలేని శ్లోకం గాని నాలుగు పాదాలు కలిగి యుంటుంది. ఒక్కొక్క పాదానికీ నిర్ణీతమైన అక్షరాలు లేక మాత్రలుంటాయి. ఒక పాదం వేరొక పాదంతో సమంకాకపోతే, "విషమ" అంటారు. నిజానికీ మాట "వి-సమ" అంటే అసమానమని అర్థం.

ఒక్కొక్కపాదం ఒక్కొక్క నిడవికలదైతే దానిని "విషమవృత్త"మంటారు. ఒక పాదాన్ని విడిచి ఒకటి అసమానంగా ఉంటే దానిని " అర్థసమవృత్త" మంటారు. అంటే మొదటి పాదంలోని అక్షరాలూ, రెండవ పాదంలోని అక్షరాలూ ఒకే సంఖ్యలో ఉండవు. అట్లాగే మూడు, నాలుగు పాదాలు సమానమైన అక్షరాలు కలిగి యుండవు. కాని రెండు, నాలుగు పాదాలకు అక్షరాలు సమానంగా ఉంటాయి.

సాధారణంగా అన్ని పాదాలూ ఒకే నిడివి కలిగి యుంటాయి. ఉదాహరణకి అందరికీ తెలిసిన ఈ ప్రార్థనాశ్లోకం తీసుకుందాం -

*శుక్లాంబరధరం విష్ణుం*
*శశివర్ణం చతుర్భుజం*
*ప్రసన్న వదనం ధ్యాయేత్*
*సర్వవిఘ్నోప శాంతయే.*

ప్రతిపాదంలోనూ ఎనిమిది అక్షరాలున్నాయి - ఇంగ్లీషు పద్ధతిలోని అక్షరాలు కావు, సంస్కృత పద్ధతిలోనివి. అక్షరంగా పరిగణింప వలసినవి అచ్చులు, అచ్చులు చేర్చబడ్డ

హల్లులు మాత్రమే. కేవల హల్లులని విడిచి పెట్టాలి. అప్పుడే ఒక్కొక్క పాదంలో ఎనిమిది అక్షరాలని తెలుస్తుంది.

శ్లోకానికి నాలుగు పాదాలుండి, ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాలుంటే దానిని అనుష్టుప్ ఛందస్సంటారు.

**కవిత్వపు ఛందస్సు పుట్టుక :**

వేదాలను పఠించేప్పుడు స్వరభేదానికై స్థాయిని హెచ్చించటం తగ్గించటం జరుగుతూంటుంది. కాని కావ్యాలలోగాని ఇతర కవనాల్లోగాని ఇది ఉండదు. వేదాలలోని అనుష్టుప్ ఛందస్సుని మొదటగా వాల్మీకి వాడాడు - కాని వేదాలలో వలె స్థాయి భేదం లేకుండా. అది ఆయన ప్రయత్నపూర్వకంగా చేయలేదు. రెండు పక్షులలో ఒక దానిని బోయవాడు చంపటం చూచాడు. తన సహవాసి మరణాన్ని చూస్తున్న పక్షిపట్ల కరుణ, బోయవాని పట్ల కోపంగా మారింది. అతనిని ఈ విధంగా శపించాడు;

*మా నిషాద ప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీసమాః*
*యత్ క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్॥*

"వేటకాడా- నీకెప్పుడూ ఏ శుభమూ కలుగకుండుగాక, ఆనందంలో ఉన్న క్రౌంచపక్షులలో ఒక దానిని హతమార్చావు"

ఆయన కోపం అప్రయత్నంగానే ఆ విధమైన అక్షర రూపం దాల్చింది.

వాల్మీకి మహర్షి తన ఆవేశానికి ఎంతో చింతించి దీని గురించి ఆలోచించాడు. హఠాత్తుగా ఆయన మనస్సులో ఒక ఆలోచన మెరిసింది. ఆయన జ్ఞాన దృష్టి గల ఋషి, తన శాపము అనుష్టుప్ ఛందస్సులో, నాలుగుపాదాలతో, పాదానికి ఎనిమిది అక్షరాలతో కూర్చ బడిందని గ్రహించాడు. ఆయనకి ఆవేశం అప్రయత్నంగా పెల్లుబికినట్లే, ఆ అక్షరాల కూర్పు కూడ కవిత్వంవలె అప్రయత్నంగానే జరిగింది. ఆయన ఆశ్చర్య చకితుడయినాడు. బోయవానిని శపిస్తూ పలికిన శ్లోకానికే మరో అన్వయం కుదురుతుంది. "లక్ష్మీవల్లభా! సుఖదంపతులలో కామమోహితుడైన పురుషుని వధించటం నీకు యశస్కరం" ఈ పద్యం విష్ణు అవతారమైన శ్రీరామునికి సరిగ్గా నప్పుతుంది. కామాతురుడైన రావణుని వధించటానికి రాముడవతరించాడు. మండోదరిని పెళ్లి చేసుకొని సుఖిస్తున్న రావణుడు పరస్త్రీలను మోహించి, వరించాడు. తన నుండి అప్రయత్నంగా వెలువడిన ఆ శ్లోకం దైవప్రేరితమని వాల్మీకి గ్రహించాడు. సృష్టికర్త, బ్రహ్మ ధైర్యమివ్వటంతో ఆ అనుష్టుప్ ఛందస్సులోనే రామాయణ కావ్య నిర్మాణం ప్రారంభించాడు.

వైదిక స్వరాలు లేకుండా (అంటే ఉచ్చారణలో భేదం లేకుండా) శ్లోకం జన్మించటమిక్కడే. పరమసత్యాలని తాను ప్రచారం చేయటానికే ప్రజలు తేలికగా కంఠస్థం చేయటానికీ వీలుగా ఉండే మాధ్యమం తనకి అప్రయత్నంగా సంక్రమించిందని సంతోషించాడు

ఆయన. ప్రపంచానికి ఆదికావ్యంగా, అనుపమాన సౌందర్యంతో ఆయన రాముని కథను అనుష్టుప్ ఛందస్సులో నిర్మించాడు.

వచనాన్ని కంఠస్తం చేయటం కష్టం - మరచిపోతాం. ఛందోబద్ధమవటం వల్ల కవిత్వాన్ని జ్ఞాపకముంచుకోవటం తేలిక. ఈ కారణం వల్లనే పూర్వపు రోజులలో చాలా విషయాలను కవిత్వంలోనే చెప్పేవారు. అచ్చువేయటం ప్రారంభించిన తరువాత అన్నిటినీ కంఠస్థం చేయవలసిన అవసరం తప్పింది, దేనిని కావాలంటే దానిని గ్రంథస్థం చేయగలగటం వల్ల. ఈ విధంగానే వచనం ప్రాచుర్యంలోకి వచ్చింది. కాని భావవ్యక్తీకరణలో కవిత్వానికి సొగసూ, సౌందర్యమూ, ఓజస్సూ ఎక్కువ.

రామాయణావిర్భావం కేవలం దైవకృపవల్లనే జరిగింది. ఆ ఛందస్సు అప్రయత్నంగా సృష్టింపబడింది. ఇతర స్తోత్రాలూ, పురాణాలూ, కావ్యాలూ రచింపబడటానికి దారి చూపింది.

**కొన్ని ఛందస్సులు :**

ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, స్రగ్ధర-ఇత్యాదివి స్తోత్రాలలో, కావ్యాలలో వాడబడే ఇతర ఛందస్సులు. వాటిలో కొన్ని బహుక్లిష్టమైనవి. పండితులేగాని ఇతరులు ఉపయోగించలేరు.

"అనుష్టుప్" ఛందస్సులో పాదానికి ఎనిమిది అక్షరాలుంటాయన్నాను. తొమ్మిది ఉంటే "బృహతీ" అవుతుంది. పది ఉంటే "పంక్తి" అవుతుంది. పదకొండు ఉంటే "త్రిష్టుప్" అవుతుంది. పన్నెండు ఉంటే "జగతీ" అవుతుంది. పాదానికి ఇరవై ఆరు అక్షరాలు గల ఛందస్సుని "ఉద్‌కృతి" అంటారు. ఇది "భుజంగ విజృంభితం" పద్ధతిలోనిది. పాదానికి ఇరవై ఆరు కంటే ఎక్కువ అక్షరాలుంటే "దండక" మవుతుంది. వీటిలో కూడ ఎన్నో రీతులున్నాయి.

కొన్ని ఛందోరీతుల పేర్లు సుందరంగా, సముచితంగా, రసాత్మకంగా ఉంటాయి. కొన్ని ఛందస్సులలో అక్షరాలు పులిపిల్ల ఆడుతూ గంతులు వేస్తున్నట్లుగా సాగుతాయి. దీనిని "శార్దూల విక్రీడిత" మంటారు. శార్దూలమంటే పులి, విక్రీడిత అంటే ఆట. పాదానికి పందొమ్మిది అక్షరాలుంటాయి. అతిధృతి - అంటే వేగంగల జాతి ఛందస్సు. ప్రతిపాదంలోనూ రెండు అక్షరసముదాయాలుంటాయి. ఒకదానిలో పన్నెండు, మరొక దానిలో ఏడు అక్షరాలుంటాయి. పాకుతున్న పామువలె ధ్వనించే ఛందస్సుని "భుజంగ ప్రయాత" మంటారు భుజంగమంటే పాము. 'జగతి' ఛందోరీతి యిది. పాదానికి పన్నెండు అక్షరాలుంటాయి. ప్రతిపాదాన్ని రెండు అక్షర సముదాయాలుగా విభజించాలి. ఒక్కొక్కదానిలో ఆరు అక్షరాలుండేట్టు. ఉదాహరణ : "మయూరాధిరూఢం మహావాక్యగూఢం" అన్నప్పుడు మ-యూ-రా-ధి-రూ-ఢం. మ-హా-వాక్య-గూ-ఢం. ఆదిశంకరుని "సౌందర్యలహరి" "శిఖరిణి" ఛందస్సులో ఉంది. ప్రతిపాదానికీ పదిహేడు అక్షరాలుంటాయి (పాదానికి పదిహేడు అక్షరాలు కలవాటికి 'అద్యష్టి' సాధారణ నామం). ఈ పదిహేడు అక్షరాలనీ ఆరు, పదకొండు

అక్షరసముదాయాలుగా, రెండుగా, విభజిస్తే "శిఖరిణి" అవుతుంది. "స్రగ్ధర" అన్న ఛందస్సులో శబ్దాలు ప్రతిధ్వనిస్తున్నట్టు - వెల్లువవలె నోటినుండి బయల్వెడలు తున్నట్టు ఉంటాయి. ఇందులో ఇరవై ఒక అక్షరాలుంటాయి పాదానికి. వీటిని ఏడేసి అక్షరసముదాయాలుగా, మూడుగా, విభజిస్తారు.

శ్రీ శంకరాచార్యుల వారు ఈశ్వరునిపైన, విష్ణువుపైన వ్రాసిన స్తోత్రాలు "కేశాదిపాద" "పాదాదికేశ" అన్న ఛందస్సులో ఉంటాయి. అవి ఈ జాతికి చెందినవే.

ఇంద్రవజ్ర అన్నది "తిష్టుప్" జాతికి చెందిన ఛందస్సు. పాదానికి పదకొండు అక్షరాలుంటాయి దీనిలో. ఉపేంద్రవజ్రలో కూడ పదకొండే ఉంటాయి. కాని వేరే విధంగా విభజింపబడుతుంది. ఈ రెంటినీ కలిపితే "ఉపజాతి" ఛందస్సు వస్తుంది. కాళిదాసు తన కుమారసంభవాన్ని ఈ ఛందస్సులోనే ప్రారంభించాడు.

ఈ ఛందస్సులు వేదకాలం దాటిన తరువాతి కవిత్వానికీ, స్తోత్రాలకీ సంబంధించినవి. వేదాలలో కనబడే ఛందస్సులు - గాయత్రి, ఉష్నిక్, అనుష్టుప్,బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి వంటివి.

మంత్రరాజమైన గాయత్రి మహామంత్రం చెప్పబడిన ఛందస్సుకి ఆ పేరే ఉంది - "గాయత్రి ఛందస్సు"

సాధారణంగా ఏ దేవతకి సంబంధించినదో, ఆ దేవతపేరే పెడ్తారు. "శివపంచాక్షరి" "నారాయణ అష్టాక్షరి" "రామత్రయోదశి" అన్న పేర్లలో దేవతపేరూ, అక్షరాల సంఖ్యా కలిసి యుంటాయి.

గాయత్రి మంత్రానికి దేవత సవిత, గాయత్రి అన్నది ఛందస్సు పేరు మాత్రమే. కాని మంత్రానికి ఛందస్సుపేరే పెట్టారు. శబ్దానికీ, స్వరానికీ దివ్యశక్తి ఉన్నట్టుగానే ఛందస్సుకీ, రచనకీ కూడా ఉన్నాయి. మంత్రానికైనా, శ్లోకానికైనా నాలుగు పాదాలుండాలి మామూలుగా. దీనికి విరుద్ధంగా గాయత్రికి మూడు పాదాలే ఉంటాయి. గాయత్రి అనే ఛందస్సుకి మూడుపాదాలూ, పాదానికి ఎనిమిది అక్షరాలూ - మొత్తం ఇరవైనాలుగు అక్షరాలుంటాయి. మూడు పాదాలు కలిగి యుండటం వల్ల "త్రిపాద గాయత్రి" అంటారు. ఇతర గాయత్రి రీతులు కూడా ఉన్నాయి. ఋగ్వేదపు మొదటి మంత్రం - "అగ్నిమీలే" - కూడ గాయత్రి ఛందస్సులోనిదే.

కొన్ని స్తోత్రాలలో 24 అక్షరాల గాయత్రిని నాలుగు పాదాలుగా, ఒక్కొక్క పాదానికి ఆరు అక్షరాలతో విభజిస్తారు.

ఒక్కొక్క పాదానికి ఏడు అక్షరాల చొప్పున మొత్తం 28 అక్షరాలుంటే అది "ఉష్ణిక్" ఛందస్సవుతుంది.

## ఛందస్సు ప్రయోజనం :

ఏ మంత్రమైనా రూపొందితే, దానిని నిర్దుష్టంగా, సరియైన స్థాయిలో, స్వరంతో పలికే విధానాన్ని నిర్దేశిస్తుంది 'శిక్ష' శాస్త్రం. మంత్రం యొక్క రూపం సరిగ్గా ఉండాలంటే ఛందస్సు అవసరం. ధ్యానమగ్నుడైన ఋషికి భగవంతుని అనుగ్రహం వల్ల గోచరించపబడే ఏ మంత్రానికైనా సరియైన రూపమే ఉంటుంది. అది శ్రమతో కూర్చబడింది కాదు కదా!

ఒక వేదసూక్తాన్ని గాని, మంత్రాన్ని గాని పఠించేప్పుడు అది మూలం ప్రకారమే ఉన్నదో లేదో తెలుసుకోవటానికి ఛందస్సు ఉపయోగిస్తుంది. మంత్రంలోని అక్షరాలను లెక్కపెట్టినప్పుడు లెక్కకుదరకపోతే తెలిసిన వారినడిగి సరియైన రూపాన్ని తెలుసుకో గలుగుతాము.

వాటంతట అవే ఆవిర్భవించిన మంత్రాలను అట్లా ఉంచినా, కవులు శ్లోకాలరూపంలో తమ భావాలని వ్యక్తీకరించేందుకు ఛందస్సునే ఆశ్రయిస్తారు. సంగీతానికి తాళమెటువంటిదో శ్లోకాలకి ఛందస్సు అటువంటిది. ఒక క్రమంలో ఉండవలసి రావటం వల్ల దానికి స్వతస్సిద్ధంగానే రూపమేర్పడుతుంది, ఛందోబద్ధమైన దానిని కంఠస్థం చేయటం తేలిక.

వేదపాఠాలు ఆదిలో ఎట్లా ఉండేవో అట్లాగే ఒక్క అక్షరం ఎక్కువా, తక్కువా కాకుండా ఉండటానికి కారణం ఛందస్సొక్కటే. వేదశబ్దాలతో ఆడుకోరాదు. ఏ మాత్రం హెచ్చుతగ్గు జరిగినా వాటి ఆధ్యాత్మికతకు భంగం వాటిల్లుతుంది.

## వేదాలకి పాదం - మంత్రానికి నాసిక :

ప్రతిమంత్రమూ ఏదో దేవతకి అంకితమయి ఉంటుంది. అంటే, ప్రతిమంత్రానికీ ఒక అధిష్ఠాన దేవత ఉంటుందన్న మాట. దానికొక ఛందస్సూ, దానిని లోకానికి అనుగ్రహించిన ఋషీ ఉంటారు. ఆయనే ఆ మంత్రానికి ఋషి. మంత్రాన్ని చెప్పే ముందు ఆ ఋషిపేరు తలచుకొని, శిరస్సును తాకటమంటే, ఆయన పాదాలను ఎంతో గౌరవంతో శిరస్సుపై పెట్టుకోవటమన మాట. మంత్రాలను మనకి యిచ్చిన వారు ఋషులే కదా!

మంత్రం యొక్క ఛందస్సు పేరుని చెప్పినప్పుడు ముక్కుని వేలితో తాకుతాం. మంత్రానిక ఒకే పరిరక్షకుడు ఛందస్సు. మంత్రానికి ఊపిరి వంటిదది. అందువల్లనే మన ఊపిరి నియమబద్ధం చేసే ముక్కుని పట్టుకోవటం. ఊపిరి లేక జీవితమే లేదు. ఆ విధంగానే మంత్రాలకి ఛందస్సే ఊపిరి కాని, వేదాలనన్నిటినీ ఒక మూర్తిగా భావిస్తే 'శిక్ష' నాసిక, ఛందస్సు పాదాలూ అవుతాయి.

మనం కాళ్లమీద నిలబడి నట్టే వేదపురుషుడు ఛందస్సనే కాళ్లపై నిలబడుతాడు. కాళ్లులేక పోతే లేచి నిలబడలేము. వేదం యొక్క దేహం నిలబడేది ఛందస్సనే పాదాలపైనే.

# 18

# వేదాంగములు : నిరుక్తం

**వేదపురుషుని చెవులు :**

నిరుక్తం, వేదాలకు నిఘంటువు. నిఘంటువుని కోశమంటారు సంస్కృతంలో "అమరకోశ"మనే సంస్కృత నిఘంటువు ఎంతో ప్రసిద్ధమైనది. ప్రతిమాట యొక్క వ్యుత్పత్తీ, అర్థమూ వివరింప బడుతాయి. దీనినే నిరుక్త శాస్త్రమంటారు. ఆంగ్లంలో "ఎటిమాలజీ" (పదఉత్పత్తి శాస్త్రం) అంటారు.

వేదపురుషుని చెవులు నిరుక్తం. వేదాలలో వాడబడిన అరుదైన, అసాధారణమైన మాటలకు అర్థాలు చెప్తుంది. అంతేకాక, ఆ పదమెందుకు ప్రయోగింపబడిందో కూడ చెప్తుంది. ఈ విషయమై ఎందరో, ఎన్నో గ్రంథాలు వ్రాశారు. కాని అన్నిటిలోనూ అమూల్యమైనది యాస్కరచన.

వేదపదాల వ్యుత్పత్తిని ఈ వేదనిఘంటువు వివరిస్తుంది. "హృదయ"మన్న పదాన్ని తీసికొందాం. ఈ మాటని వాడటానికి కారణమేమిటి? వేదాలే దీనికి సమాధానం చెప్తాయి. "హృది-అయం" అంటే "హృదయంలో నివసించేవాడని" అర్థం. "హృద్" అంటే "మనిషి గుండె" కూడా. కాని ఈ పదం హృదయంలో ఉండే ఈశ్వరుణ్ణి కూడా సూచించటం వల్ల దాని ఆధ్యాత్మిక విలువ ఎక్కువౌతుంది. ఏ శాస్త్రమైనా ఈశ్వరుణ్ణి చేర్చాలి. పరమేశ్వరుడు వసించే స్థలం కాబట్టి, హృదయం. అట్లాగే ప్రతిపదానికీ ఒక కారణముంటుంది. నిరుక్తం ఈ విశ్లేషణని చేస్తుంది.

సంస్కృతంలో అన్ని పదాలూ ధాతువులనుండి జన్మిస్తాయి.

ప్రతిశబ్దానికీ మూలముంటుంది. ఆంగ్లంలో క్రియలకేగాని నామవాచకాలకి మూలముండదు. కాని సంస్కృతంలో అన్ని పదాలకూ ధాతువుంటుంది. సంస్కృత పదాలను కొలది మార్పులతో, ఇతర భాషలు తీసికొన్నాయి. అందువల్లే ఈ భాషలలో పదాలమూలం తెలియదు - అవి పరాయి భాషనుంచి వచ్చాయి కదా! ఆంగ్లంలో కాలాన్ని అవర్ (hour) అంటారు. శబ్దోచ్చారణని అనుసరించి గమనిస్తే ఇది "hou", "or" లుగా తెలుస్తుంది. ఎప్పుడో ఒక కాలంలో దీనిని "హోరా" (hora) గా పలికి ఉంటారు. సంస్కృతంలో హోరాశాస్త్ర మొకటి ఉంది. (ఇది 'అహోరాత్రం' అన్న మాటనుండి వచ్చింది.) అంటే, రేయింబవలు (అహ-పగలు, రాత్ర-రాత్రి) హోర అంటే ఒక గంట కాల ప్రమాణం. ఈ హోర ఇంగ్లీషులో అవర్ (hour) అయి యుండవచ్చు. దీని ఉచ్చారణలో "h" అన్న అక్షరాన్ని పలుకరు. ఆ విధంగానే ఇంగ్లీషు పదం heart సంస్కృతంలోని 'హృద్' నుండి

వచ్చింది. ఇటువంటివే ఇంకా చాలా ఉన్నాయి. ఈ భాషలలో ఈ కొత్తరూపాలు రావటానికి ఎంతో కాలమయి యుంటుంది. ఈ కారణం చేతనే భాషా శాస్త్రజ్ఞులకు ఆ భాషలలోనే ఈ పదాల మూలం కనుగొనటం కష్టమవుతోంది.

ఏ భాషైనా అర్థం కానప్పుడు దానిని వినటంలో ప్రయోజనమేమిటి? వినకపోయినా హాని లేదు. అది బధిరుని ముందు పలికినట్టే కదా. అందువల్లనే ప్రతి పదాన్నీ విభజించి వ్యుత్పత్త్యర్థాన్ని తెలిపే నిరుక్తాన్ని వేదపురుషుని చెవులంటారు.

శృతికి (వేదానికి) శ్రోత (చెవి) కూడాను. వేదాలను వినికిడి వల్లనే కదా నేర్చుకొనేది! వ్యాకరణ, నిరుక్త శాస్త్రాలను ఆంగ్లేయులు కాశీ పండితుల వద్ద అభ్యసించారు. నిరుక్తం ప్రతిమాట యొక్క వ్యుత్పత్తినీ ఇచ్చి, అర్థం చెప్తుందని తెలుసుకున్నాం. దాని నుంచే ఫైలాలజీ అనబడే భాషా శాస్త్రాన్ని నిర్మించారు. వేదాలకి సంబంధించిన వ్యాకరణ, నిరుక్తాలనుండే ఈ ఆధునిక ఫైలాలజీ - భాషాశాస్త్రం - జనించింది.

అన్ని భాషలూ ఏదో ఒకే ఆది భాషనుండే ఉద్భవించాయని పరిశోధనల వల్ల తేలింది. ఈ భాషను వాడే ప్రదేశాలలోనే ఆదిమమానవుడుండే వాడనీ ఆ కారణం చేతనే మానవులంతా ఒకే ప్రదేశంలో ఉండే వారనీ భావింపబడుతోంది. కాని ప్రపంచంలో ప్రదేశమెక్కడ ఉన్నదో నన్న విషయంపై భిన్నాభిప్రాయాలున్నాయి. దీని గురించి అంత పట్టించుకొనక్కర్లేదు మనమిక్కడ.



# 19

# వేదాంగములు : జ్యోతిషం

**వేదముల - నేత్రములు :**

ఇప్పటి వరకూ శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తమనే నాలుగు వేదాంగాల గురించి చెప్పాను. అయిదవది : జ్యోతిషం.

వేదపురుషునికి నేత్రం వంటిది జ్యోతిషం. ఈ శాస్త్రానికి మూడు విభాగాలున్నాయి. లేక, మూడు స్కందాలున్నాయి. అందువల్లనే ఈ శాస్త్రాన్ని "స్కంద త్రయాత్మక" మంటారు. స్కందమంటే చెట్టు యొక్క ముఖ్యమైన శాఖ.

గర్గ, నారద, పరాశరాదులెందరో జ్యోతిషం గురించి గొప్ప గ్రంథాలు వ్రాశారు. ఈ శాస్త్రంలో ఒక విభాగాన్ని తీసికొని దివ్యశిల్పి మయునకు సూర్యుడు భోదించాడంటూ ఒక గ్రంథముంది. దాని పేరు "సూర్య సిద్ధాంతం". దేవతలూ, ఋషులూ రచించిన గ్రంథాలెన్నో యున్నాయి. మానవులు రచించిన గ్రంథాలు కూడా ఉన్నాయి. వరాహమిహిరుడెన్నో గ్రంథాలు వ్రాసినట్టు ప్రసిద్ధి. ఆర్యభట్టుడు, భాస్కరాచార్యుడు కూడ ఈ శాస్త్రానికెంతో సేవ చేశారు. ఇటీవలి కాలంలో సుందరేశ్వర శ్రౌతి అన్న పండితుడు, "జ్యోతిష కౌస్తుభ" మన్న గ్రంథాన్ని రచించారు.

కళ్లులేని వాడు అంధుడు. దగ్గరగా ఉన్న వాటిని స్పృశించి తెలుసుకోవచ్చు. కాని దూరంగా ఉన్నవాటిని కళ్లతోనే చూడాలి. మానవ నేత్రాలు దగ్గరవాటినీ, దూరంగా ఉన్నవాటినీ చూచి గుర్తించినట్టే, జ్యోతిషశాస్త్రం దూరంగా ఉన్న గ్రహాలను, నక్షత్రాలను వాటి పూర్వపు గతులనూ, భావిగతులను చూడటానికి ఉపయోగపడుతుంది. గ్రహాలు ఇప్పుడెట్లా ఉన్నాయో తెలిసికోవటం చూపుతోనే సాధ్యం - దీనికి జ్యోతిషజ్ఞాన మక్కరలేదు. కాని ఎప్పుడో గ్రహాలస్థితి ఎట్లా ఉండేదో తెలిసికోవటానికి జ్యోతిష శాస్త్రమవసరమే. రంగులను గుర్తించటానికి స్పర్శ జ్ఞానం చాలదు, కళ్లుకావాలి. ఇప్పుడైనా ఒక గ్రహం కనబడితే దాని ఉనికి బట్టి మనపై దాని ప్రభావమేమిటో ఎరుగలేము. దీనికి జ్యోతిషశాస్త్రమే శరణ్యం. అందువల్లనే వేదపురుషునికి నేత్రమన్నారు ఈ శాస్త్రాన్ని.

వైదిక కర్మలను నిర్వహించటానికి గ్రహాల స్థితిని తెలుసుకోవాలని నియమాలున్నాయి. వివాహాది కార్యాలకు ముహూర్తాలని నిర్ణయించేప్పుడు గ్రహాలసానుకూలత చూస్తారు. జ్యోతిషాన్ని "నయన"మని కూడ అంటారు, అంటే 'కన్ను' అని అర్థం. "నయ" అంటే "దారి చూపట"మని అర్థం. గ్రుడ్డివానికి ఎవరైనా దారి చూపాలి. కళ్లున్న వాళ్లకి ఆ కళ్లే దారి చూపుతాయి. వైదిక కర్మలని నిర్వహించటానికి ముహూర్తాలను తెలిపి, జ్యోతిషం వాటిని నిర్వహించటానికి కంటివలె మార్గాన్ని చూపుతుంది.

## జ్యోతిషం, ఖగోళశాస్త్రం :

ఆధునిక ఖగోళశాస్త్రం ఆయా గ్రహాల ఉనికిని తెలియజేయడానికే పరిమితమయినది. ఆ గ్రహాల స్థితి ప్రపంచాన్ని ఎట్లా ప్రభావితం చేస్తుంది? మనపై దాని ప్రభావమేమిటి? ఆ ప్రభావం మనకి సానుకూలమవటానికి ఏమి చెయ్యాలి? ఈ శాస్త్రంతో కలిసి జ్యోతిషం ఇందుకు ఉపయోగిస్తుంది.

ఒక్కొక్క గ్రహం క్రింద, నక్షత్రం క్రింద, ఒక్కొక్క తిథిలో జరిపే కర్మల సఫలతా విఫలతలను తెలిసికోవటానికి ఏర్పడింది జ్యోతిషశాస్త్రం ఆదిలో. అంటే ఏయే కర్మలు చేయటానికి ఏయే సమయాలు సానుకూలమో తెల్పటమే జ్యోతిష శాస్త్ర ముఖ్య ప్రయోజనం. అందువల్లనే ఈ శాస్త్రాన్ని వేదాలలో భాగంగా, వేదాంగంగా రూపొందించారు. గ్రహాల గతులను సూచించటానికి ఎన్నో లెక్కలు అవసరమవటం వల్ల గణితశాస్త్రం కూడ దీనిలో భాగమైంది. వైదిక యజ్ఞాన్ని నిర్వహించే ప్రదేశాన్ని "యజ్ఞవేది" అంటారు. ఆ స్థలాన్ని నిర్ణయించటానికి, ఎన్నో విపులమైన నియమాలున్నాయి. ఈ నియమాలననుసరించి యజ్ఞవేదిని సరిగ్గా నిర్మిస్తే సత్ఫలితాలు వస్తాయి. కాబట్టి, ఈ లెక్కలని అతి జాగ్రత్తగా ఈ నియమాల ప్రకారం వేయవలసిన అవసరమేర్పడింది. ఈ కారణం వల్లనే గణితశాస్త్రం వేదాలకి ఉపాంగంగా రూపొందింపబడింది.

## ప్రాచీన గణిత గ్రంథాలు :

జ్యోతిషంలో మూడు స్కందాలు ఉన్నాయి. అవి సిద్ధాంత స్కందం, హోరస్కందం, సంహిత స్కందం. సిద్ధాంత స్కందంలో అంకగణితం (arithmetic) త్రికోణశాస్త్రం (trignometry) క్షేత్రగణితం (geometry) బీజగణితం (algebra) వివరింప బడ్డాయి. పాశ్చాతులకు కొన్ని శతాబ్దాల కృషివల్ల గాని దొరకని ఉన్నత గణిత సంబంధమైన విషయాలు మః పురాతన జ్యోతిషంలో ఉన్నాయి.

అంకగణితం కేవలం అంకెలకి సంబంధించినది. కూడికలు, తీసివేతలు, హెచ్చింపులు, భాగహారాలు వంటివి అంకగణితానికి సంబంధించినవి. "అవ్యక్త గణితం" "తెలియని అంకెల"తో సంబంధించినది. అంటే, ఒకటి - రెండు - మూడు వంటి అంకెలను గాక "అ" "ఆ" వంటి గుర్తులను వాడేది. దీనినే బీజ గణితమంటారు. అవ్యక్తమంటే స్పష్టంగా తెలియని అని అర్థం. క్షేత్రగణితం అంటే 'జియోమెట్రి' జియో (geo) అంటే భూమి. మిట లేక మీటర్ అంటే కొలత. అందువల్లనే జియోమెట్రి అన్న పదమేర్పడింది. యజ్ఞభూమిని, యజ్ఞవేదిని నిర్ణయించి వాటి విస్తీర్ణము, ఆకారము ఎట్లా ఉండాలో చెప్పేది క్షేత్రగణితం. అంకగణితంలో "సమీకరణ"మనే భాగముంది. తెలియని విషయాలని తెలిసిన విషయాలతో కనుగొనటమది. తెలియని అంకెల సమూహాలని ఇస్తే వాటిని సమీకరణాలుగా రూపొందించవలసి యుంటుంది. సమీకరణ మంటే సమానం చేయటం. ఆ విధంగానే ఆంగ్లంతో equation అన్న పదమేర్పడింది.

ఆపస్తంబ సూత్రాలలో ఒక సమీకరణ ముంది. ఈ మధ్య వరకూ దానిని ఎవ్వరూ నిరూపింపలేకపోయారు. పాశ్చాత్య గణిత శాస్త్రానుసారం ఎవ్వరూ నిరూపంప లేకపోవటం వల్ల దానిని నిరూపించట మసాధ్యమన్నారు కూడా. కాని మరికొంత పరిశోధన తరువాత ఆ సమీకరణము సరియైనదే నని తేలింది. దీనికి పాశ్చాత్య పరిశోధకులు ఆశ్చర్య పడటం సహజమే. ఆధునిక శాస్త్రవేత్తలకు అర్థంకాని గణితశాస్త్ర కౌశలం, ప్రాచీన భారతీయ పండితులకు కొన్ని వేల సంవత్సరాల క్రితమే కైవసమైంది. ఇప్పటికీ అర్థంకాని, ఋజువు అంతుపట్టని, సూత్రాలున్నాయి. వీటిని కూడ సమీకరణ సహాయంతోనే నిరూపించాలి. గణిత శాస్త్రానికి సంబంధించిన శాఖలింకా ఉన్నాయని మన శాస్త్రాలు పేర్కొంటాయి. ఉదాహరణకి - రేఖాగణితం, గుట్టక, అంగభాగం - ఇత్యాది. అవ్యక్తగణితాన్ని బీజగణితమని కూడ అంటారు.

దాదాపు 800 సంవత్సరాల క్రింద భాస్కరాచార్య అనే ప్రసిద్ధ గణితశాస్త్రజ్ఞుడుండేవాడు. మనమెంత తెలివిగా వ్యవహరించినా, విధి బలీయమని చూపే సంఘటన ఆయన జీవితంలో సంభవించింది. ఆయనకి లీలావతి అనే కుమార్తె ఉండేది. గొప్ప జ్యోతిష్యుడవటం వల్ల లీలావతికి వివాహమవగానే వైధవ్యం ప్రాప్తిస్తుందని ఎరిగాడాయన. సుఖసంసారానికి గ్రహాలు అనుకూలంగా ఉన్న సమయాన వివాహం జరిగితే ఆమె జీవితాన్నే మార్చగలనను కున్నాడాయన. అటువంటి గ్రహస్థితిని ఎంచి వివాహముహూర్తాన్ని పెట్టారాయన. ఆ రోజులలో ఇప్పటి వలె గడియారాలు లేవు. సమయం తెల్పటానికి ఒక నీటి పాత్రను వాడేవారు. దీనిని ఘటిక అనేవారు (అదే నేటి ఘటికారం లేక గడియారం). ఈ పాత్రకు రెండు భాగాలుండేవి - పైదీ, క్రిందిదీ. పై భాగం నుండి ఒక సన్నని రంధ్రం ద్వారా నీరు క్రిందికి జారేది. క్రింది భాగంపైన మందుల సీసాలపై ఉండేట్టుగా గీతలుండేవి. నీటిమట్టాన్ని బట్టి గంట తెలిసికునే వారు. ఒక్కొక్క గీత రోజులో 60వ భాగాన్ని సూచించేది. దీనిని ఘటిక అనేవారు. (ఘట లేక కుండ అన్న మాటనుంచి వచ్చింది). ఒక ఘటిక 24 నిమాషాలతో సమానం. వాతావరణానుసారంగా నీరు ఆవిరి అవటం వల్ల ఈ పద్ధతి అంత సరియైనది కాదని, తరువాతి కాలంలో ఇసుకని వాడటం మొదలుపెట్టారు. ఆ విధమైన సాధనని ఇసుక గడియారం (hour glass) అంటారు. ఆ నాటి సంప్రదాయానుసారం లీలావతి వివాహం ఆమె బాలికగా ఉన్నప్పుడే నిర్ణయమయిపోయింది. ఆ బిడ్డ "నీటి ఘటిక" వద్ద చేరి ఏదో ఆడుకుంది. అందువల్ల ఆమె ముక్కుపుడక నుండి ఒక ముత్యం జారి ఆ ఘటిక యొక్క రెండు భాగాల నడుమగల బెజ్జంపై పడింది. ఆ కారణంగా నీరు క్రిందికి జారటం సన్నగిల్లింది. ముహూర్తాన్ని సూచించే మట్టానికి నీరు వచ్చేప్పటికి, ఆ ముహూర్తం దాటిపోయి చాలా సేపయింది. ఆ తరువాతి లగ్నం, అశుభమైనది, అది వచ్చేసింది. ఆ ముహూర్తానికే లీలావతి వివాహమవటం వల్ల ఆమె బాల వితంతువయింది - జాతకం నిజమయింది.

ఆ ఘటికలో ముత్యం పడినట్టు, ఆ పిల్లతో సహా, ఎవ్వరూ గమనించలేదు. కాని ఆ విషయాన్ని గుర్తించేప్పటికి కాలం మించి పోయింది. అప్పటికే వివాహం జరిగిపోయింది. విధి అనుల్లంఘనీయమని సమాధాన పడ్డారు.

ఆ తరువాత భాస్కరాచార్యునికి గణితశాస్త్రంపై గ్రంథం రచించాలనిపించింది. ఆ గ్రంథానికి కుమార్తె పేరునే ఎనుకొన్నారు. ఆమె పెరిగిన తరువాత ఆమెని మంచి గణితశాస్త్రజ్ఞురాలిగా చేసి, తన గ్రంథానికి ఆమె పేరునే పెట్టుకున్నారు. ఈ గ్రంథంలో అంకగణితం, వ్యక్తగణితం, బీజగణితం ఇత్యాది వన్నీ యున్నాయి. గ్రహాల గతులను, స్థానాలను గణించటానికి "సిద్ధాంత శిరోమణి" అన్న గ్రంథాన్ని కూడా రచించారు.

"ప్రాచీన లేఖామాల" అన్న గ్రంథమొకటి యుంది - పురాతన శాసనాల సంకలనమది. గుజరాత్‌లో సింగన అనే రాజు భాస్కరాచార్యుని రచనలను ప్రాచుర్యంలోకి తీసుకురావటానికి కృషిచేశాడని ఈ గ్రంథం నుంచి తెలుస్తుంది.

యూక్లిడ్ (Euclid) క్షేత్రగణితం (geometry) లోని 7, 8, 9, 10 అధ్యాయాలు దొరకటం లేదంటారు. కానీ, సంస్కృతంలో పన్నెండు గణితగ్రంథాలు చెదరకుండా ఉన్నాయి. మన పురాతన గణితశాస్త్ర గ్రంథాలలో చెప్పబడిన అతిసులువయిన గణన పద్ధతులు కూడా మనకు తెలియవు. గుణింతమంటే పదే పదే జరిగే కూడికే, అట్లాగే భాగహారమంటే పదేపదే జరిగే తీసివేతే.

భాస్కరాచార్యునికి పూర్వము దాదాపు 1500 సంవత్సరాల నాడు, వరాహమిహురుడనే గణిత శాస్త్రజ్ఞుండేవాడు. "బృహత్ సంహిత" "బృహత్ జాతకము" వంటి గ్రంథాల రచయిత ఆయన. బృహత్ సంహిత అనేక శాస్త్రాల సంక్షిప్త రూపము. ఎన్నో శాస్త్రాలను బాగా ఎరిగిన వారు మన ప్రాచీన శాస్త్రజ్ఞులు! "బృహత్ జాతకము" అన్నది జ్యోతిషానికి సంబంధించిన అన్ని విషయాలను చర్చిస్తుంది. "ఆర్యభట్ట సిద్ధాంత" మన్న గ్రంథరచయిత ఆర్యభట్టుడు. ఆయన కూడ పదిహేనువందల సంవత్సరముల క్రితముండేవాడు. ఆర్యభట్టుడు బోధించిన సూత్రాలననుసరించే ఇప్పటి "అంకగణిత" మేర్పడింది. ఆధునిక గణితశాస్త్రజ్ఞులు వరాహమిహిరుని, ఆర్యభట్టుని ఆరాధిస్తారు. ఈ గణితశాస్త్రాలన్నీ నవగ్రహాలూ, నక్షత్రాలూ - వాటి సంచారమూ చెప్తాయి. కాని ఉన్నవి ఏడు గ్రహాలే. రాహుకేతువులు ఛాయాగ్రహాలు, సూర్యచంద్రుల గతికి వ్యతిరేక దిశలో సంచరిస్తాయి. వాటికి ప్రత్యేకమైన లెక్కలు కావాలి. వాటి స్థానాలని తెలుసుకోవాలంటే సూర్య చంద్రుల సంచారాన్ని తిరుగ వేయాలి.

నక్షత్రానికీ, గ్రహానికీ తేడా ఏమిటి? మన సూర్యుని చుట్టూ తిరిగేవి గ్రహాలు. నక్షత్రవీధికి (galaxy) చెందినవి నక్షత్రాలు. కంటి చూపుతో గుర్తించే విధానమొకటి ఉంది. వజ్రాన్ని త్రిప్పుతూంటే మిణుకుమిణుకు మంటూ తళతళలాడుతుంది. నక్షత్రాలూ అంతే. గ్రహాలు మాత్రం అట్లా కాక కాంతిని ఒకే విధంగా వెదజల్లు తూంటాయి.

సూర్యుడూ, చంద్రుడూ స్వయంప్రకాశాలు. నక్షత్రాలు మిణుకు మిణుకు మంటూ ఎన్నో రంగులను చూపుతాయి. బాగా చెక్కిన వజ్రం నుంచి నీలమూ, ఆకుపచ్చా కనబడినట్టు. గురు, శుక్రులు పెద్ద నక్షత్రాల వలె ఉంటాయి కాని అవి నక్షత్రాల వలె తళతళలాడవు. మిణుకుమిణుకుగా కనబడేవి నక్షత్రాలే. సూర్యుడు కూడ అంతే. జాగ్రత్తగా

చూస్తే చుట్టూ ఉన్న జ్యోతిచక్రం మాయమవుతుంది. అప్పుడు నీటిపై తేలుతున్న అద్దం వలె ఉంటుంది.మిణుకు మిణుకు మంటూ కదులుతున్నట్టుంటుంది. చంద్రుడట్లా కాదు.

సూర్యునికి కాంతీ, కదలికా ఎట్లా ఉన్నాయో వివరిస్తాను. పూరిగుడిసెలో చూరులో ఒక చిన్న రంధ్రం ద్వారా సూర్యుని కిరణాలు వస్తున్నాయనుకోండి. ఆ రంధ్రం నుండే చంద్రుని కిరణాలు కూడా వస్తాయి. సూర్యకిరణాలు కదులుతున్నట్లు కనబడగా, చంద్రకిరణాలు నిశ్చలంగా ఉన్నట్లుంటాయి. ఇతర గ్రహాలు చంద్రుని వంటివే. నక్షత్రాలు చిన్నవిగా కనబడినా, వాటికి కదలికా, తళతళలాడటం ఉంటాయి. నక్షత్రం బాగా పెద్దదయితే దాని మెరుపులో సప్తవర్ణాలూ కనబడుతాయి, వజ్రం నుండి వరజిమ్మే రంగుల వలె. సూర్యుని పేర్లలో "సప్తాశ్వాన్" అన్నది ఒకటి. అంటే అతని రథానికి ఏడు గుఱ్ఱాలుంటాయని అర్థం. ఏడు రంగులు గల ఒకే అశ్వమని కూడ అర్థం చెప్పుకోవచ్చు. 'అశ్వ' అంటే 'కిరణ'మని కూడ అర్థముంది. సూర్యునికిరణాలు వెదజల్లే ఏడు రంగుల గురించి ఈ ప్రస్తావన. ఒక కిరణం కూడ ఏడు రంగులనీ విరజిమ్ముతుంది. తైత్తిరీయ ఆరణ్యకం ఒక కిరణానికి ఏడు పేర్లున్నాయని అంటుంది. "ఏకొ అశ్వః వహతి సప్తనామ" అంటే ఒకే రంగు, తెలుపు, వక్రీకరణం వల్ల ఏడు రంగులుగా చీలుతుంది.

నక్షత్రాలు తూర్పున ఉదయించి పశ్చిమాన అస్తమిస్తాయి. గ్రహాలు కూడ పశ్చిమంవైపే కదులుతాయి కాని ప్రతిరోజూ తూర్పు వైపు కొంత కదులుతాయి. ఏడు గ్రహాలూ తూర్పువైపు కదులుతాయి. జ్యోతిషశాస్త్రం ఈ చలనాన్ని అధ్యయనం చేస్తుంది.

**మానవ జీవితాన్ని ప్రభావితం చేసే గ్రహాలు :**

భూమి మీద మానవుని బ్రతుకు గ్రహాల చలనం వల్లనే మారుతూంటుంది. మంచి రోజులు, కష్టకాలం, దుఃఖం, సంతోషం, ఉచ్ఛస్థితి, పతనం - ఇవీ మారుతూఉండే మానవుని జీవిత లక్షణాలు. అటువంటి మార్పులు మానవులకు మాత్రమే పరిమితం కాదు. సంస్థలకూ, దేశాలకూ కూడ మంచిరోజులూ, గడ్డురోజులూ సంభవిస్తూంటాయి. భూమి మీద కనబడే ఈ ఫలితాలకూ గ్రహాల గతికీ సంబంధమున్నదని ప్రాచీన ఋషులు కనుగొన్నారు. మనపై ప్రభావాన్ని బట్టి గ్రహాలగతిని సిద్ధాంతీకరించారు. ఏ కార్యాన్నైనా ప్రారంభించిన వేళ బట్టి, అప్పటి గ్రహస్థితిని బట్టి, ఫలితమేమవుతుందో చెప్పవచ్చు.

ఈ పరిజ్ఞానం "హోరాశాస్త్రం"లో ఉంది. జన్మకాలం నాటి గ్రహాలస్థితి గతులను నిర్ధారించి, జాతక చక్రాన్ని వేయవచ్చు. దాని బట్టి ఆ మనిషి జీవిత పర్యంతమూ మంచి రోజులూ, చెడురోజులూ ఏమిటో చెప్పవచ్చు.

మంచి రోజులకూ, చెడ్డరోజులకూ కారణాలనేకం. ఏదైనా జబ్బుకి కారణాలు చెప్పినట్టే యిదీను. "తత్త్వం"లో మార్పు వల్ల నంటాడు వైద్యుడు, అలౌకికశక్తుల వల్ల నంటాడు మాంత్రికుడు, గ్రహాల మార్పు వల్లనంటాడు జ్యోతిష్యుడు. పూర్వ జన్మ కృత కర్మఫలమంటుంది

ధర్మశాస్త్రం. మానసిక అవస్థల మార్పు ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తుందంటాడు మానసిక శాస్త్రజ్ఞుడు. ఈ రకంగా ఎన్నో కారణాలు చెప్తారు. కాని అసలు కారణమేమిటి? గ్రహాలా, అలౌకిక శక్తులా, మనస్సా - ఇవేవీ కాక మరేదైనానా? ఇవేవీ అసత్యాలు కావు. వీటిలో ప్రతిదాని పాత్రా ఉంది - అన్నీ ఒకే దానికి విభిన్నరూపాలే. మన మర్మం చేసుకోవటానికి అనేక కారణాలు చెప్తారు. వాటి సమిష్టి ప్రభావమే మన అనుభవం. ఒక్కొక్కరు ఒక్కొక్క వ్యాఖ్యానమిస్తారు. వర్షం పడితే, తేమ కలుగుతంది. ఈగలు ముసురుతాయి, కప్పలు బెక బెకమంటాయి. ఇవన్నీ వర్షం యొక్క పరిణామాలే - ఆ విధంగానే పూర్వ జన్మలో మనం చేసిన వాటికి ఫలితాలుగా భావింపదగ్గ సూచిక లెన్నో ఉన్నాయి. ప్రతివ్యాఖ్యానమూ - మరొక నిదర్శనం! వీటన్నిటికీ పరస్పర సంబంధాలున్నాయి. పూర్వ కర్మ ననుసరించే గ్రహాలస్థితి గతులుంటాయి. రోగం వస్తుంది, మనస్సు కలత చెందుతుంది. అతీంద్రియ శక్తులూ పని చేస్తాయి. ఇవన్నీ ఒకే కర్మకి ఫలాలు. దుర్ఘటనకి ఆపాదింపబడిన ప్రతికారణమునూ ఆధారంగా చేసికొని దీనిని నిరూపించవచ్చు. కాని గ్రహాలగతులకు సంబంధించిన లెక్కల ద్వారా నిరూపించటం అన్నిటికంటే తేలిక.

**శకునాలూ, నిమిత్తాలూ :**

జ్యోతిషశాస్త్రంలో ఒక భాగం "సంహిత స్కంద" మన్నాను. భూగర్భంలో నీరు ఎక్కడ ఉంటుంది? భూగర్భంలో నదులూ, వాగులూ ఎక్కడ ప్రవహిస్తూంటాయి? భూగర్భంలో నీరు ఉంటే, భూమిపైన కనబడే సూచనలేమిటి? ఇటువంటి విషయాలు కొన్ని ఈ స్కందంలో ఉన్నాయి. సుగంధద్రవ్యాలను చేయటం, అత్తర్లను చేయటం, గృహనిర్మాణం, శకునాలూ, నిమిత్తాలూ, చెప్పే శాస్త్రం ఇవన్నీ కూడా ఈ స్కందంలో ఉన్నాయి.

శకునానికీ, నిమిత్తానికీ తేడా ఉంది - రెంటినీ కలిపి 'శకునా'లని అన్నా 'శకున'మంటే "పక్షి" అని అర్థం. పక్షుల వల్ల కలిగేవి శకునాలు ఈ భూమి మీద ప్రతిదానికీ మరొక దానితో సంబంధముండి తీరుతుంది. సంఘటనలకు కూడ అటువంటి సంబంధమే ఉంది. సరియైన లెక్కలు కట్టితే వీటి గురించి ముందే చెప్పవచ్చు, అర్థం చేసికోవచ్చు.

భూమి మీద సంభవించే వన్నీ ఒక దివ్యశక్తికి విధేయాలు. అన్నీ ఒక నిర్ణీత పద్ధతిలో జరుగుతాయి. అందువల్ల ఒక విషయాన్ని బట్టి మిగిలిన వాటి గురించి చెప్పవచ్చు. హస్తరేఖలు, ప్రశ్న అడిగిన సమయంలో గ్రహాల స్థితిని బట్టి భవిష్యత్తుని చెప్పటం (ఆరూఢం) జ్యోతిషం - అన్నీ ఒకదానితో ఒకటి సంబంధం కలవే. అన్నీ సత్యాలే. వీటిలో శకునాలొకటి.

శకున శాస్త్రం ఈ విషయాలను కూడ చెప్పుతుంది. (1) మనకి ఎడమవైపు నుండి కుడివైపుకి పక్షి వెళ్తే ఫలితమేమిటి? (2) వివిధ పక్షుల కేకలకు అర్థమేమిటి?

నిమిత్తాలను కూడ తెలియజేస్తుంది. "నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ". అంటాడు అర్జునుడు కృష్ణునితో యుద్ధమారంభమయే ముందు. దుశ్శకునాలు

కనబడుతున్నాయని మనం అనటం వంటిదే అదీను. ఇక్కడ "శకున" మనకుండా "నిమిత్త"మనే సరియైన పదాన్ని వాడాడు. పిల్లి దారికడ్డంగా వెళ్తే శకునం, రాబందు ఎగిరితే శకునం.

ఆ తరువాత భగవంతుడు 'నిమిత్తం' గురించి అర్జునితో "నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్" అంటాడు. "వీరందరూ ఈ యుద్ధంలో హతమవాలని ముందే నిశ్చయించాను. కాబట్టి వీరంతా మృతులేనని భావించు. వారిని హతమార్చేది ఇంకెవ్వరూ కారు, నేనే. నీవు కేవలం ఒక సాధనానివే" అంటాడు. అందువల్లే "నిమిత్త మాత్రం భవ" అంటాడు.

అందువల్ల శకునం ఏ సంఘటననూ కల్పించదు మార్పు చేయదు. ఎప్పటికైనా బయల్పడే పరిణామాన్ని ముందుగానే తెల్పుతుంది. అట్లాగే శకునాలు కూడ పూర్వజన్మ కృత కర్మలకి ఫలితాలు ఎట్లా ఉంటాయో ముందే చెప్తాయి.

క్లుప్తంగా చెప్పాలంటే, ఈ మూడు స్కందాలలోనూ గణితశాస్త్రం గురించి, గ్రహాలగతుల గురించీ, ప్రధానసూత్రాలు చెప్పబడ్డాయి. ఒక మనిషి జీవితంలో మంచి కాలము, చెడు కాలము చెప్పటం హోరలేక జాతకానికి సంబంధించినది. "హోర" అన్న పదంనుండే horoscope అన్న మాట వచ్చింది.

**ఆధునిక ఆవిష్కరణాలూ, ప్రాచీన గ్రంథాలూ :**

వరాహమిహురుడు "బృహత్ సంహిత" అనే గ్రంథాన్ని రచించాడని చెప్పాను. అందులో కొత్తగా కనుగొన్న శాస్త్ర విషయాలెన్నో ఉన్నాయి.

అంతరిక్షంలో ఏ ఆలంబనా లేకుండా గ్రహాలు ఎట్లా వ్రేలాడుతున్నాయి? క్రిందికి పడిపోవేమి? ఈ అద్భుతవిషయాలను న్యూటన్ కనుగొన్నాడని అందరి నమ్మకమూను.

ప్రాచీన విజ్ఞానంలో సూర్యమండలాన్ని వర్ణించే ప్రథమశ్లోకంలో, అంతరిక్షంలో భూమి పడిపోకుండా ఉండటానికి కారణం ఆకర్షణ శక్తి అని ఉంది. ఆదిశంకరులు ఉపనిషత్ భాష్యంలో కూడ భూమికి ఆకర్షణ శక్తి ఉన్నదని పేర్కొన్నారు. గాలిలోకి దేనినైనా విసరినప్పుడు అది భూమిమీద పడుతుంది. దీనికి కారణం భూమ్యాకర్షణ శక్తే. అదే లాగుతుంది. ప్రాణం పైకి వెళ్తుంది, అపానం క్రిందికి లాగుతుంది. అందువల్లే క్రిందికి లాగే శక్తిని అపానశక్తి అంటారు. శంకరులు భూమికి అపానశక్తి ఉన్నదంటారు. దీనినే ఆకర్షణ శక్తి అని కూడా అంటారు. ప్రశ్నోపనిషత్తులో "పృథివ్యాం యా దేవతా సైషా పురుషస్యాపానమ వష్టభ్యాన్తరా" (3.8) అని ఉంది. అంటే, భూమిని నియంత్రించే దేవతే మానవ దేహంలో అపానశక్తిని కలిగిస్తుందని భావం. ఆచార్యుల వారు తమ భాష్యంలో ఇట్లా అంటారు. గాలిలోకి విసరబడిన వస్తువు క్రిందికి లాగబడినట్లే, పైకి లేచే ప్రాణాన్ని అపానం క్రిందికి లాగుతుంది. దీనిని బట్టి ఈ ఉపనిషత్తు ఆకర్షణ సిద్ధాంతం గురించే చెప్పుతోందని స్పష్టమౌతోంది. ఇటువంటి అద్భుత విషయాలెన్నో ఉన్నాయి మన శాస్త్రాలలో. వాటి

గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించకపోగా, ఏ శాస్త్రంలో దేనిని కనుగొన్నా అది పాశ్చాత్య దేశాలనుండే వచ్చిందని నమ్ముతాం!

ఎంతో ప్రాచీన కాలంలో రచింపబడ్డ మన జ్యోతిషగ్రంథాలలో ఇప్పుడు వాడుకలో నున్న గణితశాస్త్ర సిద్ధాంతాలెన్నో ఉన్నాయి. సృష్ట్యాదిలో గ్రహాలన్నీ ఒకే వరుసలో ఉండేవి. కాలక్రమేణా అవి కొద్దిగా జరుగుతూ వచ్చాయి. మరొక కల్ప మారంభమయేప్పటికి అవన్నీ ఒకే వరుసకి వస్తాయి.

భూమ్యాకర్షణ శక్తి గురించే కాక, భూభ్రమణం గురించి కూడ ఆర్యభట్టు, వరాహమిహిరుడు చెప్పారు. 11వ శతాబ్దివరకు పాశ్చాత్యుల సిద్ధాంతమిది "భూమి ఒక్కటే విశ్వంలో మధ్యగా నిలకడగా ఉంటుంది. సూర్యుడు భూమి చుట్టూ తిరుగుతాడు. అందువల్లనే భూమిమీద పగలూ రాత్రీ సంభవిస్తాయి". దీనికి భిన్నంగా ఎవరైనా ఇంకో సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తే ఆ వ్యక్తిని తగులబెట్టించే వారు అప్పటి మూఢమతులు. కాని ఆదికాలంనుండి సత్యమేమిటో మన కెరుకే.

భూమి సూర్యుని చుట్టూ తిరుగుతోందని, సూర్యుడు భూమి చుట్టూ తిరగటం లేదనీ సూచించటానికి ఆర్యభట్టుడు ఒక చక్కని పేరును వాడాడు. అది "లాఘవ గౌరవ న్యాయం" (తేలిక తనం గురించిన సిద్ధాంతం). తేలికగా ఏ పనైనా జరిగితే దానిని హస్త లాఘవమంటారు. అంటే, చేతితో చేసిన పనినేర్పు. "లఘు"కి విపరీతార్థం "గురు". - పెద్దది, బరువైనది - గురు. గురువంటే పెద్దవాడని అర్థం. ఆయన దేశికుడు, ఆచార్యుడు. ఆచార్యుడు గురువైతే, శిష్యుడు లఘువు. గురువైన ఆచార్యుని శిష్యుడు గౌరవిస్తాడు. అందువల్లనే ఆచార్యుని చుట్టూ ప్రదక్షిణ చేస్తాడు. సౌరమండలంలో అన్నిటి కంటె పెద్దది సూర్యుడు. భూమి లఘువు. ఆ పెద్దదాని చుట్టూ చిన్నది తిరుగుతూంటుంది - ఇదే "లాఘవగౌరవ న్యాయం". ఈ విధమైన ఉపమానంతో ఆర్యభట్టు భూమి సూర్యుని చుట్టూ చేసే పరిభ్రమణాన్ని వర్ణించాడు.

శాస్త్రజ్ఞులు మతద్రోహులని, వారిని కాల్చివేసి, శాస్త్రప్రగతిని ఆపటానికి ప్రయత్నించిన వారితో బాటుగా మనం కూడా హిందూమతం గురించి ఇటువంటి ఆరోపణలను చేస్తూ ఉంటాం. "హిందూ దేశంలో శాస్త్రపురోగతి లేకపోవటానికి కారణం, హిందూ మతం ఈలోక వ్యవహారాలను పట్టించుకోకుండా, పరలోక చింతనను ప్రోత్సహించటమే" అంటాం. నిజానికి, మన పూర్వులకు అన్ని శాస్త్రాలూ సుపరిచితాలే.

సూర్యుడు కదలడు. భూమే సూర్యుని చుట్టూ తిరుగుతుంది. తూర్పున ఉదయించి, కొద్దిగా పైకి ప్రాకి, మళ్లీ పశ్చిమాన అస్తమిస్తూన్నట్టు కనబడుతుంది, అంటే. ఇది వాస్తవం కాదని, ఋగ్వేదంలోని ఐతరేయ బ్రాహ్మణంలో ఉంది. అందులో సూర్యోదయంగాని, సూర్యాస్తమయంగాని లేవని ఉంది.

గాలిఎప్పుడూ కదులుతూనే ఉంటుంది - దీనిని మనం గమనించవచ్చు. జ్వాల నిశ్చలంగా ఉండదు, ఎప్పుడూ కదులుతూనే ఉంటుంది. నీరు నిలచిపోదు. ప్రవహిస్తూనే ఉంటుంది. ఆకాశం వైపు చూస్తే సూర్యచంద్రులు కదులుతున్నట్లే ఉంటుంది. శబ్దానికి కారణం ఆకాశమే. ప్రకంపనం వల్లే శబ్దం వస్తుంది. కాబట్టి శబ్దం కూడ కదలికే. కాని పైకి మాత్రం భూమి కదలక, నిశ్చలంగా ఉన్నట్లుంటుంది.

ఆకర్షణశక్తీ, భూభ్రమణమూ అట్లా ఉంచుదాం. భూమి ఆకారం గమనిద్దాం. పాశ్చాత్యులేమంటారు? పూర్వం వారు భూమిని సమస్థలంగా భావించేవారు. కాని తరువాత గోళాకారమని తామే కనుగొన్నట్టు గొప్పలు చెప్పుకుంటారు. సరే, మన భాషలో జియోగ్రఫీ (geography) అన్న దానినే మంటాం? భూగోళశాస్త్రమని కదా. దానిని భూ-శాస్త్రమని కూడ అని ఉండవచ్చు. కాని భూమి గోళాకారం కలదని ఎప్పుడో ఎరిగిన విషయాన్ని తెలియజేయటానికే భూగోళ శాస్త్ర మన్న పేరు వచ్చింది. "గోళం" అంటే గుండ్రని, భూ - అంటే భూమి!

విశ్వంలో అన్ని లోకాలూ, నక్షత్రమండలాలూ ఉన్నాయి. దానినే బ్రహ్మాండ మంటాం. అంటే బ్రహ్మ కల్పించిన అండమని అర్థం. "అండ"మంటే గ్రుడ్డు. గ్రుడ్డు గుండ్రంగా ఉండదు. ఆధునిక విజ్ఞానం నిరూపించేదిదే - విశ్వం గుండ్రంగా కాక అండాకారంలో ఉంటుందని. ఖగోళశాస్త్రం ప్రకారం విశ్వం చలనాత్మకం. "జగత్" అన్న పేరులోనే ఉన్నదీ విషయం. "జగత్" అంటే నిరంతరం కదులుతూ, నిశ్చలంగా ఉండనిది అని అర్థం.

ప్రాచీన భారతంలో కూడా భూమి సూర్యుని చుట్టూ తిరుగుతోందన్న సిద్ధాంతాన్ని వ్యతిరేకించిన వారుండేవారు. వీరు ఉద్దేశాలివి: భూమి పరిధి దాదాపు 25,000 మైళ్లు. భూమి ఒకసారి పరిభ్రమించటానికి దాదాపు 24 గంటలు తీసుకుంటే, రమారమి గంటకు 1000 మైళ్ల వేగంతో పరిభ్రమిస్తోందనమాట. అంటే నిమిషానికి 16 లేక 17 మైళ్లు పయనిస్తుంది. దీని అర్థమిది: భూమి ఎప్పుడూ పరిభ్రమిస్తూండటం వల్ల ఒక స్థానంలో ఈ నిమిషంలో మద్రాసు ఉంటే మరొక నిమిషంలో అక్కడికి మద్రాసుకి 17 మైళ్ల దూరంలో ఉన్న నేలో, సముద్రమో వస్తుందన మాట. ఈ క్షణం మద్రాసులో ఉండే కాకి ఎగిరి ఒక నిమిషం తరువాత క్రిందికి వచ్చిందనుకుందాం. అది ఏ చెట్టు మీద నుంచి నుంచో, ఇంటి మీదనించో ఎగిరితే తిరిగి అక్కడికే వస్తుంది. భూమి అతి వేగంగా తిరుగుతోందంటే, ఆ కాకి వెళ్లిన చోటుకే తిరిగి ఎట్లా రాగలుగుతుంది? భూమి తిరుగుతూ ఉంటుంది. కాబట్టి మద్రాసు ఉండే ప్రదేశం 17 మైళ్లు జరిగి, ఆ స్థానంలో మద్రాసుకి 17 మైళ్ల దూరంలో ఉండేది రావాలి కదా? ఈ ధోరణిలో భూభ్రమణ వాదాన్ని వ్యతిరేకించేవారు మాట్లాడుతారు. దీనికి భూభ్రమణ సిద్ధాంతాన్ని నమ్మేవారు ఏ సమాధానమిచ్చారో నేనెరుగను. కాని ఆధునిక శాస్త్రజ్ఞులతో చర్చించిన తరువాత నాకు తెలిసిన్న విషయమిది; భూమిచుట్టూ 200 మైళ్ల వరకూ గాలితో ఒక వాయుమండల ముంది - ఆ పైని పొరలుపొరలుగా మరికొన్ని

మండలాలున్నాయి. ఇవన్నీ కూడా భూమితో పాటే పరిభ్రమిస్తూ ఉంటాయి. వాళ్ళు చెప్పినదేదో నాకు సరిగ్గా అర్థం కాకపోవచ్చు, కాని భూమితో బాటు వాయుమండలం కూడ పరిభ్రమిస్తోందన్నది నిస్సందేహం.

"అరేబియా అంకెలు" అనబడే అంకెలు - అంటే 1, 2, 3, 4 ..... ఇత్యాది భారతదేశంలోనే జన్మించాయని పాశ్చాత్యులు ఇప్పుడు గ్రహించారు. శూన్యమంటే "౦". ఇది భారతదేశంలోనే ఉదయించిందని పండితులు అందరూ అంగీకరించారు. అందుచే, ప్రాచీన భారతంలో గణితశాస్త్రం గొప్పదశకు చేరుకున్నదని ఒప్పుకున్నారు. మనపూర్వులు శూన్యాన్ని (సున్నాని) కనిపెట్టి ఊరుకోలేదు. ఏ అంకెనైనా సున్నాతో భాగహారిస్తే వచ్చేది అనంతత్వమే నన్న సూక్ష్మ సూత్రాన్ని భాస్కరాచార్యుడు ప్రతిపాదించాడు. ఈ సిద్ధాంతసత్యాన్ని అనంతుడైన భగవంతునితో జోడించి తన గణితశాస్త్ర గ్రంథంలో, మొదటి శ్లోకంలో చెప్పాడు.

భాజకము (భాగించే సంఖ్య) చిన్నదైన కొద్దీ భాగహార లబ్దం (భాగింపగా వచ్చు సంఖ్య) పెద్ద దవుతూ ఉంటుంది పదహారుని ఎనిమిదితో భాగిస్తే వచ్చేది రెండు. నాలుగుతో భాగిస్తే వచ్చేది నాలుగు. రెండుతో భాగిస్తే, ఎనిమిది వస్తుంది. కాని శూన్యంతో భాగిస్తే? వచ్చేది లెక్కకు అందదు - అనంతత్వం. ఏ అంకెనైనా సున్నాతో భాగించగా వచ్చేది అనంతమే. దీనిని "కహర"మన్నాడు భాస్కరాచార్యుడు. "కమ్" అంటే సున్నా, "హరమ్" అంటే భాగించుట.

**గ్రుడ్డి నమ్మకం కాదు - నిరూపించ దగిన సత్యాలు -**

"హిందూ శాస్త్రాలు అర్థంలేని వాటితో నిండి ఉంటాయి. మేరు పర్వత శిఖరం భూమికి ఉత్తరదిశన ఉన్నదని నమ్మకం. అక్కడ నివసించే దేవతలకు మన సంవత్సరం ఒక రోజుతో సమానం. ఆ మేరువు చుట్టూ సూర్యుడు తిరుగుతాడు. భూమిచుట్టూ ఉప్పునీటి సముద్రమే కాక వేరే ఏడు సముద్రాలున్నాయి - వీటిలో చెరుకురసం, పాలు, ఇత్యాదివి ఉంటాయి. అయిదు ఖండాలున్న భూమిపై నున్నవి ఏడు ద్వీపాలు. ఇదంతా శుద్ధ చెత్త"! ఇదీ పాశ్చాతుల వైఖరి. కొన్ని ప్రశ్నలని వేసుకుందాం. సముద్రపు నీరు ఉప్పగా ఎందుకుండాలి? ఆ నీటిలో ఉప్పుని ఎవరు కలిపారు? ఉప్పునీరు ఉండటం నిజమైతే తియ్యగా, పాలవలె ఉండే నీరు ఉండటం అంత ఊహించలేని విషయమా?

సరే, సప్తద్వీపాలూ, సప్తసముద్రాలూ సరికావను కుంటే, ఆ శాస్త్రమే భూమియొక్క స్థానం గురించి ఏమంటుంది? ఉత్తరదిశ చివర మేరుపర్వతమూ, దక్షిణదిశ చివర ధృవనక్షత్రమూ ఉన్నాయని కదా!

ఉత్తరదిశపు చివర అంటే ఉత్తర ధృవమనుకోవచ్చు. దక్షిణ ధృవం వైపు చూస్తే అది సరిగ్గా ఎదురుగా ఉండదు. ఈ ప్రాంతాన్ని కూడా ధృవమనే అంటారు, ధృవనక్షత్రమనే పేరు

ననుసరించి. ఇప్పుడు ఉత్తరధృవానికి సరిగ్గా. ఎదురుగా లేకపోయినా. ఆదిలో ఉండేది. విశ్వాంతరాళంలో జరిగే మార్పుల వల్ల భూమి కొంత ఒరిగిందంటారు. ఆధునిక శాస్త్రవేత్తలు. భూమి ధృవనక్షత్రాని కెదురుగా ఒక బొంగరం వలె తిరుగుతూండేది. ఆ రోజులలో శాస్త్రాలలో చెప్పినట్టు సప్తసముద్రాలు, సప్తద్వీపాలు ఉండేవి. కాని ఆ తిరగటంలో భూమి నిటారుగా లేక కొంత ఒరిగింది. ఆ ఏడు సముద్రాలూ కలిసిపోయి ఉంటాయి. అందువల్లే సముద్రపునీరు ఉప్పగా ఉంటుందనుకుంటాను. ఆ సమయంలోనే సప్తద్వీపాలు ఏడు ఖండాలుగా మారాయేమో!

ఉత్తరధృవానికి ఇంకా ఉత్తరంగా ఏ ప్రదేశమైనా ఉంటే అక్కడే మేరువుంది, అక్కడే స్వర్గం ఉంది. భూమిని ఒక నిమ్మకాయతో పోలిస్తే దాని శిఖరం మేరువు. అక్కడ్నుంచి అన్నీ క్రిందికే, దక్షిణానికే, ఉంటాయి. అక్కడ నుండి తూర్పుకిగాని, పశ్చిమానికిగాని, ఉత్తరానికిగాని వెళ్లే అవకాశం లేదు. దక్షిణముఖంగా దిగటానికి గత్యంతరం లేదు. నిమ్మకాయ 'శిఖరం' పై దేనినైనా ఉంచితే ఇది విశదమవుతుంది. భూమిపై అన్నిటికీ ఉత్తరాన ఉన్నది మేరువే. "సర్వేషాం అపి వర్షానాం మేరు ఉత్తరస్థిత" అన్న మాటకి అర్థమిదే.

ధృవం దగ్గర వాతావరణ మెట్లా ఉంటుంది? ఆరు మాసాలు పగలూ, ఆరు మాసాలు రాత్రీను. ఈ విషయాన్ని ప్రాథమిక తరగతుల్లో కూడా చెప్తున్నారు. ఒక రాత్రీ, ఒక పగలూ కలిసి ఒక రోజు అవుతాయి. అట్లాగే, ధృవప్రాంతంలో ఆరునెలల చీకటీ, ఆరు నెలల వెలుగూ - ఒక సంవత్సరమన మాట- ఒక దినమైనట్టే కదా! ఈ విధంగానే దేవతల ఒక రోజు, మన సంవత్సరానికి సమానమైంది. భూమి తిరుగుతున్నప్పుడు దాని పరిధిలోని ప్రదేశాలన్నీ తిరుగుతూ ఉన్నా, ఉత్తరపు మొనా, దక్షిణపుమొనా తిరుగుతూన్నట్టు కాదు. ఆ ప్రాంతం అతిస్వల్పం - అందువల్లనే దానిని 'మొన" అంటారు.

భూభ్రమణం జరిగేప్పుడు సూర్యచంద్రులతో కల సంబంధాన్ని బట్టి ఆయా ప్రదేశాలకు 18 గంటలు పగలుంటే సరిగ్గా వాటి కెదురుగా ఉన్న వాటికి 6 గంటలే సూర్యరశ్మి ఉంటుంది, మిగిలిన 18 గంటలూ చీకటే. రేయింబవళ్ల నిడివి ఆయా ప్రదేశాల ఉనికిని బట్టి ఉంటుంది - వీటిలో వ్యత్యాసాలు చాలా ఉంటాయి. సూర్యోదయం తూర్పున కొద్ది రోజులు జరుగుతుంది. సరిగ్గా నడినెత్తి మీదికి సూర్యుడు రావటమూ కొన్ని రోజులలోనే. ఇతర రోజులలో సూర్యోదయం కొద్దిగా ఈశాన్యంగానైనా, కొద్దిగా ఆగ్నేయంగానైనా జరుగుతుంది. ఉత్తరధృవం వద్ద అట్లా కాదు. ఆరుమాసాలు వరుసగా పగలు, ఆరు మాసాలు వరుసగా రాత్రీ మళ్లీ పగలు - ఇట్లా జరగటం చూస్తే ఆ ప్రదేశం సూర్యుని చుట్టూ తిరగటం కాక సూర్యుడే ఆ ప్రాంతం చుట్టూ తిరుగుతున్నాడేమో ననిపిస్తుంది. మేరు పర్వతం చుట్టూ సూర్యుడు తిరుగుతాడన్న మాట కర్థమిదే. ఉత్తరధృవప్రాంతంలో ఆరుమాసాల పగలునీ ఉత్తరాయణ మంటారు, అక్కడ చీకటి పడి దక్షిణధృవం వద్ద పగలు వచ్చినప్పుడు దక్షిణాయనమంటారు.

ఉత్తరధృవాన్ని సుమేరు అనీ, దక్షిణధృవాన్ని మేరువనీ అంటారు. 'సుమేరియా' అన్న పేరు సుమేరు నుండి వచ్చినదే. అక్కడ వైదిక దేవతల ఆరాధన జరుగుతూండేదట. ఉత్తిరాన దేవతలున్నట్లే దక్షిణాన పితృలూ, నరకమూ ఉన్నాయి. దివ్య చక్షువులుంటేనే గాని దేవతలనూ, పితరులనూ నరకాన్నీ చూడటమసాధ్యం. మనకా దివ్యదృష్టి లేనంత మాత్రాన ఆ ప్రాంతాలు లేవని అకారణంగా అనకూడదు.

రష్యాలో పుట్టి, అమెరికాలో పెరిగి, భారతదేశంలో స్థిరపడిన బ్లావటస్కీ వంటి వారు థియొసాఫికల్ సొసైటీని (దివ్యజ్ఞాన సమాజం) స్థాపించారు. వారు భూతాల గురించీ, దివ్యుల గురించీ చెప్పారు. సర్ ఆలివర్ లాడ్జ్ అనే సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు భూతాలగురించీ, చనిపోయిన వారి ఆత్మగురించీ ప్రత్యేకంగా ఆధ్యయనం చేశాడు. భూతాలున్నాయని వాటిని ఆవాహనం చేసి మనం లబ్ధిని పొందవచ్చుననీ దృఢంగా చెప్పారాయన.

జ్యోతిషశాస్త్రం ప్రారంభంలో ఖగోళశాస్త్రాలను చెప్పి చివరికి ఆముష్మిక విషయాలను ప్రస్తావించిందంటే అబ్బుర మేమీ లేదు; ఈ విషయాలు పరస్పర విరుద్ధాలు కావని చెప్పటానికా అన్నట్టు. ఆధునిక శాస్త్రజ్ఞులు కూడ అదే మార్గాన నడుస్తున్నారు. మన శాస్త్రాలు ఎప్పుడో ప్రాచీన కాలంలో పుట్టాయి. ఇప్పుడు మనలో మనకి ఉన్నట్టు ఆ రోజులలో మానవులకూ దేవతలకూ పరస్పర సంబంధాలుండేవి. ఏ క్రతువుకైనా మనం చెప్పే "సంకల్పం" గమనిస్తే ఇది విశదమవుతుంది. సంకల్పంలో కొన్ని యుగాల వెనుకకు వెళ్ళి, సృష్ట్యాదికి వెళ్లి, ప్రస్తుతకాలం గురించి చెప్పుతాం. యుగారంభంలో, ఖగోళ శాస్త్ర లెక్కల ప్రకారం, అన్ని గ్రహాలూ ఒక వరుసలో ఉండేవి.

కొన్ని లెక్కల వల్ల ఇప్పుడు వచ్చే సమాధానాలు వేరుగా ఉన్నాయి. ఇప్పుడు భౌతికంగా తెలిసేదానికీ, శాస్త్రాలలో ఉన్నదానికీ తేడా ఉంటే, శాస్త్రాలన్నీ అభూతకల్పనలని మనం త్వరపడి అనకూడదు. గ్రహాలన్నీ ఒకే వరుసలో, ఉత్తర దక్షిణ ధృవాలు ఒకదానికొకటి సరిగ్గా ఎదురుగా ఉన్నప్పుడు శాస్త్రాలావిర్భవించాయి. ఆ పిదప ఎన్నో యుగాలూ, భూమిలో పరివర్తనలూ సంభవించాయి. నేల పర్వతంగానూ, పర్వతం సముద్రంగానూ, సముద్రమెడారి గాను - ఈ విధంగా ఎన్నో మార్పులు సంభవించాయి. ఈ వివరాలన్నీ భూగర్భశాస్త్రజ్ఞుల వద్ద ఉన్నాయి. ఇంతేకాక, గ్రహాల చలనం వల్ల నక్షత్రమండలాలలో కూడ మార్పులు వచ్చాయని ఖగోళశాస్త్రజ్ఞులంటారు. శాస్త్రాలలో చెప్పిన దానికీ ఇప్పుడు కనబడే దానికీ భేదాలు నిస్సందేహంగా ఉన్నాయి.

సృష్టి ప్రారంభం నుంచి ఖగోళశాస్త్రాల అంచనా ప్రకారం వచ్చే సమయానికీ ఆధునిక శాస్త్రానుసారం వచ్చే దానికీ తేడా లేదు.

కలియుగానికి 4,32,000 సంవత్సరాలున్నాయి. ద్వాపర యుగానికి దానికి రెండింతలు అంటే 8,64,000 సంవత్సరాలు. త్రేతాయుగానికి మూడింతలు, అంటే 12,96,000 సంవత్సరాలు. కృతయుగానికి 17,28,000 సంవత్సరాలు. నాల్గింటినీ కలిపి

మహాయుగమంటారు. దానికి 43,20,000 సంవత్సరాలు. అటువంటి వెయ్యి మహాయుగాలు పధ్నాలుగు మనువుల పరిపాలనా కాలం. మనువు పరిపాలనా కాలాన్ని మన్వంతర మంటారు. ఎన్నో రాజ్యాలు, ప్రజాస్వామ్యాలూ వచ్చినా భూమిని పరిపాలంచటానికి భగవంతుడు మనువులను నియమించాడు. పధ్నాలుగు మనువులుంటారు, సృష్ట్యాది నుండి అంతం వరకు. మనువు కాలం నుండి వచ్చిన వారం కాబట్టి మనలను, మనుష్యులు (మనుజులు) అంటారు. ఆంగ్లంలో man అన్న పదం కూడ 'మనువు' నుండి వచ్చినదే. సంకల్పంలో మనం ఫలానా సంవత్సరంలో, వైవస్వత మన్వంతరంలో (ఏడవమనువు, వైవస్వని కుమారుని) ఉన్నామని చెప్పుతాం. దీని బట్టి మొదటి మనువు - స్వయంభువ మనువు - వరకూ శాస్త్రాల ప్రకారం లెక్క పెట్టితే భూమి మీద మానవ జాతి నెలకొన్న కాలానికి సరిపోతుంది.

"మన్" అన్న ధాతువుకి అర్థం ఆలోచించటం. అదే మనస్సు చేసే పని. దీనిని దృష్టిలో పెట్టుకొనే మనువు అన్న పేరు వచ్చింది. సచేతనమైన జీవులలో ప్రథముడు మానవుడు. "ఆలోచించగల జంతువు" అన్నది చాలా సముచితమైన మాట. ఆలోచించగలగటమే మానవుడ్ని జంతువునుండి వేరు చేస్తుంది. అది మనువుతోనే ప్రారంభమైనది. దీనినుండే man అన్న సముచితమైన పేరు వచ్చింది.

పైన చెప్పినట్టు, పధ్నాలుగు మనువుల కాలమే బ్రహ్మకి ఒక పగలు అవుతుంది. అటువంటి కాలమే రాత్రి అవుతుంది. అంటే 8640 మిలియన్ల సంవత్సరాలు బ్రహ్మకి ఒక దినమన్నమాట. అటువంటి 365 దినాలు బ్రహ్మకి ఒక సంవత్సరం. ఈ ప్రకారంగా బ్రహ్మవయస్సు 1200 సంవత్సరాలు. విశ్వం కూడ అంతకాలమే ఉంటుంది. బ్రహ్మలేక పోతే సృష్టిలో ఏదీ మిగులదు. దానినే "మహాప్రళయ" మంటారు. ఆ తరువాత బ్రహ్మ జీవితకాల పరిమితిలో సృష్టే ఉండదు. మన ఊహకందని, అనంతమైన బ్రహ్మమొక్కటే సంస్థితమవుతుంది. ఆ తరువాత మరొక బ్రహ్మ సహాయంతో మరొక సృష్టి ప్రారంభమవుతుంది. ఇప్పుడు మన వైదిక కర్మలలో మనం చేసే సంకల్పానుసారం బ్రహ్మజీవితం ఉత్తరార్థంలో ఉంది.

ఏడులోకాలున్నాయి - అవి భూ, భువః, సువః, మహః, జనః, తపః, సత్యః. సృష్టిలోని వన్నీ, దేవతలతో సహా ఈ ఏడు లోకాలలో ఎక్కడో అక్కడ ఉంటాయి. వీటిలో భూః, భువః, సువః - ఒక వర్గానికి చెందుతాయి. వీటిని 'భూర్భువసువః' అంటారు కర్మలు చేసేప్పుడు. మిగిలిన నాలుగూ వీటి కంటే పై లోకాలు 'బ్రహ్మ రాత్రివేళ నిద్రిస్తే ఈ మూడులోకాలూ లయమవుతాయి. దీనిని అవాంతర ప్రళయ మంటారు. బ్రహ్మ జీవిత కాలం పరిసమాప్తమైతే, అన్ని లోకాలూ (మిగిలిన నాలుగింటితో సహా) లయ మవుతాయి.

మనం గుర్తించలేక పోయినా, సూర్యుని వేడిమి కొద్దికొద్దిగా తగ్గుతున్నదని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. సూర్యుని వేడిమి లేక పోతే జీవరాశులకి మనుగడే లేదు. ఆహారపదార్థాలతో

ఆరంభించి, జీవితాన్ని నిలపడానికి అవసరమైన వన్నీ, అంటే వర్షాల వంటివి కూడ, సూర్యుని వేడిమిపైనే ఆధారపడ్డాయి. అందువల్ల కోటాను కోట్ల సంవత్సరాల తరువాత ప్రపంచమే ఉండదని లెక్కలు కట్టారు. తదుపరి అవాంతర ప్రళయమూ ఆధునిక శాస్త్రజ్ఞులు ప్రకారం ప్రపంచలయమూ ఇంచుమించు ఒకే సమయానికి జరుగుతాయి. అట్లాగే ఈ అంచనాలనే వెనక్కి తిప్పితే సృష్టి ఆది గురించి చెప్పే సమయమూ ఆధునిక శాస్త్రజ్ఞుల అంచనాలతో సరిపోతుంది.

పధ్నాలుగు మనువుల పాలన బ్రహ్మకి ఒక పగలుతో అయిపోతాయి గనుక ఒక్కొక్క మన్వంతరానికీ 71 చతుర్ యుగాలుంటాయి. మన వైవస్వత మన్వంతరంలో మన మిప్పుడు 28 చతుర్ యుగంలోని కలియుగంలో ఉన్నాము. మనం చెప్పే 'సంకల్పం' దీనిని వివరిస్తుంది. అది రోజు, నిమిషం వరకూ కూడ చెప్తుంది. ఇదంతా కాలమానం ప్రకారమే.

సంకల్పంలో మనం నివసించే భూప్రదేశం గురించిన వర్ణనలు కూడ ఉన్నాయి. విశ్వాన్నంతా - అంటే బ్రహ్మాండాన్ని - వర్ణిస్తుంది. అక్కడ్నుంచి మనం నివసించే గ్రామం వరకూ వస్తుంది. మనముత్తరాలు వ్రాసేప్పుడు ఊరిపేరూ, తేదీ వ్రాసినట్టే ఈ వివరాలను సంకల్పంలో చెప్పుతాము. ఈ క్లిష్టమైన లెక్కలన్నీ జ్యోతిషశాస్త్రంలో ఉన్నాయి.

**అనుభవసిద్ధమయ్యే సాక్ష్యం :**

గుడిసె చూరులో చిన్న కన్నంలోంచి సూర్యకిరణం వచ్చినేలపై పడుతుంది. వచ్చే సంవత్సరం ఆ కిరణ మెక్కడ పడుతుందో చెప్పలేం. కాని జ్యోతిషశాస్త్రానుసారం చేసే లెక్కల సహాయంతో ఆ రోజునే నిర్ధారణ చేయవచ్చు. పూర్వకాలంలో ఒక ముత్యాన్ని త్రాడుతో వేళ్లాడదీసి, నిర్ణీత సమయాలలో నేలమీద సూర్యుని కిరణాలు ఎప్పుడు పడుతాయో చెప్పే వాళ్ళని రాజులు సత్కరించేవారు. మిగిలిన శాస్త్రాలలో కేవలం వాక్చాతుర్యంతో ఇటువంటి సత్కారాలు పొందవచ్చు కాని జ్యోతిషశాస్త్రజ్ఞులు ప్రత్యక్షంగా నిరూపించవలసి వచ్చేది. అక్కడ మోసానికి తావులేదు. వారి ప్రజ్ఞకు సూర్యచంద్రులే సాక్షులు!



# 20

# వేదాంగములు : కల్పము

**వేదపురుషుని బాహువులు :**

వేదపురుషుని ఆగవ అంగం - కల్పం - ఆయన బాహువుగా పరిగణింప బడుతుంది. వేదోక్తమైన కర్మని చేయటానికి "కల్పం" ప్రేరకం. శిక్ష - వ్యాకరణ - ఛందస్సు - నిరుక్త - జ్యోతిషం అధ్యయనం చేసిన తరువాత ఏమి చెయ్యాలి? ఫలితాలని పొందటానికి ఏదైనా చేయాలి. మన మనస్సుకి తోచినదాని నల్లా చేయటం వలన కలిగిన పాపాలను క్షాళనం చేసుకోవటానికి ఏవైనా మంచి పనులు చెయ్యాలి. ఇవి చేయటానికి ఒక మంత్రముండాలి. దానిని సరిగ్గా ఉచ్చరించటం నేర్చుకోవాలి. దాని అర్థం తెలిసికోవాలి. కర్మని చేయటానికి అవసరమైన సాధనసామగ్రియుండాలి. అంటే ఒక యిల్లో వేరే ఏదైనా అనువైన స్థలమో ఉండాలి, ఈ పనులు చేయటానికి. ఫలితాన్ని భగవంతునికి అర్పించాలి. "కల్పం" ఈ విషయాలకి సంబంధించినది. విధేయతతో వేదాలను వల్లించాలి. "శిక్ష" ద్వారా వాటిలోని పదాలను నిర్దుష్టంగా నేర్చుకోవాలి. తత్సంబంధమైన వ్యాకరణాన్ని నేర్చుకోవాలి. లయనూ, అర్థాన్నీ ఛందస్సుద్వారా, నిరుక్తం ద్వారా గ్రహించాలి. కర్మను చేయటానికి శుభముహూర్తాన్ని జ్యోతిషం వల్ల తెలుసుకోవాలి. కల్పంలో చెప్పబడిన కర్మల నిర్వహణ కొరకే ఇవన్నీను. 'ఏ కర్మను ఏ విధంగా చేయాలి? ఏయే కర్మలను ఏయే జాతుల వాళ్లు, ఏయే ఆశ్రమాలలో చేయాలి? (ఆశ్రమాలంటే బ్రహ్మచారి, గృహస్థు, సన్యాసి) ఏ కర్మకి ఏ మంత్రం, ఏ సామగ్రి, ఏ అధిష్ఠాన దేవత? ఎందరు ఋత్వికులను నియమించాలి? ఏయే ఆకారాలుగల ఏయే పాత్రలను వినియోగించాలి' - ఈ విషయాలనన్నిటినీ కల్పం చెప్పుతుంది.

కల్పశాస్త్రాన్ని ఎందరో ఋషులు సంకలనం చేశారు. దక్షిణ భారతంలో ఎక్కువ ప్రాచుర్యంలో ఉన్న కృష్ణయజుర్వేదానికి సంబంధించిన పది కల్పసూత్రాలను రచించిన ఋషులు ఆరుగురు - వాళ్లు ఆపస్తంబుడు, బోధాయనుడు, వైఖానసుడు, సత్యాషాఢుడు, భరద్వాజుడు, అగ్ని వేషుడు. ఋగ్వేదానికి ఆశ్వలాయనుని కల్పమే ఎక్కువగా వాడుకలో ఉన్నది. సాంగాయనుడు రచించినది కూడ ఒకటుంది. శుక్లయజుర్వేదానికి కాత్యాయనుని సూత్రాలున్నాయి. సామవేదంలోని కౌథుమశాఖకి లాట్యాయనుడు, రాణాయనేయ శాఖకి ద్రాహ్యాయణుడు, తలవకార శాఖకి జైమిని - కల్ప సూత్రాలు రచించారు. ప్రతిశాఖకి సంబంధించిన కల్పంలోనూ రెండు వర్గాల సూత్రాలున్నాయి. అవి - గృహ్యాసూత్రాలు, శ్రౌతసూత్రాలు. ఈ రెండు సూత్రాలూ గర్భంలో శిశువు ఉదయించినది మొదలు, దేహానికి దహనం జరిగే వరకు చేయవలసిన కర్మలను వివరిస్తాయి. దహనసంస్కారం కూడ ఒక క్రతువే. దానిని అంత్యేష్టి - అంటే ఆఖరికర్మ - అని అంటారు. ఇందులో దేహాన్నంతా అగ్నికి అర్పిస్తారు.

అగ్నిహోత్రాన్ని ఆధారంగా చేసుకొని బ్రాహ్మణుడు ప్రతిదినమూ ఇరవైయొక్క యజ్ఞాలు చెయ్యాలి - అవి ఏడు హవిర్యజ్ఞాలు, ఏడు సోమయజ్ఞాలు, ఏడు భాగయజ్ఞాలు. వీటిలో హవిర్యజ్ఞాలూ, సోమయజ్ఞాలు గృహ్యసూత్రాలలో ఉండవు. ఈ పద్నాలుగూ శ్రౌతసూత్రాలలో ఉంటాయి. ఇవి నలభై కర్మలలో, సంస్కారాలలో ఉంటాయి (సంస్కారమంటే పరిశుద్ధం చేసేది అని అర్థం).

అగ్నిహోత్రాన్ని గృహంలో చేయాలి. యజ్ఞాన్ని అరుబయట ఒక ఆచ్ఛాదన క్రింద చేయాలి. శ్రౌతసూత్రాలు ముఖ్యమైన యజ్ఞాలను వివరిస్తాయి. గృహ్యా సూత్రాలు - ఇంటిలో చేయవలసిన కర్మలను వివరిస్తాయి. కల్పసూత్రాలు - నలభై సంస్కారాలను, ఎనిమిది ఆత్మ గుణాలను వర్ణిస్తాయి. హవిర్ - సోమయజ్ఞాలకి సంబంధించిన పద్నాలుగు యజ్ఞాలనూ మినహాయించి, మిగిలిన ఇరవైఅరు కర్మలూ గృహ్యాసూత్రాలలో ఉంటాయి. ఇవి గర్భాదానం, పుంసవనము, సీమంతం, జాతకర్మ (పుట్టిన తరవాత చేసే సంస్కారం), నామకరణం, అన్నప్రాసన, ముండనం, ఉపనయనం, వివాహం, అంత్యేష్టి - వంటివి. వీటి గురించి మళ్లీ చెప్పుకుందాం.

ఎనిమిది ఆత్మ గుణాలివి : (1) దయ, (2) క్షమ (ఓర్పు) (3) అనసూయ (అసూయ లేకపోవటం) (4) శౌచం (పరిశుభ్రత) (5) మొండితనం లేకపోవటం (6) మధురస్వభావం (7) అత్యాశలేకపోవటం (8) నిష్కామం - వీటిని సామాన్యధర్మాలంటారు - ఇవి అందరికీ, జాతి భేదం లేకుండా, వర్తించే ధర్మాలు.

పెద్దవాళ్లకి అభివాదాలని చేసేప్పుడు మనమే సూత్రాన్ని అవలంబిస్తామో చెప్పుకుంటాం. ఇది శ్రౌతసూత్రాలకి సంబంధించినదే. ఉదాహరణకి సామవేదం వారు ద్రాహ్యాయన సూత్రాన్ని అనుసరిస్తామంటారు. ద్రాహ్యాయణుడు శ్రౌతసూత్రాలనే రచించాడు. గోబిలుడనే ఋషి గృహ్యాసూత్రాలను రచించాడు. కాని పూర్వకాలంలో వైదిక కర్మలను ఎంతో విధేయతతో, ఉత్సాహంతో చేస్తూ ఉండటం వల్ల శ్రౌతసూత్రాలే వారి వారి స్వంతసూత్రాలయాయి. ఆ ఆనవాయితీయే ఇప్పుడు కూడా సాగుతోంది. తరువాతి కాలం వారు ఏ పెద్ద శ్రౌతకర్మనీ చేయరు. కాని వివాహాది గృహకర్మలను మాత్రం చేస్తారు. శ్రౌత కర్మలకంటె గృహ్యకర్మలు తక్కువ ప్రాధాన్యం కలవి. కాని, ఇప్పుడవే ప్రధానమైనాయి.

పూర్వపు రోజులలో పేదవారు కూడ అవసరమైతే భిక్షాటనం చేసి, శ్రౌత కర్మలను నిర్వహించేవారు. ఆ రోజులలో కొందర్ని "ప్రతివసంత సోమయాజుల"నేవారు. అంటే ప్రతి వసంతకాలంలోనూ సోమయజ్ఞం చేసేవారని అర్థం. ఎవరి సాలుసరి ఆదాయమైనా మూడు సంవత్సరాల పాటు నిలిచేదయితే వారు ప్రతి వసంతంలోను సోమయజ్ఞం చేసేవారు. ఇదంతా ఇప్పుడు మారిపోయింది. ఈ రోజులలో సంపన్నులైనా, వారి మూడు సంవత్సరాల ఆదాయాన్నీ ఒక్క ఏడాదిలో ఖర్చుచేసే సామర్థ్యం వచ్చింది. నేటి సమాజపు ఆర్థిక వ్యవస్థ అందరినీ పేదవారిగా, దీనులుగా చేసేసింది. ఇది వ్యాపారస్థులకే వర్తిస్తుంది. అన్ని

విషయాలలో మితముండాలి. "అతి"ని వర్జించాలి. ఆధునిక యాజమాన్య చాతుర్యమంతా మనల్ని నిత్య అసంతృప్తులని చేసింది. సంపన్నుడుకూడా తట్టుకోలేని ఎన్నో ఖర్చులు చేయవలసి వస్తోంది. ఈ వ్యక్తిగత వ్యయాలను తగ్గించుకోవాలి. ఉన్న వనరులను మంచి కార్యాలను చేయటానికి మళ్లించి, వినియోగించు కోవాలి.

యజ్ఞాలను నిర్వహించేటప్పుడు "చయన"మనే ప్రక్రియ ఒకటుంది. కల్పంలో దీనికి సంబంధించి శుల్బసూత్రమని ప్రత్యేక విభాగ మొకటుంది. శుల్బ సూత్రాలు రెండు రకాలు సామాన్యసూత్రాలు, విశేషసూత్రాలు. కాత్యాయన, బోధాయన, హిరణ్యకేశులు - ఈ ముగ్గురూ శుల్బ సూత్రాలను రచించారు. శ్రౌతము అన్నది శృతిలో, వేదంలో, వస్తుంది. శ్రౌతకర్మలు పెద్ద పెద్ద క్రతువులు - వాటిని ప్రత్యేకంగా బయట నిర్మించిన శాలలలో నిర్వహించాలి. ఇంటిలో చేయటం సాధ్యంకాదు. అందువల్లనే, ఇంటిలో చేయగల చిన్న చిన్న కర్మలను గృహ్యకర్మలంటారు. ఈ రోజులలో యజ్ఞాలని చేయటమే అరుదు. కాని కొన్ని గృహ్యకర్మలని జరుపుతున్నారు.

మన శాస్త్రాలన్నీ మనల్ని భగవంతునివైపే నడుపుతాయి. ఏది వ్రాసినా, దేనిని చదివినా దానిని భగవదంకితం చెయ్యాలి. అది ఆధ్యాత్మిక ప్రగతికి దోహదమవాలి. మన శాస్త్రాల పద్ధతి యిది. వైదిక మతమునకు అత్యంత ముఖ్యమయిన శ్రౌత కర్మలను (హవిర్, సోమ యజ్ఞములు) క్వచిత్తుగా జరుగుతున్నాయి.

ద్రాహ్యాయనునీ, కాత్యాయనునీ మినహాయిస్తే కల్పసూత్రాలను రచించిన మిగిలిన వారు అంటే, ఆపస్తంభ, బోధాయన, ఆశ్వలాయనులు, శ్రౌతసూత్రాలనూ, గృహ్యసూత్రాలను కూడ రచించారు. ఇవి కాక ధర్మ సూత్రాలు కొన్ని యున్నాయి. వ్యక్తిగా, గృహస్థుగా, సామాజకునిగా మనిషి ఎట్లా నడుచుకోవాలో చెప్తాయివి. వీటినుండే తరువాతి కాలంలో ధర్మశాస్త్రాలు ఉదయించాయి.

అధర్వశాస్త్రం అంత ప్రాచుర్యంలో లేదు ఈ రోజులలో. తత్సంబంధమైన కల్పసూత్రాలు కూడా అలభ్యములే.

ఎంత చిన్న పనినైనా నేర్పుతుంది, కల్పం. బ్రాహ్మణుడు ఎంత చిన్నపని చేసినా దానికి వేదాలతో సంబంధముంటుంది. అప్పుడే అతను ప్రతిశ్వాసలోనూ, ప్రతి అడుగులోనూ దివ్యశక్తుల సహాయాన్ని పొందగలగుతాడు. అందువల్లనే అతడు ఎట్లా కూర్చోవాలో, ఎట్లా భుజించాలో, ఎట్లా బట్టలను ధరించాలో కూడ చెప్పబడియున్నాయి. ఉదాహరణకి కల్పశాస్త్రం ఇళ్లనెట్లా కట్టుకోవాలో చెప్తుంది. గృహనిర్మాణం (ఇంటి నమూనా) వాస్తు లక్షణమూ (ఏయే సామాగ్రిని ఉపయోగించాలో) చెప్తుంది. ఇవన్నీ చెప్పటానికి కారణమిది; లోకకల్యాణానికై ప్రకృతిలోని శక్తులను ఉపయోగించుకునే వీలుని గృహనిర్మాణం కల్పించాలి. "వైశ్వదేవబలి" అన్నది యింటికి నిర్ణీతమైన గుమ్మము వద్దనే చేయాలి - ఎక్కడ పడితే అక్కడకాదు. ఇప్పటి ఫ్లాట్లలో (flats) ఇది సాధ్యం కాదు. వేదాల అనుష్టానాన్ని సానుకూలం

చేయటం కోసమే గృహనిర్మాణం గురించి కల్పసూత్రాలలో చెప్పబడింది. ఉపాసన (హోమానికై అగ్నిని రగిల్చే ప్రదేశం) స్థలానికి ప్రత్యేకమైన ఆకారముంది - హోమం సక్రమంగా నిర్వహించటానికై శాస్త్రాలలో ఆ కొలతల వివరాలున్నాయి. వాటి ప్రకారం లేకపోతే, క్రతువు చెయ్యటం కష్టం. బడిలో తరగతి గదులలో బల్లలనూ, కుర్చీలనూ విద్యాబోధనకి తగినట్లు ఎట్లా అమరుస్తారో ఈ పథకాలుకూడ వైదిక కర్మల సక్రమ నిర్వహణకే ఏర్పడ్డాయి. మామూలు స్కూళ్లల్లో కూడ శాస్త్ర ప్రయోగాలు చేసే ప్రయోగశాలలలో ఉండే బల్లలకూ, కుర్చీలకూ - పాఠాలు చెప్పే గదులలో ఉండే వాటికీ తేడా చూస్తూనే ఉంటాం.

శిల్పశాస్త్రాన్ననుసరించి మనమిళ్లను కట్టుకోవాలి. సూత్రాలను రచించిన వారు గృహస్థు తన గృహాన్ని ప్రత్యేక విధంగానే కట్టుకోవాలని నిర్దేశించారు. వేదోక్తమైన జీవనాన్ని గడుపుదామనుకున్న వారికే ఇది వర్తిస్తుందని వేరే చెప్పనక్కర్లేదు. కాని, ఇంకొకరెవరో, ఇంకో పథకం ప్రకారం కట్టుకున్న యింట్లో నివసించ వలసి వస్తే - వైదిక కర్మల నిర్వహణకు ఆ యిల్లు అనువుగా ఉండదు. కొన్ని కర్మలను చేయటానికి యిల్లు అనుకూలంగా లేదంటూ మొదలు పెట్టుతాం, కాలక్రమేణా మన సంకల్పం సడలుతుంది, విశ్వాసం క్షీణిస్తుంది. ఇంటిని మార్చుకోవటం కష్టం కాబట్టి మన జీవన విధానాన్ని మార్చుకుంటాం.

శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - ఇవి ఆరు శాస్త్రాలు. ఇవి కాక నాలుగువేదాలతో కలిపి ఇప్పటివరకు పధ్నాలుగులో పది విద్యలగురించి పరిచయం చేసుకున్నాం. మిగిలిన నాల్గింటినీ చూద్దాం.



# 21

# ఉపాంగములు : మీమాంస

చతుర్దశ విద్యలలోనాలుగు వేదాలూ, ఆరు వేదాంగాలూ తరువాత మిగిలిన నాలుగు ఉపాంగములు. ఇవి మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము.

"మీమాంస" అన్న సమాసంలో "మాఙ్" ధాతువుకి "సన్" ప్రత్యయం చేర్చబడింది. ఈ రెండు మాటల అర్థం పూజిత 'విచారణ' లేక 'ఆదరణీయమైన విషయమై గంభీరమైన పరిశీలన'. ఆ విషయం - వేదాలు. 'నిరుక్తం'లో వేదమంత్రాల అర్థముంటుందని చెప్పుకున్నాం. ఆయా మంత్రాల ప్రాముఖ్యత, ఉద్దేశమూ, వాటి విశిష్టతా నిర్దుష్టంగా గ్రహించే పద్ధతిని మీమాంస తెలుపుతుంది.

వేదాలలో రెండు ప్రధాన విభాగాలున్నాయని చెప్పుకున్నాం. అవి కర్మకాండ, జ్ఞానకాండ. వేదశాఖ మొదటి భాగంలో కర్మకాండ ఉంటుంది, అందువల్ల దానిని పూర్వభాగమంటారు. దీని తర్వాత వచ్చేదానిని ఉత్తరభాగమంటారు. అట్లాగే మీమాంసలో కూడ రెండు భాగాలున్నాయి : పూర్వమీమాంస, ఉత్తరమీమాంస.

పూర్వమీమాంస కర్మకాండలో చెప్పబడిన కర్మల, యజ్ఞాల ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తుంది. ఉత్తరమీమాంస జ్ఞానకాండ విషయమైన ఆత్మసాక్షాత్కారం ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తుంది.

ఉపనిషత్తుల గురించీ, బ్రహ్మసూత్రాల గురించీ ప్రస్తావించినప్పుడు ఉత్తరమీమాంస గురించి చెప్పటమయింది. ఉత్తరమీమాంసనే, వేదాంతమని సాధారణంగా అంటారు. "మీమాంస" అన్న పదానికి "పూర్వ" అని గాని, "ఉత్తర" అని గాని చేర్చకపోతే, అది పూర్వమీమాంస క్రిందే లెక్క. అయినా పూర్వమీమాంస గురించి చెప్పుకునేప్పుడు అక్కడక్కడ ఉత్తరమీమాంస, అంటే వేదాంతం, గురించి కూడ ప్రస్తావిస్తాం.

ప్రతి శాస్త్రానికీ ఒక సూత్రము, ఒక వార్తికము, ఒక భాష్యమూ ఉంటాయని ముందే చెప్పుకున్నాం. పూర్వమీమాంసకి సూత్రాన్ని రచించిన ఋషి జైమిని. దానికి భాష్యాన్ని శబరస్వామి, వార్తికాన్ని కుమారిలభట్టు వ్రాశారు. పూర్వమీమాంస సూత్రాలపై ప్రధానమైన వ్యాఖ్యానం, కుమారిల భట్టు రచించిన "భాట్టదీపిక". కుమారిల భట్టు - కుమారస్వామి అవతారమంటారు. కుమారిల భట్టు వ్యాఖ్యానానికి కొద్ది తేడాతో ప్రభాకరుడు కూడ ఒక భాష్యాన్ని వ్రాశాడు. అందువల్ల పూర్వమీమాంసని అనుసరించేవారు (అంటే, మీమాంసకులు) రెండు వర్గాలవారు - కుమారిల భట్టు అనుచరులు, ప్రభాకరుని అనుచరులు. వీరి మధ్య గల విభేదాలను మనం పట్టించుకోనక్కరలేదు. పూర్వమీమాంస అంటే ఏమిటో స్థూలంగా తెలుసుకుందాం.

జైమిని రచించిన పూర్వమీమాంసాసూత్రము బృహద్గ్రంథం. దానిలో పన్నెండు అధ్యాయాలున్నాయి. ప్రతి అధ్యాయంలోనూ ఎన్నో పాదాలున్నాయి. ఒక్కొక్క పాదానికి అధికరణలున్నాయి. మొత్తమ్మీద వెయ్యి అధికరణలున్నాయి. ఒక్కొక్క అధికరణమూ ఒక్కొక్క విషయమే ప్రస్తావిస్తుంది. అంటే మొత్తం మీద వెయ్యి విషయాల ప్రస్తావన ఉన్నదన్న మాట. ఈ అధికరణలలో కొన్ని వేదోక్తుల సూక్ష్మ పరిశీలన ఉంది. వేదాలు శాశ్వతం, ఆద్యంత రహితం, అవి దైవవిహిత శాసనాలు. మనం పాలితులం, ఆయన ప్రభువు. ఆయన ఎందరో అధికారులను నియమించాడు. సృష్టి పరిపాలన నంతా ఎందరో దేవతలు, అంటే - ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, యముడు, ఈశానుడు, కుబేరుడు, నిర్‌ఋతి వంటి వారు నిర్వహిస్తారు. పధ్నాలుగు భువనాలలోని జీవరాశులని పరిపాలించటానికి కొన్ని నిబంధనలు, నియమాలూ ఉండాలి వారికి. ఇవి వేదాలలో ఉన్నాయి. వేదాలను విశ్లేషిస్తే మనమెట్లా నడుచుకోవాలో, నిబంధనలను దేవతలు ఎట్లా అమలుపరుస్తారో తెలుస్తుంది. మన నిత్యజీవితంలో, తగాదాలను. న్యాయాధీశులు పరిష్కరిస్తారు. దేశంలోని శాసనానుసారం విషయాన్ని న్యాయవాదులు విశదీకరిస్తే, న్యాయాధీశులు తీర్పు చెప్తారు. ఆ విధంగానే మానవమనుగడకు సంబంధించిన వేదాలలోని శాసనాల అంతరార్థాన్ని, భావాన్నీ జైమిని విశదీకరించాడు. ఏదైనా వాజ్యం న్యాయస్థానానికి వస్తే అటువంటి సమస్యనే అంతకు పూర్వమెట్లా పరిష్కరించారో, అంటే మరొక న్యాయస్థానంలో ఏ తీర్పు చెప్పారో, చూచుకుంటారు. న్యాయాధీశుడు తన తీర్పునిచ్చేముందు, ఆ దృష్టాంతాన్ని కూడ గుర్తుంచుకుంటాడు. వెయ్యి అధికరణలూ వెయ్యి సమస్యలను తీసుకొని పైకి కనబడే అర్థంతో పోనీక వాటి పూర్వాపరాలను కూలంకషంగా చర్చించి ఒక నిర్ణయానికి వస్తాయి. ఈ విశ్లేషణా పద్ధతిని మీమాంస అంటారు. ఆరంభంలో వేదంలోని ఒక విషయవాక్యాన్ని తీసుకుంటారు. ఆ తరువాత, ఆ వాక్యార్థమిదే నని సమస్యని లేవనెత్తుతారు. ఆ పిదప, ఆ అర్థానికి వ్యతిరేకంగా వాదించటం (పూర్వపక్షం) జరుగుతుంది. తరువాతి పని పూర్వ పక్షంలో చెప్పిన దానిని ఖండించటం, దీనిని ఉత్తర పక్షమంటారు. ఆఖరిదశలో పూర్వాపరాలను గ్రహించి, ఒక నిశ్చయానికి రావటం. దీనిని నిర్ణయమంటారు. ప్రతి విషయముపైన నిర్ణయాన్నీ, ప్రతి అధికరణంలోనూ చెప్తారు.

జైమిని సూత్రాలు క్లుప్తంగా ఉంటాయి. వాటిలోని భావాలు శబరస్వామి భాష్యంలో వివరింపబడ్డాయి. "శబర" అన్న పదం బోయ జాతికి కూడ వర్తిస్తుంది. రామాయణంలో శబరి ఈ జాతికి చెందిన వ్యక్తే. పరమశివుడు, అర్జునునికి పాశుపతాస్త్రాన్ని ప్రసాదించటానికి వేటకానివేషంలో శబరగా వచ్చాడు. అప్పుడే తన వార్తికాన్ని రచించాడని ఒక కథకూడ ఉంది.

పూర్వమీమాంసలో వెయ్యి అధికరణలుండటం చేత "సహస్రాధికరణి" అని కూడ అంటారు. వేదవచనాలకి కేవలం ప్రతి పదార్థాలపై ఆధారపడి తప్పుడు భావాన్ని గ్రహించకుండా అసలైన తాత్పర్యాన్ని వివరించటమే వీటి ఉద్దేశం. పూర్వమీమాంస కర్మకాండ (లేక, పూర్వకాండ) యొక్క అసలైన అర్థాన్ని వివరించినట్టే ఉత్తరమీమాంస జ్ఞానకాండ (లేక ఉత్తరకాండ) యొక్క అసలైన భావాన్ని వివరిస్తుంది.

ఉపనిషత్తులు పరమాత్మాది విషయాల గురించి చెప్తాయి. తన బ్రహ్మసూత్రాల ద్వారా వేదవ్యాస మహర్షి ఉపనిషదర్థములను వివరించాడు. జ్ఞానకాండకు చెందిన ఉత్తరమీమాంసపై వార్తికాన్ని రచించిన వాడు సురేశ్వరాచార్యుడు - ఆదిశంకరుల శిష్యుడు. ఈయన తన పూర్వాశ్రమంలో, అంటే సన్యాసాశ్రమాన్ని స్వీకరింపక ముందు, మండన మిశ్రుడనే పూర్వమీమాంసకుడు. కర్మకాండయొక్క గొప్పదనాన్ని గట్టిగా సమర్థించేవాడు. ఆయనే కర్మనుండి జ్ఞానానికి మారి ఆదిశంకరుల శిష్యుడై బ్రహ్మసూత్రాలపై శంకరుల భాష్యానికి వార్తికమును రచించాడు.

ఉత్తరమీమాంస అంటే వేదాంతం. వైదిక ధర్మాన్ని పునరుద్ధరించి సుప్రతిష్ఠం చేసిన ఆదిశంకరులు వేదాల ఉపాంగమైన పూర్వమీమాంసకి అభ్యంతరం చెప్పనేల?

ఈ ప్రశ్నకి సమాధానం చెప్పేముందు, ఏ విద్యకైనా (అంటే మీమాంసకైనా, శాస్త్రానికైనా) లక్ష్యమేమిటో పరీక్షించాలి. ఏ శాస్త్రమైనా చివరికి భగవద్దర్శనానికి దారి తీయాలి. మన శాస్త్రాలన్నీ అటువంటివే. వ్యాకరణానికీ, శబ్దశాస్త్రానికీ కూడ అదే లక్ష్యం. అందువల్లనే వాటిని పథ్నాలుగు విద్యలలో చేర్చారు. సరే, భగవంతుని గురించి పూర్వమీమాంస ఏమంటుంది? ఉత్తరమీమాంస ఏమంటుంది? ఈ రెండు మార్గాలలో భేదాలేమిటి? చూద్దాం.

భగవంతుడెవరు? ఆయన లక్షణాలేమిటి? ఆయనని ఏ విధంగా నిర్వచించాలి? ఆదిశంకరులవారు భాష్యం రచించిన వ్యాసుని బ్రహ్మసూత్రాలు, ఈశ్వరుని గురించి ప్రస్తావించాయి. అందులో "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అంటారు. అంటే, దృశ్యమానమైన ప్రపంచానికి కర్త, అంటే సృష్టికర్త, ఈశ్వరుడని అర్థం. వైదిక మతానికి ఆవలనున్న మతాలు కూడ భగవంతుని "కర్త"గానే పేర్కొంటాయి. ఈశ్వరుడు సృష్టికర్తే కాదు - మన మంచి పనులకు చెడు పనులకు సంబంధించిన ఫలితాలను మనకే ఇచ్చే వాడు కూడాను.

మీమాంసకులు, అంటే పూర్వమీమాంసని అనుసరించి కర్మకాండకే ప్రాధాన్యమిచ్చే వారు, సృష్టికార్యంలో ఈశ్వరుని పాత్రగురించి ఏమీ చెప్పరు. వారికి అది అంత ప్రధానం కాదు. వారు ఈశ్వరుని ఫలదాతగా - అంటే మనం చేసే పనులకు ఫలితాలనిచ్చే వానిగా చూడరు.

వేదాలలోనూ, బ్రహ్మసూత్రాలలోను ఈశ్వరుని లక్షణాలుగా పేర్కొనబడినవి రెండు: దృశ్యమానమైన జగత్సృష్టికర్త, కర్మఫలదాత. ఈ రెంటిలో మొదటి లక్షణాన్ని సాంఖ్యులు, రెండవదానిని మీమాంసకులు వ్యతిరేకించారు. మీమాంసకుల దృష్టిలో ప్రతిపనికీ ఏదో ఒక ఫలితముంటుంది, ధీనికీ ఈశ్వరుడికీ సంబంధం లేదు. అందువల్ల ఈశ్వరుడు ఫలదాత కాడు. వేదోక్తమైన కర్మలను సక్రమంగా నిర్వహించటం వల్ల పుణ్యం లభిస్తుంది. దుష్కార్యాలు దుష్ఫలితాలనే తప్పకుండా ఇస్తాయి - ఇదీ వారి నమ్మకం. అందువల్ల ఈశ్వరుని ప్రమేయం లేకుండానే మనం చేసే పనులు ఫలితాలను వాటంతటవే ఇస్తాయి. వేదాల పవిత్రతను

అంగీకరించిన మతాలలో సాంఖ్యము - భగవంతుని సృష్టికర్తగా నిరాకరించింది. మీమాంస ఆయనని కర్మ ఫలదాతగా నిరాకరించింది *

**మీమాంసా సిద్ధాంతాలు :**

మీమాంసా సిద్ధాంతాల గురించి కొంత చెప్పుకుందాం. మీమాంసకులు ఈశ్వరుడు ఉన్నాడా లేడా అనే విషయంపై చర్చించరు. మనం చేయవలసిందల్లా వేదాలలో చెప్పినట్టు నడచుకోవటమే. కార్యాచరణలో అంతర్భాగం తత్ఫలితం కూడా, అందువల్లనే ప్రతికార్యానికీ ప్రతిఫలం వెంటనే ఉంటుంది, అందువల్ల ఈశ్వరుని ప్రమేయం లేదు. మనతోటలో కాచిన కాయని కోసి మనకివ్వమంటూ వేరొక కూరగాయల వర్తకుడ్ని నియోగించుకోవలసిన అవసరమేమిటి? ఈశ్వరుని ప్రమేయం లేకుండా చేసిన పనికి ఈశ్వరునితో ముడిపెట్టటం దేనికి? మనం భూమిని సాగుచేస్తాం. పంటని పెంచుతాం. ఆ విధంగానే, వేదాలలో చెప్పినట్టు మనం నడచుకొంటే ఫలితాలు వాటంతటఅవే వస్తాయి. ఈ ఫలితాలని రప్పించటానికి భగవంతుని అవసరం లేదు. భగవంతుడు జగత్తుని సృష్టించాడన్న సమస్యకి బదులుగా, ఆయన సృష్టి ఎందుకు చేయవలసి వచ్చిందని అడుగుతారు. జగత్తుకి మొదలూ, తుదీ అంటూ లేకుండా ఇప్పటి వలెనే ఎప్పుడూ సంస్థితమయ్యే ఉంది. జగత్తు ఏదో ఒక సమయంలో ఉదయించి ఉంటేనే కదా సృష్టికర్త ప్రసక్తి వస్తుంది? ప్రపంచమెప్పుడూ ఇప్పటి వలెనే ఉన్నదే. కాబట్టి దానిని ఎవరు సృష్టించారన్న విషయం ఆలోచించకు. నీ విధిని నీవు చెయ్యి. ఫలితాలు వాటంతటవే వస్తాయి".

శాశ్వతాలైన వేదాలు చెప్పే విషయాలు మానవుని మేధకు అందవు. వేదాల ప్రకారం కార్యాచరణ వల్ల ఫలితాలు వస్తాయి.

సత్కార్యాలు సత్ఫలితాలను, దుష్కార్యాలు దుష్ఫలితాలనూ ఇస్తాయి. మనమా ఫలితాలను అనుభవిస్తూ కాలం వెళ్లబుచ్చుతాం. అందువల్ల వీటిని నియంత్రణ చేయటానికి భగవంతుని అవసరం లేదు. ఏ పనీ చేయకుండా, సోమరివలె ఉండకూడదు - అది పాపం, నరకానికి దారి తీస్తుంది. కర్మని చేయక పోవటమే పాపం. కర్మలు మూడు రకాలు - నిత్య, నైమిత్తిక, కామ్యములు.

ఎల్లవేళలా, ప్రతిరోజూ విధిగా చేయవలసిన కర్మలను నిత్యకర్మలంటారు. ప్రత్యేక సందర్భాలలో చేసే కర్మని నైమిత్తికమంటారు. ఉదాహరణ - గ్రహణమప్పుడు స్నానం చేసి పితృతర్పణం వదలటం. నిత్య, నైమిత్తిక కర్మలు అందరూ తప్పకుండా చెయ్యాలి. "కామ్య" కర్మలు ఏదో ఒక ఫలాన్ని అపేక్షించి చేసేవి. వర్షాలు కావాలంటే "వరుణజపం" చేస్తాం.

---

* సాంఖ్య వాదం ప్రకారం ఈశ్వరుడు సృష్టికర్తకాడు. ఈశ్వరుడు శుద్ధ చైతన్యం, జగత్తు భౌతిక పదార్థం కావటం వల్ల ఈశ్వరుడు సృష్టి కార్యాన్ని చేసి ఉండడు. దీనికి శంకరాచార్యులవారు, నిర్గుణమైన బ్రహ్మమే సగుణబ్రహ్మంగా కార్యకలాపం చేసి జగత్సృష్టి కావించాడన్నారు.

కుమారుని కొరకు పుత్రకామేష్టిని చేస్తాం. కామ్యకర్మలు చెయ్యాలని నిర్బంధమేమీ లేదు. ఇష్టముంటే చేయవచ్చు లేకపోతే మానవచ్చు.

నిత్యకర్మల లక్షణాలని కూడ మీమాంసకులు చెప్పారు. అవి రెండు రకాలు "అకరణే ప్రత్యవాయ జనకం", "కరణే అభ్యుదయం". మొదటి రకం కర్మలు చేయకపోతే కీడు వాటిల్లుతుంది, రెండవరకంవి అనుష్టిస్తే సత్ఫలితాలు కలుగుతాయి. మంచి గృహమూ, సంపదా, సత్సంతానం, ఖ్యాతి, జ్ఞానం - ఇవన్నీ అభ్యుదయానికి సంబంధించినవి. వేదాంతంలో "నిశ్శ్రేయసమ్" అన్న పదాన్ని తరచూ వాడుతారు. మోక్షం వల్ల, అంటే జన్మరాహిత్యం వల్ల, కలిగే నిత్యానందమిది - ఇంతకు మించిన ఆనందమే లేదు. కాని అభ్యుదయం ప్రస్తావించేది అంతకంటె తక్కువ ఆనందం గురించే. మీమాంస దీని గురించే చెప్తుంది. నిత్యానందం గురించి, అంటే నిశ్శ్రేయస్సు గురించి, మీమాంస ఏమీ చెప్పదు.

పని-లేక-కార్యం తగిన ఫలితాలనిస్తుంది. ఇదే కర్మ మార్గమంటే. సత్కార్యాన్ని చేస్తే సంతోషం కలుగుతుంది, చేయకపోతే వేదన సంభవిస్తుంది. నిత్యకర్మ నాచరించక పోతే వేదన తథ్యం.

సంధ్యావందనం ప్రతిరోజూ చేయవలసిన నిత్యకర్మ. చాలా మంది "మాకు తీరికలేదు. మేము చేయలేము, సత్ఫలితాలను వదులుకుంటా"మంటారు. దీనికి మీమాంస సముచితమైన సమాధానాన్నిస్తుంది. "కేవలం సత్ఫలితాలను పొందటానికే చేసే కర్మ కాదు సంధ్యావందనం. ఐచ్ఛికంగా చేసే కర్మకానే కాదు. ఆ కర్మని చేయకపోవటం - దుఃఖానికి దారి తీస్తుంది -" అంటుంది మీమాంస. ఒక కార్యమాచరిస్తే సత్ఫలితాలు వస్తాయనటం సబబు, కాని ఒక కార్యాన్ని చేయకపోవటం వల్ల దుఃఖం కలుగు తుందనటంలో అర్థమేమిటి? సంధ్యావందనం చేయకపోవటం వల్ల చెడు ఫలితాలు వస్తాయి, చేయటం వల్ల ప్రత్యేకమైన సత్ఫలితాలు కలుగక పోవచ్చు. ఈ రకపు కర్మలని "అకరణే ప్రత్యవాయ" వర్గంలో చేరుస్తారు.

దేవాలయంలో దైవారాధన చేసినా, పేదలకు అన్నదానం చేసినా సత్ఫలితాలు వచ్చి తీరుతాయి. ఇటువంటివి "కరణే అభ్యుదయ" వర్గంలోకి వస్తాయి. ఇది న్యాయమే. "అకరణే ప్రత్యవాయ" సమర్థనీయమేనా? దీనిని నిరూపింపగలిగే దృష్టాంతమేమయినా ఉన్నదా లోకంలో? ఉన్నది. బిచ్చగాళ్లకు బిచ్చం వేస్తాం. ఏ సంస్థకో దానం చేస్తాం - అట్లా చేసేప్పుడు అవసరమున్న వారిని ఆదుకోవటం మనకి పుణ్యాన్నీ ఇస్తుందనీ, తద్వారా సంతోషం కలుగుతుందనీ అనుకుంటాం. ఒక్కొక్కసారి సహాయం చేయాలనిపించదు. అటువంటి సమయాలలో మనం పుణ్యాన్ని దాని వల్ల కలిగే ఆనందాన్నీ కూడా వదులుకుంటాం. అవసరమైన వారికి సహాయం చేయటం మంచిదే, ఇంకా ఎక్కువగా దానం చెయ్యక పోవటం గర్హనీయమని మాత్రం అనుకోము.

ఎవరిదగ్గరన్నా అయిదు వందల రూపాయలు అప్పుగా తీసుకొని, ఫలానారోజుకి తిరిగి ఇచ్చేస్తామని చెప్పామనుకోండి. అప్పుతీర్చవలసిన సమయం రాగానే ఆ వ్యక్తితో "నాకు అయిదు వందల రూపాయలివ్వటం వల్ల నీకు వచ్చే పుణ్యాన్ని నీకు దక్కనీయాలని నేను ఆ పైకాన్ని నీకు తిరిగి ఇవ్వదలచుకోలేదు" అంటే, అప్పిచ్చిన వాడు ఏ మాత్రమూ సంతోషించడు. అటువంటి పుణ్యం తనకి అవసరం లేదనీ, తన డబ్బు తనకి తిరిగి యివ్వమనీ అంటాడు. అవసరమైతే, వ్యవహారాన్ని కోర్టుకి తీసికొని వెళ్తాడు. తన డబ్బునే కాక, దానిపై వడ్డీని కూడ రాబట్టటానికి ప్రయత్నిస్తాడు. "అకరణే ప్రత్యవాయం" అన్నదానికి ఇది ఒక దృష్టాంతం - కార్యం చెయ్యకపోవటం వల్ల దుష్ఫలితాలు కలగటం. ఇక్కడ డబ్బు తిరిగి యివ్వకపోవటం. ఈ దృష్టాంతమే సంధ్యావందనానికి కూడ వర్తిస్తుంది. సంధ్యావందన మాచరిస్తే వచ్చే పుణ్యాన్ని వదులు కుంటాననే వాడు, పై ఉదాహరణలో, అప్పు తీసుకున్న వాని వంటివాడే!

ఈ అప్పు గురించిన వ్యవహారం దృష్టాంతంగా ఇస్తే చాలదేమో. ఇంకా కొన్ని ప్రశ్నలుదయిస్తాయి. వాటిని గమనిద్దాం. ఎవరు, ఎప్పుడు అప్పు తీసుకున్నారు? సంధ్యావందనానికి సంబంధించిన ఋణాన్ని ఎవరి వద్దనుండి పొందాము?

వేదాలలో తైత్తరీయ సంహిత (6-3) ఇట్లా చెప్తుంది: "జన్మతః బ్రాహ్మణులకు మూడువిధాలైన ఋణాలుంటాయి - అవి - ఋషులకు, దేవతలకు, పితరులకు". వేదాధ్యయనం వల్ల ఋషుల ఋణాన్ని తీర్చుకోవాలి. యజ్ఞాలు, పూజలు చేయటం వల్ల దేవతల ఋణాన్ని తీర్చుకోవాలి. తర్పణము శ్రాద్ధము జరపటం వల్ల పితృఋణం తీర్చుకోవాలి. మనం ఋణం తీసుకున్నామని గాని, ఈ విధంగా ఋణపడి యున్నామని గాని మనకి తెలియదు. మనకి తెలియని విషయాలని వేదాలు చెప్తుతాయి. ఈ ఋణాలకి కారణాలని కొంచెమాలోచిస్తే తెలుస్తుంది. విశ్వాసమున్న వారికి న్యాయంగా తోచే సమాధానం దొరుకుతుంది. ఇద్దరు సహోదరులున్నారను కుందాం. ఒకతను న్యాయమూర్తి, రెండవవాడు పురోహితుడు. అంటే వైదికవృత్తిని అనుసరించేవాడు. మొదటివానికి ప్రతిరోజూ కోర్టుకి వెళ్ళి, వాజ్యాలు విని, నిర్ణయాలు తీసుకోవటం విధి. అతను మొరాయించి "నేనెందుకు కోర్టుకి వెళ్లాలి, నా సోదరుడు వెళ్లనప్పుడు" అన్నాడనుకోండి. దానికి సమాధానం చాలా చిన్నదే "ఆ ఉద్యోగం కోసం అర్థించావు, ఉద్యోగం వచ్చింది. ఉద్యోగం చెయ్యటానికి ఒప్పుకున్నావు. అందువల్ల నీవు కోర్టుకి వెళ్లాలి. అది నీ వృత్తి. నీ సోదరుని వృత్తి వేరం"టాం. పూర్వజన్మల కర్మల ఫలితంగా మనం ఉన్నత స్థితిలో జీవించటానికి ఎన్నుకొన్నాం. దీనివల్ల ఈ జన్మలో కొన్ని విధులను నిర్వహించాల్సి వస్తుంది. ఈ విధంగా మనలని నియమించి నియమాలను నిర్దేశించిన అధికారి మనకు అదృశ్యుడు, కాని మన పనులకు సాక్షీభూతుడు. ఇది వేదాంతుల సిద్ధాంతం. మనకి లభించిన స్థితి తనంతటతానే ఫలితాలనిస్తుందంటారు మీమాంసకులు.

మన పూర్వకర్మలు మన జాతిని నిర్ధారిస్తాయి. మన నడవడి కూడా తదనుసారంగానే ఉండాలి. అట్లా చేయక పోవటం వల్ల అసౌకర్యమే కాక, దుష్ఫలితాలు కూడ సంభవించవచ్చు. మనమే స్థితిలో జన్మించామో తదనుగుణంగా నడుచుకోవాలి. వేదాలలో విధింపబడిన ఆచారాలను, కర్మలను పాటించాలి. మొదటగా వేదాధ్యయనం చెయ్యాలి, తన విధులను తెలుసుకోవాలి బ్రాహ్మణుడు. కష్టంలో ఉన్నవారికి ఊరట కల్పించి వాళ్లు కూడ వారి వారి అర్హతానుసారం విధులను పాటించేట్టు చేయాలి. తెలుకలవాడు నూనెను తయారుచేసి నూనెనమ్మాలి. చెప్పులు కుట్టేవాడు చెప్పులను తయారు చెయ్యాలి, బ్రాహ్మణుడు తన ఆహార విషయంలో ఎంతో నిగ్రహం చూపాలి - అతడు దైవసాక్షాత్కారాన్ని పొందటానికి వీలుగా, దేహాన్నీ, మనస్సునీ ఆత్మనూ శుద్ధంగా ఉంచుకోవాలి. ఇతరులకు కూడ దైవచింతన కలిగేట్టు చెయ్యాలి. అందువల్లనే పూర్వం అన్ని వృత్తులవారికీ అన్ని వర్గాల వారికీ భూములను దానం చేసేవారు. వంశానుగతంగా చేపట్టిన వృత్తులను విడనాడితే కొంత అసమత తప్పదు. మొట్టమొదటిది - భూమిపోయి, ఆ వృత్తినే అవలంబించే వానికి దక్కుతుంది. ఈ రోజులలో ఆ భూమిపైన కూడ పన్నులున్నాయి. కాబట్టి పూర్వపు వృత్తిని వదులుకోవటం శాస్త్రానుసారం పాపమేకాక లోకవ్యవహారపరంగా కూడ నష్టమే. ఇటీవలి కాలం వరకూ తన కులవృత్తిని ఆచరించటం కొంత గౌరవప్రదం కూడా!

జన్మ వల్ల చేయవలసిన కర్మలను మనం చేయకపోవటం వల్ల సమాజం నానాటికీ దిగజారిపోవటం చూస్తున్నాం. ప్రతి ఒక్కరూ వారివారి విధులను నెరవేర్చకపోతే సామూహిక వసతులుండవు, దారిద్ర్యం తాండవిస్తుంది కూడా. ఇప్పటి పరిస్థితి అదే.

సంధ్యావందనం వంటి నిత్యకర్మలను చెయ్యకపోతే దుష్ఫలితాలు తప్పవు. ఆ కర్మలను చేస్తే జరిగే మంచి ఏమిటంటే ఆ దుష్ఫలితాలు లేకపోవటమే. సకాలంలో బాకీని తీర్చివేస్తే ఆ ఋణభారం తీరినట్టూ అవుతుంది, తీసుకున్న అప్పుని తిరిగి ఇచ్చిన వానిగా మంచి పేరూ వస్తుంది. ఈ మంచితనం వల్ల వచ్చే మంచిపేరే, వ్యాపారాన్ని వృద్ధి చేస్తుంది. ఆ విధంగానే నిత్యకర్మలను చేస్తూండటం వల్ల మనకి పాపం పెరగకుండా ఉంటుంది. మన శ్రేయస్సు కూడ వృద్ధి చెందుతుంది. అది రెండు విధాలమేలే!

"అకరణే ప్రత్యవాయ"మునూ "కరణే అభ్యుదయ"మునూ - రెంటినీ వేదాంతులు ఒప్పుకున్నారు. మనం కూడా వారినే అనుసరిద్దాం.

నిత్యకర్మలు తప్పకుండా చేయాలి. వేదోక్తమైన అగ్నిహోత్రాన్ని, శాస్త్రోక్తమైన ఔపాసననీ తప్పకుండా చేయాలి. జీవించి యున్నంతకాలమూ అగ్నిహోత్రం చేయాలని వేదాల చెప్తాయి. "దానిని చెయ్యాలి, చేస్తే చాలు"నంటారు మీమాంసకులు. అందువల్లనే వారికి సన్న్యాస ఆశ్రమం ఆమోదయోగ్యం కాదు. సన్న్యాస ఆశ్రమంలో అగ్నిహోత్రంగాని ఇతర కర్మలుగాని అవసరం లేదు. మీమాంసకులు కర్మలను చేయక పోవటాన్ని అశ్రద్ధగా పరిగణిస్తారు. కర్మలను విడచి సన్న్యాసం స్వీకరించటం ధర్మాన్ని

విడిచినట్లే. వాళ్లు "మనిషి వందసంవత్సరాలు తన విహిత కృత్యాలను చేస్తూ జీవించాలి" అనే ఉపనిషద్వాక్యాన్ని నమ్ముతారు. (ఈశావాస్య - 2వ మంత్రం) తైత్తిరీయ బ్రాహ్మణం ప్రకారం. అగ్నిహోత్రాగ్ని మానడం వల్ల మహావీరుని హత్యచేసిన మహాపాతకం చుట్టుకొంటుంది. మీమాంస సిద్ధాంత ప్రకారం "దుష్కార్యాలను చేయటం వల్ల పాపమంటు కున్నట్టే, నిత్యకర్మలను చేయకపోవటం వల్ల కూడ పాపం చుట్టుకుంటుంది. సన్న్యాసి "కర్మభ్రష్టుడు" - తన విధిని ఉపేక్షించిన వాడు. అందువల్లనే మీమాంసకులు సన్న్యాసిని చూడటమే పాపమనీ, చూస్తే పాపపరిహారం చేసుకోవాలనీ అనుకునే వారు. "పాపిని చూచినా, అతనితో మాట్లాడినా, అతనిని తాకినా, అతని పంక్తిలో భోజనం చేసినా - ఇవన్నీ పాపాలే. ఆ విధంగానే సన్న్యాసులకి కూడ దూరంగా ఉండాలి". మీమాంసకుడైన మండనమిశ్రుని వంటి వారి భావాలిట్లా ఉండేవి.

సన్న్యాసం, అనంతత్వం, మోక్షం, జ్ఞానం - వీటన్నిటి గురించి వేదాలలోని జ్ఞానకాండలోనే ప్రస్తావన ఉంది. వాటికి అధికార ప్రతిపత్తి వేదాలవల్లే కలిగింది. అటువంటప్పుడు వాటిని చులకనగా చూడటమెందుకు? మీమాంసకులేమంటారో చూద్దాం -

"ఉపనిషతులలో జ్ఞానమూ, పరబ్రహ్మమూ ప్రస్తావింప బడ్డాయి - నిజమే. కాని వేదమేమిటి? వేదం శబ్దము, వాక్కు. ఏ కారణం చేత అది ప్రవృత్తమైనది. మనకి తెలియని విషయాలను చెప్పటానికి. అదే శబ్ద ప్రమాణం. కంటితోగాని తర్కబుద్ధితోగాని గ్రహింపలేని వాటిని మనం గ్రహించేట్టు చేయటానికే. అనవసరమైన దానిని వర్ణించటం దాని ప్రయోజనం కాదు. అన్ని పదాలకు రెండు ముఖ్య ప్రయోజనాలున్నాయి. ఒకటి, ఏమి చెయ్యాలో చెప్పటం, రెండవది ఏమి చేయకూడదో చెప్పటం".

> *"ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేన వా।*
> *పుంసాం యేనోపదిశ్యేత తత్ శాస్త్రం అభిధీయతే"*

అంటే, ఏ విషయం గురించైనా ప్రయోజనం లేకుండా పలికే పలుకులు వృథా - అవి కేవలం శబ్దాన్నే కలిగిస్తాయి. ఎవరైనా "కాకి ఎగురుతుంది" అంటే వినే వానికి దాని వల్ల కలిగే ప్రయోజనమేమిటి? "కాకి నల్లగా ఉంటుంద"న్న వాక్యం ఏ ప్రయోజనాన్నీ చేకూర్చదు.

అట్లా కాక, "రేపు రాత్రి ఇక్కడ ఒక ధార్మిక ప్రవచనముంటుంద"ని అంటే దానికొక ప్రయోజనముంది, ఒక సందేశముంది. ప్రజలు సమావేశానికి రావటానికి అదొక ఆహ్వానం, ప్రేరకం. అలాగే, రేపు ఒక దూరప్రదేశంలో ధార్మిక ప్రసంగం ఉందని అంటే, దానికీ ఏ ప్రయోజనం లేనట్టే - అంత దూరమవటం వల్ల వెళ్లటం కుదరదు కాబట్టి. అందువల్ల, నిర్దిష్టమైన ప్రయోజనాన్ని కలిగించని మాటలు వ్యర్థం - అటువంటి వాటిని పలుకరాదు. ఒక్కొక్కసారి అవి కొంత సమాచారాన్ని వ్యక్త పరుస్తాయేమో గాని ఆ సమాచారం వల్ల ఏ లాభమూ లేదు.

నోటి మాట మంచి పని చేయించేట్టుండాలి, లేదా, అసలు పనే చేయకుండేట్టుండాలి. వేదాలు అయిదు మహాపాతకాలని పేర్కొని వాటిని పరిహరించమని ఉద్బోధిస్తాయి. వీటికి "నివృత్తి ప్రయోజన"ముంది. అంటే, చెయ్యకపోవటం వల్ల లాభం. పాపాన్ని చేయకుండా, దిగజారి పోకుండా ఉండటమే దీని వల్ల మేలు. ఈ రెండు ప్రయోజనాలూ లేని మాటలు కేవలం పుక్కిటిపురాణమే, వ్యర్థమే!

వేదాలలో ఒక భాగం మనం చేయవలసిన పనుల గురించీ, చేయదగని పనుల గురించీ చెప్తుంది. మరొక భాగంలో కొన్ని కథలూ, ఉపాఖ్యానాలూ ఉంటాయి. ఆ కథలకు ప్రత్యేకత ఏమీ లేకపోయినా, వైదిక సూత్రాలతో జోడింప బడి యుండటం వల్ల వాటికొక ప్రయోజనమూ, విశిష్టతా కలిగాయి. వ్యాపార ప్రకటనలను చూడండి కావాలంటే. ఒక సింహంతో కుస్తీపడుతున్న మనిషి బొమ్మ ఉంటుంది. ఆ బొమ్మ రహస్యమేమిటి? ఏమీ లేదు - ఆ ప్రకటనలో చెప్పబడిన టానిక్‌ని కోనేట్టు ప్రేరేపించటమే. వేదాలలో చెప్పబడిన కథలూ ఇంతే - కాని, అవి ఉత్తమమైన ప్రయోజనం కలవి. వేదోక్తమైన విధులను మనం చెయ్యటానికి ప్రోత్సాహకాలివి. కథ పాత్ర "అర్థవాద"మవుతుంది. ఫలితాన్ని అపేక్షించేది. మందులకి సంబంధించిన వ్యాపార ప్రకటనలు ప్రసిద్ధులైన డాక్టర్ల సిఫార్సులతో ఎందుకుంటాయి? ఆ మందు ఇంకా ఎక్కువమంది కొంటారని. ఇటువంటి ప్రచారంలో అతిశయరూపంలో సత్యాన్ని చూపుతారు. అటువంటి అసత్యాన్ని "గుణవాద" మంటారు. ఇంకొకటి ఉంది. దానిని "అనువాద" మంటారు. తెలిసిన సత్యాలను పదే పదే చెప్పటం. నిప్పు కాలుస్తుందని తెలుసు, కాని దానినే పునరుక్తి చేయటం, అనువాద మవుతుంది. గుణార్థవాదంలో కల్పన దృష్టాంతంగా చెప్పి వైదిక సూత్రాలను ఆమోదించేట్టు చేస్తారు. "మద్యపానం వద్దు" అని వేదాలలో చెప్పబడింది. తాగుడు వల్ల ధ్వంసమై పోయిన మనిషి కథను చెప్తే అది అర్థవాద మవుతుంది. దాని ఉద్దేశం తాగుడు మాన్పించటం. "తాగుడు మంచిది కాదు. అది మత్తుని కలిగిస్తుంది" అనటం అనువాదం. సారాంశమేమంటే, ఈ కథలన్నీ అర్థవాద మన్నమాటే. వాటి ప్రయోజనమొకటే వైదిక సూత్రాలను మనమవలంబించేట్టు చేయటమే.

జ్ఞానకాండ ఉపదేశించే వాటిని ఖండించటానికి మీమాంసకులు ఇట్లా అంటారు. "వేదం ఒక యజ్ఞాన్ని వర్ణిస్తుంది. అందులో బంగారాన్నే గాని వెండిని దక్షిణగా పెట్టకూడదని ఉంటుంది. తైత్తిరీయ సంహిత కూడ వెండిని దక్షిణగా పెట్టకూడదంటుంది. దీనిని నొక్కి చెప్పటానికి కొక కథ కూడ చెప్తుంది. ఈ కథ వెండిని దక్షిణగా ఇవ్వటం వల్ల చెడు ఫలితాలని చెప్పి, వెండిని దక్షిణగా ఇవ్వకుండా చేస్తుంది. దీనిని "నిషేద"మంటారు. చేయవలసిన దానిని "విధి" అంటారు. అటువంటి కథలకు ప్రత్యేకత ఏమీ లేకపోయినా, వాటికొక నిర్దుష్టమైన ప్రయోజనముంది".

దీనినే ముఖ్యంగా తీసుకొని మీమాంసకులు "జ్ఞానకాండ"కి అభ్యంతరాలు చెప్తారు. "ఉపనిషత్తులు బ్రహ్మస్వరూపం గురించే చెప్తాయి - దానికి ఏ గుణమునూ ఆపాదించవు.

భగవత్సాక్షాత్కారం ఒక అనుభవమే - ఆ స్థితిలో ఏ వ్యాపకమూలేదు. వేదం ఎప్పుడు, ఎట్లా ప్రమాణమవుతుంది? ఏదో ఒక సత్ఫలితమిచ్చి నప్పుడే ప్రమాణమవుతుంది. అందువల్ల ఉపనిషత్తు కేవలం అర్థవాదమే. దేని గురించైనా అది ఎట్లాగున్నదో వర్ణిస్తుంది. ఎరిగిన దాని గురించి ఇంకా తెలుసుకోవలసిందేమిటి? ఏమి చేయాలో తెలుసుకోనవసరం లేదా? "బ్రహ్మముంది. ఆత్మే బ్రహ్మం" అని అనటం వల్ల వేదాలు మన జ్ఞానానికి గాని మన శ్రేయస్సుకి గాని ఏ విధంగా దోహదం చేస్తాయి? అందువల్ల మనం యజ్ఞాల వంటి కర్మలు చేయాలి - వేదాల ఉద్దేశం కూడా మనచే ఈ కర్మలను చేయించటమే. వేదం (శబ్దం) ఉన్నదందుకే. సంస్థితమైన దాని గురించి తెలుసుకోవటానికి వేదప్రామక్కరలేదు. ఎప్పుడో ఒకప్పుడు అది తెలియక మానదు. అటువంటి సైద్ధాంతికమైన జ్ఞానం లేకపోయినా నష్టమేమీ లేదు. దృశ్యమైన జగత్తుని వర్ణించే వేదభాగం కేవలం అర్థవాదమే. ఈ కారణం వల్ల ఉపనిషత్తులు ప్రామాణికం కానేరవు. యజ్ఞాలను ఆచరించే వారికి ఔన్నత్యము కలిగించటమే వాటి ప్రయోజనం. కార్యోన్ముఖతే జీవి యొక్క తృష్ణ. అందువల్లనే వ్యక్తి కర్మలను ఇంకా చేయటానికి ప్రోత్సహింప బడుతాడు. కర్మని చేయకుండా ఉండటం తప్పు. వైదిక కర్మలను చేయవలసిన అవసరం లేని పరివ్రాజకుడవటం కూడ తప్పే. ఉపనిషత్తులు జీవుని బ్రహ్మంతో సమానం చేస్తాయి. దీనికి ప్రయోజనమిది : కర్మలను చేసే వ్యక్తి యొక్క ఔన్నత్యాన్ని శ్లాఘించటం. అతను ఇంకా కర్మలను చేసి, ఇతరులచే చేయించటానికి ప్రోత్సహించటం. ఎంతటి బలాఢ్యుడైనా, సింహంతో పోరాడలేనట్టు - జీవి బ్రహ్మత్వాన్ని అందుకోలేడు. ఉపనిషత్తులు అర్థవాదాలు. బ్రహ్మము, జ్ఞానము, మోక్షము ఈశ్వరుడు వంటి మాటల వల్ల మనకే ప్రయోజనమూ లేదు. కర్మే సర్వమూను" ఇదీ మీమాంసకుల సిద్ధాంతం.

**శంకరుని సమాధానం :**

దీనికి శంకరుని సమాధానమేమిటి? శబ్దం (వేదం) కార్యోన్ముఖమే కానవసరం లేదు. శబ్దం (వేదం) యొక్క పవిత్రత ఒక విషయం గురించి చెప్పటంలోనే ఉన్నదని మీమాంసకుల నమ్మకం. అంటే, కార్యానికి ప్రతిఫలమే శబ్దం (వేదం) యొక్క ఉద్దేశం. అంతేకాని గమ్యం కేవలం కర్మకాదు - కర్మకూడా కర్మకోసం కాదు. ఏ కార్యాచరణమూ ఉండని స్థితే గమ్యమైతే, ఆ స్థితిని వర్ణించే జ్ఞానకాండమే ప్రమాణ మవ్వాలి. శబ్దం యొక్క ప్రయోజనం ఏదో ఒక ఫలితమే అవ్వాలిగాని కేవలం కర్మాచరణం కాదు. వేదాలు మద్యపానాన్ని విడనాడమంటాయి. దానికి పర్యవసానంగా చేయవలసిన పనియేమిటి? ఏమీ లేదు! అంటే శబ్దానికి ఫలితంతో నిమిత్తం లేదనా? మద్యపానం వల్ల కలిగే చెడు ఫలితాలను నివారించటమే దాని ప్రయోజనం. ఈ విధంగా, ఏమీ చేయక పోవటాన్ని అభావమంటారు. అన్ని నిషేధాల ఉద్దేశమూ అభావమే - ఏమీ చేయకుండా ఉండటం. మీమాసంకులు కూడ వేదం విధించే నిషిద్ధాలను ఆమోదిస్తారు. వారు కూడ అటువంటి పనులను చేయరు. కొన్ని నిషేధాలను వారు అంగికరించినప్పుడు నిష్క్రియాత్మకమయి నట్టి బ్రహ్మానుభూతిని వారు ఎట్లా

విమర్శించ గలరు? ఆత్మసాక్షాత్కారమే పరమోత్కృష్టమైన ఫలం - ఆ స్థితిలో ఏ విధమైన కార్య కలాపమూ ఉండదు. వేదశబ్దాలన్నీ అర్థవంతములు, కేవలం అర్థవాద మంటూ త్రోసి పుచ్చరాదు.

భగవద్గీతలో కృష్ణభగవానుడు "సర్వం కర్మాఖిలం, పార్థ, జ్ఞానే పరిసమాప్యతే" అంటాడు. అంటే, కర్మలు జ్ఞానానికే దారితీసి అక్కడ పరిసమాప్తమవుతాయి అని అర్థం. అన్ని పనులూ ఈశ్వరార్పితం కావాలి. సర్వకర్మలకు సిద్ధి (గమ్యము) నైష్కర్మ్యము. అదే బ్రహ్మానందం. దానితో జనన - మరణ స్థితి అంతమవుతుంది. వేదాల పరమోపదేశమూ, లక్ష్యమూ కూడా ఇదే. కర్మకాండ అంతా జ్ఞానకాండకి దారి చూపాలి. అందులో లీనమవాలి. అప్పుడే దానికి సార్థకత.

"వేదంలో కర్మలకు సంబంధించిన ఆదేశాలు కర్మకాండలోనే ఉన్నాయి. వాటి వల్ల చిత్తశుద్ధి, సంయమనం కలుగుతాయి కాబట్టి. నైష్కర్మ్యసిద్ధి అలవరినచో, సాధనమయిన వేదోక్త కర్మానుష్ఠానము అవసరంలేదు. ఇదే జ్ఞానకాండ యొక్క సందేశం. అయినా, కర్మకాండలోని విధులు మనస్సుని పరిశుద్ధపరచి ఈశ్వరుని వైపు మార్గం చూపుతాయి. ఈ కారణం వల్లనే అవి వేద సారభూతములైనాయి. కేవలం కర్మకి ఏ ప్రయోజనమూ లేదు. వేదాలు సన్న్యాసాశ్రమాన్ని శ్లాఘిస్తాయి - అది పరమాత్మ సాక్షాత్కారం తర్వాత నెలకొనే స్థితి. అంతే కాదు - అదే పరమాత్మకూడా. ఆ స్థితిని చేరుకోవటానికి మనం కృషి చేయాలి."

కర్మకాండ దుష్కార్యములు చేయటం వల్ల దుష్ఫలితాలు వస్తాయని వాటిని వారిస్తుంది. అటువంటి కర్మలను చేయటం కొందరికి లాభసాటిగా, సుఖదాయకంగా ఉండవచ్చు. ఈ కారణం చేతనే కొందరు దుష్కార్యాలు చేస్తూఉంటారు. అటువంటి పనులను చేయని వాడు ఆ రకమైన లాభాన్నీ, సంతోషాన్నీ విడనాడుకుంటాడు. ఎందుచేత? పాపకార్యాలు మొదట సుఖాన్ని (ముఖ్యంగా, ఇంద్రియసుఖాన్ని) యిచ్చినా, చివరికి మనకి శాశ్వతానందానుభూతిని దక్కనీయవు. ఆ కారణం చేతనే పాపకర్మలను చేయవద్దని మనకి వేదాలుద్బోధిస్తాయి ఇవి ఈ లోకంలో సంపదనీ, పితృదేవలోకాల్లో సుఖాన్ని కలిగించినా ఈ సుఖాలు కూడ అనంతం కావు. పుణ్యం హరించుకు పోయిన తరువాత మళ్లీ భూలోకంలోకి రావలసిందే. "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" అంటుంది భగవద్గీత. నిత్యానంద స్థితి పరమాత్మలో లీనమై ఏ వ్యాపకమూ లేకుండానే ఉన్నప్పుడే సంభవము. తాత్కాలిక లాభాలనూ, సౌఖ్యాన్నీ యిచ్చే కర్మల పరిమితిని దాటటానికీ, ఉత్తమగతుల ప్రాప్తికీ ప్రయత్నించాలి. వేదోక్తమయిన కర్మలను ఆచరించాలి, నిజమే. కాని నిత్యానందాన్ని ఇవ్వలేని ఆ కర్మలను చేయటం వల్ల ప్రయోజన మేమిటి? ఈ కారణం చేత ఆ కర్మలను విడనాడ వచ్చా?

ఆ నిత్యానందమయ స్థితిని నేరుగా చేరుకోవచ్చా? ఇది సాధ్యం కాదు. జ్ఞానమును పొందుట సులభం కాదు. మొదట, మనస్సులోని అపవిత్రత క్షాళనం కావాలి. మనస్సులో రేగే భావాల వెల్లువలని అదుపులో పెట్టగలిగేది కర్మాచరణమే. అందువల్లనే ఆ కర్మలను

యథావిధిగా తప్పకుండా చేయాలి. ఆ కర్మలను చేసేప్పుడు వాటి వల్ల సంప్రాప్తించే సుఖాలు, స్వర్గమూ వంటి వాటి నుండి మనస్సు మరల్చుకోవాలి. అంటే, కర్మలని చేస్తూనే వాటి ఫలితాలను స్వచ్ఛందంగా విడనాడు కోవాలి. ఈ కారణం వల్ల, మనస్సుకి సహజంగానే ఉండే అపవిత్రత పోతుంది. ఆ కర్మలవల్ల కలిగే ఫలితాలని ఆపేక్షించటం లేదనీ, ఆ కర్మలను ఈశ్వరార్పితంగా ఆచరిస్తున్నామనీ చిత్తశుద్ధితో భగవంతుడిని వేడుకొంటే మనకి మానసిక పవిత్రతనీ, స్వచ్ఛతనీ, అంటే చిత్తశుద్ధినీ, ఈశ్వరుడు తప్పకుండా అనుగ్రహిస్తాడు. ఆ తరువాత విచార మార్గమవలింబింప వచ్చు. అనంతరస్థితి ఏ కార్యమూ లేక - నిత్యానంద మయంగా ఉండటం.

**వేదాంతము, మీమాంస :**

వైదిక కర్మలను సమర్థించటంలో, అద్వైత సిద్ధాంతం కూడ మీమాంసని ఆమోదించటమే కాక, మీమాంసాకారులు తమవిగా భావించుకొనే ఆరు ప్రమాణాలను స్వప్రయోజనానికి ఉపయోగించుకుంటుంది.

ఆది శంకరుల అద్వైతమూ, రామానుజుల వారి విశిష్టాద్వైతమూ, మధ్వాచార్యులవారి ద్వైతమూ - నిజానికి వైదిక సిద్ధాంతాలే. అద్వైతం వలెనే మిగిలినిన రెండు సిద్ధాంతాలు కూడ వైదిక కర్మలను ఆచరించమనే చెప్తాయి. అంటే, కొంత వరకూ మీమాంసా సిద్ధాంతం మిగిలిన మూడు సిద్ధాంతాలకు ఆమోదయోగ్యమే.

మీమాంసకుల ఆరుప్రమాణాలనూ అద్వైతులంగీకరించినా, విశిష్టాద్వైతులు మూడింటినే ఆమోదిస్తారు. అవి - ప్రత్యక్షం, అనుమానం, శబ్దం (వేదం). ఈ ప్రమాణాలూ మీమాంసకులవే. ప్రమాణాల పాత్ర గురించి, "న్యాయ"మనే ఉపాంగం గురించిన చర్చలో ఇంకొంచెం వివరిస్తాను.

పిండితార్థమిది - అద్వైతసిద్ధాంతాలని ప్రతిపాదించిన ముగ్గురు ఆచార్యులూ మీమాంసను పూర్తిగా నిరాకరించలేదు. మీమాంసను ఆధారంగా చేసుకునే ద్వైతానికీ విశిష్టాద్వైతానికీ ముఖ్య సాధనమైన భక్తిని చేరుకుంటాం. అద్వైతం అక్కడ నుంచి మరొక మెట్టుకి వెళ్లి జ్ఞానాన్ని చేరుస్తుంది.

కర్మనే ప్రాముఖ్యంగా ఎంచుకున్నారు కాబట్టి మీమాంసని కర్మమార్గ మంటారు. ఈ కర్మమార్గమూ వేదాంతులు చెప్పే కర్మ, భక్తి, జ్ఞాన మార్గాలు వేరు. 'కర్మ' అంతిమ దశఅనీ, ఆ పైన ఇంకేమీ లేదనీ వేదాంతమనదు. వేదాంతుల కర్మ మార్గం లేక కర్మయోగం ప్రకారం వైదిక కర్మలను ప్రతిఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పితంగా చేయాలి.

భగవద్గీతలో శ్రీ కృష్ణుడు ఈ మాటని నొక్కిచెప్పాడు ఈశ్వరుని పట్ల భక్తికీ, మీమాంసకులు నిర్విరామంగా నొక్కి చెప్పే కర్మకీ తేడా ఉన్నది. ఈ కర్మలు సంపదనీ సౌఖ్యాన్ని ఇవ్వటమే కాక, చిత్తశుద్ధిని కలిగించి భక్తి జ్ఞానాలకు మార్గం చూపుతాయి. అంటే మీమాంస లక్ష్యమనుకున్న దానిని, వేదాంతం ఒక సాధనగా మాత్రమే పరిగణిస్తుంది.

# 22

# బౌద్ధమూ - ఇతర సిద్ధాంతాలూ

**శంకరులు, బౌద్ధమూ :**

ఆదిశంకరచార్యులు ఖండించటం వల్ల బౌద్ధమతం దేశంనుండి తరిమివేయ బడిందని అనేవాళ్లు చాలా మంది ఉన్నారు. ఇది నిజం కాదు. వైదిక సూత్రాలకు కట్టుబడే ఉన్నా, సాంఖ్య మీమాంసలు ఈశ్వరుని ఉనికిని నిరాకరించటాన్నే ముఖ్యంగా మార్కొన్నారు శంకరులు. ఆయన వాదమిది : వేదపదాల అర్థం ప్రకారమూ, బ్రహ్మసూత్రానుసారమూ గల ఈశ్వరుని నిర్వచనాన్ని గాని, ఈశ్వరుడు సృష్టికర్త అని గానీ, ఫలదాత అని గానీ నిరాకరించటం సమంజసం కాదు. సత్యమన్నది వేదాలలో చెప్పబడినదేననీ ఈశ్వరుడు లేకుండా జగత్సృష్టే లేదనీ ఆయన అన్నారు. అంతేకాక, కర్మాచరణమే వ్యక్తికి ఫలితాన్ని ఇస్తుందన లేమన్నారాయన. ఈశ్వరుడే ఫలదాత, ఫలనియంత కూడాను. ఈశ్వరుని చైతన్యమే, సంకల్పమే జగత్తుని సృష్టించింది, కార్యానుసారం ఫలితాలేర్పడటం, వాటివల్ల సుఖదుఃఖాలు కలగటం కూడ ఈశ్వరుడు కల్పించిన "కర్మ" వల్లనే. ఆయన సాంఖ్య, మీమాంస వాదులను నిర్దుష్టంగా ఖండించారు. బౌద్ధమతాన్ని విమర్శించేప్పుడు కూడ ఆయన వేదములు, బ్రహ్మసూత్రములలో చెప్పిన దానిని దాటలేదు, ఈశ్వరుని ఉనికినే సంశయించిన భాగాలనే వ్యతిరేకించారు.

ఆచార్యులవారి వాదపటిమ వల్లనే, వారి తర్కం వల్లనే బౌద్ధమతం దేశం నుండి బహిష్కరింపబడిన దనటానికి ఏ ఆధారాలూ లేవు. అయితే, బౌద్ధం దేశం నుంచి పోవటానికి కారణమేమిటి? బౌద్ధమతానికి ప్రజలపై నున్న ప్రభావాన్ని తగ్గించటానికి ఎవరో కారకులుండాలి కదా. వీరు మీమాంసకులు, తార్కికులూ. తర్కశాస్త్ర ప్రవీణులను తార్కికులంటారు. పధ్నాలుగు విద్యలలోనూ, మీమాంస తరువాత పేర్కొనవలసినది న్యాయశాస్త్రం. ఈ శాస్త్రానికి సంబంధించినదే తర్కం. న్యాయశాస్త్ర ప్రవీణులని "నైయాయికు"లంటారు. ఉదయనాచార్యుడనే తార్కికుడు, కుమారిలభట్టనే మీమాంసకుడు, వారి వారి కారణాల ఆధారంతో, బౌద్ధమతాన్ని తీవ్రంగా ఖండించారు. బౌద్ధమతం భగవంతుడు లేక ఈశ్వరుడు లేడంటూ చేసిన ప్రచారాన్ని ఉదయనాచార్యుడు ఖండించాడు. మీమాంసకులు కర్మలేగాని ఈశ్వరుడు ఫలదాత కాడని అంగీకరించినా, వేదోక్తమైన కర్మలను శ్రద్ధగా, సవ్యంగా చేయాలన్నారు. ఆ కర్మలను చేయనవసరం లేదన్న కారణం వల్ల బౌద్ధమతాన్ని మీమాంసకులు ఖండించారు. బౌద్ధమతంలోని ఈ వాదాన్ని తీవ్రంగా విమర్శించాడు కుమారిల భట్టు. బౌద్ధమతం యొక్క పురోగమనాన్ని అడ్డగించిన వారు - దాని నాస్తికత్వాన్ని విమర్శించిన ఉదయనుడూ, దాని కర్మాచరణ విముఖతని ఖండించిన కుమారిలభట్టూను. వీరి తరువాత వచ్చిన శంకరులు ఆ మతంలోని విపరీత ధోరణులను ఖండించవలసిన

అవసరమేర్పడలేదు. బౌద్ధులు ప్రచారం చేస్తున్న వాటిలోని తప్పులను చూపటమే ఆయన పని అయింది.

ఆచార్యుల వారు, ఈశ్వరుడే దృశ్యమానమైన జగత్తుకి సృష్టికర్త అనీ, కర్మఫలాలనిచ్చే ఫలదాత అనీ నిస్సంశయంగా ప్రతిష్టించారు.

శంకరాచార్యుల వారు బౌద్ధమతానికి విరోధులంటూ జరిగే తప్పుడు ప్రచారాన్ని సరిదిద్దటానికే ఈ ప్రస్తావన చేశాను.

**బౌద్ధమతమూ - హైందవ సమాజమూ :**

గౌతమ బుద్ధుని మహాత్మునిగా గౌరవించినా భారతదేశస్థులు బౌద్ధమతాన్ని యథాతథంగా ఎన్నడూ స్వీకరించలేదు. దివ్యజ్ఞాన సమాజమనే ఉద్యమంలో ఎందరో చేరారు. అయినా, వాళ్లు కూడ హిందూ ఆచారాలను పాటిస్తూంటారు. పండుగలనూ జరుపుకుంటూనే ఉన్నారు. వాళ్లల్లో వివాహాది కార్యాలన్నీ వేదోక్తంగానే జరుగుతూంటాయి. వాళ్లు హిందూ మతాన్ని విడనాడలేదు. కొందరు మహనీయులు జన్మించగానే వారి మానవతా, విజ్ఞతా, శీలమూ - జనాన్ని ఆకర్షిస్తాయి. అయినా మహనీయుల పేర నెలకొల్పబడిన సంస్థలలో స్వల్పమైన మార్పులతో వైదిక ఆచారాలను పాటిస్తారు. కాని ఆ సంస్థల అనుచరులు వీటిని యిళ్లల్లో పాటించరు. వారి సంప్రదాయానికే కట్టుబడి యుంటారు.

మహాత్మాగాంధీ, గాంధేయమతం గణనీయాలు. ఆదిలో ప్రజలు ఉత్సాహం కొద్దీ ఆయనని శ్రీరామ, కృష్ణ అవతారాల కంటె అధికుడనేవారు. కాని వీళ్లే తమ నిత్యజీవితంలో ఆయన చెప్పిన ముఖ్య బోధనలను, అంటే, వితంతు పునర్వివాహము, అస్పృశ్యతా నివారణము, వంటి వాటిని పాటించేవారు కారు. ఈ మేరకు వారు గాంధిమతాన్ని అవలంబించే వారు కారు - అయినా, మహాత్ముని అనుచరులుగా లోకంలో చెలామణి అయేవారు. కాని మహాత్ముడు - త్యాగశీలము, సత్యము, భగవద్భక్తి, లోకసేవవంటి విశిష్టగుణ సమన్వితుడు - ఆ కారణం వల్ల ఆయనని అందరూ గౌరవించే వారు. అంతమాత్రాన ఆయన బోధనలనీ పద్ధతులనీ అందరూ యథాతథంగా అంగీకరించారని అనుకోరాదు.

బుద్ధుని విషయంలోనూ యిదే జరిగింది. ఆయన వ్యక్తిగత జీవితం శ్లాఘనీయం. రాజకుమారుడై, మంచి పరువంలో భార్యాబిడ్డలను విడచి మానవాళి ఉద్ధరణకై జీవితాన్ని అంకితం చేశాడు. ఈ త్యాగబుద్ధీ, సచ్ఛీలమూ జనాన్ని ఆకర్షించాయి. అంత మాత్రాన బుద్ధుని బోధనలన్నిటినీ అందరూ అంగీకరించి పాటించారని చెప్పలేం. కర్మకాండను బుద్ధుడు ఖండించినంత మాత్రాన ప్రజలు వాటిని త్యజించలేదు. వారు క్రతువులను చేస్తూనే ఉండేవారు, కులధర్మాలను ఆచరిస్తూనే ఉండేవారు. అంతేకాదు, అధిక సంఖ్యలలో అందరూ భిక్షువులు కాలేదు. పెళ్లిళ్లు చేసుకొని సంప్రదాయ సిద్ధమైన ఆ ఆశ్రమ ధర్మాని

పాటించేవారు. అశోక చక్రవర్తి బౌద్ధుడై, బౌద్ధమతానికి ఎంతో సేవ చేసినా ఆయన మారలేదు, ప్రజలవైదిక జీవితాన్ని మార్చలేక పోయాడు. అశోకస్తంభమూ, ఇతర శాసనాలూ ఆయన తన ప్రజల మతస్వేచ్ఛని ఎట్లా పరిరక్షించేవాడో చెప్తాయి. ప్రసిద్ధులైన బౌద్ధభిక్షువుల రచనలు కొన్ని, విద్యలవేల్పు సరస్వతీ స్తవంతో ప్రారంభమవుతాయి. వారు నీలాధార దేవతని ఆరాధించేవారు. తంత్ర విద్యలలో దేవతల నెట్లా ఆరాధించారో చెప్పబడి యుంది - ఈ తంత్ర గ్రంథాలు చాలా మట్టుకు టిబెట్ నుండి వచ్చాయి.

శ్రీహర్షుడు, బిల్హణుడు, సంస్కృతంలో గ్రంథరచన చేశారు. బౌద్ధమతం ఉచ్ఛదశలో ఉన్నప్పుడు కూడా ప్రజలు వైదిక ఆచారాలు, జీవన విధానమూ అవలంబించేవారని ఆ రచనల నుండి తెలుస్తుంది.

నేను ఉపదేశించే జీవన విధానాన్ని అనుసరించని సంస్కర్తలెందరో నా వద్దకు వస్తూంటారు. నా విశ్వాసాలు వారికి లేకపోయినా, నాలో ఏదో మంచి వారికి తోచి ఆ వ్యక్తిగత గౌరవంతో నన్ను చూడటానికి వస్తూంటారు. మన దేశంలో ప్రాచీనకాలంలో కూడా ఇట్లాగే ఉండేది. సాంప్రదాయక జీవనంలో కొద్ది సంస్కారాలను ప్రోత్సహించే వారే కాక, తద్భిన్నమైన జీవన విధానాన్ని తీవ్రంగా, గాఢంగా ప్రతిపాదించేవారు కూడా గౌరవపాత్రులే అయేవారు. దీనికి కారణం వారి వ్యక్తిగత సుగుణాలు, జీవనసరళీను! ఇప్పటికీ సాంప్రదాయకమైన జీవితం మన నడుమనుండి పూర్తిగా మాయంకాలేదు. ఎంతైనా, కొన్ని శతాబ్దాలుగా పరీక్షకు గురియై నిలచి, మనలో జీర్ణించుకు పోయింది కదా యిది! తమ పూర్వీకుల అడుగు జాడల లోనే, ఒక తరం నుండి మరొక తరానికి, వారసత్వం వలె, సంక్రమించిన జీవన విధానాన్ని విడువలేరు ప్రజలు. బౌద్ధమతం తెచ్చిన సంస్కారానికి కూడ యిదే గతి అయింది. కాబట్టి బౌద్ధ సిద్ధాంతాలని ఉదయనుడు, కుమారిల భట్టూ ఖండించేప్పటికి ప్రజలు ఆ కొత్త మతాన్ని విడచి, సాంప్రదాయక జీవనం వైపు మొగ్గటానికి ఏమీ కష్టం కాలేదు.

**శంకరులు, ఇతర సిద్ధాంతాలు :**

ఆది శంకరుల సిద్ధాంతంలో అంతిమ దశ క్రతువులను విడనాడి, మనస్సుని పరమాత్మునిపై కేంద్రీకరించటం. కాని బుద్ధుని వలె ప్రారంభదశలోనే వైదిక కర్మలని విస్మరించాలని ఆయన అనలేదు. ఆ కర్మలనాచరించటం వల్ల కలిగే చిత్తశుద్ధి లభించిన తరువాతనే ఆత్మవిచారాన్ని ప్రారంభించాలన్నారు. ఆదిలో మీమాంసానుసారం కర్మల నాచరించాలి, వాటిని విడనాడమని బౌద్ధులు చెప్పే స్థితికి చివరకు చేరాలి.

ఆచార్యులవారు బౌద్ధం, మీమాంస, సాంఖ్యం, న్యాయం మొదలైన సిద్ధాంతాలను కొంత వరకే అంగీకరించారు, ఆ దశదాటిన తరువాత వాటి నన్నిటినీ ప్రతిఘటించారు. ఈ సిద్ధాంతాలన్నీ మొత్తంలో ఒక భాగాన్నే పట్టుకొని అదే పరమావధి అన్నాయి. ఆచార్యుల వారు అన్నిటినీ సమన్వయ పరచారు.

సాంఖ్యము :

సాంఖ్య సిద్ధాంతం ప్రకారం ఆత్మకి దేనితోనూ సంబంధంలేక పోయినా అన్నిటికీ కారణం ఆత్మే - అదే పురుషుడు. జగత్తుని సచేతనం చేసే శక్తి, మాయ - అదే ప్రకృతి. ఆ సిద్ధాంతం ప్రకారం జగత్తులో 24 తత్త్వాలున్నాయి. వాటిలో మొదటిది ప్రకృతి. దీనినుండి రెండవ తత్త్వమైన అహంకారముదయించింది - "నేను" అన్న భావాన్ని కలిగించేది యిదే. ఇది రెండుగా చీలుతుంది. ఒకవైపున అది చైతన్యమవుతుంది. దీనినే జీవుడంటాం - దీనికి మనస్సూ, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఉన్నాయి. రెండవ వైపు అది జడము - అయిదు తన్మాత్రలు, అయిదు మహాభూతాలూ దీంట్లోనివే. పంచేంద్రియాల వల్లనే జీవునికి బాహ్యప్రపంచ మెరుక కలుగుతుంది. చూచే కళ్లూ, వినే చెవులు, వాసన చూచే ముక్కూ, రుచితెలిపే నోరు, స్పర్శ తెలిపే చర్మం - ఇవీ పంచేంద్రియాలు. జీవుడు పనిచేయటానికి ప్రత్యక్షంగా ఉపకరించే వాటిని కర్మేంద్రియాలని అంటారు. వీటిలో కూడ నోటిని చేరుస్తారు - వాక్కుని పలికిస్తుంది కాబట్టి. అన్ని పనులనూ చేసే చెయ్యి మరొక కర్మేంద్రియం. ఆయా ఇంద్రియాలు నెరవేర్చే కార్యాలు - అతి సూక్ష్మం - తన్మాత్రలంటే అవే - ఇవి శబ్దం (చెవి) స్పర్శ (చర్మం) దృశ్యం లేక చూపు (కన్ను) రుచి (నోరు) వాసన (ముక్కు). అచేతన స్థితిలో వీటి రూపాలే పంచమహాభూతాలు. ఆకాశం (శబ్దం) వాయువు (స్పర్శ) అగ్ని (దృశ్యం) నీరు (రసం లేక రుచి) పృథ్వి (వాసన). మొత్తం 24 తత్త్వాలున్నాయి. ప్రకృతి, మహత్, అహంకారం, మనస్సు, పంచేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు, అయిదు తన్మాత్రలు, అయిదు మహాభూతాలు.

ఈ ఇరవై నాల్గింటినీ వేదాంతంలోని అద్వైత సిద్ధాంతం కూడ అంగీకరిస్తుంది, కాని అద్వైత సిద్ధాంతం ప్రకారం నిర్గుణ బ్రహ్మకీ, ప్రకృతికీ (మాయకీ) సంయోగం ఈశ్వరుని వల్ల లేక సగుణబ్రహ్మ వల్ల కలుగుతుంది. సాంఖ్యము ఈశ్వరుని ప్రసక్తే తీసుకురాదు.

సాంఖ్యము చెప్పే త్రిగుణాలను అన్ని వేదాంత సిద్ధాంతాలూ అంగీకరించాయి. అవి : సత్వ, రజః, తమో గుణాలు. సత్వ గుణమంటే - స్వచ్ఛమూ, ప్రశాంతమూ, ఉన్నతమూ అయిన స్థితి. రజోగుణం - తొందరపాటు, కార్యచరణ పరాయణత్వం. తమోగుణం - సోమరితనం, బద్ధకం, నిద్రపోయే లక్షణం.

భగవద్గీతలోని గుణత్రయవిభాగ యోగంలో వీటి గురించి విపులీకరింపబడింది. భగవంతుడు అర్జునునికి నిస్త్రైగుణ్య స్థితిలో ఉండమని ఉపదేశిస్తాడు. అంటే త్రిగుణాలకు అతీతమైన స్థితిలో - ఆత్మనిష్ఠలో ఉండమని. ఈ మూడు గుణాల సంఘర్షణ వల్లనే అసంతృప్తి, స్పర్థా ఏర్పడుతాయని అంటుంది, సాంఖ్యము. వాటిని సంపూర్ణంగా అణచివేయాలి. భగవద్గీత, ఇతరశాస్త్రాలూ - ఈశ్వరారాధనా, శరణాగతీ, ఆత్మవిచారమూ, చిత్త సమత్వాన్నీ, ఔన్నత్యాన్నీ కలిగిస్తాయని చెప్తాయి. కాని సాంఖ్యము అట్లా చెప్పదు.

"జీవ చైతన్యం పురుషునకే ఉంది. ప్రకృతి జడం. అందువల్ల ప్రకృతి స్వయంచోదకం కాదు. కాని పురుషుని ప్రేరణ వల్లే ఇరవై నాలుగు తత్త్వాలుగా భాసిస్తుంది. అయినా పురుషునికి దీనితో ప్రమేయం లేదు. అది కేవలం "ఎరుకే", అంటుంది సాంఖ్యము. దీనిలోని విరోధాభాస పైకి తెలుస్తూనే ఉంది కదా.

"కేవల"మన్న పదానికి అర్థం దేనిలోనూ కలువకుండా, ఒకటిగా, స్వచ్ఛందంగా ఒంటరితనం కోరుకుని ఉండటం. దీని విశేషణం, కైవల్యం. సాంఖ్యలో మోక్షాన్ని కైవల్యమంటారు. జీవుడు ఇరవై నాలుగు తత్త్వాలనూ అధిగమించి, అచేతనమైన జడాన్ని ఛేదించి, తనంతట తానే పురుషునితో ఉంటాడు. ఇదే కైవల్యం.

అద్వైత సిద్ధాంతం ప్రకారం కూడా మాయను అధిగమించి ఆత్మలో లీనమవటమే లక్ష్యం. 'ఆత్మ' అన్నా 'పురుషుడ'న్నా ఒకటే. కాని ఈ లక్ష్యసాధనకి ఆచార్యులవారు చెప్పిన కర్మ, ఉపాసన, జ్ఞానవిచారమనే పద్ధతుల ప్రసక్తి సాంఖ్యములో లేదు. ఇరవైనాలుగు తత్త్వాల లక్షణాలను చెప్పటంతోనే సాంఖ్యము చాలా వరకు ఆగిపోతుంది. సాంఖ్యమునకు మరొక లోపముంది. "పురుషుడు (ఆత్మ) ఏ వ్యాపకమూ లేని శుద్ధ జ్ఞానము. జ్ఞానముగాని జీవచైతన్యంగాని లేనిది ప్రకృతి." ఈ రెంటికీ ఈ భేదం ఉంది. కాని జడమైనది ఇతర తత్త్వాలుగా ఎట్లా మారుతుందో సాంఖ్యము చెప్పదు. సాంఖ్యము చెప్పేదల్లా ఇదే: పురుషుని (జీవచైతన్యం) ఉనికే జడపదార్థమట్లా మారటానికి కారణమని. పురుషునికి ఏ వ్యాపకమూ లేదంటూనే, ప్రకృతి పురుషుని వల్లనే వ్యాపకాలను నెరవేరుస్తుందంటుంది సాంఖ్యము. వీటికి పొత్తు కుదరటమెట్లా? దీనికి సాంఖ్యుల సమాధానమిది : అయస్కాంతపు ఉనికి ఇనుపరజనుకి చలనం కలిగిస్తుంది - ఏ ప్రయత్నమూ లేకుండానే. ఆ విధంగానే పురుషుని ఉనికి వల్లనే ప్రకృతి కార్యనిమగ్న మవుతుంది. గుడ్డివాడు కుంటివానిని బుజం మీద పెట్టుకుని తీసికొని వెళ్తున్నట్లే వున్నది యిదీను. గుడ్డివాడు చూడలేడు. కుంటివాడు నడవలేడు. కాని కుంటి వాడుచెప్పే గుర్తులను బట్టి గుడ్డివాడు నడువగలగుతాడు. అట్లాగే చేతనత్వం లేని ప్రకృతి, చైతన్య స్వరూపమైన పురుషుని మోస్తుంది. లోకవ్యాపారం సాగుతుంది. ఇది మంచి ఉపమానమే, కాని సప్రమాణమైనది కాదు. అద్వైతం ప్రకారం ఏ వ్యాపకమూ లేని నిర్గుణబ్రహ్మమే సగుణమైన ఈశ్వరునిగా ఉన్నట్లనిపించి, మాయద్వారా లోకవ్యవహారాన్ని నడుపుతుంది.

సాంఖ్యమునకీ అద్వైతానికీ మరొక ముఖ్యమైన భేదముంది. పురుషుడు శుద్ధ చైతన్య మన్నా, జీవాత్మలన్నీ ఒకే ఆత్మ అని ఒప్పుకోకుండా, జీవాత్మలన్నీ వేరువేరు అంటుంది సాంఖ్య సిద్ధాంతం.

ఇటువంటి అసంగత విషయాలెన్ని యున్నా వేదాంత సిద్ధాంతమైన తత్త్వాలను గుర్తించి చెప్పుతుంది. వాటి లక్షణాలను చెప్తుంది సాంఖ్యము. "సాంఖ్యము" అన్న మాట "సంఖ్య" అన్న మాట నుంచి వచ్చింది.

సాంఖ్య సిద్ధాంతంపై కపిలముని సూత్రములను వ్రాశాడు. ఈ విషయంపైన గొప్ప గ్రంథాలు - ఈశ్వరకృష్ణుని సాంఖ్య కారిక, విబిజ్ఞాన భిక్షు రచించిన సాంఖ్య సూత్రభాష్యము.

భగవద్గీతలో కృష్ణ భగవానుడే అనేక సాంఖ్య సూత్రాలను విశదీకరించాడు. కాని ఆత్మ సాక్షాత్కారానికి సాంఖ్యము యోగములు కూడ రెండు మార్గాలే అని ఆయన చెప్పినప్పుడు ఆయన చెప్పేది జ్ఞాన మార్గం గురించే.

పురుషుడు వేరు, ప్రకృతివేరు అని గ్రహించాలని చెప్పటంతో ఆగిపోతుంది సాంఖ్యము. రాజయోగం అక్కడనుండి అందుకొని ఏ విధంగా ఆ గ్రహింపు కలుగుతుందో, దానికి చేయవలసిన సాధనయేమిటో చెప్తుంది. కాని యోగంలో ఈశ్వరుని ఉనికిని అంగీకరించి, ఈశ్వరారాధన మనోనిగ్రహానికి ఒక పద్ధతిగా చెప్పబడుతుంది. పతంజలి "రాజయోగం"లో యోగాన్ని మనస్సు యొక్క విచ్ఛిన్నకర శక్తిని అదుపులో పెట్టటానికి ఒక మార్గమని చెప్పబడింది.

సాంఖ్యమూ, యోగమూ మన శాస్త్రాలలో చెప్పబడిన 14 లేక 18 విద్యలలోనివి కావు. అయినా ఇవి కూడ రెండు ముఖ్యమైన విద్యలే. కనుక వాటి ప్రస్తావన తీసి కొని వచ్చాను.

ఈ విషయాన్ని ముందు కూడ ఒకసారి చెప్పాను. మీమాంస వేదాల ప్రమాణాన్ని అంగీకరించినా, భగవంతుని పట్ల భక్తి అవసరమనదు. సాంఖ్యము కూడ వేదాల ప్రమాణాన్ని అంగీకరిస్తుంది. కాని నిరీశ్వర వాదాన్ని బలపరుస్తుంది. ఆదిశంకరులవారు రెంటిలోనూ సరియైన అంశాలనే స్వీకరించి, మిగిలిన వాటిని నిరాకరించారు. ఈ వాదాలకి మూలభూతమైన వేదాంతసారాన్ని ప్రతిష్ఠించారు.నిర్గుణ బ్రహ్మస్థానంలో సాంఖ్య సిద్ధాంతాన్నీ, ఆ సిద్ధాంతం ప్రతిపాదించిన ప్రకృతే - మాయగానూ, ఆ సిద్ధాంతం నిర్వచించే ఇరవైనాలుగు తత్త్వాలనూ, మీమాంస సిద్ధాంతం యొక్క కర్మకాండనూ, న్యాయం చెప్పే ఈశ్వరుడ్నీ, దానికి గల ఆధారాలను - వీటన్నిటినీ శంకరులు ఆమోదించారు. కాని, ఆయా సిద్ధాంతాలు ఏదో ఒక అంశాన్నే తీసుకొని ముఖ్య లక్ష్యంగా ప్రతిపాదించాయంటారు. హేతు వాదానికీ, బుద్ధికీ ఆమోదయోగ్యమైన రీతిలో సమన్వయ పరచాలంటారు!



# 23

# ఉపాంగములు : న్యాయము

**తర్కము --ఔచిత్యమును తెలిపే శాస్త్రం :**

న్యాయశాస్త్రాన్ని తర్కశాస్త్రమని కూడ అంటారు. దీనిని కూర్చినది గౌతమమహర్షి. తర్కం (యుక్తుల) ద్వారా ఈ సృష్టికి కర్త పరమేశ్వడేనని నిరూపించటమే ఆ శాస్త్రం యొక్క ముఖ్య ఉద్దేశం. ఈశ్వరుని ఉనికిని సహేతుకంగా ప్రతిష్ఠిస్తుంది. ఈ శాస్త్రానికి ముఖ్యమైన సాధనం తార్కిక పద్ధతి. (హేతు విచారణ పద్ధతి)

అనుమితి అనివార్యం. వేదాలు ఒక విషయాన్ని చెప్తాయి. వేదోక్తాల అర్థము, విశిష్టతా ఉత్తరమీమాంస ద్వారా తెలుస్తుంది. వేదాల పట్ల అకుంఠిత విశ్వాసమున్నా, మనస్సులో ఏదో ఒక శంక ఉంటూనే ఉంటుంది. అటువంటి సందేహాలను నివృత్తి చేసి ఆ విశ్వాసాన్ని మనస్సులో ధృవపరచటానికి ఎన్నో సాధనలున్నాయి. ఒక రాటని పాతినప్పుడు, భూమిలో దానిని పాతి అటూ ఇటూ కదుపుతాం. దీని వల్ల అది నేలలో గట్టిగా పాతుకుపోతుంది. ఆ విధంగానే సత్యాన్ని కూడ అన్ని వైపులనుంచీ రకరకాలైన వాదాలతో మార్కొనాలి. అప్పుడే అది ఏ ప్రతివాదమూ లేక సుస్థిర మవుతుంది. ఎటువంటి వాదాన్నైనా మనమాహ్వానించాలి. అయితే, ఈ వాదాలు సహేతుకంగా, సాధికారంగా, సప్రమాణంగా ఉండాలి. కాని ఏదో వితండవాదం చేద్దామని ఏదో మాటల గారడీ చేద్దామని గాని చేయబూనిన వాదాన్ని తిరస్కరించాలి.

ఆదిశంకరుల అంతిమ ఘడియలు ఆసన్నమైనప్పుడు ఆయన శిష్యులు వారిని ఏదో ఒక సందేశమివ్వమని ప్రాధేయపడ్డారు. తత్ఫలితంగా ఆచార్యులవారు అయిదు శ్లోకాలను చెప్పారు. వీటినే ఉపదేశపంచకమనీ, సోపానపంచకమనీ, సాధనపంచకమనీ అంటారు. వాటిలో ఒక భాగమిట్లా ఉంటుంది.

*"దుస్తర్కాత్సువిరమ్యతాం శ్రుతిమతస్తర్కోఽను సంధీయతాం"*

అంటే "కుయుక్తులతో కూడిన వాదము విడిచి, వేదసమ్మతమైన అనగా ప్రమాణ బద్ధమైన యుక్తులలో యధార్థ్యమును గ్రహించుము"

వేదాలలో చెప్పిన వాటిని ధృవపరచటానికి వినియోగించే సాధనాలని న్యాయమంటారు. ఈ శాస్త్రకారుడు, గౌతముడు.కణాదుడు కూడ న్యాయశాస్త్రం రచించాడు. దానిని వైశేషిక మంటారు.

రెండు పదార్థాలు విభిన్నములని అన్నామంటే ఆ రెంటిలో ఏదో ప్రత్యేకతలుండటం వల్లే - ఒకదానిలోని లక్షణాలు రెండవ దానిలో లేకపోవటం వల్లనే. ఈ విశేషమే పరిశీలనకి

మూలమవటం వల్ల ఆ పద్ధతిని వైశేషిక మంటారు. న్యాయశాస్త్రం శాస్త్రీయ పద్ధతిలో నడుస్తుంది. జీవుడు, జగత్తు, ఈశ్వరుడు, మోక్షము వంటి ఆధ్యాత్మిక విషయాలను ప్రస్తావించేప్పుడు వైశేషికాన్ని చేరుతుంది. ఈ విషయాలనే వైశేషికులు "అపవర్గ"మంటారు. ఈ రెండూ తర్కాన్నీ, తత్త్వాన్నీ ఉపయోగిస్తాయి. తత్త్వాన్ని తర్కం ద్వారా బోధిస్తాయి.

మౌలికసత్యాన్ని నాలుగు సాధనాల ద్వారా న్యాయశాస్త్రం చర్చిస్తుంది. అవి (1) ప్రత్యక్షం (2) అనుమానం (3) ఉపమానం (4) శబ్దం.

వీటిలో మొదటిది ప్రత్యక్షప్రమాణమనేది మనకి జ్ఞానేంద్రియాల వల్ల అనుభవ సిద్ధమయ్యేది. అంటే చూపు, వాసన, వినికిడి, రుచి ఇత్యాది. రెండవది; అనుమానం ఇది న్యాయశాస్త్రంలో చాలా ముఖ్యమైనది.

అనుమానమంటే ఏమిటి? దూరాన కొండ శిఖరంపై పొగను చూచామనుకోండి. పొగ మాత్రమే కనబడుతుంది, జ్వాల కానరాదు. ముందున్న బండరాళ్లు మనకా జ్వాల కనబడకుండా అడ్డుపడుతాయి. పొగమాత్రమే కనబడుతున్నా మనకి ఆ కొండ మీద నిప్పు అంటుకొన్నది అని నిశ్చయించు కోవటానికి ఏ సందేహమూ ఉండదు. దీనినే అనుమాన మంటారు. కొండ మీద మంట ఉండి ఉండాలని మనం నిశ్చయం చేసుకోవటానికి ఉపకరించే సాక్ష్యంపొగే. దీనిని సాధనమనిగాని, లింగమనిగాని, హేతువని గాని అంటారు.

మన మనుసరించే వేదాంత సిద్ధాంతం ప్రకారం మనకి గురువు అనుగ్రహించిన ఉపదేశాన్ని ధ్యానం చేయాలి. దీనినే మననమంటారు. అంటే, గురువు చెప్పిన దానిని యుక్తి అనే సాధనతో ఎప్పుడూ మనస్సులో గుర్తుంచుకోవటం. ఇక్కడ అనుమాన ముపకరిస్తుంది. ప్రత్యక్షంగా గోచరం కాని దానిని ఇతర సాక్ష్యాల సహాయంతో గుర్తించగలగటానికి అనుమాన మొక్కటే సాధనం. పరమాత్మ, జీవాత్మలు మన జ్ఞానేంద్రియాలైన కళ్లు, చెవులు, నోరు, ముక్కు వంటి వాటి పరిధిలోకి రావు. మోక్షమనే అంతిమ స్థితి వాటి కందదు. దీనిని అనుమానం వల్లనే, హేతుబద్ధమైన అనుమానం వల్లనే, గ్రహింపగలుగుతాం. తెలియని దానిని తెలిసినదాని సహాయంతో గ్రహించటమే అనుమానమంటే.

వైదిక కర్మల నాచరించటం వల్ల మనకి అంతశ్శుద్ధి ఏర్పడుతుంది. గురువు ఇచ్చే ఆదేశాల పట్ల మనకి విశ్వాసముంటుంది. ఆ పరిస్థితిలో వేరెవరో, వేరేదో చెప్తే మనకి సంశయాలు కలుగుతాయి. కాబట్టి ఒక నిశ్చయానికి వచ్చేలోగా సంభావ్యాలైన అన్ని అభ్యంతరాలనూ పరీక్షించాలి. అనుమానం వంటి సాధనలు మన విశ్వాసాలని పరిరక్షించుకోవటానికి ఉపయోగిస్తాయి. న్యాయశాస్త్రము, వైశేషికము తమ తమ చర్చలలో అనుమానాన్నే ముఖ్యంగా ఉపయోగిస్తాయి.

ప్రత్యక్ష ప్రమాణం పరిధిలోనికి వచ్చేవి బహుస్వల్పం. అనుమాన ప్రమాణం వల్ల అర్థం చేసుకోదగిన విషయములు చాలా ఎక్కువ. అనుమానం గురించి ఇంకొంచెం తెలుసుకుందాం. వైదికసత్యాలని బుద్ధి గ్రహించటానికి ఇది ఉపకరిస్తుంది. అందువల్లనే,

న్యాయాన్ని వేదానికి ఉపాంగంగా పేర్కొంటారు. మీమాంస ప్రమాణం ద్వారా సహాయపడితే, న్యాయం యుక్తుల ద్వారా సహాయపడుతుంది.

పదార్థమంటే (పదస్య అర్థరి) "మాటల అర్థం". ఆధ్యాత్మిక విషయాలలో చర్చలన్నీ ఒక విషయాన్ని నమ్ముతాయి - అసలు పదాల అర్థాలని క్షుణ్ణంగా తెలుసుకుంటే వేదాలలోని సత్యాలు బాగా అవగాహన అవుతాయని. ఒక నిశ్చయానికి వచ్చేముందు అన్ని ప్రమాణాలనూ ఉపయోగించాలి. అవగాహనకి ఉపకరించే సాధనమే, ప్రమాణమంటే.

న్యాయంలో పదార్థాన్ని ఏడువిధాలుగా వర్గీకరించారు. అర్థం చేసుకోవలసిన ప్రతిపదార్థం గురించి వ్రాయటం కష్టం కాబట్టి. ఈ వర్గీకరణ ఆయా పదార్థాలను ఏ మాధ్యమం ద్వారా గ్రహిస్తామో వాటి బట్టి జరిగింది. ఈ ఏడూ రెండు వర్గాలకు చెందుతాయి. భావ - అంటే ఉనికి కలవి, అభావ అంటే ఉనికి లేనివి. ఏడు వర్గాలలోనూ "అభావం" ఆఖరుది. మిగిలిన "భావా"లని ఆరు వర్గాలుగా విభజించారు.

ఇక్కడొక ప్రశ్న ఉత్పన్నమవుతుంది - లేనిదాని గురించి ఊహించట మెట్లా? "లేమి" అనే దానికి ఒక ప్రత్యేకమైన అర్థముంది. లేమి కొన్ని ప్రదేశాలలోనే సంభవం, అన్ని ప్రదేశాలలోనూ కాదు. "ఇక్కడ పువ్వులు లేవు" అన్నప్పుడు పువ్వులు లేకపోవటం ఈ ప్రదేశంలోనే అని అర్థం. "అక్కడ పూజా మందిరంలో పువ్వులున్నాయి" అంటే అక్కడ పువ్వులలేమి, అభావం లేదు. అట్లాగే కొన్ని సమయాలలో ఉంటుంది, మరి కొన్ని సమయాలలో ఉండదు. అందువల్ల అభావానికి కూడ నిర్దిష్టమైన ఉనికి ఉంది. కొన్ని సమయాలలో, కొన్ని ప్రదేశాలలో అది ఉంటుంది.

పదార్థం యొక్క ఏడు లక్షణాలివి - ద్రవ్యం - పదార్థం; గుణం - లక్షణం; కర్మ-కార్యం; సామాన్యం - జాతి; విశేషం - ప్రత్యక్ష లక్షణం; సమవాయం - వ్యక్తికీ జాతికీ సంబంధం; అభావం - పదార్థం లేక పోవటం. ద్రవ్య, గుణ, కర్మలను - సత్ అంటారు. ద్రవ్యాన్ని - భౌతికంగా చూపించవచ్చు. జ్ఞానం, కోర్కె, సంతోషం, దుఃఖం - ఇటువంటి లక్షణాలను అవి ఆధారపడిన పదార్థాల నుండి విడదీసి చూపవీలుకాదు. తామర ఎఱ్ఱగా ఉంటుంది - అది దాని లక్షణం. ఆ లక్షణాన్ని తామరనుండి విడదీయలేము. అంటే "గుణ" మనేది పదార్థంలోనే ఉంటుంది. ఆ గుణం దేనికైతే ఉంటుందో, అది ద్రవ్యం - పదార్థమన్నమాట. సంతోషాన్ని గాని, దుఃఖాన్ని గాని విడిగా చూపలేం - కాని సంతోషంగా ఉన్న మనిషినీ, దుఃఖంలో ఉన్న మనిషినీ గమనించగలం. ఆ విధంగా ఆ రెండు స్థితుల గురించీ తెలుస్తుంది. ఎఱ్ఱని తామరను చూచినప్పుడు ఎరుపంటే ఏమిటో అర్థమవుతుంది. కర్మ అంటే పని - కదలటం, నడవటం, పరుగెత్తటం - ఇత్యాది. ఏదో పదార్థానికి సంబంధించినవే ఇవీను - విడిగా ఉండలేవు. పరుగెత్తే వానిని నుండి పరుగెత్తటమనే కర్మని విడదీయలేము. మనిషి పరుగెత్తటం చూడగలం, దాని బట్టి పరుగెత్తటమంటే ఏమిటో తెలుసుకొని, దానికీ కూర్చోవటానికీ, పడుకోవటానికీ గల తేడాని గమనించగలం.

సామాన్యమన్నది జాతికి సంబంధించినది. ఆవుల మంద ఉంది - ఆ మందలోని వాటికన్నిటికీ ''గోవు''లుగా ఉండటం సామాన్యలక్షణం. దీనినే మనం ఆవుల జాతి అంటాం. జాతి ఒకటే అయినా ప్రతి ఆవుకీ ప్రత్యేక లక్షణాలుంటాయి. ఇది 'విశేషం'. ప్రతి ఆవునీ దానికి గల ప్రత్యేక లక్షణాలని బట్టి వేరువేరుగా గుర్తించవచ్చు. ద్రవ్యము - దాని గుణము, ద్రవ్యము - దాని కార్యము, జాతి లక్షణము, జీవి ప్రత్యేకత, ఒక ప్రాణి - దాని అంగములు, సమిష్టి, వ్యష్టి - ఇది సమవాయం. ఒక పదార్థం మరొక దానిని కలిస్తే దానిని సంయోగమంటారు. అవి కలిసైనా ఉండవచ్చు, విడివిడిగానైనా ఉండవచ్చు. ద్రవ్యము, గుణము - సమవాయము ద్రవ్యము, కర్మ కూడ సమవాయమే. గుణం కాని కర్మకాని స్వయం ప్రతిపత్తి లేనివి కాబట్టి అవి ఎప్పుడూ ఏదో పదార్థాన్ని కలిసే ఉంటాయి.

అభావం - ఏడవలక్షణం గురించి పైన చెప్పుకున్నాం ''పదార్థాన్ని ఏడు వర్గాలుగా విభజించినట్లే ప్రతి విషయాన్నీ మళ్లీ వర్గీకరించారు. ద్రవ్యానికి తొమ్మిది వర్గాలున్నాయి - అవి పృథ్వి (భూమి), ఆప (నీరు), తేజస్సు (జ్వాలకాంతి) వాయువు (గాలి), ఆకాశం, కాలం, దిక్కు, ఆత్మ, మనస్సు. వీటిలో మొదటి అయిదింటిని - పంచభూతాలంటారు. ఆకాశంలేక అంతరిక్షం - వీటి ఉనికిని వీలు పరుస్తుంది. ఈ పంచభూతాలకి సమానంగా దేహంలో పంచేంద్రియాలున్నాయి.

చూచే కళ్లు, వినే చెవులు, రుచి నెరిగే నాలుక, శీతోష్ణాలను గ్రహించే స్పర్శ, వాసన చూచే ముక్కు - ఇవి అయిదు ఇంద్రియాలు. ఈ గ్రహింపు కేవలం పై చర్మానికే కాక, దేహమంతా వ్యాపిస్తుంది. లోపలకూడా తెలుస్తుంది. ఉదాహరణకి - తలనొప్పిగాని, కడుపునొప్పిగాని శరీరంలోపల గల స్పర్శజ్ఞానానికి తెలుస్తుంది. ఈ అయిదు అనుభూతులూ, వాటి సంబంధిత అంగాలవల్లనే కలుగుతాయి. చూపుకంటితోనే సాధ్యం, చెవులతో కాదు. చెవులతోనే సంగీతాన్ని వినగలుగుతాం కళ్లతోనూ, ముక్కుతోనూ కాదు. దేనినైనా నాలుకపైన పెడితేనే దాని రుచి మాత్రమే తెలుస్తుంది, దాని వాసన కాదు. చక్కెర తీపి నాలుకకే తెలుస్తుంది - ముక్కుకి కాదు. అంటే, ఈ ఇంద్రియాలకి ఒకే ఒక విషయం తెలుస్తుంది. రూపమనే గుణం కంటికే తెలుస్తుంది. రూపమంటే ఒక పదార్థపు రంగు, ఆకారము. తెలుపు, పసుపు, నలుపు, ఆకుపచ్చ, ఎరుపు, మట్టిరంగు - అనేవి రంగులు. శబ్దాలూ, వాటిలోని తేడాలూ చెవులకే తెలుస్తాయి. సువాసన, దుర్వాసన ముక్కుకే తెలుస్తాయి. ఆరు రకాల రసాలు (రుచులు) నాలుకకే తెలుస్తాయి. స్పర్శేంద్రియం చల్లదనాన్నీ, వేడిమినీ గ్రహిస్తుంది. ఈ అయిదు ఇంద్రియాలూ అయిదు గుణాలని గుర్తించ గలవు. వీటిని జ్ఞానేంద్రియాలంటారు. ఈ ఇంద్రియాలు లేకపోతే, ఆయా గుణాల గ్రహింపు ఉండదు. మనకి ఆరు ఇంద్రియాలుంటే ఆరు గుణాలను గ్రహింప గలిగే వారమేమో! మనకి వెయ్యి ఇంద్రియాలుంటే వెయ్యి పదార్థ లక్షణాలను గ్రహింపగలిగేవారమేమో! ప్రపంచంలో ఎన్ని పదార్థాలున్నాయో మనకి తెలియదు. స్పర్శజ్ఞానమే లేకపోతే మనకి ఉష్ణమూ, శీతలమూ తెలిసేవి కావు. వేడిలోని ఈ మార్పులను స్పర్శజ్ఞానం వల్లనే గ్రహించ గలుగుతున్నాము.

గ్రుడ్డివారు, చెవిటివారు రూపాన్నీ, శబ్దాన్నీ గ్రహించలేరు - ప్రపంచంలో ఈ రెంటికొరతా ఏ మాత్రమూ లేదు! కన్ను, నాలుక, ముక్కు, చర్మము (స్పర్శేంద్రియం) చెవులు - ఈ అయిదు ఇంద్రియాలకూ అవి గ్రహించే విషయాలున్నాయి. రూపము, రుచి, గంధం, స్పర్శ, శబ్దం.

పంచభూతాలలో ఈ గుణాల్లున్నాయి. భూమికి అయిదు గుణాలూ ఉన్నాయి. భూమికి ఆకారముంది, రుచి ఉంది. మన దేహము, కూరగాయలు, పటిక బెల్లమూ ఇవన్నీ భూమికి సంబంధించినవే. భూమికి గంధం కూడ ఉంది - పువ్వు భూమికి సంబంధించినదే. గట్టితనం, ఉష్ణం, శీలం - ఇవి కూడ భూమికి సంబంధించినవే. భూమికి శబ్దం కూడా ఉంది. బిగించిన దారం శబ్దాన్నిస్తుంది. ఆ విధంగానే కఱ్ఱకూడా - ఇంకొక పదార్థాన్ని కొట్టినప్పుడు. నీటిలో, గంధం తప్ప, ఇతర నాలుగు లక్షణాలూ ఉన్నాయి. నీటిని బాదితే శబ్దం వస్తుంది. భూమికి అయిదు గుణాలే కాక, ఏ ఇతర భూతానికీ లేని గంధం కూడ ఉంది. ఈ వాసన భూమికి ప్రత్యేకం. నీటికి ప్రధాన మైన లక్షణం రసం (లేక రుచి). నీరు లేకపోతే రుచిని గుర్తించలేం. ఆ కారణం వల్లనే రుచిని ఎరుకపరచే యింద్రియమైన నాలుక ఎప్పుడూ తడిగా ఉంటుంది. నాలుక పొడి ఆరిపోతే రుచి తెలియదు. తేజస్సుకి (అంటే, మంటకి) వాసనగాని, రుచిగాని లేవు. రూపము, స్పర్శ, శబ్దమూ మాత్రమే ఉన్నాయి. రూపం దీని ప్రత్యేక లక్షణం. గాలికి రూపం లేదు. ఉన్నదల్లా శబ్దమూ, స్పర్శా మాత్రమే. స్పర్శదాని ప్రత్యేక లక్షణం. అందువల్లనే, గాలి వీచినప్పుడు శరీరానికి తెలుస్తుంది. ఆకాశానికి శబ్దం మాత్రమే ఉంది. ఆధునిక శాస్త్రజ్ఞులు మొదట్లో శబ్దం రావటానికి గాలి కారణమనుకున్నారు. కాని రేడియో (తీగెలులేని ప్రసారం) వచ్చిన తరువాత శబ్దం ఆకాశం యొక్క లక్షణమని గ్రహించారు. ఈ తీగెలులేని ప్రసారం గాలిమీద ఆధారపడదు.

శబ్దమనే ఒకే గుణం కల ఆకాశమూ, శబ్దమే కాక స్పర్శకూడా కల వాయువూ, శబ్ద స్పర్శలతో బాటు కంటికి గోచరించే రూపం కూడ కల అగ్నీ, రసం లేక రుచి గల నీరూ, ఈ నాలుగు గుణాలే కాక గంధం కూడ కల భూమీ - ఇవీ పంచభూతాలంటే. పంచభూతాలకి ప్రతీకలుగా ద్రవ్యాలున్నాయి. ఈ అయిదూ మినహాయిస్తే మిగిలిన ద్రవ్యాలివి - కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు - గంట, నిన్న, రేపు, సంవత్సరము, యుగము వంటివి కాలాన్ని తెలుపుతాయి. దిక్కు అనేది ప్రదేశాన్ని, ఉత్తరం, దక్షిణం, ఇక్కడ, అక్కడ - అనేవి. ఆత్మ అనేదానికి మనస్సుంటుంది, మనస్సే వీటన్నిటినీ గ్రహిస్తుంది. ఆత్మ రెండు రకాలు - జీవాత్మ, పరమాత్మ. జగత్తులో జరిగే వాటినన్నిటినీ సాక్షి వలె చూచేది పరమాత్మ. ప్రపంచ వ్యవహారాలలో నిమగ్నమై వ్యథిత మయ్యేదిజీవాత్మ. జీవాత్మలనేకం - పరమాత్మ ఏకం. రెండూ చైతన్యమే. వేదాంతానుసారం ఎరుకే, వివేకమే ఆత్మ అంటే. కాని న్యాయశాస్త్రం ప్రకారం ఎరుకకలిగినదే ఆత్మ. ద్వైత సిద్ధాంతం వలెనే న్యాయం ప్రకారం కూడ ఎరుక లేనిదే జీవాత్మ. వేదాంతం ప్రకారం ఎరుకకి రెండోది ఏదీ లేదు. అందువల్ల ఎరుక లేని జీవాత్మలంటూ ఏమీ లేవు. న్యాయశాస్త్రం ప్రకారం ఎరుక ఒక లక్షణం. ఆత్మ పదార్థం, ఎరుక దాని లక్షణం. ఆత్మ వివేకానికీ జ్ఞానానికీ - ఎరుకకలిగి యుండటానికీ స్థానం.

సంపూర్ణ జ్ఞానానికి వెలుపల ఏదీ లేదు "అందువల్లనే న్యాయశాస్త్రం ప్రకారం పరమాత్మ అంటే పరిపూర్ణమైన జ్ఞానం. జీవాత్మలకు ఎరుక పరిమితం. అందుచేతనే వాటిని కించిద్జ్ఞులంటారు - అంటే కొంచెం జ్ఞానం కలవని అర్థం. పరమాత్మ సర్వజ్ఞుడు - అంటే "అన్నీ తెలిసిన" అని అర్థం. మనం పూర్తి జ్ఞానానికీ, అసంపూర్ణ జ్ఞానానికీ నిలయమే - అంటే రెండూ ఉంటాయి. కాని పరమాత్మకి పరిపూర్ణ జ్ఞానమే. అదే విభుడు "అన్నిటా వ్యాపించిన" అని అర్థం. న్యాయశాస్త్రం కూడ పరమాత్మ సర్వవ్యాప్తమని అంగీకరించినా - జీవాత్మ పరమాత్మల భేదాన్ని గుర్తించదు. ప్రతి జీవిలోనూ వివేక ముండటమే దీనికి కారణం. దాని ఉనికి మనస్సులో, మనస్సే సుఖదుఃఖాను భూతులను కలిగిస్తుంది.

న్యాయశాస్త్ర ప్రకారం గుణాలు ఇరవై అయిదు రకాలు, కర్మలు అయిదు రకాలు. ఆ శాస్త్ర ప్రకారం, సరియైన పదార్థ జ్ఞానం కలిగితే సత్యం అవగాహన అవుతుంది. అప్పుడు మనస్సు అప్రధానమైన వాటిని నిరాకరిస్తుంది. "మోక్ష ప్రాప్తి కలుగుతుంది. ఆ స్థితిలో సంతోషవిషాదాలు లేవు! వేదాంత లక్ష్యమైన మోక్షం కోసం మనం ప్రయత్నిస్తాం. దీనికి గురూపదేశపు మననం చాలా ఉపయోగం. ఈ మనన యొక్క ప్రాముఖ్యాన్ని న్యాయశాస్త్రం చెప్తుంది. పంచభూతాలు, జీవాత్మ, మనస్సు - మనకు తెలుస్తాయి. కాని పరమాత్మనెట్లా తెలుసుకోవటం? పరమాత్మను తెలుసుకోలేం. పరమాత్మను తెలిసికోవటానికి అనుమానం అవసరం. మిగిలిన వాటిని తెలిసికోవటానికి పంచేంద్రియాలు సేకరించే ప్రమాణం చాలు. శృతిప్రకారం పరమాత్ముడున్నాడు. అనుమాన పద్ధతి వల్ల న్యాయశాస్త్రం పరమాత్ముడుండి తీరాలంటుంది. అనుమానానికి ఒక ఉదాహరణ : నేను కూర్చున్న కుర్చీని ఎవరో వడ్రంగి చేసి ఉంటాడని తెలుస్తూనే ఉంది. ఆ చేసిన వ్యక్తిని మనం కలుసుకోనంత మాత్రాన దానిని మనిషి చేయలేదన గలమా? ఇతర కుర్చీలను చేయటం చూడటం వల్ల దీనిని కూడ వడ్రంగే చేసి ఉంటాడనుకుంటాం. ఇది వడ్రంగికే సాధ్యమని కూడ మనకు తెలుసు. ఆ విధంగానే జగత్తుకి కూడ ఒక సృష్టికర్త ఉండాలి. సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. అందరినీ కాపాడటం వల్ల దయామయుడు కూడా. న్యాయశాస్త్రం ఇటువంటి విషయాల పూర్వాపరాలు చర్చించి నిశ్చయానికి వస్తుంది.

**ప్రమాణాలు :**

ప్రత్యక్షము, అనుమానము మాత్రమే కాక న్యాయశాస్త్ర ప్రకారం ఇంకా రెండు ప్రమాణాలున్నాయి. ఇవి ఉపమానము, శబ్దము.

ఉపమానమంటే ఏమిటి? మనకి తెలియని దాని గురించి తెలిసిన దాని సహాయంతో తెలుసుకోవటం. "గవయమ్" అనే పశువుంది. కాని అదెట్లా ఉంటుందో మనకి తెలియదు. అది గోవువలె ఉంటుందంటారు. అడవి ప్రాంతానికి వెళ్ళి నప్పుడు ఆ వర్ణనకి సరిపోయిన ఒక పశువుని చూస్తాం. అదే "గవయమ్" కాబోలుననుకుంటాం. ఇది ఉపమానం.

శబ్దప్రమాణం - వేదోక్తి, మహనీయుల ప్రవచనం. వేదాలు గాని, మహర్షుల వంటి మహనీయులుగాని ఏదైనా చెప్తే దానిని ప్రమాణంగా స్వీకరించాలి - అవి అసత్యాలెప్పటికీ

కావు కనుక. నైయాయికులు (న్యాయశాస్త్రాన్ని అనుసరించేవారు) వేదాలు భగవంతుని పలుకులే అని నమ్ముతారు. ఆ కారణం చేతనే అవి ప్రమాణాలు. మనోవాక్కాయ కర్మలుగా సత్యవ్రతులైన మహనీయుల పలుకులు కూడ "శబ్ద ప్రమాణం"గా పరిగణింప బడుతాయి.

ఈ నాలుగు ప్రమాణాలూ కుమారిలభట్టు ప్రతిపాదించిన మీమాంసా సిద్ధాంతంలో భాగాలు. "అర్థాపత్తి" "అనుపలబ్ధి" అనబడే మరో రెండింటిని కూడ చేర్చి మొత్తం ఆరు ప్రమాణాలను చేశాడు. అద్వైతులు ఈ ఆరుప్రమాణాలను అంగీకరించారు. అర్థాపత్తిని అర్థం చేసుకోవటానికి మన శాస్త్రాలు ఒక ఉదాహరణనిస్తాయి. శాస్త్రం ఇటువంటి వాక్యాన్ని తీసుకొంటుంది: "పీనో దేవదత్తో దివాన భుంక్తే" అంటే "స్థూల కాయుడైన దేవదత్తుడు పగలు ఆహారం తీసుకోడు". పగలు ఆహారం తీసుకోకపోయినా అతడు సన్నబడలేదు! దీని వలన మనకి అర్థమయేది ఏమిటి? అతడు రాత్రిళ్లు బాగా తింటాడని! వేరే అసంగతమైన ఊహలు - అంటే అతడు అసలే ఆహారం తీసుకోడనీ, ఆహారం తీసుకోకపోయినా సన్నబడడనీ - వీటికి సమాధానం కుదురుస్తుంది. ఈ విధంగా సమాధానాన్ని కుదిర్చి, అసమర్థనీయములైన భావాలను విడనాడే మార్గమే అర్థాపత్తి.

దేవదత్తుడు రాత్రిపూట ఆహారం తీసుకుంటాడనే మన నిశ్చయం పైన ఉదహరించిన 'అనుమానమ'నే రెండవ ప్రమాణం వంటిది కాదు. అనుమాన పద్ధతిలో మనం గుర్తించటానికి వీలైన అంశం ఆ గుర్తించవలసిన పదార్థంలోనే ఉండాలి. ఉదాహరణకి - మేఘాలనుండి ఉరుములు, అగ్ని నుండి పొగ. ఇక్కడ అటువంటి "లింగం" - లేక పూర్వోక్తమైన దేదీ లేదు.

ఉపమానం విషయంలోనూ ఇంతే. మనం పశువుని చూచి గవయము అనుకొన్నా అనుమానం తెగలోకి ఇది రాదు. ఇక్కడ రూపాన్ని బట్టి మనమా పశువుని గుర్తించం. మన మెరిగిన రూపాన్ని పోలి ఉండటం వల్ల మనం గుర్తిస్తాం. ఆఖరి ప్రమాణం, అనుపలబ్ధి. ఒక పదార్థం లేదని గ్రహించటమే ఇది. న్యాయంలోని ఆఖరి పదార్థాన్ని అభావమని చెప్పుకున్నాం. అభావాన్ని, అనుపలబ్ధి వల్లనే అర్థం చేసుకోగలం. "ఆ పాకలో ఏనుగుందేమో చూడు" అన్నప్పుడు ఆ పాకకి వెళ్లి చూచి అక్కడ ఏనుగు లేకపోతే ఏనుగు లేదని తెలుసుకుంటాం. ఏనుగు కనబడదు. అక్కడ లేదన్న సత్యం తెలుస్తుంది. ఆ సత్యం తెలియటానికి కారణం, ఏనుగు లేక పోవటమే.

ఒక పదార్థం లేకపోవటం వల్ల మన మెరిగే సత్యం అనుపలబ్ధి. ఈ రెండు ప్రమాణాలను న్యాయశాస్త్రం అంగీకరింపదు. కాని మీమాంస, వేదాంతంలోని అద్వైత సిద్ధాంతమూ అంగీకరిస్తాయి.

విచక్షణా జ్ఞానం మనకి భగవంతుని చూపటానికే. ఈ ప్రమాణాల నాధారంగా పరిశీలిస్తుంటే, న్యాయశాస్త్రం అంతమైన చోట, వైశేషికం ఆరంభమవుతుంది. ఈ పద్ధతికి మూల పురుషుడు కణాదుడు. అన్ని పదార్థాలకూ ఆధారభూతమైనది అణువేనని ఆయన సిద్ధాంతం. ఈశ్వరుడు అణువులను వివిధరీతులలో కూర్చి, జగత్తుని సృష్టించాడు.

న్యాయంలోనూ, వైశేషికంలోనూ - ప్రపంచమూ, ఆత్మా - ఈశ్వరునికి భిన్నంగా ఉంటాయి. నిజానికిది ద్వైత సిద్ధాంతమే.

జీవునికి చైతన్యం, బుద్ధి ఎక్కడ నుంచి వచ్చాయి? జడమైన అణువు ఎక్క డ నుంచి వచ్చింది? ఈ విధంగా ప్రశ్నించుకుంటే అన్నీ పరమాత్మని వివిధరూపాలేనన్న అద్వైత సిద్ధాంతాన్ని చేరుతాం.

ఈ అద్వైత నిశ్చయాన్ని చేరుకోవటానికి న్యాయం ఒక మెట్టుగా ఉపయోగిస్తుంది. విచక్షణకీ, హేతుబద్ధమైన నిశ్చయాలకు రావటానికీ న్యాయం, లేక తర్కం, ఉపయోగిస్తుంది. నిజానికి, బుద్ధితో పరిశీలనా, పరిశోధనా అది. అంతేకాదు, హేతువాదం నాస్తికం గాని, అనాత్మవాదం గాని కానవసరం లేదని చూపుతుంది. అసలు విషయమేమిటంటే - అసంఖ్యాకమైన జీవులూ, క్రమ బద్ధంగా నడచే జీవనగతీ - వీటి వెనుక ఒక సృష్టికర్త ఉండి యుండాలి. కేవలం బుద్ధితో కలిగే అవగాహనకు కొన్ని పరిమితులున్నాయని న్యాయశాస్త్రం అంగీకరిస్తుంది. అందువల్లనే మనం తార్కికంగా గ్రహింపలేని కొన్నిటికి వేదవాక్కును ప్రమాణంగా అంగీకరించాలంటుంది. అంటే, తర్కాన్ని మితిమీరేలాగ కొనసాగించి, దుస్తర్కం చేయరాదు. అంతిమ సత్యాన్ని గ్రహించటానికి తర్కాన్ని ఒక సాధనంగానే వినియోగించాలి.

అసలు ఏ విధమైన తర్కమూ లేకుండా భగవంతుడినీ శాస్త్రాన్నీ యథాతథంగా అంగీకరింపగలిగితే ఉత్తమం. కాని భగవత్సాక్షాత్కారాన్ని అనుగ్రహించే అటువంటి అకుంఠిత విశ్వాసం దుర్లభం. అకుంఠిత విశ్వాసమూలేక, హేతువాదము చేయని స్థితి ఒక విధంగా సోమరితనమే! తన మేధను ఉపయోగించి భగవంతుడు లేడనే నాస్తిక నిర్ణయానికి తప్పుగా వచ్చిన వాడైనా ప్రమాదం లేదు - అతడు తన బుద్ధిని ఉపయోగింపని వాని కంటే నయం. నాస్తికుడు తన పరిశీలనాత్మకతను కొనసాగింపగా, కొనసాగింపగా నాస్తికత్వాన్ని విడనాడే స్థితిని చేరుకో గలడు. బద్ధకస్తునికి ఏ విధమైన గతీ లేదు.

అందువల్లనే నాస్తికమైన చార్వాక సిద్ధాంతాన్ని కూడ ఒకప్పుడు ఒక ధర్మంగా గుర్తించారు. "చారు" "వాక" అంటే "చెవులకు ఇంపైన" అని అర్థం. "ఉపవాసాలతో, వ్రతాలతో మానసిక భౌతిక ఆంక్షలతో మనల్ని మనం బాధ పెట్టుకోవద్దు. ఈ శరీరానికీ, మనస్సుకీ స్వేచ్ఛనిచ్చి సుఖిద్దాం". వినటానికి ఎంతో హాయిగా ఉండే ఈ మాటలే చార్వాక సిద్ధాంత సారం.

కాని ఈ రీతిగా జీవితాన్ని గడుపుతున్నా, సుఖంవెనుకనే దుఃఖం కూడ జొరబడుతుంది. నిజానికి దుఃఖమే ఎక్కువౌతుంది. అనాత్మవాదాన్ని బలపరచని విశ్వాసమొక్కటే దుఃఖానికి పరిష్కారం.

**వివేకమవసరం :**

మనస్సూ బుద్ధీ బాగా నిశితమైన పరీక్షకు సంసిద్ధమైనప్పుడే వేదాంతపరమైన విచారం సాధ్యం - ఆ కారణం వల్లనే దృశ్యమానమైన జగత్తంతా మిథ్య (మాయ) అనిన ఆదిశంకరుని జగద్గురువుగా సకల శాస్త్ర పారంగతులు అంగీకరించారు.

న్యాయాన్ని తర్కమనీ "ఆన్వీక్షికి" అని కూడా అంటారు. న్యాయాన్నీ కపిలముని స్థాపించిన కాపిలమును, (సాంఖ్య) పతంజలి స్థాపించిన పాతంజలిమును, (యోగం) కుమారిల భట్టు చెప్పిన భాట్టమును, ఆదిశంకరులు క్షుణ్ణంగా అధ్యయనం చేశారు.

అద్వైతాన్ని గుర్తింపని ఇతర సిద్ధాంతాలు కూడ అద్వైతంలో ఇమిడి ఉన్నాయి. ఈ కారణం వల్లనే శంకరాచార్య అన్న నామాన్ని ధరించిన నేను, ఇతర శాస్త్రాలు గురించి చెప్తున్నాను. ద్వైతము, విశిష్టాద్వైతము, శైవము, వైష్ణవము - అన్నీ అద్వైతంలో ఉన్నాయి. ఇతర సిద్ధాంతాలను అద్వైతం ఖండించిన సందర్భాలలో కూడా, ఆయా సిద్ధాంతాలే పరమసత్యాలనీ అద్వైతం కాదనీ అవి అన్నప్పుడే. అంతేకాని, ఇతర సిద్ధాంతాలు ఏ మాత్రమూ ఆమోదయోగ్యం కావని అద్వైత మెప్పుడూ ఖండించలేదు. వాటికి ఉచితమైన గౌరవప్రపత్తులను అద్వైతులిచ్చారు.

**తర్కశాస్త్రంపై గ్రంథాలు :**

న్యాయశాస్త్రాన్ని రచించిన గౌతముడ్ని అక్షపాదుడని కూడ అంటారు. ఆయన ఎల్లవేళలా చింతనా పరుడై బాహ్య ప్రపంచాన్ని పట్టించుకొనేవాడు కాడట. ఈ రోజులలో కూడ పరిశోధనలలో నిమగ్నమైన ఆచార్యులనీ, శాస్త్రజ్ఞులనీ పరధ్యానపరులంటారు. వారి పరధ్యానం పరిహాసానికి పాత్రమయింది కూడాను. గౌతముడటువంటి వాడే. ఒకసారి నడుస్తూ నూతిలో పడిపోయాడు. భగవంతుడతనిని రక్షించి మళ్లీ అటువంటి ప్రమాదం జరుగకుండా, ఆయన పాదాలకు కళ్లని పెట్టాడని ఇతిహాసం కూడా ఉంది. ఆయనకి తెలియకుండా వేసే అడుగుల వల్ల ఏ ఎదురుదెబ్బలూ తగులకుండా ఉండేట్టు ఆ కళ్లు నివారించేట్టు ఆశీర్వచనం చేశాడట భగవంతుడు. కాళ్లకి కళ్లు కలిగి యుండటం వల్ల ఆయన పేరు అక్షపాదుడు (కాళ్లల్లో కళ్లు కలవాడు) అయింది. ఆయనకి మార్గాన్ని భగవంతుడు చూపాడనటానికి ఇదొక పద్ధతి. ఆయన సూత్రాలపై వాత్స్యాయనుడు ఒక వ్యాఖ్యానం రచించాడు. వార్తికాన్ని, ఉద్యోతకరుడు వ్రాశాడు. ఆ వార్తికంపై వ్యాఖ్యానాన్ని వాచస్పతిమిశ్రుడనే అద్వైతి రచించాడు. దీని పేరు "తాత్పర్యటీకా పరిశుద్ధి". "న్యాయకుసమాంజలి" అన్న గ్రంథాన్ని కూడ ఉదయనుడు రచించాడు. బౌద్ధమతాన్ని ఖండించి, ఈ దేశం నుండి దానిని పారద్రోలిన వారిలో ముఖ్యుడాయన. న్యాయశాస్త్రంపై "న్యాయమంజరి" అనే వ్యాఖ్యానాన్ని జయంతుడు రచించాడు. అన్నంభట్టారకుడు "తర్క సంగ్రహ" మనే గ్రంథాన్ని, దానికొక టిప్పణినీ (దీపిక) రచించాడు. న్యాయశాస్త్రాన్ని అభ్యసింపగోరేవారు చివర చెప్పిన గ్రంథాలతో ప్రారంభిస్తారు.

కణాద మహర్షి చెప్పిన వైశేషిక సూత్రాలపై ప్రశస్తపాదుడు ఒక భాష్య గ్రంథాన్ని రచించాడు. దాని పేరు "పదార్థ ధర్మ సంగ్రహం". దీనిపై ఒక వ్యాఖ్యానాన్ని ఉదయనుడు రచించాడు. ఇటీవల ఉత్తమూర్ వీరరాఘవాచార్యులు "వైశేషిక రసాయన"మనే గ్రంథాన్ని రచించాడు.

వైశేషికానికి మరొకపేరు కూడా ఉంది. అది "ఔలూక్య దర్శనం". "ఉలూక"మంటే గుడ్లగూబ. ఇదే ఆంగ్లంలో Owl అయింది. కణాదునినే ఉలూకమనే వారట. తన చింతనలో పరధ్యానంగా ఉంటూ నూతిలో గౌతముడు పడ్డాడు. కణాదుడు పగలంతా తన పరిశోధనలలో నిమగ్నమై భిక్షాటనం రాత్రిళ్లు చేసుకునే వాడట అందువల్ల "గుడ్లగూబ" అన్న పేరు వచ్చింది. (భగవద్గీతలో కృష్ణభగవానుడు అజ్ఞాని రేయి, జ్ఞాని పగలు అని అన్నప్పుడు జ్ఞానులను గుడ్లగూబలుగా వర్గీకరిస్తాడు). కణాదుడు చెప్పిన సిద్ధాంతమవటం చేత వైశేషికాన్ని కణాదశాస్త్రమని కూడ అంటారు. విద్వాంసుల దృష్టిలో వ్యాకరణమూ, న్యాయమూ అన్ని శాస్త్రాలనూ అర్థం చేసుకోవటానికి ఉపయోగపడుతాయి.

**జగత్సృష్టికి కారణం :**

సృష్టికి కారణాలు రెండు : నిమిత్తం, ఉపాదానం. మట్టికుండ ఉంటే, దానిని చేయటానికి మన్ను ఉండాలి. కుండ ఉండటానికి కారణం మట్టి. దానిని ఉపాదానమంటారు. కాని మన్ను కుండగా ఎట్లా మారుతుంది? తనంతట తాను కాలేదు కదా. కుమ్మరి మట్టిని కుండగా చేయగలడు. అంటే కుండ ఉండాలంటే కుమ్మరి ఉండాలి. అతడు కారకుడు లేక నిమిత్తం. జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన నిమిత్తం లేక శకునం వేరు.

న్యాయవైశేషిక సిద్ధాంతాననుసరించి, అణువులను ఉపాదానంగా తీసుకొని, ఈశ్వరుడు నిమిత్తకారణమై జగత్తుని సృష్టించాడు. మట్టిని కుండగా చేయటానికి, కుమ్మరి ఉండి తీరాలి. అతడే లేకపోతే కుండ అసంభవం. దీనినే ఆరంభవాదమని గాని, అసత్ కార్యవాదమని గాని అంటారు. "సత్" అంటే ఉన్నది; "అసత్" అంటే లేనిది. మట్టిలో కుండ లేదు. లేనికుండ మట్టినుండి సంస్థిత మవుతుంది. ఆ విధంగానే, అణువులలో లేని జగత్తును ఈశ్వరుడు అణువుల సహాయంతో సృష్టించాడు. న్యాయశాస్త్రపు సిద్ధాంతమిది.

సాంఖ్యవాదుల ప్రకారం దేవుడు లేడు. వారి సిద్ధాంతానుసారం ప్రకృతి తన నుండి తానే జగత్తుని కల్పించింది. ఆధునిక నాస్తికుల వాదానికీ దీనికీ తేడా ఉంది. దీనికి కారణమిది : సాంఖ్యులు నిర్గుణ బ్రహ్మను (లేక, పురుషుణ్ణి) జ్ఞానస్వరూపునిగా గుర్తిస్తారు. జడమైన ప్రకృతి యొక్క సక్రమ వ్యాపకాలకి కారణం, పురుషుని సాన్నిధ్య ప్రభావం వల్లనే అంటారు. ఆ సామీప్యమే సృష్టికీ, అందులోని నియమబద్ధతకీ కారణమంటారు. పురుషునకు ఏ వ్యాపకమూ లేదు. సూర్య కిరణాల వల్ల నీరు ఆవిరి అవుతుంది. మొక్కలు పెరుగుతాయి, తడిబట్టలు ఆరుతాయి. ఇవన్నీ సూర్యుని ప్రభావం వల్లనే జరుగుతాయి. సూర్యునికి మాత్రం కొలనుని ఎండిపోయేట్టు చేద్దామని గాని, మొక్కని ఎదిగేట్టు చేద్దామని గాని ఉద్దేశముండదు. మంచునీళ్లల్లో చేతులు పెట్టితే వేళ్లను బండబారుద్దామన్న ఉద్దేశ్యం మంచునీటికి కలదని అనలేము కదా. ఆ విధంగానే పురుషుడు సృష్టికార్యం సల్పాలని సంకల్పింపక పోయినా, పురుషుని ప్రభావం వల్ల ప్రకృతే తననుండి సృష్టి కార్యాన్ని సల్పుతుంది. ఇది సాంఖ్య సిద్ధాంతం. దీనినే పరిణామ వాదమని కూడ అంటారు.

నైయాయికుల అసత్ కార్యవాదానికి ప్రతిగా సాంఖ్యులు సత్ కార్య వాదాన్ని ప్రతిపాదిస్తారు. వీరిట్లా అంటారు :

కుండ కూడ మట్టిలో అంతర్భాగమే. మొదట్లో నూనెగింజలను గానుగవాడు ఆడిస్తే ఆ గింజలలోనే ఉన్న నూనె వస్తోంది. మట్టిలోనే ఇమిడి ఉన్న కుండకి ప్రయత్నం వల్ల ఆ రూపంవస్తుంది. మట్టినుపయోగించటం వల్లనే కుండ వస్తుంది. నూనె గింజల నుండి కుండ తయారు కాదు కదా! అట్లాగే, నూనెని మట్టి నుండి పొందలేం. కుండలో మట్టి కణాలు తప్ప ఏవీ లేవు. ఆ అణువుల అమరికని కాస్త మారిస్తే కుండ తయారవుతుంది.

శ్రీ శంకరభగవత్పాదుల వారిట్లా అన్నారు. "ఆరంభవాదంగాని పరిణామ వాదం గాని సప్రమాణం కాదు. మాయసహాయంతో బ్రహ్మమే సృష్టి రూపం దాల్చాడు. ఆ విశ్వకర్త అయిన కుమ్మరిని విడిచి మట్టిలేదు. అందువల్ల ఆరంభవాదానికి అర్థం లేదు. పరిణామము వలన - అంటే మార్పు వలన - పరమాత్ముడు జగత్తుని పాలనుండి పెరుగువలె సృష్టించాడనటమూ సబబు కాదు. ఎందు వల్లనంటే - అటువంటి పరిణామము సంభవించిన తరువాత పెరుగు మాత్రమే ఉంటుంది కాని పాలుండవు. జగత్సృష్టి తరువాత పరమాత్మ అస్థిత్వం కోల్పోయాడనటం అసందర్భం. పరమాత్ముడు శుద్ధ జ్ఞానం వలె ఒకవైపూ, జీవునిగా - జగత్తుగా మరొకవైపూ ఉంటాడు. ఇదంతా ఆ "సత్" పదార్థం యొక్క లీల. నాటకంలో పాత్రధరించినంత మాత్రాన ఆ మనిషి నిజస్వరూపాన్ని కోల్పోతాడా? సృష్టి కూడా అంతే. జగత్తులో అనేక రూపాలను ధరించినా ఆ సత్ పదార్థానికి మార్పులేదు". దీని పేరు వివర్తవాదం - శంకరుని సాహసోపేతమైన సిద్ధాంతం.

పాముగా భ్రమింప చేసే త్రాడు - వివర్తం. అది పాముగా మారలేదు. అందువల్ల అది ఆరంభవాదం కాదు. త్రాడు త్రాడుగానే ఉంటుంది, పాము కాలేదు. కాని మన అజ్ఞానం వల్ల అది పామువలె కనబడుతుంది. ఇట్లాగే అవిద్యవల్ల బ్రహ్మమే మనకు జగత్తువలె, సృష్టివలె, అందులోని జీవరాశుల వలె కనబడుతుంది.

ఆచార్యులవారు ప్రతిపాదించిన సత్యాన్ని గ్రహించటానికి అనేకమైన యుక్తులను న్యాయశాస్త్రం చెప్తుంది. పదార్థం యొక్క నిజస్వరూపాన్ని తెలిసికోవటానికి ఈ యుక్తులు ఉపయోగ పడుతాయి. వీటివల్ల వైరాగ్యం సిద్ధిస్తుంది. ఈ స్థితి నుంచి సంతోషదుఃఖాలు లేని స్థితికి వెళ్లవచ్చు. ఆ స్థితిని అపవర్గమంటారు. న్యాయవైశేషిక సిద్ధాంతాలు అక్కడితో నిలచిపోతాయి.

ద్వైత సిద్ధాంతం ప్రకారం కూడ అంతకంటె ముందుకు వెళ్లలేం. అద్వైతం ఒకే ఒక సత్ ఉన్నదనీ మనము 'సత్' అవటమే మోక్షమనీ, జన్మరాహిత్యసిద్ధి అనీ ప్రతిపాదిస్తుంది.

న్యాయం మాత్రం మనం అపవర్గమనే ఉత్కృష్టస్థాయికి చేరుకోగలమనీ, ఈ ప్రపంచపు అసంతృప్తి కరమైన జీవనాన్ని అధిగమించ గలమనీ చెప్తుంది.

ఈ శాస్త్రానికి ఇంకొక విశిష్టత కూడ ఉంది. బౌద్ధులు, సాంఖ్యులు, చార్వాకులు ప్రతిపాదించే సిద్ధాంతాలను ఖండించగల యుక్తులనేకం తెల్పుతుంది. ఈశ్వరుడున్నాడనీ, సృష్టికర్త అనీ కూడ నిరూపిస్తుంది.

**కొన్ని సంఘటనలు - వాదాలు :**

"తత్త్వచింతామణి" అనే తన గ్రంథంలో గంగేశమిశ్రోపాధ్యాయ 64 వాదాలను పేర్కొన్నాడు. ఇప్పటి వరకూ ఏవో తాత్త్విక సిద్ధాంతాలతో శ్రమిస్తున్నాం. ఇప్పుడు గంగేశమిశ్రుని గురించి కొన్ని ఉదంతాలు చెప్పుకుందాం.

ఆదిలో గంగేశుడు అంత తెలివైన కుర్రవాడు కాడు. అతను బెంగాలులో ఉన్నతమైన బ్రాహ్మణ వంశంలో పుట్టాడు. ఆ రోజులల్లో ఇటువంటి కులీన బ్రాహ్మణ బాలురకు ఎందరో బ్రాహ్మణ కన్యలనిచ్చి వివాహం చేసే ఆచారముండేది. ఆ బ్రాహ్మణ కన్యలలో కొందరు కులీనులు కారు. ఆ రీతిగా ఒక కులీన బ్రాహ్మణులకు ఏభై వరకూ భార్యలుండేవారు. కాని గంగేశమిశ్రునికి ఒకే ఒక భార్య ఉండేది. ఆమెతో అతను అత్తవారి యింట ఉండేవాడు. అతను అవివేకి కావటం వల్ల ఎక్కువ సంబంధాలు రాలేదు.

బెంగాలీలు చేపలు తింటారు. వర్షాకాలంలో పెక్కు ప్రదేశాలు జలమయమవుతాయి. కూరగాయలను పెంచుకోవటానికి నేల దొరికేది కాదు. ఆ కాలంలో సమృధిగా దొరికే చేపలను తినేవారు. తూర్పు బెంగాలులో చేపని జలపుష్పమని కూడ అంటారు. అంటే అది శాకాహారం వంటిదేనని సూచించటానికి. కూరలు పెంచుకొనే అవకాశమే లేకపోవటం వల్ల బెంగాలీలకు చేపలు తినటమలవాటయింది. గంగేశుని అత్తవారి యింట్లో చేపలను వండుతూండేవారు. గంగేశుని "గంగ" అని పిలుస్తూ ఉండేవారు. అతడు మొద్దు కావటం వల్ల అతనికి ఎముకలను మాత్రం వడ్డించి మిగిలిన వారు కండను తినేవారు. ఆ తరువాత అతనిని ఆటలు పట్టించేవారు. దానిని అతడు భరింపలేకపోయేవాడు. ఒకనాడు కాశీకి ప్రయాణమై జారుకున్నాడు. అక్కడ పది సంవత్సరాలు విద్యనభ్యసించాడు. అతడు లేకపోవటాన్ని ఇంట్లో ఎవ్వరూ పట్టించుకోలేదు. అతను తన విద్యను పూర్తి చేసి తిరిగి వచ్చాడు. అన్నాళ్లు అతను ఏ లక్ష్యమూ లేకుండా, వృథాగా అక్కడా, ఇక్కడా తిరిగి ఉంటాడని అందరూ అనుకున్నారు. భోజనానికి కూర్చున్నప్పుడు అతనికి పాత అలవాటు ప్రకారం చేపని వడ్డించారు. అప్పుడు అతను "నాఽహం గంగా, కిన్తు గంగేశమిశ్ర" (నేను ఇంక గంగను కాను, నేను గంగేశమిశ్రను) అంటే నేను మునుపటి తెలివితక్కువ గంగనైతే చేప ఎముకలనే పెట్టినా సరిపోయేది - కాని ఇప్పుడు నేను పాండిత్యాన్ని సూచించే పేరును చేర్చుకున్నాను అని అర్థం. ఈ అర్థాన్ని క్లుప్తంగా సూచించాడు ఆ వాక్యంలో. అత్తవారు అతని విలువను గ్రహించారు.

ఆ గంగేశమిశ్రుడే "తత్త్వచింతామణి"ని రచించాడు. దానిపై ఎందరో వ్యాఖ్యానాలు వ్రాశారు. వారిలో రఘునాథశిరోమణి ఒకడు. అతని తరువాతనే గొప్ప సంస్కృత పండితుల

పేర్ల చివర "శిరోమణి" అన్న బిరుదును చేర్చటం మొదలు పెట్టారు. గదాధరుడనే పండితుడు కేవలం పదిశ్లోకాలపై వ్యాఖ్యగా బృహద్గ్రంథాన్ని వ్రాశాడు. అందులో ఒక్క వాక్యం కూడ అప్రస్తుతమనలేం. ఆ గ్రంథం పేరు "గదాధరి". ఇందులోని అయిదు వాదాలనైనా చదివి అర్థం చేసుకో గలిగిన వానిని చదువుకొన్నవాడనవచ్చు. పదింటిని చదివితే మంచి తెలివగల వాడ్నవచ్చు. ఈ వాదాలలో ఒక దానిని "ప్రామాణ్య వాద" మంటారు. దానిని క్షుణ్ణంగా నేర్చిన వాడిని అందరికంటే వివేకి అనవచ్చు. ఈ నాటికీ తర్కశాస్త్రాన్ని అభ్యసించేవారు గదాధరిని అధ్యనం చేస్తారు.

ప్రామాణ్యవాద మంటే ప్రమాణాలు, లేక ఋజువుల గురించి ఇప్పుడు చెప్పనారంభిస్తే తలతిరిగిపోతుంది. కాని మన ఆచార్యులవారి రోజులలో ఈ ప్రామాణ్య వాదాన్నే మండనమిశ్రుని వాకిటగల రామచిలుకలు కూడ చర్చించేవట!

ఆదిశంకరుడు మండనమిశ్రుని నివాసమున్న మాహిష్మతికి వెళ్లి అక్కడ నదినుంచి యిళ్లకు నీరుని తీసికొని పోతున్న ఆడవాళ్లని మండనమిశ్రుని యింటికి దారి అడిగాడు. ఆ ఆ నగరంలో సామాన్యస్త్రీలు కూడ బాగా చదువుకున్న వాళ్లే. ఆచార్యుని ప్రశ్నకు వారు శ్లోక రూపంలో సమాధానం చెప్పారు. వాటిలో ఒకటి మండనమిశ్రుని యింటి గుర్తులను ఈ విధంగా వివరించింది;

*"స్వతః ప్రమాణం పరతః ప్రమాణం*
*కీరాంగనాః యత్రగిరం వదంతి*
*ద్వారస్థ నీడాన్తర సన్నిరుద్ధ*
*జానీహి తత్ మండన పండితౌకః"*

(ఏ వాకిట ఆడరామచిలుకలు స్వతప్రమాణం గురించీ పరఃప్రమాణం గురించీ చర్చించుకుంటాయో - ఆ యిల్లే విద్వాంసుడైన మండనునిది అని తెలుసుకో)

ప్రాచీన భారతంలో పురుషులే కాక స్త్రీలు కూడ బాగా చదువుకున్న వారేనని దీని బట్టి అర్థమవుతుంది. స్త్రీలే కాదు ఆడరామచిలుకలు కూడ వేదాంత విచారణలో నిష్ణాతులని కూడ తెలుస్తుంది. ఆ శ్లోకం దీనినే సూచిస్తుంది.

ఈ వాదం కష్టమైనదే అయినా దాని గురించి ఇంకొంచెం తెలుసుకుందాం. దీనికి సంబంధించి ఒక చమత్కారమైన కథ కూడా ఉంది.

ఒక దక్షిణాత్యుడు తర్కశాస్త్రాన్ని అభ్యసించటానికి నవద్వీపం వెళ్లాడు. ఆ రోజులలో, ఈ శాస్త్ర పండితులు ఎందరో బెంగాలులో ఉండేవారని పేరు. దక్షిణ దేశం నుండి వెళ్లినాయన మంచి కవి. తన కావ్యాల వల్ల ఎంతో సంపదనార్జించాడు. ప్రామాణ్యావాదం గురించి ప్రత్యక్షంగా నేర్చుకుందామని నవద్వీపం వెళ్లాడు. ఎంత చదివినా బాగా అర్థం కాలేదతనికి. ఇంకా ప్రయత్నించాడు - దానితో అతని కవిత్వధార దెబ్బతిన్నది. ఎప్పుడూ

తర్కంతోనే తంటాలు పడుతూండటం వల్ల అతని కవితలలోని సొగసు సన్నగిల్లింది. అతను తీసికొని వెళ్లిన సొమ్ముకూడ ఖర్చయిపోయింది. రెండు విధాలా నష్టపోయాడు, ఎంతో దుఃఖించాడు. ప్రామాణ్యవాదం అర్థం కాకపోవటంతో, తనలో - మిగిలిన కవితాగంధంతో ఇట్లా అన్నాడు - "నా కవిత్వాన్నే అపహరించిన ప్రామాణ్యవాదానికొక నమస్కారం"!. "నమఃప్రామాణ్యవాదాయ మత్కవిత్వాపహారిణే"

ఒక వస్తువుని చూడగానే మనకి దాని గురించి ఎరుక ఏర్పడుతుంది. ఒక్కొక్క సారి ఈ ఎరుక సరిగ్గా ఉండదు. పటికను చూచి కలకండ (పటిక బెల్లం) అనుకోవచ్చు. ఇది తప్పు జ్ఞానం. సరియైన జ్ఞానాన్ని "ప్రమ" అంటారు. తప్పు దానిని "భ్రమ" అంటారు. జ్ఞానాన్ని ఇంకా రెండు విధాల విభజిస్తారు. "సంశయజ్ఞానం", "నిశ్చయజ్ఞానం". సందేహమున్న జ్ఞానాన్ని సంశయజ్ఞానమంటారు. ఏ సందేహమూ లేని దాన్ని నిశ్చియజ్ఞాన మంటారు. తప్పు జ్ఞానం ఒక్కొక్కసారి సరియైన జ్ఞానం వలె అనిపిస్తుంది. అటువంటి సందర్భాలలో దీనినే ప్రమాణం అనుకుంటాం. పటిక, పటికబెల్లం వలె కనబడటం వంటిది. కొన్ని సందర్భాలలో మనకి కలిగిన ఎరుక సంశయాత్మకంగా మొదటే అనిపిస్తుంది. నీటిలో చెట్ల నీడను చూచినప్పుడు అవి తలక్రిందుగా కనబడుతాయి. చెట్లు అట్లా నిలబడవు అని మనం ముందే గ్రహిస్తాం. అందువల్ల ఆ ప్రమాణాన్ని తిరస్కరిస్తాం. అంటే "ఎరుక" కలిగిన క్షణంలోనే అది సత్యమో - అసత్యమో తేలిపోతుంది. కొంత కాలవ్యవధి తరువాత కూడ మొదట కలిగిన ఎరుక సరియైనదిగానే నిలుస్తే దానిని ప్రామాణ్య గ్రహ జ్ఞానమంటారు. ఆదిలోనే సంశయాత్మకంగా తోచే జ్ఞానాన్ని అప్రామాణ్యగ్రహాస్కందిత జ్ఞానమంటారు. "ప్రమ" లేక సరియైన జ్ఞానంలో వలె, భ్రమలో కూడ ప్రమాణం వల్లనే జ్ఞానమేర్పడుతుంది. అందుచేతనే, పటిక, పటికబెల్లం వలె తోచినప్పుడు, మన ఎరుకే ప్రమాణం.

ఋజువు రెండు రకాలు - ఆదిలోనే సత్యమనిపించేవి, ఆదిలోనే అసత్యమనిపించేవి. ఈ రెంటిలో ఏది సరియైనదన్న విషయాన్నే మండనమిశ్రుని వాకిట రామచిలుకలు చర్చించుకుంటున్నాయి.

ఒక పదార్థాన్ని గుర్తించినప్పుడు తనంతటతానే మనస్సు ఆ గుర్తింపు ప్రమాణమా, అప్రమాణమా నని తెలుసుకోలేదు. ఆ పదార్థపు లక్షణం మీద ఆధారపడి ఉంటుందది. ఆ పదార్థానికే మనపై గల ప్రభావాన్ని పరీక్షించకపోతే, మన అవగాహన సరియైనదో కాదో చెప్పలేము. అంటే, మన అవగాహన ఆత్మాశ్రయమైనది కాదు. ఇది న్యాయశాస్త్రం యొక్క వాదం. మండనమిశ్రుని వంటి మీమాంసకుల దృక్పథం దీనికి భిన్నం. పదార్థం యొక్క తత్వాన్ని గ్రహించటం మన బుద్ధికే తెలుస్తుందని వారి వాదం. కాని మన గ్రహింపు అప్రమాణమైనదని ఋజువైతే, దానికి కారణం ఆ పదార్థం యొక్క లక్షణమే. దీనినే ఇంకో విధంగా చెప్పాలంటే - సరియైన అవగాహన, లేక ప్రమాణం, మన మీద ఆధారపడి యుంటే, తప్పుడు గ్రహింపు ఆ పదార్థమ్మీద ఆధారపడి యుంటుంది. ఈ విషయాలనన్నిటినీ తర్కశాస్త్రంలో చర్చిస్తారు.

"వాద"మనే మాటని ఈ రోజులలో తమ భావాన్ని సమర్థించటమనే అర్థంలో వాడుతున్నారు. నిజానికి, ఉభయ పక్షాల వాదాలకూ సమన్వయం కలిగించటం. అంతేకాదు, విభిన్నమైన దృక్పథాలను పరిగణనలోకి తీసుకొని ఒక నిశ్చయానికి రాగలగాలి. ఆచార్యులవారు మండన మిశ్రుని వంటి పండితులతో వాదాలను చేస్తూ దేశమంతా తిరిగారన్నప్పుడు మన భావమిదే - ఆయన అందరి అభిప్రాయాలను గ్రహించేవారు, కాని చివరికి వారిదే పైచెయ్యి అయేది. తన ప్రత్యర్థులు చేసిన వాదాలనన్నిటినీ మార్చొని, ఆయన అద్వైతం యొక్క ఔన్నత్యాన్ని ప్రతిష్ఠించారు. "వాద"మంటే భిన్నాభిప్రాయాలను ప్రకటించుకోవటం, కేవలం తమ దృక్పథాన్నే బలపరచుకోవటం కాదు. తాను ముందే నిశ్చయించుకున్న అభిప్రాయాన్నే సమర్థిస్తూ వాదించటం "జల్ప" మవుతుంది; వాదం కాదు. మూడవ రకంది కూడా ఉంది. జల్పంలో వలె ఒక నిశ్చితాభిప్రాయ ముండక పోయినా ఎదిరి చెప్పిన వాటిని ఏదో విధంగా ఖండిస్తూండటం, దీనిని వితండవాదమంటారు.

పన్నెండవ శతాబ్దంలో గంగేశమిశ్రుడు బెంగాలుకి తిరిగి వచ్చినప్పటి నుండి న్యాయశాస్త్రానికి పునరుజ్జీవనం కలిగింది. బెంగాలులో పుట్టిన దీనికి నూతన తేజం వచ్చింది. దీనిని నవ్యన్యాయ మనేవారు. దీనికి ఇంకొక కారణముంది. గంగేశమిశ్రుడు, అతని తరువాతి అనుచరులు, నవద్వీపంలో నివసించేవారు. నవద్వీపాన్ని నాడియాడ్ అని కూడ అంటారు. శ్రీ కృష్ణ చైతన్య కూడ ఇక్కడి వాడే. ఆయన కూడ బహుశాస్త్ర కోవిదుడు. కొన్నాళ్ల తరువాత ఆయన కృష్ణ భజన సంకీర్తన చేస్తూ భగవంతుని నామ సంకీర్తనమే మోక్షానికి సోపానమని చాటాడు.

"జగత్తు సత్యం, మిథ్య కాదు, జీవాత్మలనేకం, అవి పరమాత్మకు భిన్నం" అనే న్యాయశాస్త్ర సిద్ధాంతాలతో అద్వైతం ఏకీభవించదు. న్యాయశాస్త్రం నిరీశ్వరవాదాన్ని ఖండించి, భగవంతుని ఉనికిని నిర్ద్వందంగా సమర్థిస్తుంది. దీనికై అది ప్రతిపాదించే సిద్ధాంతాలు అద్వైతానికి దారి చూపే యుక్తులు. ఆ కారణం వల్ల దానిని ఒక ముఖ్యమైన శాస్త్రంగా పరిగణిస్తారు.

న్యాయం వేదానికొక ఉపాంగం - ఎంతో వివేకమైన, తర్కబద్ధమైన వాదాలకి స్థానమది. పధ్నాలుగు విద్యలలో తరువాతిది పురాణం. దీనినే ఆధునికులు కొందరు కేవలం మూఢ నమ్మకాలుగా తీసివేస్తారు. పురాణాల విషయం కొంచెం చూద్దాం.



# 24

# ఉపాంగములు : పురాణములు -

**వేదమునకు భూతద్దములు :**

వేదాలకు పురాణాలు భూతద్దాలనవచ్చు. చిన్న చిన్న వాటిని పెద్దవిగా చేస్తాయికనుక. వేదాలలోని సూక్తులు క్లుప్తంగా ఉంటాయి - వాటిని కథలుగా, ఆఖ్యాయానాలుగా పెంచి చూపుతాయి పురాణాలు.

ఒక భావాన్ని క్లుప్తంగా చెప్పితే అది మనస్సులో నాటుకోక పోవచ్చు, దాని ఫలితమూ కనబడక పోవచ్చు. దానినే ఒక కథగానో ఉపాఖ్యానంగానో చెప్పితే మనస్సులో నిలచిపోతుంది. ఒక ఉదాహరణ తీసుకుందాం. వేదాలు "సత్యం వద" అంటాయి - అంటే, "సత్యాన్ని పలుకు" అని. సత్యవ్రతాన్ని పాటించటం ఎంతటి మహనీయతకు దారితీస్తుందో హరిశ్చంద్రుని కథలోని వృత్తాంతాల వల్ల తెలియజేయబడింది. "ధర్మం చర" అంటే ధర్మాన్ని పాటించు. రెండు ముక్కలలో వేదాలు చెప్పిన దానిని మహాభారతంలోని పాండవుల కథ ద్వారా తెలియ వస్తుంది. 'మాతృదేవో భవ' 'పితృదేవో భవ' అంటే తల్లిని దైవముగా ఆరాధించు, తండ్రిని దైవముగా ఆరాధించు - ఇది వేద వాక్కు. ఈ వైదిక నిర్దేశాలను భూతద్దంలో చూపినట్లు రామాయణ గాథలో తెలుస్తుంది. వైదిక నియమాలైన నిగ్రహం, క్షమ. కరుణ, పవిత్రత వంటి ధర్మాలనన్నిటినీ తమ తమ జీవితాలలో ఎందరో స్త్రీలు పురుషులు పాటించి చూపుతారు. ఇవన్నీ పురాణాల ద్వారా తెలుస్తాయి. ఆ కథలని వినటం వల్లా, చదవటం వల్లా ఆ మహనీయులు పాటించిన ధర్మాలలో మనం కూడ నిమగ్నుల మవుతాం.

వాళ్లందరూ ఎన్నో పరీక్షలకూ, కష్టాలకూ గురి అయ్యారు. ఈ విశిష్ట వ్యక్తులు ఎన్నో విధాల ధర్మాన్ని అతిక్రమించిన సామాన్యులకంటె ఎక్కువ కష్టాలను అనుభవించారు. అయినా వారి గాథలు చదువుతూంటే "ధర్మపాలన కష్టంకదా ధర్మాన్ని విడనాడితే ఏమి" అన్న ప్రశ్న మనలో ఉదయించదు. ధర్మపరాయణత్వము, ఎన్ని అవాంతరాలు వచ్చినా ధర్మాన్ని విడనాడకుండా ఉండటమూ, దాని వల్ల వారికి కలిగిన ఉపశాంతీ - ఇవే మన మనస్సులో మెదులుతాయి. ఆ మహనీయులకు సంభవించిన కష్టాలు, విపత్తులూ తెలిసినప్పుడు మన మనస్సు కరుణతో కరిగి పోతుంది. మన అంతరాంతరాలలోని సంశయాలు పోయినట్టూ, మన దోషాలు క్షాళనమయినట్లూ అనిపిస్తుంది. వారి అంతిమ విజయం, ఖ్యాతీ మన మనస్సులలో ధర్మాన్ని నిలుపుతాయి. పురాణగాథలు చేసేదిదే.

**పురాణాలూ, చరిత్రా :**

మన దేశ చరిత్ర లిఖిత పూర్వకంగా లేదంటూంటారు. పురాణాలు చరిత్రే. క్రీస్తు శకంలో జరిగిన వాటిని తప్పిస్తే ఇంక దేనినీ చరిత్రగా ఆధునిక విద్వాంసులు అంగీకరించరు.

మొగమాటానికా అన్నట్లు పురాణాలలో ఈషణ్మాత్రం చారిత్రకాంశాలున్నాయని అంటారు. దీనినైనా తమ అభిమాన సిద్ధాంతాలను బలపరచే వాటి గురించే. మహాద్భుతాలూ అస్వభావికమైన విషయాలూ, వీరి దృష్టిలో అర్ధరహితం. మానవునికి ఇంద్రియగోచరం కానిదంతా అసత్యమని ప్రక్కకు నెట్టేస్తారు. పురాణాలలో ఎన్నో మర్మాలున్నాయి. అదంతా చరిత్ర కానేరదంటారు.

పురాణాలలోని సంఘటనలు పిన్న వయస్కుల మనస్సుకి ఆకర్షణీయ మవటమే కాక, వారి శీలాన్ని కూడ సన్మార్గాలలో పెట్టుతాయి. చరిత్ర అటువంటిది కాదు. చరిత్రని పట్టించుకోనక్కర్లేదని నేననను. పురాణాలు కూడ చరిత్రే. మానవుణ్ణి ఉన్నతుణ్ణి చేయటం వాటి లక్ష్యం. అందువల్లే పురాణాలని కూడ చదవాలి. చరిత్రని చదువ వలసిన అవసరముండటానికి ఒక కారణం, చరిత్ర పునరావృతమవటం. పరిస్థితులూ, సంఘటనలూ తిరిగి తిరిగి రావటం సహజం. అందుచేత, గతం తెలిస్తే, భవిష్యత్తుని తెలుసుకోగలం. గతం నుండి గుణపాఠాలను కూడ నేర్వగలం. ఒక పరిస్థితిని ఉపేక్షచేస్తే యుద్ధానికో, సంఘవిచ్ఛిత్తికో, నాగరిక ధ్వంసానికో దారి తీయగలదని చరిత్ర చూపుతుంది. అటువంటి పరిస్థితే మళ్లీ పొడచూపితే మనం ముందు జాగ్రత్తలు తీసికొని ఆ దుర్ఘటనలను తప్పించు కోవచ్చు. చరిత్రకు గల ప్రయోజనాలలో ఇదొకటంటారు.

పురాణాలకి కూడ చారిత్రకత ఉంది. కాని ప్రజలను సన్మార్గవర్తనులను చేయటానికి ఉపకరించే సంఘటనల గురించే అవి చెప్పుతాయి. ధర్మవర్తనం వల్ల ఈ జన్మలోనే సత్ఫలితాలను పొందిన రాజుల గురించీ, అధర్మప్రవర్తన వల్ల కష్టాల పాలైన రాజుల గురించీ పురాణాలు చెప్పుతాయి. లేకపోతే, మరు జన్మలలోకి తీసికొని పోయి వారి పురాకృతాల ఫలితాలని చూపుతాయి. ఉత్తర జన్మలో పాపపుణ్యాల ఫలితాలని తెలుపని పురాణం లేనే లేదు. చరిత్ర అధ్యయనం వల్ల కలిగే ప్రయోజనాలివి (1) పూర్వానుభవం ప్రస్తుత పరిస్థితిని ఎదుర్కొనటానికి ఉపకరిస్తుంది (2) సద్వర్తన వల్ల సత్ఫలితాలను పొందిన సత్పురుషుల జీవితాల అధ్యయనం మనకి మార్గదర్శక మవుతుంది (3) దుష్టకార్యాలు చేసి ఎందరికో ఎన్ని విధాలో కీడు చేసి తత్ఫలితాలను తామే ఇంకా ఎక్కువగా అనుభవించిన వారి జీవితాలను తెలిసికోవటం మనం పెడదారుల పడకుండా ఆపుతుంది. ఈ ప్రయోజనాలు చరిత్ర పాఠాలను చదవటం వల్ల లభించవు. పురాణాలే ఆ ప్రయోజనాలను అందిస్తాయి.

కొందరు రాజవంశీయులు జయించిన యుద్ధాలను గురించిగాని, వారు చేసిన సంస్కారాలను గురించిగాని ఏకరువు పెట్టటంలో ప్రయోజనమేమీ లేదు. వారి పనుల మంచి చెడ్డలను కూడ వివరించాలి. మనమింకా ఉత్కృష్టమైన జీవితాన్ని గడపటానికి దోహదమివ్వని చరిత్ర నిరర్థకం. పురాణాల ప్రయోజనమిది. మనిషి మనస్సుని మలచి అతనికీ, సమాజానికీ ఉన్నతమైన జీవితాన్ని కలిగించటం.

పురాణాలలో సూర్య, చంద్ర వంశపు రాజుల గురించి వివరాలెన్నో ఉన్నాయి. వారి వంశపరంపరకి సంబంధించిన వివరణలెన్నో ఉన్నాయి. ఆదర్శప్రాయులు కాని రాజులు

గురించి రెండు మూడు వాక్యాలకంటే ఎక్కువ ఉండవు. మనకి ఆదర్శప్రాయులైన వారి గురించి ఎన్నో వివరాలుంటాయి. ఉదాహరణకి - ధృవుని తండ్రియైన ఉత్తనపాదుని గురించీ ధృవుని తరువాత రాజ్యమేలిన అతని కుమారుని గురించీ మహాభాగవతంలో రెండు మూడు వాక్యాల కంటె ఎక్కువ లేవు. కాని భక్తి తత్పరతకి పెట్టింది పేరైన ధృవుని గురించి ఎన్నో వివరాలున్నాయి.

"పురాణాలు కేవలం కల్పిత గాధల"ని మన దేశ చరిత్ర వ్రాసిన ఆంగ్లేయులన్నారు. "విభేదాలను కల్పించి, విడదీయి" అన్న వారి రాజకీయ నీతి కనుగుణంగా వారు జాతివాదాన్ని అందులో జొప్పించి అదంతా నిష్పక్షపాతమైన పరిశోధనగా చెప్పుకున్నారు! వారి దృష్టిలో పురాణాలు కల్పనలే అయినట్టుగానే, స్వతంత్ర భారతంలో ఆధునికుల దృష్టిలో ఇంగ్లీషువారు రచించిన భారత దేశ చరిత్రకూడ అక్కడక్కడ కల్పనే! నిష్పక్షపాతంగా చరిత్రను వ్రాయటానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. ఇక్కడ కూడా ఆయా రచయితలకు కొన్ని కొన్ని అంశాలపట్ల వారి వారి భావాలూ, అభిమానాలూ ఉండవచ్చు. ఎంత ప్రయత్నించినా, అసలు నిజం వ్రాయబడుతుందని నమ్మకం లేదు. పాశ్చాత్యుల ప్రభావం వీరిలో కూడ ఉండవచ్చు.

చరిత్ర అంటే రాజ్యాలూ, రాజులూ, యుద్ధాలూ, రాజవంశాలూ మాత్రమే కాదు. ప్రతిదానికీ చరిత్ర యుంటుంది. దురదృష్టవశాన పాశ్చాత్య చరిత్రకారులు, రాజకీయాలకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. కాని, పురాణాలలో ప్రాముఖ్యం ధర్మానికి. దాని చుట్టూ కొన్ని సంఘటనలనూ, రాజుల చరిత్రలనూ, ఋషులనూ, సామాన్యులనూ కూడా అల్లుతారు. పురాణపఠనం వల్ల రాజ్యపాలన గురించే కాక అప్పటి ప్రజల సంస్కృతీ, నాగరికతల గురించీ కూడ తెలుస్తుంది. పురాణాలలోని ముఖ్య విషయం - ధర్మమూ, ఆధ్యాత్మికతాను!

**పురణాలు వాస్తవమా, అభూత కల్పనలా?**

ఆధునికుల దృష్టిలో "మన మెరిగిన సహజసత్యాలకి అతీతమైనవి ఎన్నో ఉన్నాయి. అందుచేత వాటిని నమ్మక్కర్లేదు." దేవతలు భూమిమీద ఎక్కడ పడితే అక్కడికి వెళ్లి, వరాలనివ్వటం కేవలం అభూతకల్పనే. ఇట్లాంటివి అసంభవం. ఒక స్త్రీ శాపవశాన బండరాయి అవుతుంది. ఆ రాయే మళ్లీ స్త్రీగా మారుతుంది. సూర్యుడు తన గతిలో నిలిపి వేయబడుతాడు." ఇటువంటి సంఘటనలు మనకెప్పుడూ అనుభవంలోకి రావు. కాబట్టి అవన్నీ అభూతకల్పనలేనని త్రోసి పారేయటానికి అవకాశముంది.

కొన్ని సంఘటనలు ఇప్పుడు అసంభవమైనంత మాత్రాన అవి పూర్వకాలంలో గాని, భవిష్యత్తులో ఎప్పుడైనా గాని అసంభవమని ఎట్లా అనగలం? వేదమంత్రాలకూ, తపస్సుకీ, యోగనిష్ఠకూ గల అమోఘమైన శక్తి, తరచూ కనబడేదేనని ప్రతి పురాణమూ చాటి చెప్తూనే ఉంటుంది. ఆ సామర్థ్యమున్నంత కాలమూ అలౌకిక శక్తులను ఉపయోగించుకోవటం సాధ్యమయేది. కాంతి ఉన్నచోటే చీకటి ఉన్నట్లే దుష్టశక్తులైన దానవులూ, రాక్షసులూ కూడ

సత్పురుషులతో బాటు ఉండేవారు. ఇప్పటికీ, ఈ దుష్టశక్తులకీ, మంచి శక్తులకీ పోరాటం జరుగుతూనే ఉంది. ఇదే దేవదానవుల సమరం. ఎటొచ్చీ ఇది మన కంటికి కనబడదు. ఆ రోజులలో తపస్సంపద వల్ల ఆ దుష్టశక్తులనీ మంచి శక్తులనీ చూడగలిగే వారు. ఆధునిక శాస్త్రజ్ఞులు కూడ కాంతికీ, శబ్దానికీ సంబంధించిన అన్ని తరంగాలనూ మన యింద్రియాలతో గ్రహించలేమంటారు. మరి కొందరు శాస్త్రజ్ఞులు మానవాతీత శక్తుల గురించి పరిశోధనలు జరిపి దివ్యశక్తులున్నాయనీ వాటిలో కొన్ని మంచివీ, మరి కొన్ని చెడ్డవీ అని కనుగొన్నారు.

ఈనాడు కూడ కొందరు సిద్ధులూ, యోగులూ ఉన్నారు. తీవ్రమైన చల్లదనాన్ని గాని, వేడిమినిగాని వారి శరీరాలు తట్టుకో గలవు. వారు వర్షాన్ని కురిపించగలరు, ఆపివేయగలరు. అతిలోక శక్తులు గల మనుష్యులున్నారు. మన విశ్వాసమే దృఢం కాదు. మనమన్నిటినీ సందేహిస్తాం. పూర్వకాలంలో ఇటువంటి అలౌకిక శక్తులు కలవారెందరో ఉండటం వల్ల పురాణాలన్నీ ఈ అద్భుతాంశాల మయమన్నట్లు కనబడుతాయి. కథనంలో కొన్ని అద్భుతాలను చొప్పించినంత మాత్రాన దానిని చరిత్ర కాదంటూ కొట్టివేయరాదు.

శాస్త్రీయ పద్ధతులలో నిరూపింప దగని దంతా అభూతకల్పనే అని కొట్టివేయటం ఆధునిక విద్యకు శోభాయమనం కాదు. ఆ మాటకొస్తే, కొద్ది సంవత్సరాల క్రితం శాస్త్రపరిశోధన వల్ల ఋజువు కాని విషయాలెన్నో యిప్పుడు ఋజువవుతున్నాయి. ఇప్పుడు కూడా పురావస్తు పరిశోధకులు పది, పన్నెండు అడుగుల పొడవుగల మానవ అస్థిపంజరాలని చూస్తున్నారు. అట్లాగే ఎన్నడో భూమిపైన తిరిగిన పెద్దపెద్ద మృగాలని కూడ కనుగొంటున్నారు వీటి గురించే పురాణాలలో ఉన్నాయి. దీని బట్టి తాటి చెట్టంత పొడవుండి, ఏ మృగాలవంటి శరీరాలో కలిగిన రాక్షసులుండే వారని తెలుస్తుంది. ఐస్‌లాండ్‌లో మనిషి అస్థిపంజరంలో భాగంగా పదహారడుగులు పొడవుగల కాలి ఎముక దొరికింది. అట్లాగే, ఏనుగు కంటె పదిరెట్లు పెద్దదైన జంతువు యొక్క వెన్నెముక కూడ దొరికింది. ఇవన్నీ పురావస్తు పరిశోధనలంటూ పెద్ద ఆర్భాటం కూడ చేశారు. భూగర్భ శాస్త్ర జ్ఞానానికి, పురావస్తు శాస్త్ర జ్ఞానాన్ని జోడించి, ఇవన్నీ కొన్ని లక్షల సంవత్సరాల క్రితం నివసించే వన్నారు. దీనికే కొన్ని పురాణ లక్షణాలను చేరిస్తే, మన పురాణాలు నమ్మదగినివిగా కనబడుతాయి.

ఒకనాడు తాటి చెట్టంత, ఈనాడు ఆరడుగుల ఎత్తు, అంగుష్ఠ మాత్రం ఒకనాడు - జీవరాశులలోనూ, జీవజాతులలోనూ ఈ మార్పులు కాలప్రభావం వల్ల సంభవిస్తూ ఉంటాయి. ఈ మార్పులు గురించి కూడ పురాణాలలో చెప్పబడింది.

మాట్లాడే వానరాలు, జంతువు వంటి దేహము, మనిషి వంటి ముఖమూకల ఆకారాలు, రెండు తలలో, పది తలలో కల మనుష్యులు - ఇవన్నీ పురాణాలలో వస్తాయి. ఇవన్నీ సత్యదూరమంటారు. ఈ విధమైన విమర్శచేయని వారు, ఆయా రూపాలు కొన్నింటికి ప్రతీకలు మాత్రమేననీ, కథలన్నీ రూపకాలంకార భూయిష్టాలనీ సరిపెట్టుతారు!

నైతిక విలువలను కథల ద్వారా తెల్పుతారు, నిజమే. అంతమాత్రాన పురాణాలన్నీ కట్టు కథలని తీసిపారవేయ కూడదు. ఈ రోజులలో కూడ రెండు తలలూ, నాలుగు

చేతులూ కల శిశువుల జననం గురించి వింటూనే యుంటాం. అట్టి శిశువు మనిషే కాదు, జంతువు కాదు. అదొక వైపరీత్యం. నిర్దుష్టమైన ప్రకృతి గతి తప్పితే విపరీతం సంభవిస్తుంది. అటువంటి విపరీతాలని పూర్వం పెద్దఎత్తున బుద్ధి పూర్వకంగానే కల్పించారేమో! ఆ నాటి మానవులకు అతీంద్రియ శక్తులుండటం వల్ల అటువంటి విపరీతాలను కల్పించటం తేలిక వారికి. అందువల్లనే, "తెలియ వలసిన దంతా మాకు తెలుసు, మాకు తెలిసిన దానికి భిన్నంగా ఏదీ ఉండజాలద"ని ప్రగల్భాలు పలుక కూడదు. మనకి తెలియని దానిని గాని, మన మెరుగ జాలని దానిని గాని అసత్యమనటం సహేతుకం కాదు. పురాణాలలో అవిశ్వసనీయాంశాలని త్రోసిపుచ్చేవి ఇప్పుడు కూడా అక్కడక్కడ సంభవిస్తూనే ఉన్నాయి. ఒక ఉదాహరణ : తమ పూర్వజన్మ వృత్తాంతాలను చెప్పగల వ్యక్తుల గురించి పేపర్లలో వస్తూనే యున్నాయి. ఈ నడుమ అటువంటి వార్తలు ఎక్కువౌతున్నాయి కూడాను. "కశ్యపుని భార్య కద్రు. ఆమె సర్పాలను కన్నది" అని పురాణాలలో ఉంది. ఇది అసాధారణం, అసంభవమని అందుచేత అసత్యమని కొట్టి పారివేస్తాం. 1958లో వెలువడిన వార్త కొందరికి గుర్తుండే ఉంటుంది - "ఒక మర్వారీ స్త్రీ పాముని ప్రసవించింది" అన్నదే ఈ వార్త. ఆ వార్త చూచిన తరువాత నాకు మరొక విషయం స్పష్టమైంది.

నేను సన్యాసం స్వీకరించక పూర్వం ఒక కుటుంబంలోని విషయం వింటూండే వాడిని. ఆ వంశంలో జన్మించిన ఆడపిల్లలు గాని ఆ వంశానికి వచ్చిన కోడళ్లు గాని మొగలి పూవుతో ఎప్పుడూ అలంకరించుకునే వారు కారు. దానికి కారణమేమిటని అడిగితే ఈ కథ చెప్పేవారు. "పది, పదిహేను తరాల వెనుక మా వంశంలో ఒకామె ఒక సర్పాన్ని ప్రసవించింది. ఈ విషయాన్ని పైకి చెప్పటానికి సిగ్గుపడి రహస్యంగా ఆ పాము పిల్లని సాకారు. మామూలు శిశువుకిచ్చి నట్లే పాలు యిచ్చేవారు. అది హాయిగా పెరిగి యింట్లో ఎవ్వరికీ ఏ అపకారమూ చేయక మసలు కొనేది. కాని ఈ వింత బిడ్డను బయటకు తీసుకొని వెళ్లటం కుదిరేది కాదు. తప్పనిసరియైతే తప్ప ఆ తల్లి బయటకి వెళ్లేది కాదు. తమిళంలో ఒక నానుడి ఉంది : "బండరాయి అయినా సరే, భర్త భర్తే" అని. అంటే రూపం వల్ల ఆ బంధం చెడదని. ఆ విధంగానే ఆ పాముపిల్ల పట్ల తల్లి ప్రేమ అట్లాగే ఉండి పోయింది. ఒక సారి, ఒక దగ్గర బంధువు వివాహానికి వెళ్లవలసిన అవసరమేర్పడింది. ఆ యింట్లో ఒక అవ్వ ఉండేది. ఆ అవ్వ ఆ పాము పిల్లకి ముత్తవ తల్లేమో తెలియదు. ఆ రోజులలో నిరాధారమైన దూరపు బంధువులకి కూడ ఆశ్రయమిచ్చేవారు. ఈ రోజులలోనే పెళ్లి అయిన తరువాత తల్లిదండ్రులతో కలిసి ఉండటం ఇష్టంలేక కొడుకులు వేరే కాపరాలు పెట్టుకుంటున్నారు. పూర్వం అవిభక్త కుటుంబాలే సామాన్యంగా ఉండేవి. ఆ యింట్లో ఏ విధవ అత్తకో, ఆ తాతగారి వేలువిడిచిన సోదరునికో స్థానముండేది. ఏమయితేనేం, ఆ యింట్లో ఒక అవ్వ యుండేది. కాని ఆమెకి కనుచూపు లేదు. ఊరికి వెళ్తూ ఆ తల్లి తన పాముపిల్లని ఆ అవ్వకి అప్పగించి వెళ్లింది. పాముకి కావలసిందేమిటి? స్నానం చేయించి, జడ అల్లి, ముస్తాబు చేయటం కాదు. వేళకి పాలనివ్వాలి. ఊరికి వెళ్లేప్పుడు ఆ తల్లి, అవ్వకి చెప్పిందిట్లా "గోరు

వెచ్చని పాలని రోలు బెజ్జంలో పోయి. అవసరమైనప్పుడల్లా బిడ్డ పాలు తీసుకుంటుంది". గుర్తుంచుకోవటానికి తిరగలిని తాకమనీ చెప్పింది. అంటే ఆ పాముకి ఆ రకమైన అలవాటు చేశారన్నమాట. ఆ అవ్వ ఆ ప్రకారమే చేసింది. పాముపిల్ల కూడ తల్లి చెప్పినట్లే పాలు త్రాగుతూండేది. కొన్నాళ్ల తరువాత ఒక నాడు క్రమం తప్పింది. పాము పిల్లకి రోకలిలోని బెజ్జం ఖాళీగా ఉండటం తెలిసింది. అవ్వకి మెళకువ రాలేదు. ఆ పాము పిల్ల బెజ్జంలో ముడుచుకు పడుక్కుంది. కొంతసేపటికి ఆ అవ్వ బాగా వేడిగా ఉన్న పాలను తెచ్చి పాము పిల్ల ఉండటం గమనించక ఆ బెజ్జంలో పోసింది. ఆ వేడికి ఆ పాముపిల్ల చనిపోయింది. వేరొక గ్రామంలో ఉన్న తల్లికి కలలో ఆ బిడ్డ కనబడి "నేను చనిపోయాను. ఇంటికి వెళ్ళి మొగలి పొదల మధ్య నాకు దహన సంస్కారం చెయ్యి. ఇక నుంచి మీ యింట్లో పుట్టే ఆడపిల్లలు గాని, ఈ యింటిని మెట్టే ఆడపిల్లలుగాని ఆ పూవులని ధరించరాదు" అని చెప్పింది. అప్పటినుండి ఆ వంశంలో అదే ఆచారమైంది". ఈ కథ విన్నప్పుడు నాకు ఇది సంభవమేనా అని ఆశ్చర్యం కలిగింది.

ఎన్నో సంవత్సరాల తరువాత ఆ వంశీయులు నా వద్దకు వచ్చారు. పాము కథని చెప్పటానికి కాదు. నాకెంతో ఆసక్తి దాయకమైన రాగి శాసనం చూపించటానికి. అది రాజు యిచ్చిన దానం - రాగి పలకపై చెక్కారు. అది అచ్యుత దేవరాయ చక్రవర్తి నాటిది. రాజు కొరకై ఒక బ్రాహ్మణుడు, 108 బ్రాహ్మలకు దానాలు చేసినట్టుంది ఆ రాగి పలకపై.

ఇది ఎందుకు జరిగిందో చెప్పాను. బ్రాహ్మణుడు ఎప్పుడూ వేదాధ్యయనమూ, వైదిక కర్మలనూ చేస్తూ కాలం గడపాలేగాని భుక్తికోసం ఏ వృత్తినీ చేపట్టకూడదు. కాని అతని సంసారం గడవాలి కదా? అందువల్లనే అతడు దానాలను, బహుమానాలను పుచ్చుకోవచ్చని శాస్త్రం సమ్మతిస్తుంది. రాజులూ, ప్రభువులూ బ్రాహ్మణులకు దానాలు చేసేవారు. దానాలను స్వీకరింప వచ్చని అన్నారు. కాబట్టి వారు ఎన్నిటినైనా, ఎవరి వద్ద నుండైనా తీసుకోవచ్చని అర్థం కాదు. వారికెంతో ఆత్మాభిమాన ముండేది. అవసరమైనప్పుడు, అవసరమైన మేరకు మాత్రమే తీసుకునే వారు. రాజు ధర్మవర్తనుడూ, ప్రతిష్ఠకలవాడూ అయితేనే అతనిచ్చిన దానాన్ని తీసుకునే వారు.

మరికొందరింకా వెనక్కి వెళ్లేవారు. ఆ రాజు యొక్క వంశం నిష్కళంకంగా ఉందో లేదో చూచుకునే వారు. అటువంటి బ్రాహ్మణుల నిరంతర కోర్కెలను రాజులు ఎదుర్కొన వలసి వచ్చేది కాదు. వాళ్ల బాధల్లా బ్రాహ్మణులు తమ వద్ద దానాలు స్వీకరించి, తమకి లభ్యం కావలసిన పుణ్యాన్ని దక్కనీయటం లేదే అని. దీనిని ఎదుర్కోవటానికి రాజులూ, ప్రభువులూ వేరొక మార్గాన్ని కనిపెట్టారు. ఏ పేద బ్రాహ్మణునినో పిలిచి తమ దానాలను స్వీకరింపమని బుజ్జగించే వారు. ఒక్కొక్క సారి ఆ దానాలు గ్రామాలంత పెద్దవిగా ఉండేవి కూడాను. అటువంటి దానాలు ఏ ఒక్క వ్యక్తికి మాత్రమే పరిమితం కావు. దానం తీసుకున్న వ్యక్తి ద్వారా మిగిలిన బ్రాహ్మణులకు కూడ చెందుతాయని వారి యుద్దేశం. ఆ విధంగా దానాన్నంతా ఒక బ్రాహ్మణుడే తీసుకున్నా, తన కోసం కొంచెముంచుకొని మిగిలిన దానిని

ఇతరులకు పంచిపెట్టేవాడు. ఒక బ్రాహ్మణుని వద్ద నుండి వేరొక బ్రాహ్మణుడు తీసుకోవటం వల్ల దానికి ప్రతిగ్రహ దోషమంటేది కాదు, ఆ విధంగా రాజు యొక్క ప్రయోజనం కూడా నెరవేరేది.

దాతకీ, చివరకి దానమందుకొనే వ్యక్తికీ నడుమ వచ్చే వ్యక్తి కళంకితుడు కాడా అనే ప్రశ్న కూడ వస్తూంటుంది. వేద పండితలకు దానమివ్వటానికి రాజులుపయోగించే యుక్తిలో దోషమేమీ లేదు. సరే కాని ఆ మధ్యవర్తి మాట యేమిటి? అతనికి ఏ దొసగూ అంటదు. దానంగా లభించినది న్యాయంగా అతని సొత్తే అవుతుంది. ఆ పత్రం అతని పేరనే యుంటుంది. కాని అది తనదే అంటూ ఉంచుకోక ఇతరులకు దానమిచ్చేయటం వల్ల అతనికే పాపమూ అంటదు. తన ఆస్తిని తాను దానం చేస్తే ఏ పాపమూ లేదు కదా!

నేను పైన ఉదాహరించిన రాగిరేకులో ఒక బ్రాహ్మణుడు దానాన్ని పొంది 108 బ్రాహ్మణులకు దానం చేశాడు. ఆ నూటెనమండుగురి పేర్లూ, వారు ఎంతవరకూ వేదాన్ని పఠించారో ఒక్కొక్కరికి ఏ మాత్రం భూమి ఇవ్వబడిందో - అన్నీ ఆ రాగి రేకుపై లిఖింపబడ్డాయి. ఆ దానాన్ని పొందిన వాళ్లల్లో పాముపిల్ల పుట్టిన వంశజుడు ఒకడున్నాడు. మిగిలిన కుటుంబాల గురించి అంతగా తెలియదు. ఆ రాగి రేకు కొన్ని తరాలబట్టి భద్రపరుపబడింది. ఆ రాగిరేకులో లిఖింపబడిన పేరు "నాగేశ్వర". ఆ రేకును నా దగ్గరకు తెచ్చిన వారి పేరు కూడా అదే. ఆ వంశంలో ప్రతి తరంలోనూ నాగేశ్వర అని ఒకరి పేరైనా పెట్టుకుంటారట. దీని బట్టి ఆ పేరుకీ ఆ పాముపిల్లకీ సంబంధముందని గ్రహింపగలిగాము. (సంస్కృతంలో 'నాగ' అంటే పాము). అంతే కాకుండా, ఈ కథకు మద్దతుగా అచ్యుత దేవరాయల కాలంలో కూడా ఈ యింటి పేరు కల వంశమున్నట్టు తెలిసింది.

నాకు మొదట్లో కలిగిన సంశయానికి ఇది సమాధానం. అంతే కాదు, 1958లో ఒక స్త్రీ పాముని ప్రసవించిందన్న వార్తను చదివిన తరువాత నా సంశయం పూర్తిగా నివృత్తి అవటమే కాక దాని స్థానంలో విశ్వాసం చోటు చేసుకుంది.

పురాణాలలో మీకు పూర్తి విశ్వాసం లేకపోవటాన్ని తప్పుగా ఎంచకూడదేమో! నాకు కూడా వార్తా పత్రికలో వచ్చిన కథ పట్ల విశ్వాసం కలగటమే కాక, అంతకు పూర్వం నేను విన్న కథ గురించిన సంశయాలు కూడ ఈ వార్తతో పోయాయి. మనమీ స్థితికి వచ్చాము. పేపర్లో వచ్చిన వార్త ఎంత అసంభావ్యమైనా నమ్మటానికి సిద్ధపడుతాం. కాని పురాణాలు పేరు చెప్పగానే మూతి విరుచుకుంటాం! "వాళ్లకేం, బోలెడంత తీరుబాటు ఉండేది. తాటి ఆకులూ, గంటమూ ఉండేవి. పిచ్చి కథల సంఘటాలను తయారు చేసేశారు. అందులో కొంత గడుసు తనముంది నిజమే. కాని చాలా భాగం శుద్ధ చెత్త" - ఇదీ మన వరస!

**భావనాత్మకమే అయినా సందేశాత్మకమే :**

పురాణాలలో అక్కడక్కడ కల్పనలున్నాయేమో. అవి కూడ కాలక్రమేణా వాటిలో చొచ్చుకున్న చేర్పులూ, మార్పులే. కాని వాటిలో ఏది కల్పనో, ఏది చేర్పో, ఏది వాస్తవమో

ఎవరు చెప్పగలరు? ఎవరికి తోచిన దానిని వారు చేర్పుగా విసర్జించుకు పోతే చివరికి మిగిలే కథలేమిటి? మూల కథ కూడా మిగులక పోవచ్చు. ఎన్ని లోపాలున్నా, మనకి లభించిన రీతిలో, పురాణాలను కాపాడు కోవటం మన విధి.

కొన్ని కట్టు కథలుంటే యేమి? ఎంత కాదన్నా పురాణాలు మనల్ని దైవానికి దగ్గరగా చేర్చి, మనశ్శాంతి నిస్తాయి కదా? మనం దుకాణానికి వెళ్ళి మంచి పంచదారను కొనుక్కుంటాం. అది దొరికిందని సంతోషిస్తామా లేక అంగడిలో సరుకులను సరిగ్గా అమర్చలేదనో, ఆ కొట్టువాడికి చెవుడనో బాధ పడుతామా? భూగోళ విషయంలో గాని, ఖగోళ శాస్త్ర విషయంలో గాని, కాలాన్ని మన్వంతరాలుగా విభజించటంలో గాని, అక్కడక్కడ లోపాలుంటే ఉండనీయండి. అటువంటి దోషాలను పరిహరించటానికి ఆధునిక శాస్త్రాలు - భూగోళ, ఖగోళ, చరిత్రలు - ఉండనే ఉన్నాయి. కాని ఈ శాస్త్రాలూ, చరిత్రా సాధించలేని ప్రయోజన మొకటి ఉంది పురాణాలకు - అది పరమాత్మ తత్త్వం, భక్తి, ధర్మం - గురించి మనకి అధ్యయనం కల్పించటం.

"కొన్ని వేల సంవత్సరాల క్రితం త్రేతాయుగంలో రాముడు జీవించి యుండట మసంభవం. ఆ రోజులలో రామాయణం చెప్పే సంస్కృతీ నాగరికతా ఉండట మసంభవం" - ఇట్లాంటి విమర్శలు మనకి వినబడుతూంటాయి. మాటవరసకి రాముడు త్రేతాయుగంలో లేడనే అనుకుందాం. అట్లాగే కృతయుగంలో జరిగాయని చెప్పబడేవి కూడ జరుగ లేదనే అనుకుందాం. ఇవన్నీ గత ఏడు, ఎనిమిది వేల సంవత్సరాల లోపునే జరిగాయనుకుందాం. అంతమాత్రాన రాముని కథకిగల గొప్పదనం ఏమైనా తరిగిపోతుందా? ఆ కథనుండి మనం నేర్చుకునే గుణపాఠా లేమన్నా తగ్గిపోతాయా? పురాణాల కాలం గురించి నిశ్చితంగా చెప్పటం కష్టమనినట్లు గానే వాటి ఔచిత్యం శంకించటం కూడ తప్పేనన్న అభిప్రాయం కూడా ఉంది.

అయిదు వేల సంవత్సరాల క్రితం, కలియుగారంభమైనప్పుడు వ్యాసుడు పురాణాలను మనకు అనుగ్రహించాడని శాస్త్రాలు చెప్తాయి. ఆయన కంటే ముందు పురాణాలుండేవి!

చాందోగ్యోపనిషత్తులో నారదుడు తాను అభ్యసించిన విద్యలనన్నిటినీ పేర్కొంటాడు. ఆ విద్యలలో పురాణాలొకటి. దీని బట్టి ఒక విషయం తెలుస్తుంది : వేదాలు, ఉపనిషత్తుల నాటికే పురాణాలుండేవని. భావితరాల వారు వేదాల నన్నింటినీ కంఠస్థం చేయలేరేమోనని వ్యాసుడు వేదాలను శాఖలుగా విభజించినట్లే, ఆయన పురాణాలను కూడా క్లుప్తంగా వ్రాసి యుంటాడు.

అయినా, పాశ్చాత్య విద్వాంసులు పురాణాలు అంత ప్రాచీనమైనవి కావంటూంటారు. అంత మాత్రాన వచ్చిన నష్టమేమీ లేదు. "పరిశోధన" అనబడే దాని వల్ల, ఆధునిక మూఢ నమ్మకాలు చాలా వచ్చాయి. ఈ "పరిశోధనా" ఫలితాలన్నీ సరియైనవి కావు. కాలంగడచిన కొద్దీ అవి తప్పని ఋజువవౌతూంటుంది. పరిశోధనలన్నీ నిర్దుష్టాలే, పురాణాలన్నీ కాల్పనికాలే అనుకున్నా పురాణాలు నొక్కి చెప్పేదేమిటి? ధర్మాచరణపరాయణులు సంతోషంగా

ఉంటారనీ, అధర్మ వర్తనులు దుఃఖిస్తారనీ - అటువంటి వారికి కూడా భగవంతుని క్షమ భిక్షా, అనుగ్రహమూ లభిస్తాయనీను. ఈ భావాలు చదివేవారి మనస్సులో గాఢమైన ముద్రవేయటం వల్ల పురాణాల లక్ష్యం తీరినట్టేకదా?

**వ్యాసుని ప్రసాదం :**

ప్రజలు తేలికగా అర్థం చేసుకోవటానికి వేదాలనన్నిటినీ వేదశాఖలుగా అమర్చిన వ్యాసుడే, మనకి పద్దెనిమిది పురాణాలను ప్రసాదించాడు. పాత్రికేయులలో ప్రధముడనీ, ప్రముఖుడనీ వ్యాసుని గురించి అభిప్రాయముంది నాకు. ఉపాఖ్యానాలు, చరిత్ర, భూగోళశాస్త్రం, తత్త్వం - వీటన్నిటి గురించీ అమూల్యమైన ఉద్గ్రంథాలను పండితునకూ పామరునకూ తేలికగా అర్థమయే శైలిలో ఆసక్తి జనకంగా రచించాడు. పాత్రికేయులు చేసే పనికూడ యిదే కదా? కాని వీళ్లు కేవలం మనష్యులకి ఆసక్తి కలిగించేవి, కొంత ఉత్తేజపరచేవి మాత్రమే రచించి ఆపివేస్తారు. కాని మానవులు ధర్మోన్ముఖులవాలన్నదే వ్యాసుని ఆశయం. దానికి సాధనగా ఆసక్తిదాయకమైన పద్ధతినవలంభించాడు. మనష్యులకు ఆసక్తి కలిగించటమే పాత్రికేయుల ధ్యేయమైతే అవినీతి మయమూ, అధర్మమూనైన విషయాలకి కూడ ప్రచారం లభిస్తుంది. వ్యాసుడ్ని ఆదర్శంగా పెట్టుకుంటే పత్రికలు పరిశుభ్రమవుతాయి. దీనికి ప్రజలపై ప్రభావముంటుంది.

పద్దెనిమిది పురాణాలలో నాలుగు లక్షల "గ్రంథాలు"న్నాయి ముప్పై రెండు అక్షరాలు గల శ్లోకాన్ని "గ్రంథ"మంటారు. వీటిలో దాదాపు లక్షశ్లోకాలు స్కాందపురాణంలోనే ఉన్నాయి. అంతకంటె పెద్ద పుస్తకం ప్రపంచంలోనే లేదేమో. మిగిలిన పదిహేడు పురాణాలలో, మూడు లక్షల గ్రంథాలున్నాయి. ఇవికాక లక్షశ్లోకాలున్న మహాభారతాన్ని కూడ వ్యాసుడు వ్రాశాడు,

ఒక్కొక్క పురాణం ఒక్కొక్క దేవతకి ప్రాధాన్యమిస్తుంది. పురాణాలని మూడు విభాగాలుగా చేయవచ్చు (1) వైష్ణవ ధర్మానికి సంబంధించినవి (2) శైవధర్మానికి సంబంధించినవి (3) శాక్తేయ ధర్మానికి సంబంధించినవి. ఈ విధంగా ఎందరో విభిన్న దేవతల గురించి తెల్పుతాయి పురాణాలు.

పద్దెనిమిది పురాణాలు ఇవి : (1) బ్రహ్మపురాణం (2) పద్మపురాణం (3) విష్ణు పురాణం (4) శివపురాణం (5) శ్రీ మద్భాగవతం (6) నారద పురాణం (7) మార్కండేయ పురాణం (8) అగ్ని పురాణం (9) భవిష్యత్పురాణం (10) బ్రహ్మవైవర్త పురాణం (11) లింగ పురాణం (12) వరాహ పురాణం (13) స్కాంద మహా పురాణం (14) వామన పురాణం (15) కూర్మ పురాణం (16) మత్స్య పురాణం (17) గరుడ పురాణం (18) బ్రహ్మాండ పురాణం.

ఈ పద్దెనిమిదింటిలో పది శైవ ధర్మానికి సంబంధించినవి. ఇప్పుడు మనం చెప్పుకునే కథలు చాలా మట్టుకు వీటిలో ఉంటాయి. చరిత్ర, ఉపాఖ్యానం, తత్త్వం, అన్నీ ఉన్నాయి వీటిలో.

విష్ణు సహస్రనామంపై తాను వ్రాసిన వ్యాఖ్యలో ఆదిశంకరుడు విష్ణు పురాణం నుండి ఎన్నో ఉదాహరణలిచ్చాడు. ఆ పురాణాన్ని రచించినది పరాశర మహర్షి. ఆయన వ్యాసమహర్షి తండ్రి. శ్రీ రామానుజుల వారి విశిష్టాద్వైత సిద్ధాంతంలో విష్ణు పురాణానికి ప్రమాణగ్రంథంగా చాలా ప్రముఖమైన స్థానముంది.

రామానుజుల వారికి పూర్వం విశిష్టాద్వైత సిద్ధాంతానికి ప్రముఖ ప్రవక్తలలో ఒకరు ఆళవందార్. వారిని రామానుజుల వారు కలిసి కొనేలోగానే కాలం చేశారు. మూడు ముఖ్యమైన పనులను రామానుజులకి అప్పగించాలని ఆళవందార్ అనుకొన్నారు - మూడు చేతివేళ్లు మడిచి యున్నట్లు ఆయన పోయిన తరువాత కనుగొన్నారు. ఆ మూడూ ఏమయి యుంటాయో గ్రహించి ఒక్కొక్కదాని గురించీ రామానుజులు చెప్పినప్పుడు ఆ మూడు వేళ్లూ ఒక్కొక్కటిగా తెరుచుకున్నాయట!

ఆ మూడు మౌన ఆదేశాలలో ఒకటి. విశిష్టాద్వైత సిద్ధాంతానుసారం బ్రహ్మసూత్రాలపై భాష్యం వ్రాయమని. రెండవది : తమిళంలో ఆళ్వారుల సూక్తులు (తిరువాయ్‌మొళి) పై భాష్యం వ్రాయించమని. మూడవది పరాశరవ్యాసుల ప్రశస్తిని దృఢపరచి వ్యాపింప చేయమని. విష్ణు పురాణకర్త కావటం వల్ల పరాశరునికి ఇంత ప్రాముఖ్య మిచ్చారు. దీనిని మనస్సులో ఉంచుకునే రామానుజుల వారు తమ ముఖ్య శిష్యుడైన "కూరాత్తాళ్వార్" యొక్క ఇద్దరు కుమారులకూ పరాశర భట్టారకుడనీ, వ్యాసభట్టారకుడనీ పేర్లు పెట్టారు. ఉత్తరోత్రా పరాశరభట్టారకుడు వైష్ణవ ఆచార్యులలో ఒకడైనాడు.

పరాశర మహర్షి విష్ణు పురాణాన్ని వ్రాసినా, ఇప్పుడు మనకి లభ్యమయే పద్దెనిమిది పురాణాలు వ్యాసుడు సంస్కరించినవే. వేదాలని కూడ ఆయన విభాగం చేశారు. వేదోక్తమైన విధులు మన మనస్సులలో బాగా నాటుకు పోవటానికి వీలుగా ఆయన పురాణాలను రచించాడు. పురాణాలను ఆయన రచించటానికి ఇంకొక కారణం కూడా ఉంది. వేదాలని అందరూ అధ్యనం చేయరాదు. సామాన్యులకి వేదార్థం. తత్త్వం తెలియాలన్న ఉద్దేశంతోనే పురాణాలను ఆయన రచించాడంటారు.

వ్యాసుని తండ్రి, పరాశరుడు విష్ణు పురాణాన్ని మొదట్లో వ్రాశాడు. వ్యాసుని తనయుడు శుకాచార్యుడు పరీక్షిన్మహారాజుకి శ్రీ మద్భాగవతాన్ని వినిపించాడు.

భాగవతం గురించి మాట్లాడేటప్పుడు భిన్నాభిప్రాయాలకు తావుంది. శ్రీ కృష్ణుని కథనుమాత్రమే కాక ఇతర విష్ణుఅవతారాలను గురించి కూడా చెప్పే పురాణమా లేక 'అంబ' యొక్క లీలలను వర్ణించే దేవీభాగవతమా అని.రెండు ఆదరణీయాలే.రెండూ మహోదాత్తమైన రచనలే. చైతన్యుడు, నింబార్కుడు, వల్లభాచార్యుడు విష్ణుభాగవతానికి వేదాలతో సమానమైన స్థానాన్ని యిచ్చి తమ సిద్ధాంతాన్ని బలపరచుతారు. ఈ సిద్ధాంతాన్ని అంగీకరింపక పోయినా అద్వైతులు కూడ విష్ణుభాగవతాన్ని ఆకాశమంత ఎత్తుకి కొనిపోయి కోనియాడుతారు.

శివపురాణానికీ స్కాందపురాణానికీ భేదముంది. స్కాందపురాణంలో చాలా భాగం శివునికీ, శివలీలకీ ప్రాధాన్యముంది. నాల్గవవంతు మాత్రమే స్కందుని గురించి యుంటుంది. అయినా స్కందునికి సంబంధించిన వివరాలన్నీ యుండటం వల్ల ఆ గ్రంథాన్ని స్కాందపురాణ మంటారు.

దుర్గ యొక్క కథ, 'దుర్గాసప్తశతి' - మార్కండేయ పురాణంలో ఉంటుంది.

శాంతి హోమం, శతచండి, సహస్ర చండి - ఈ క్రతువులను నిర్వహించేప్పుడు ఆ పురాణంలోని 700 మంత్రాలను ఉపయోగిస్తారు. ఒక్కొక్క మంత్రం, ఒక్కొక్క శ్లోకంలో ఉంటుంది. ఒక్కొక్క శ్లోకాన్నీ పఠిస్తూ ఒక్కొక్క హోమాన్నీ (నివేదననీ) అర్పిస్తారు.

"భవిష్య" అంటే భావి కాలం. భవిష్యత్ పురాణంలో చాలా విషయాలున్నాయి. ఈ కలియుగంలో మనం చూచే అకార్యాల గురించి కూడా! ఈ పురాణంలో ఎప్పటి వారో అయిన మౌర్య వంశీయుల గురించే కాక ఇటీవల వచ్చిన పాశ్చాత్యుల గురించి కూడా చెప్పబడింది. కాని ఆధునికులు ఈ పురాణాన్ని కలియుగారంభంలో వ్యాసుడు వ్రాయనే లేదు - ఆయన పేరు మీరుగా ఇటీవల ఎవరో వ్రాశారని త్రోసి పారేస్తారు. అందులో కొన్ని చేర్పులున్నాయేమో - కాని మొత్త మంతా ఈ మధ్యదే అని త్రోసి పారేయరాదు. అతీంద్రియ శక్తులు కలవారు భవిష్యత్తుని గమనించగలరు. భూమిపై ఎక్కడో జరిగే వాటిని కూడ చూడగలరు. ఎవరు పడితేవారు వ్రాసి, ఆ కర్తృత్వం ఏ మహనీయునికో ఆ పాదించి, ఆమోద యోగ్యం చేసుకోవటం అంత సులభం కాదు.

గరుడ పురాణం పితృలోకాల గురించీ, మనిషి గతించిన తరువాత ఆత్మ సంతృప్తికై జరుపవలసిన శ్రాద్ధకర్మాదుల గురించీ చెప్తుంది. ఆ కారణం చేతనే శ్రాద్ధ కర్మల తర్వాత, పితృకార్యాల తరువాత, గరుడపురాణాన్ని చదవటం పరిపాటి.

లలితో పాఖ్యానం (లలితాదేవి కథ), లలితా సహస్రనామం - బ్రహ్మాండ పురాణంలో ఉన్నాయి. దేవిని ఆరాధించేవారు, మిగిలిన పురాణాలన్నీ చదివిన తరువాత ఆఖరిగా చదువ వలసినదిదంటారు. ఇందులో రాజరాజేశ్వరి పట్టాభిషేకం వర్ణించబడి యుంది. "అష్టోత్తరనామం" "సహస్రనామం" "కవచం" అంటూ ప్రతి దేవత గురించీ పఠిస్తూంటాం - ఇవన్నీ పురాణాల లోనివే. కాని విష్ణు సహస్రనామం, శివసహస్రనామం - మహాభారతంలోనివి.

ఎన్నో స్తోత్రాలు కీర్తనలూ పురాణాలలోనివే. 'ఆదిత్య హృదయం' మంత్రం శ్రీ మద్రామాయణం లోనిది. ప్రదోషస్తోత్రం స్కాంద పురాణం లోనిది. ఇట్లాగే అన్నీను.

**ఉపపురాణాలూ, చిన్న చిన్న పురాణాలు :**

పద్దెనిమిది పురాణాలకి తోడు పద్దెనిమిది ఉపపురాణాలున్నాయి. వీటిలోనివే వినాయకపురాణం, కల్కిపురాణమూను. పద్దెనిమిదే ఉన్నాయని అన్నా, నిజానికి అంతకంటె ఎక్కువే ఉన్నాయి. తులాపురాణం (ప్రతి మాసం యొక్క ప్రాశస్త్యాన్ని చెప్పేది), నాగపురాణం,

వైశాఖపురాణం. పద్దెనిమిది పురాణాలలోనూ, ఉపపురాణాలలోనూ ఉన్నాయి. ప్రతి తీర్థస్థలానికీ "స్థలపురాణ" మని ఒకటి ఉంటుంది ఇవి కూడా పైన చెప్పిన పురాణాలలోనివే కాని ఇవి వేర్వేరు గ్రంథాలుగా ఉంటాయి.

**ఇతిహాసానికీ పురాణానికీ భేదం :**

విద్యావంతులకీ విద్యాహీనులకీ నేత్రాల వలె వారికి ధర్మ మార్గాన్ని చూపుతూ అనాదిగా వస్తున్నవి రామాయణ మహాభారతాలు. వీటిని పురాణాలలో చేర్చకుండా ఇంకా గౌరవప్రదమైన "ఇతిహాస" మనే పదంతో సూచిస్తారు.

"పుర" అంటే ప్రాచీనమైన అని అర్థం. ఆ ప్రాచీనమైన వాటి గురించి చెప్పేవి పురాణాలు. కొన్ని భవిష్యత్తు గురించి కూడా చెప్తాయనకోండి !

పురాణాలన్న పదానికి  పురాతనమైన వృత్తాంతాలను చెప్పేవే అనికాక, వాటి మూలంకూడ పురాతనమే నన్న అర్థం కూడ చెప్పుకోవచ్చు. ఆ రోజులలో సాహిత్య మంతా కవిత్వానికీ నాటకానికీ పరిమితమై యుండేది. వచనరూపంలో కథని చెప్పటం తరువాత ప్రారంభమైంది. నవ్యమైనది కావటం వల్ల దానిని 'నవల' (novel) అంటారు. దానిలో ప్రాచీన గ్రంథాలలో ఉండే కవిత్వమూ, నాటకమూ లేకపోవటం వల్లనే అది నవ్యం అయింది.

పురాణానికి అయిదు లక్షణాలు (పంచలక్షణ) ఉండాలి. ఇవి (1) సర్గ - సృష్ట్యాది అన్నమాట. (2) ప్రతిసర్గ - సృష్టి జరిగిన తరువాత కాలక్రమేణ ప్రపంచంలో వచ్చిన వికాసం (3) వంశ, అంటే, ఆ వంశ చరిత్ర - ఒక తరం నుండి వేరొక తరానికి రావటం (4) మన్వంతరం - మనవాళి అంతటికీ ఆద్యులైన మనువులు, వెయ్యి యుగక్రమాలు (ఒక్కొక్క యుగక్రమంలో నాలుగు యుగాలుంటాయి) వీటి చరిత్రా (5) వంశాను చరిత్ర - దేశపాలకుల వంశ చరిత్రలు అంటే సూర్య వంశము. చంద్రవంశము వంటి వివరాలు. ఇవి కాక అంతరిక్షం యొక్క వర్ణనా ఉండాలి. అంటే పురాణం చరిత్రగానే కాక భూగోళశాస్త్రంగా కూడా వ్యవహరిస్తుందన మాట.

ఇతిహాసం - "ఇతి-హా-ఆసం" అంటే "ఈ విధంగా జరిగింది" అని అర్థం. మధ్యలో ఉన్న "హా" అంటే నిజంగానే, నిస్సంశయంగానే అని అర్థం. ఇతిహాసంలో యదార్థ వృత్తాంతమే ఉంటుంది గాని ఊహాగానానికి తావు లేదు.

ఆ వృత్తాంతం జరిగిన కాలంలో వ్రాయించబడినదన్న మాట. రాముడు బ్రతికి యున్న రోజులలోనే వాల్మీకి రామాయణాన్ని రచించాడు. వ్యాసుడు పంచపాండవులతో బాటు మహాభారతంలో చెప్పబడిన సంఘటనలను స్వయంగా చూచాడు. పురాణం కాబట్టి ప్రాచీన విషయాల గురించి వ్రాసినా ఆయన తన దివ్యశక్తితో ఆయా వృత్తాంతాలను స్మరణకు తెచ్చికొని యుంటారు. అయినా ఆ కథనంలో వృత్తాంతాల యదార్థతని ఆయన

సమకాలీనులు గ్రహింపలేక పోయి ఉండవచ్చు. కాని రామాయణ మహాభారతాలు ఆ కోవకి చెందవు. వాటిని ప్రచురించినప్పుడే అప్పటి వారికి వాటిలోని వ్యక్తులూ, వృత్తాంతాలూ తెలుసు. మన సందేహాలన్నీ నివృత్తి చేయటానికీ వాటిని ఇతిహాసాలన్నారు - 'హ' అన్న అక్షరం సత్యాన్ని స్థాపిస్తుంది.

**ఇతిహాసాల వైభవం :**

పురాణాలని వేదాలకి ఉపాంగాలంటారు. ఇతిహాసాలని వేదాలకి సమానమైన ఘనత కలవంటారు. మహాభారతాన్ని పంచమ వేద మంటారు (అయిదో వేదం) ఇక రామాయణమో వేదాల వల్లనే విదితమయే పురుషుడు దాశరథిగా జన్మమెత్తి నప్పుడు, వేదాలుకూడ వాల్మీకి బిడ్డవలె రామాయణ రూపంలో బయట పడ్డా యంటారు.

రామాయణ మహాభారత కథలు మన రక్తనాళాలలో ప్రవహిస్తున్నాయనవచ్చు.

ప్రతి పురాణంలోనూ పెద్దవీ, చిన్నవీ అనేక ఉపాఖ్యానాలుంటాయి. ప్రతి కథా ధర్మానికి సంబంధించిన ఒక అంశానికి ప్రాధాన్యమిస్తుంది. ఇతిహాసం ఆరంభం నుంచి చివరి వరకూ ఒకే కథ. మధ్య మధ్య వేరే కథలున్నా వాటికి కూడ మూల కథతో ఏదో సంబంధముంటుంది. పురాణాలలో ఒక్కొక్క ధర్మం గురించి ఒక్కొక్క కథ ఉంటే ఇతిహాసంలో మొత్తం ధర్మమంతా మూల కథలోనే నిక్షిప్తమయి యుంటుంది. ఉదాహరణకి - సత్యవ్రతాన్ని పాటించటమనే ధర్మాన్ని హరిశ్చంద్ర పురాణంలో ఒక ప్రత్యేకమైన కథ ద్వారా చెప్పబడి యుంది. దమయంతి వృత్తాంతం ద్వారా పాతివ్రత్యం యొక్క మహత్యం, రంతి దేవుని కథ ద్వారా త్యాగము, కరుణల ఉదాత్తతా చెప్పబడ్డాయి. రాముని జీవితానికీ, పంచపాండవుల జీవితానికీ సంబంధించిన ఇతిహాసాలు ఆ మహనీయులు ఎటువంటి క్లిష్ట సమయాలలో ధర్మవర్తనులైనారో, ధర్మాన్ని ఎట్లా వీడలేదో, పరిరక్షించారో చెప్తాయి.

**దేవతలలో విభేదాలెందుకు?**

ఒక్కొక్క పురాణం ఒక్కొక్క దేవతని స్తుతిస్తుందన్నప్పుడు ఒక సందేహం కలుగ వచ్చు. శైవ పురాణాలలో శివుడే పరమాత్మతత్వమని ఉంటుంది. అంటే ఆయనే పరమాత్ముడని. సృష్టిస్థితిలయకారుడన్నమాట. విష్ణువు ఆయన ఆజ్ఞాను వర్తి అవుతాడు. విష్ణువు భోగి, మాయలో పడిపోయినవాడు. శివుడొక్కడే యోగి. ఆయన జ్ఞానస్వరూపుడు. శివునికి విధేయుడు విష్ణువు. ఆయనని ఆరాధిస్తాడు కూడా. కొన్ని సందర్భాలలో ఆయన శివుణ్ణి ధిక్కరించి, చివరికి ఓడి, లొంగి పోయాడని చెప్పే వృత్తాంతాలు కూడా ఉన్నాయి. వైష్ణవపురాణాలని చదివితే దీనికి విరుద్ధంగా ఉంటుంది. శివుడే విష్ణునికి విధేయుడు అనీ విష్ణునిచే పరాజితుడనీ చెప్పే వృత్తాంతాలుంటాయి. వైష్ణవులు "భూతాలతో గణాలతో సంచరిస్తూ శ్మశానంలో ఉండే శివుడు పరమాత్ముడెట్లా అవుతాడు - ఆయన రాజాధిరాజైన వైకుంఠవాసికే దాసుడు " అంటారు.

ఈ గొప్పల గురించిన వాదనలు శివకేశవులకే పరిమితం కాదు. ప్రతి పురాణమూ ఒక్కొక్క దేవత యొక్క గొప్ప దనాన్ని చాటుతుంది. ఆ దేవతే పరమాత్మ అనీ మిగిలిన దేవతలందరూ విధేయులనీ చాటుతుంది. మిగిలిన దేవతలంతా ఆ దేవతని ఆరాధిస్తారనీ, ధిక్కరించిన వారు అణచి వేయ బడ్డారనీ చెప్తుంది ప్రతి పురాణమూను.

ఈ పరస్పర విరుద్ధాలైన కథలని వింటే అయోమయ స్థితిలో పడవచ్చు ఎవరైనా. ఇందులో ఏది సత్యం? ఏది అసత్యం? అన్నీ నిజాలు కాలేవు కదా! శివుడు కేశవుని ఆరాధిస్తాడంటే, కేశవుడు శివుని ఆరాధిస్తాడనటం అసందర్భం కదా? అసత్యమే కదా? అంబ త్రిమూర్తుల కంటె గొప్ప దన్నప్పుడు ఆమెను శివుని అర్థాంగిగా చెప్పి, విధేయురాలై పతిని అనుసరించే దేవత అని చెప్పటం. అపరాధం కదా? కాబట్టి అన్ని పురాణాలూ నిజాలు కావు, సాధికారకం కావు. అయితే ఏది సరియైనది? లేకపోతే అన్నీ అబద్ధాలేనా? ఇటువంటి సందేహాలు మనని వేధిస్తాయి. తార్కికంగా చూస్తే ఈ స్పర్థలన్నీ నిజంకాకపోయినా, వాస్తవమదే. ఒక సారి పరాజితుడైన దేవత మరొక సారి విజేతగా కనబడుతాడు. ఒక సారి ఆరాధింపబడే దేవత మరొకసారి ఆరాధన చేస్తాడు.

ఇదంతా ఎందుకిట్లా ఉండాలి?

సృష్టి స్థితిలయ కారకుడైన పరమాత్మ ఒక్కడే ఉన్నాడు - ఆయనే అన్ని రూపాలలోనూ దర్శనమిస్తాడు. ఎందుచేత? సామాన్య జీవితం ఆసక్తి దాయకమూ సార్థకమూ చేయటానికి! అందరూ ఒకే మూసలో ఉండేట్టు సృష్టించక భగవంతుడు మానవులకి విభిన్నమైన సమర్థతలనీ, దృక్పథాలనీ కల్పించాడు ఆయా మానసిక ప్రవృత్తులను బట్టి ఆరాధించుకోవటానికి వీలుగా భగవంతుడు తగిన రూపాలని ధరిస్తాడు. ఎందరో దేవతలుగా పరమాత్ముడు దర్శన మీయటానికి కారణమిదే.

ప్రతి వారికీ తమ ఇష్టదైవంపై అచంచలమైన విశ్వాసముండాలి. ఆ దేవతే పరదేవత అనీ, దైవమనీ నమ్మాలి. అందువల్లే ప్రతి రూపంలోనూ భగవంతుడు మిగిలిన వారి కంటె అధికుడుగా దర్శనమిస్తాడు. మిగిలిన దేవతలు ఆ దేవతని ఆరాధిస్తూ, ఆ దేవతకి దాసుల వలె గోచరిస్తారు.

ఒకోసారి ఒకో దేవత అన్యులని పూజిస్తూ, మరొక సారి అన్యులచే పూజింపబడుతూ, ఒకోసారి యితరులను పరాజితులను చేస్తూ, మరొకసారి ఇతరులచే పరాజితుడవుతూ కనబడే పొంతన లేని ఈ వ్యవహారానికి ఇది సమాధానం కదా?

శైవపురాణాలన్నీ శివుని ఆధిక్యతను చూపే కథల సంకలనాలే. విష్ణుపురాణాలన్నీ విష్ణుని పొగడే వృత్తాంతాల సంకలనాలే. ఇతర పురాణాలూ ఇట్లాంటివే.

ఏ దేవతనీ కించె పరచటం లక్ష్యం కాదు. ఎవరికిష్టమైన దేవతని వారికి ఉన్నతునిగా చూపించి భక్తునికి ఆ పరమాత్మ స్వరూపంపై భక్తిని అధికం చేయటమే ఉద్దేశం. దీనినే

అనన్య భక్తి అంటారు. ఆ దేవతని గొప్పవానిగా చూపించటమే లక్ష్యంగాని, ఇతరులని తక్కువ చేయటం కాదు. దీనినే "నహి నిందా న్యాయ" మంటారు.

జగత్తంతా పరమాత్ముని విభిన్నరూపములే అని భావించే వారికి 'అనన్యభక్తి' అవసరం లేదు. ఒక దేవత నుండి మరొక దేవత వైపు మళ్లటమనేది, ఒక దేవత మరొకనికి భిన్నుడన్న తలంపున్నప్పుడే సాధ్యం. అందరూ ఒకే పరమాత్ముని రూపాలని గ్రహిస్తే పురాణాలన్నీ విభిన్న రూపధారియైన ఆ పరమాత్ముని లీలలే అని తెలుస్తుంది. ఎవరి ప్రకృతికి తగినట్లు వారికి సంతృప్తిని కలిగించటమే ఈ విభిన్నమూర్తుల లక్ష్యమని అర్థం చేసుకుంటే, పైకి కనబడే ఆ పరస్పర వైరుధ్యాలను ఆస్వాదించటమే కాక భక్తిని కూడ పెంపొందించుకోవటం సాధ్యం.

దీనికింకొక కారణం కూడా ఉంది. అది ప్రజలకు ఆదర్శమేర్పర్చటం. ప్రపంచంలో పవిత్రత ఉండాలి. ఆ కారణం చేతనే అంబ తన వర్తన వల్ల ఆదర్శ ప్రాయమవాలి. ఆమె పరాశక్తే అయినా, భర్తకి విధేయురాలై యుండాలి. ప్రపంచంలో భక్తి ఉండాలి - దానికి భగవంతుడే ఆదర్శప్రాయుడవాలి. అందువల్లనే కొన్ని కథలలో విష్ణువు శివునికి భక్తుడవుతాడు. మరికొన్ని సందర్భాలలో శివుడు విష్ణువుని ఆరాధిస్తాడు. ఒకోసారి ఒక దేవతని పొగుడుతూ మరొకసారి మరొక దేవతని పొగుడుతూ కనబడే పౌరాణిక గాథలు ఆయా దేవతల పట్ల మన భక్తిని అధికం చేయటానికే ఉద్దేశింపబడ్డాయి. ఏ దేవతనైనా తక్కువగా చూడటం ఆ దేవతని అవమాన పరచటం గాని, విమర్శించటం గాని కానే కాదు. మరొక దేవతపై కేంద్రీకరించి భక్తులకి ఆ రూపంపై భక్తిని పెంచటమే లక్ష్యం.

**అనేక రూపాలలో ఒకడు :**

ఒకే ఒక పరమాత్మ విభిన్న దేవతలుగా కనబడుతాడు. ఒక్కొక్క భక్తుడు భగవంతుని ఒక్కొక్క రూపానికి అంకిత మవుతాడు. భక్తుని భక్తిని అధికం చేయటానికి పరమాత్ముడు ఆ దేవత యొక్క లక్షణాన్నే ఎక్కువ చేసి, ఇతర లక్షణాలను అణచి ఉంచుతాడు. పూర్వం వీధులలో లాంతర్లుండేవి. దీపం చుట్టూ నాలుగు గాజు పలకలుండేవి. కొన్నింటికి మూడే పలకలుండేవి. దీపపు కాంతి మూడు వైపులా విరజిమ్మేది. ఒక్కొక్కసారి ఆ మూడు పలకలకూ మూడు రంగులు వేసేవారు అలంకారానికై. తత్ఫలితంగా ఒక్కొక్కగాజు పలక ద్వారా వచ్చే కాంతి ఒక్కొక్క రంగులో ఉండేది. ఒకే పరమాత్మ సృష్టి స్థితిలయాలకు కారణం. చైతన్యమే (శుద్ధజ్ఞానమే) అన్నిటికీ మూలం. ఆ చైతన్యమే మూడు పార్శ్వాలు కల లాంతరులో ఉన్నదనుకోండి. మూడు రంగులలో ఒకటి ఎరుపు. అదే సృష్టి. స్పెక్ట్రాస్కోప్‌లో (Spectroscope) ఎరుపు రంగుని మాత్రమే మొత్తం కాంతి నుంచి విడతీస్తే మిగిలినవి కూడ విరిగిపోతాయి. సృష్టి అనేక మవటమంటే యిదే. ఆ కారణం చేతనే సృష్టి కర్త అయిన బ్రహ్మాది ఎరుపు వర్ణమంటారు. లాంతరులో ఇంకొక రంగు ఊదా. స్పెక్ట్రమ్ (రూపం)లో ఇది ఆఖరి రంగు. మొదటిది ఎరుపు, చివరిది నీలం. సృష్టింపబడిన జగత్తుని సంస్థితం

చేసేటప్పుడు విష్ణువు జ్ఞానంతో ఇట్లా చెప్తున్నట్లుంటుంది. "ఈ జగత్తు మిథ్య, దీనిని పరమాత్మతో సమానమనుకోకూడదు. ఇదంతా పరమాత్ముని లీల". ఆ జ్ఞానజ్యోతిలో దృశ్యమానమైన జగత్తంతా దగ్ధమైపోతుంది - కాలిన బొగ్గువలె అయిపోతుంది. వస్తువు తగలబడిపోయినా రూపమాత్రావశిష్టమై ఉండే దశ అది - అదే, వస్తువు ఇంకా ఉన్నట్లు భ్రమ కల్పిస్తుంది. రూపమైతే ఉండవచ్చు, కాని రంగు పోతుంది! జగత్తు ఉండవచ్చు కాని అది సత్యమన్న భ్రమపోతుంది. (కాలిన బొగ్గు వలె నల్లగా అయిపోతుంది) "సర్వం విష్ణుమయం జగత్" అంతా నీలి రంగు గల విష్ణువే (శ్యామలం) నీలమేఘశ్యామల - నీలం, నలుపు, ఊదా - అన్నీ మూడు పలకలు గల లాంతరు వలె రూపాన్ని ధరిస్తాడు. నీలిరంగు అద్దం నుండి బయటకు వచ్చే కాంతిని "విష్ణు" వంటాము.

మూడవ పలకకి ఏ రంగూ లేదు : అంతా జ్ఞానమనే జ్వాలలో దగ్ధమైతే - మొదట బొగ్గు వలె నల్లగా అవుతుంది. ఇంకా అగ్నికి గురియైతే అది బూడిద అవుతుంది, అస్తికగా మారుతుంది. ఇది కూడ దగ్ధమై, అసలు రూపాన్నే కోల్పోతుంది. మొదట్లో ఉన్న నల్లరంగు పోయి అంతా తెలుపవుతుంది.

తెలుపు కూడ స్వచ్ఛమైన కాంతే. పరమాత్ముని నుండివచ్చిన అన్ని రంగులూ అస్తిత్వాన్ని కోల్పోయి మళ్లీ పరమాత్మే అవుతాయి. ప్రత్యేకపునికి, భ్రమకొల్పే ఉనికి, పోతుంది. ఇదే మహాభస్మం. ఇదే పరమేశ్వరుడు. పైకి చాలా క్రూరమైన కార్యంగా తోస్తుంది సంహారం. కాని దీనితోనే ఆగడు శివుడు. ఆపని జగత్తుకి తన మూలంతో సంధానం కలిగించే కరుణామయ కార్యమే. తన లీలలో దృశ్యమానమైన జగత్తుకి జ్ఞానం కలిగించినప్పుడు "జగత్సర్వం" ప్రేక్షకునికి బొగ్గువలె కనబడింది. అందువల్లే "సర్వం విష్ణుమయం జగత్" అన్న వర్ణన వచ్చింది. లీలముగిసిన తరువాత, పరమజ్ఞానం వల్ల సంహారమైనప్పుడు 'జగత్సర్వం' లేదు. అందు వల్లే అంతా 'శివమయ'మంటాం.

ఒకే లాంతరు - బ్రహ్మ చైతన్యం - ఎరుపుగాజులోంచి చూచినప్పుడు బ్రహ్మగా (సృష్టికర్తగా) నీలపు గాజు ద్వారా చూచినప్పుడు విష్ణువుగా, ఏ రంగూ లేని గాజుపలక ద్వారా చూచినప్పుడు శివునిగా కనబడుతుంది.

"ఒకే మూర్తి త్రిమూర్తులుగా కనబడే" వానిగా పరమాత్ముని ఋషులు కొనియాడారు. ఏ సిద్ధాంతానికీ కట్టుబడకుండా విశాలదృక్పథాన్ని అలవరచుకొన్న కవులందరూ పరమాత్మని త్రిమూర్త్యాత్మకంగానే వర్ణించారు.

ఇంగ్లీషు వాళ్లు కూడ జెహోవా, జవ్, ప్రభువుగా పేర్కొనటం ఈ సామరస్యధోరణిలోనే. జెహోవా - బైబిలు వచ్చేముందు ఇజ్రయిల్‌లో ఉండే జాతులకు దేవుడు. గ్రీసు ప్రాంతాల వారి దైవం జవ్. "ప్రభువు" అన్నది భగవంతుని సూచించే సాధారణ నామవాచకం. క్రైస్తవమతావలంబులైన "ప్రభుసేవకులు" కూడ ఎన్ని పేర్లతో పిలిచినా ఉన్నది ఒకే దేవుడనే.

వినయంతో, గౌరవభావంతో, సత్ఫలాపేక్షతో పురాణాలని చదివితే ఏ విధమైన అయోమయమూ కలగదు. మన మేలు కొరకే అవి ఉన్నాయన్న జ్ఞానం మనకి కలుగుగాక! పరమసత్యానికి కొంచెం భిన్నంగా ఏదన్నా ఉన్నా, అది కూడ మన మేలు కోరే అని మనం గ్రహించాలి.

**కావ్యం - కవిత్వం :**

ఒక మంచి పని చేయటానికి మూడు మార్గాలున్నాయి - ఒకటి ప్రభువు వలె శాసనం చెయ్యటం దీనిని "ప్రభుసమ్మితి" అంటారు. అంటే, సేవకుడ్ని యజమాని ఆదేశించటం. తనకి యిష్టమున్నా లేకపోయినా సేవకుడు ఆదేశాన్ని పాటించాలి లేకపోతే, శిక్షింపబడ్తాడు. అధికారయుతంగా కాక ఒక పనిని చేయమని స్నేహపురస్సరంగా మనని ఎవరైనా అడిగితే ఆ పనిని వెంటనే చేసేస్తాం. ఇక్కడ, శిక్షింపబడుతామన్న, భయంలేదు. సుహృద్భావమూ, ఆపేక్షా ఉన్నాయి. స్నేహితుడుగా అతడు మనకి మంచే చేస్తాడన్న భావంతో చేస్తాం. స్నేహపూర్వకంగా ఒక పనిని చేయమనటం. "సుహృత్ - సమ్మితి" అవుతుంది. ఈ రెంటికన్నా ఫలితాన్ని ఇంకా తేలికగా యిచ్చేది ప్రేమాస్పదుని, (అంటే భార్యవంటి వ్యక్తి) వినతి. ప్రభువు యొక్క ఆదేశం కష్టమైతే, అదే స్నేహితుని వద్దనుండి వచ్చినది తేలిక అవుతుంది. ప్రియతముని వద్ద నుండి వచ్చినది ఇంకా తేలిక అవుతుంది. అది కాంతాసమ్మితి (కాంత అంటే భార్య).

వేదాలు ప్రభు సమ్మితాలు, పురాణాలు సుహృత్ సమ్మితాలు, కావ్యాలు కాంతాసమ్మితాలు - ఇదీ గాథ.

"ఇట్లా చేయి, అట్లా చెయ్యి" అని మాత్రమే వేదాలంటాయి. ఎందువల్లనో చెప్పవు. పురాణాలు, ఇట్లా చేస్తే ఈ విధంగా మేలుకలుగుతుంది. అట్లా చేస్తే హాని కలుగుతుంది" అని చెప్తాయి. ఏ పనినైనా ఒక విధంగా ఎందుకు చెయ్యాలో కథల ద్వారా చెప్తాయి. కేవలం కారణాలని చెప్పటమే పురాణాల లక్షణం కాదు. ఆసక్తి దాయకమైన కథల రూపంలో సందేశాన్ని అందజేయటమే పురాణాల ధ్యేయం.

కావ్యమేమి చేస్తుంది? కవి ఏమి చేస్తాడు? యదార్థ కథలకు తన సృజనాశక్తిని జోడిస్తాడు. తన భావనతో కథలను కల్పిస్తాడు. కొన్ని విషయాలను పదే పదే చెప్తాడు. ఇది కవికి గల స్వేచ్ఛ. అతి చిన్న విషయానికి అలంకారం చేసి అందరికీ ఆకర్షణీయంగా, ఆమోద యోగ్యంగా చేస్తాడు. ఉన్న విషయాన్ని స్నేహితుని వలె సూటిగా చెప్పి ఊరుకోకుండా, కవి ప్రీతి పాత్రురాలైన భార్య వలె ప్రవర్తిస్తాడు. మొండిగా ఉన్న భర్తని తన వైపు త్రిప్పుకొని తన మాటని నెగ్గించుకోవటానికి భార్య బ్రతిమాలు తుంది, బుజ్జగిస్తుంది, ప్రాధేయపడుతుంది. కావ్యం భార్యవలె, వేదం యజమాని వలె, నడచుకుంటే నడుమ పురాణాలు స్నేహితుని వలె వ్యవహరిస్తాయి. మన మనస్సులలో ధర్మాన్ని ప్రతిష్ఠించటమే వాటి లక్ష్యం.

# 25

# ఉపాంగములు : ధర్మశాస్త్రము

**పురాణాల లక్ష్యాన్ని చేరుకోవటానికి మార్గం :**

పురాణాలలోని వ్యక్తులు మనకి ఆదర్శప్రాయులనీ, మార్గదర్శకులనీ గ్రహించాం. వారి కథలను విన్న తరువాత వారి గొప్ప లక్షణాలనే అలవర్చుకొని అనుసరించాలని మనకీ అనిపిస్తుంది. అటువంటి కోర్కె కలిగినా, ఆ విధంగా అన్ని పరిస్థితులలోనూ నడచుకోవటం కష్టమనిపిస్తుంది. ఏదో ఒకటి ఎప్పుడూ చేస్తూండటం మనిషి లక్షణం. మనస్సుని ఒక్క క్షణమైనా నిశ్చలంగా ఉంచటమసంభవం.

"నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్య కర్మకృత్" "ప్రపంచమున ఎవడునూ ఒక్క క్షణకాలమైనను కర్మ (ఏదొకపని) చేయక నిశ్చలముగ యుండలేడు." కనుక ఏ పనినైనా సవ్యంగా ఎట్లా చేయాలో నేర్చుకోవాలి. ఆ విధంగా మనసుని పరిశుద్ధ పరచుకొని, మంచి శీలాన్ని, నడవడినీ అలవర్చుకొని, త్రిగుణాలనీ అతిక్రమించి జ్ఞానియై బ్రహ్మంలో ఐక్యమవాలి.

మన ధర్మాన్ని తు.చ. తప్పకుండా పాటించి, మన పాపాలను పోగొట్టుకుని, చిత్తాన్ని శుభ్రపరచుకొని, పునర్జన్మ అంటూ లేని మోక్షాన్ని పొందాలంటే మనమేమి చెయ్యాలి? అసలు మన పుట్టుకే పాపం వల్ల - దీనిని క్షాళనం చేసుకోవాలి. కొత్తగా పాపాలు చేయకూడదు. మనస్సునీ త్రిగుణాలనీ ఉదాత్తం చేసుకోవాలి, పాపాన్ని చేయకుండా ఉండటానికి. మతానికి గల ప్రయోజనమిదే. మన మతం ప్రకారం మనమేమి చేయాలి?

ప్రస్తుతం అందరికీ సాధారణంగా రామాయణ. భాగవతాలు, కొన్ని పురాణాలు తెలుసు. ఆయా కాలాలలో స్థలాలలో వ్యక్తులు ఎటువంటి ధర్మనియమాలకి కట్టుబడే వారో వీటి నుండి తెలుస్తుంది. ఈ నియమాలన్నీ ఒక చోట క్రోడీకరింపబడి లేవు. అవి అక్కడా, ఇక్కడా ఉన్నాయి. పురాణాలలోగాని, ఇతిహాసాలలో గాని ఈ నియమాలను పాటించే విధమేమిటో చెప్పబడలేదు. ఆ నియమాలను తెలిసి ఉన్నంత మాత్రాన మనం వాటిని ఆచరించలేం.

పురాణాలకూ, ఇతిహాసాలకూ "భక్తి" మూలం. అయితే రోజంతా పూజతోనో, ధ్యానంతోనో, స్తోత్రంతోనో గడపగలమా? ఇది కుదరదు. కుటుంబంపట్ల మన ధర్మాన్ని నిర్వర్తించాలి. మనం తినాలి, స్నానమాడాలి, ఇంకా ఇతర వ్యక్తిగత, భౌతిక అవసరాలను తీర్చుకోవాలి. మిగిలిన కాలాన్ని పూజకై వినియోగించటం కూడా సాధ్యం కాదు. విసుగు జనిస్తుంది. కాబట్టి, సత్కార్యాలను చేయటానికి మనకి వేరే నిర్దేశాలూ, సూచనలూ కావాలి. ఇవి ఎక్కడ లభ్యమవుతాయి? ధర్మశాస్త్రాల నుండే. పద్నాలుగు విద్యలలోనూ ఆఖరిది - పురాణాల తరువాతది - ధర్మశాస్త్రం.

పురాణపురుషులు మనకి గమ్యాన్ని సూచిస్తారు. ఆ గమ్యాన్ని చేరటానికి కర్మానుష్ఠానంతో ప్రారంభించాలి. మన నిత్యజీవితమెట్లా గడపాలో ధర్మశాస్త్రాలు ఉపదేశిస్తాయి. ఎన్నో చోట్ల మన విధులను వేదాలు వివరించాయి - వాటి నన్నిటినీ ఒక క్రమంలో పెట్టి, వాటికి వివరణ యిచ్చేవి, ఉపాంగాలు. ఇంటి పనులు, స్వంతపనులు, స్నానమాడటం, ఆహారం తీసుకోవటం - ఇవన్నీ శాస్త్రాలు చెప్పినట్టు చెయ్యాలి.

ఆత్మోన్నతికీ, ఆత్మసాక్షాత్కారానికీ దోహదమయ్యే రీతిలో మన వ్యాపకాలనన్నిటినీ నిర్దేశించింది వేద ధర్మం. మన నిత్యకృత్యాలనన్నిటినీ మతంతో ముడి పెట్టింది. ఒక విధంగా పడుకుంటే మూర్తిమత్వమినుమడిస్తుంది, ఒక విధంగా బట్టలు వేసుకుంటే మంచి జీవితం గడపటానికి ఉపకరిస్తుంది. ఒక విధంగా యింటి నిర్మాణముంటే వైదిక కర్మలను నెరవేర్చటానికి ఉపయోగిస్తుంది. లౌకిక జీవితం వేరు, ధార్మిక జీవితం వేరు అంటూ ధర్మశాస్త్రాలు విడదీయలేదు. ఏపని చేసినా అది ధర్మబద్ధమే, ఆత్మోన్నతికి దోహదకారే. లౌకిక నియమాలు, ధార్మిక నియమాలూ వ్యక్తి తన కోసం, తన ఉన్నతికోసం ఎట్లా అవిభక్తంగా ఆచరించాలో అభిన్నంగా చూపబడ్డాయి.

పురాణాలలో ఉన్న భక్తే వేదాలలో కూడ ఉంది. కాని దానితో బాటు ఎన్నో కర్మలు కూడ ఉన్నాయి. భక్తి కార్యరూపం దాల్చేప్పుడు పూజ జరుపుతాం - ఆ పూజవిధానానికి సంబంధించిన నియమాలెన్నో ఉన్నాయి పూజతో బాటు యజ్ఞాలు, శ్రాద్ధం, తర్పణం - ఇవన్నీ వైదిక ధర్మంలోని భాగాలే. ఇవన్నీ వేదాలలో ఉన్నాయి నిజమే. కాని అన్నీ ఒకచోట క్రోడీకరింపబడి లేవు. అంతేకాదు, ప్రతికర్మనూ ఎట్లా నిర్వహించాలో వివరణలు కూడ లేవు.

"వేదో ఒ ఖిలో ధర్మమూల" మంటాడు మనువు. అంటే, ధర్మాలకి మూలం వేదమని అర్థం.

వ్యక్తియొక్క ముక్తికే కాక లోకకల్యాణానికి కూడ ఉపకరించేట్టే వేదాలు విధులను ఏర్పర్చినా, ఈ రెండు ప్రయోజనాలూ సాధించేది ధర్మమే. అయినా ఎక్కడా నిర్దుష్టమైన, వివరణాత్మకమైన ఆచరణ క్రమం చెప్పబడలేదు. అంతేకాదు, వేదభాష సులభంగా అర్థం కాదు కూడా.

అటువంటి వేదాల నుండి "కల్ప" మనే వేదాంగం, కర్మల పట్టికని సూత్ర రూపంలో తయారు చేసింది. ఇవి ఎంతో క్లుప్తంగా ఉంటాయి. వివరాలతో కూడిన మార్గ దర్శకాలు కావు. వీటికి పూర్తిగా వివరణలనిచ్చి, ఏ సందేహమూ మిగులకుండా చేసేవి ధర్మశాస్త్రాలే!

ధర్మ సూత్రాలు (ఆపస్తంభునివి, గౌతమునివి, ఇతరులవి) సూత్ర నియమమనుసరించి అతిక్లుప్తంగా ఉంటాయి. సూత్రమంటే అట్లాగే ఉండాలి. ధర్మశాస్త్రాలు - మనువు, యాజ్ఞ వల్క్యుడు, పరాశరుడు - రచించిన స్మృతులు శ్లోకాల రూపంలో ఉంటాయి.

కాని వీటన్నిటికీ ఒకే ప్రమాణముంది - అవి వేదాలు. మన మేమి చేయాలో, ఎట్లా చేయాలో వేదాలలో ఉంది. మనం వాటిని నిస్సంకోచంగా పాటించాలి. కల్పంలో కొంత

క్రోడీకరింపబడిన వేద విహితమైన విధులను విశ్లేషించి చెప్పటం ధర్మశాస్త్రాల ప్రయోజనం. కల్పంలో యజ్ఞభూమి, యింటి నిర్మాణం వంటి విషయాల గురించి ఎక్కువగా చెప్పబడితే, ధర్మ శాస్త్రంలో మనిషి వర్తనానికి సంబంధించిన అన్ని విషయాల గురించీ చెప్పబడింది.

"నేనీ పనిని చేయదల్చుకొన్నాను. కాని ఈ పని మంచిదో కాదో తెలుసుకోవాలంటే వేదాలలో ఎక్కడ వెతకాలో నాకు తెలియదు. వేదాలు అనంతంగా ఉన్నాయి. అందువల్లనే ఎక్కడ చూడాలో ఈ పనినెట్లా చెయ్యాలో తెలియటం లేదు: అన్ని వేదాలను క్షుణ్ణంగా ఎరిగిన వారెవ్వరూ నాకు కనబడటం లేదు" ఇవి సాధారణంగా ఎదురయ్యే ప్రశ్నలు.

వేదాలనబడే మహాసముద్రంలో మనకి కావలసిన వాటిని వెతుక్కోవటం అసాధ్యమే.

"ఈ కార్యమెట్లా చెయ్యాలో వేదాలు చెప్తే - తప్పకుండా ఆ విధంగా చేస్తాను. కాని అది లేనప్పుడు ఏం చెయ్యాలి?"

వీటికి మనువు సమాధానమిది. "సరే నేను చెప్తాను వేదాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన గురువులు స్మృతులను రచించారు. వారేమి రచించారో తెలుసుకో. స్మృతి ధర్మశాస్త్రమే".

'స్మృతి' అంటే జ్ఞాపకం, 'విస్మృతి' అంటే జ్ఞాపకం లేకపోవటం. స్మృతులు వేదాలను జ్ఞాపకముంచు కోవటానికి సాధనాలు. వేదాలను క్షుణ్ణంగా ఎరిగిన మహర్షులు ఆదేశాలను (ధర్మాన్ని) కర్మలను (వాటిని ఆచరించే విధానాలను) కూర్చి ఒక క్రమంలో అమర్చారు. అందరికీ తేలికగా అర్థమయ్యే భాషలో స్మృతులను రచించారు. వాటిని చూస్తే - ఏమి చేయతగునో, ఏమి చేయకూడదో, ఏ విధంగా చేయాలో తెలుస్తుంది - అంటాడు మనువు.

ఆరవ వేదాంగమైన "కల్ప" వేదంలోని ఆదేశాలను ఎట్లా పాటించాలో చెప్తుంది. గృహ్యసూత్రాలు గృహంలో చేయవలసిన కర్మలను వర్ణిస్తాయి. శ్రౌతసూత్రాలు - అశ్వమేధం వంటి యాగాల నిర్వహణను చర్చిస్తాయి. ధర్మ సూత్రాలు - వ్యక్తిగత, సామాజిక విధులను ఆయా వర్ణాల వారు, జీవితంలో వారివారి దశలను బట్టి అనుసరించవలసిన వాటిని చెప్తాయి.

జీవుడు తల్లి గర్భంలో ప్రవేశించినప్పటినుండీ - పుట్టుక, పెంపు, వివాహం, గార్హస్థ్యం ఆఖరికి దహనం - వరకూ ఏమేమి చెయ్యాలో వివరంగా చెప్తాయి స్మృతులు. అంతేకాక, నిద్దుర మేల్కొన్నప్పటి నుండి రాత్రి పడుకునే వరకు మనిషి ఏమేమి చెయ్యాలో కూడ చెప్తాయి. ఆయా విషయాలకి సంబంధించి 16 ముఖ్యమైన సంస్కారాలున్నాయి.

**స్మృతులూ వాటి అనుబంధ గ్రంథాలు :**

మనువు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు, గౌతముడు, హారితుడు, యముడు, విష్ణువు, శంకుడు, లిఖితుడు, బృహస్పతి, దక్షుడు, అంగీరసుడు, ప్రచేతసుడు, సంవర్తుడు, అసనసుడు, అత్రి, ఆపస్తంభుడు, శతపుడు - ఈ పద్దెనిమిది మహర్షులు తమ అలౌకిక శక్తితో అన్ని వేదాలలోని విషయాన్నీ గ్రహించి ధర్మశాస్త్ర రూపంలో వాటి సంకలనాలని

మనకి యిచ్చారు. వీటినే మనుస్మృతి, పరాశర స్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి - ఇత్యాదిగా ఆయా ఋషుల పేర్ల మీద సూచిస్తారు. వాటిని చదివితే చాలు - అన్ని అనుష్ఠానాలూ, ధర్మాలూ తెలుస్తాయి. పద్దెనిమిది స్మృతులకు తోడు పద్దెనిమిది అనుబంధ ఉపస్మృతులు కూడ ఉన్నాయి.

శ్రీ మద్భగవద్గీతని కూడ స్మృతిగా పరిగణించటం పరిపాటి. వేదాలలోని పదాలు అందులో ఉల్లేఖింపబడక పోయినా, మన ధర్మానికి ప్రమాణమైన గ్రంథమవటం వల్ల స్మృతిగా స్థానముంది.

ఎన్నో స్మృతులుండటం వల్ల ఒక దానిలో ఉన్నది వేరొక దానిలో ఉండక పోవచ్చు. కొన్ని సందర్భాలలో వాటిలో కొన్ని మార్పులు కూడా ఉండవచ్చు. అందువల్ల కొంత సందేహమూ కలుగవచ్చు. అటువంటి సందేహాలని నివృత్తి చేయటానికి ధర్మశాస్త్ర నిబంధనలున్నాయి.

కొన్ని స్మృతులు కొంత వరకే చెప్పి ఊరకుంటాయి. పూర్తిగా నియమాలను చెప్పవు. కొన్నింటిలో "సంధ్యావందన" ప్రసక్తే ఉండదు. విధిగా చేసే దీని గురించి వేరే చెప్పటమనవసరమనో, ఒక తరం నుండి వేరొక తరానికి సాంప్రదాయకంగా వస్తూనే ఉన్నదన్న భావం వల్లనో! శ్రాద్ధానికి సంబంధించిన ఆదేశాలు కొన్నింటిలో ఉండవు, కొన్నింట శౌచానికి సంబంధించినవి ఉండవు. "ఈ విధంగా భుజించు. ఈ విధంగా ఊపిరి పీల్చు" - ఇవన్నీ లిఖితపూర్వకమైన ఆదేశాలుగా ఉండనక్కరలేదు.

స్మృతులను రచించినవారు ఈ విషయాలని ఆ విధంగా ఉపేక్షించి యుంటారు.

'తెలిసిందే కదా' అంటూ ఏ విషయాన్నీ విడువకుండా 'నిబంధన గ్రంథం' అన్ని విషయాలనీ ప్రస్తావిస్తుంది. స్మృతులలో కొద్దిపాటి తేడాలుంటే వాటిని సమన్వయపరచి సరియైన దేదో నిర్దుష్టంగా ఈ గ్రంథం చెప్పుతుంది. ఈ నిబంధనలను రచించిన మహనీయులు స్మృతులనన్నిటినీ అధ్యయనం చేసి వాటిలోని తేడాలని గమనించి, సందేహాలకు తావు లేకుండా నిశ్చితాభిప్రాయాలని వెలిబుచ్చారు.

మన దేశంలో ఒక్కొక్క ప్రాంతం ఒక్కొక్క నిబంధన గ్రంథాన్ని అనుసరిస్తుంది. మహారాష్ట్రులు కాశీనాధ ఉపాధ్యాయ రచించిన "ధర్మసింధు"వనే నిబంధన గ్రంథాన్ని అనుసరిస్తారు.

యాజ్ఞవల్క్య స్మృతిపై భాష్యం "మితాక్షరం". హిందూ న్యాయశాస్త్రం విషయంలో సందేహాలు వస్తే న్యాయస్థానాలలో దీనినే ప్రమాణంగా తీసుకుంటారు. దీనికి కూడ చట్టం వంటి పరపతే ఉన్నదని కోర్టులు అంగీకరిస్తాయి. దాక్షిణాత్యులు వైద్యనాథ దీక్షితులు రచించిన "వైద్యనాథ దీక్షిత" మన్న గ్రంథాన్ని అనుసరిస్తారు. గృహస్థులకు ఇది ఎంతో ముఖ్యం. సన్యాసుల విధులను గురించి "విశ్వేశ్వర సంహిత" నుండి తెలుసు కుంటారు. తమిళనాడులో ధర్మశాస్త్రమంటే వైద్యనాథ దీక్షితమే. కొద్దిపాటి భాషాజ్ఞానమున్నా ధర్మశాస్త్రాన్ని

చదివి అర్థం చేసుకోవచ్చు. అధ్యయనం చేసినా అర్థం పూర్తిగా అవగాహన కాని వేదం వలె కాదు. వైద్యనాథ దీక్షితానికి మంచి అనువాదం కూడా ఉంది.

శృతులైన వేదాలనీ వాటిపై వ్యాఖ్యానాలైన సూత్రాలనీ (అంటే కల్పసూత్రం, ధర్మ సూత్రం, శ్రౌతగృహ్య సూత్రాలూ) స్మృతులనీ ఆ తరువాత వచ్చిన నిబంధనగ్రంథాలనీ అందరిచే అంగీకరింపజేయటం తేలికకాదు. దీక్షితీయానికి ప్రామాణిక గ్రంథమన్న స్థానం కలగటానికి కారణం దీక్షితులవారు నిష్పక్షపాతంగా, విశాలమైన దృక్పథంతో మీమాంసలో చెప్పిన పద్ధతి ప్రకారం పదాల అర్థాలను నిర్ణయించారు. అన్ని శాస్త్రాలూ పోగు చేసి, విభేదాలను సమన్వయ పరచారు. స్మృతులలోనే తేడాలుంటే ఎంతో ఉదారవైఖరితో "వారి వారి ప్రాంతాలలో అనుసరించే దానినే అవలంబించ వచ్చు, ప్రతి కుటుంబంలోనూ ఆ కుటుంబ పెద్దలు చేసినట్టు చేయవచ్చు" అంటే శిష్టాచారంగా.

**స్వేచ్ఛా, అదుపూ :**

ఇక్కడ ఒక మాట చెప్పాలి. ఏ విషయాన్నైనా ఎంత క్షుణ్ణంగా విచ్ఛేదం చేసినా, ఎంత వివరంగా విశ్లేషించినా జీవితంలో మనిషి ఎదుర్కొనే అసంఖ్యాకమైన పరిస్థితుల కన్నిటికీ సమాధానాలని చెప్పటం కష్టం. గ్రంథాలలోని నీతి వాక్యాలను క్రోడీ కరించబడిన శాసనాలవలె ఆచరించటం కష్టం. క్రమ శిక్షణకై నిబంధనలు అవసరమే, ఇవన్నీ మన శాస్త్రాలలో పుష్కలంగా ఉన్నాయి కూడా కాని నిత్య జీవితంలో "స్వేచ్ఛ" "ప్రజాస్వామ్యం" వంటి పెద్ద పెద్ద మాటలు ఎవరికి తోచినట్టు వారు వ్యవహరించటంలోనో, బలాఢ్యులైన అధిక సంఖ్యాకులు బలహీనులైన అల్పసంఖ్యాకులను కష్టపెట్టటమో జరుగుతోంది. నిబంధనలను చెయ్యటంలో కల కట్టుబాట్లను, అట్టి కట్టుబాట్లకి పరిమితులను పెట్టుకోవలసి వస్తుంది. మరీ ఎక్కువ అదుపు నిబంధనలను ఉల్లంఘించటంగా మారుతుంది.

ఆ కారణం వల్లనే అన్ని విషయాలలోను మార్గదర్శక సూత్రాలను చెప్పిన మన శాస్త్రాలు,అనుల్లంఘనీయమైన శాసనాలు కాలేదు. పెద్దలననుసరించి నడుచుకునేట్టు వ్యక్తికి స్వేచ్ఛని కల్పించాయి. వ్యక్తిగత ప్రవర్తనకి కొంత స్వేచ్ఛ నివ్వాలి - అంటే పెద్దల నడవడి ప్రకారమూ, ఆచార ప్రకారమూ, సంప్రదాయం ప్రకారమూ నడుచుకొనేట్టు విడిస్తే మరి కొన్ని విషయాలలో లిఖిత పూర్వకమైన నియమావళిని అనుసరించటానికి వీలవుతుంది. తన ప్రవర్తన ద్వారా ఇతరులు కూడా నీతులను పాటించేట్టు చేయటమే అన్నిటి కంటె ఉత్తమమైన మార్గం. తరువాతిది, బలవంతం చేయకుండా నోటితో అనునయించటం. చివరి పద్ధతి శాసనాలను ఏర్పర్చి వాటికి కట్టుబడేట్టు చేయటం. "సహస్రం వద ఏకం మాలిఖ" అనేది పాత నానుడి. అంటే, మనిషిని ఒప్పించటానికి వెయ్యి మాటలనుపయోగించు కాని ఒక్క దానిని కూడా లిఖించి, ఆచరించమని బలవంత పెట్టకుమని అర్థం. ఇప్పటి వైఖరి ఏమిటంటే ప్రతి విషయం మీదా లిఖిత పూర్వకమైన చట్టాలు జారీ చెయ్యటం అంతే కాదు, ఏ అభిప్రాయం పడితే అది ప్రచురింపబడటం.

వ్యక్తికి స్వేచ్ఛ నివ్వకుండా వేలకొద్దీ నిబంధనలను ధర్మశాస్త్రాలు విధించాయని ఆరోపిస్తారు. నిజానికి, ఆ స్వేచ్ఛని దృష్టిలో పెట్టుకునే ఎన్నిటి గురించో శాస్త్రాలు ఏ ప్రస్తావనా చేయలేదు. ధర్మశాస్త్ర కర్తల దృష్టిలో వ్యక్తి తననీ తనతో బాటు సమాజాన్నీ నాశనం చేయకుండా ఉండాలంటే మార్గదర్శక సూత్రాలు, నియంత్రణా అవసరం. కాని వీటినే "శాసనాలు"గా వ్రాస్తే అందరూ బందీలయినట్టు భావించుకుంటారు. ఈ కారణం వల్లనే కొన్ని నియమాలనే లిఖిత పూర్వకంగా పెట్టి మిగిలిన వాటిని సంప్రదాయానుసారం పాటించటానికి విడిచిపెట్టారు.

శాస్త్రాలు పెట్టిన నిబంధనలనే ఏ పెద్దవారో, ఏ సంప్రదాయానుసారమో ఆచరించినప్పుడు అవి నిబంధనలుగా తోచవు. ప్రాంతీయ సంప్రదాయాలను, కుటుంబ సంప్రదాయాలను పాటించేప్పుడు వైయక్తిమైన భక్తి భావం కూడ ఉంటుంది! ఆఖరి ధర్మశాస్త్ర మయిన వైద్యనాథ దీక్షితీయ మొక్కటే ఈ ఉదారవైఖరిని అవలంబించలేదు. అంతకు పూర్వపు గ్రంథాలూ ఇంతే. బహుజన సమ్మతమైన ఆపస్తంభ సూత్రాలను రచించిన ఆపస్తంభుడు ఇట్లా అన్నాడు : "ఈ శాస్త్రంలో అన్ని ధర్మాలనూ నేను స్పృశింపలేదు. ఇంకా ఎన్నో మిగిలి పోయాయి. స్త్రీల నుండి, నాల్గవ వర్గం వారి నుండీ నేర్చుకోవలసినవి ఎన్నో ఉన్నాయి. వారి నుండి వాటిని తీసుకోండి."

స్త్రీలను పురుషులు అణచివేశారనీ, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులకు తక్కువ స్థానమిచ్చారనీ చెప్పే మాటలు ఎంత నిరాధారమైనవో దీనిబట్టి తెలుస్తుంది. ధర్మశాస్త్రానికి ప్రమాణగ్రంథంలో స్త్రీల, బ్రాహ్మణేతరుల విజ్ఞతకి ఎంత ప్రాధాన్యమివ్వబడిందో ధర్మం విషయంలో వారు ప్రమాణంగా ఎట్లా పరిగణింపబడ్డారో తెలుస్తుంది.

ఆశ్వలాయనుడు వంటి సూత్రకారులు వివాహసందర్భాలలో హారతిని ఎప్పుడు ఇవ్వాలో, పెళ్లికూతురుని ఎప్పుడు చెయ్యాలో వంటి విషయాలలో స్త్రీల నిర్ణయాలనే పాటించాలన్నారు. వివాహమంటపానికి శంఖుస్థాపన చేసేప్పుడు ఒక మంత్రం పఠించాలి - కాని అప్పుడు కూడా బాగా అనుభవమున్న పనివాళ్లు సంప్రదాయానుసారం చెప్పేదాన్ని గమనించాలి.

శాస్త్రాలు వ్యక్తిని బందీ చేయక, ప్రజాసామ్య విధానం వలె కొంత స్వేచ్ఛని కూడా ఇచ్చాయి.

నాల్గవ వర్గంవారు పాటించవలసిన కర్మలను క్రతువులను కూడ ధర్మశాస్త్రాలు చెప్పాయి. వాళ్లని ఏమీ నిర్లక్ష్యం చేయలేదు. దీక్షితీయంలో - వర్ణాశ్రమ కాండలో అహ్నికకాండలో, శ్రాద్ధకాండలో ఈ వివరాలున్నాయి. సాధారణంగా ధర్మశాస్త్రాలను రెండు కాండలుగా విభజిస్తారు. ఆచారకాండ, వ్యవహార కాండ. వ్యక్తిగత ప్రవర్తన - ఆచారం. నియమాన్ని చెప్పేది వ్యవహారం.

**చిహ్నం :**

మన మొక మతాన్ని అవలంబిస్తే దానికి సంబంధించిన చిహ్నాలు కొన్ని యుంటాయి.

స్కౌట్స్ (బాల భటులు)లకు ఒక యూనిఫామ్ ఉంటుంది. అట్లాగే సైనికదళానికి, నావికాదళానికి చెందిన వారికి, వాళ్లను గుర్తు పట్టేందుకు వీలుగా కొన్ని గుర్తులుంటాయి. పోలీసు శాఖలో, ఉపశాఖలలో కూడా అంతే. వాళ్లు తమ యూనిఫామ్‌లని మార్చుకున్నా, బాడ్జీలను మార్చుకున్నా వారు చేసే పని ఏ విధంగానూ ప్రభావితం కాదు. అయినా వారు అట్లా మార్చుకోకూడదంటూ కొన్ని నిబంధనలున్నాయి. నావికుడు పోలీసు వాని దుస్తులను ధరింపరాదు. ప్రతి వృత్తిలోనూ ఒక క్రమమూ, క్రమ శిక్షణా ఉండాలి. మతానికి కూడ అటువంటి క్రమ శిక్షణ అవసరం లేదా? అందువల్లనే గుర్తు తెలియటానికి కొన్ని చిహ్నాలను వివిధవర్గాలవారికీ, వివిధ ఆశ్రమాలలో ఉన్న వారికీ విధులను నిర్ణయించారు. ప్రాంతీయ సంప్రదాయం ప్రకారం ధోవతిని కట్టుకునే తీరూ, చీరెని ధరించే తీరూ ఉంటాయి - అట్లాగే నుదిటిపై పెట్టుకునే బొట్టు వంటివి కూడా.

ఇవన్నీ కేవలం సామాజిక క్రమశిక్షణ కోసమే ఏర్పడినవి కావు. వీటన్నిటికీ సూక్ష్మమైన ప్రయోజనాలు కూడా ఉన్నాయి. మనిషిని పరిశుద్ధ పరచి, ఆధ్యాత్మిక ప్రగతికి దోహదం చేస్తాయి.

ఆఫీసులలో బంట్రోతులే యూనిఫామ్‌లని వేసుకుంటారు. అధికారులు కాదు. దీనికి మనమభ్యంతరం చెప్పం కాని శాస్త్రాలు ఒక్కొక్క వృత్తికీ, ఒక్కొక్క ఆశ్రమానికీ వేరు వేరు లక్షణాలను ఏర్పరిస్తే సమానత్వమూ, స్వేచ్ఛా అంటూ ఆక్షేపిస్తాం. అనాదిగా వస్తున్న వర్ణాశ్రమ ధర్మాలు, లోక కల్యాణానికై ఎవరు ఆచరించవలసిన ఆచారాలనీ, అనుష్ఠానాలనీ వారి బాగుకే నిర్ణయించాయి.

ఇదంతా మరచిపోయి, ఎక్కడా లేని "ఉన్నతజాతు"లను, "తక్కువజాతు"లను కల్పించి ద్వేషాన్నీ, తిరుగుబాటునీ తీసుకువచ్చారు. చివరికి ఎవరికీ ఏ విధమైన చిహ్నామూ లేని స్థితికి వచ్చాం.

సామాజిక చిహ్నాలను ఎన్నింటినో ధరించటానికి ఏ సిగ్గూ అడ్డురాదు. కాని మత పరమైన చిహ్నాలను, ఆత్మోన్నతిని కలిగించే వాటిని, ధరించటానికి మాత్రం ఎంతో సిగ్గుపడతాం. అదంతా మూఢ నమ్మకమనేస్తాం. సంస్కరణ పేర దానిని విడిచేస్తాం. కాని మనం సంస్కర్తలమని తెలుపుకోవటానికి ఏదో ఒక రకమైన టోపీనో, ఒక రంగుకల చొక్కానో, తుండు గుడ్డనో ధరిస్తాం. భగవంతునికి కన్నా వీటికే ఎక్కువ ప్రాధాన్యమిస్తాం!

**స్మృతులు స్వేచ్ఛగా కల్పింపబడినవి కావు :**

స్మృతులు ధర్మశాస్త్రాలే - వాటి పట్ల గౌరవమున్న వాళ్లకి కూడ ఒక తప్పుడు అవగాహన ఉంది వాటి గురించి. స్మృతులను రచించిన వారు తమంతట తామే, స్వచ్ఛందంగా ఆ నీతులను రచించారనుకుంటారు. వాళ్లని శాసకులనుకుంటారు. వాళ్లకి ఇష్టం వచ్చినట్టు

శాసనాన్ని రచించారు అంటారు. అంటే, రాజ్యపాలన సూత్రాలను చెప్పే భారతీయ రాజ్యాంగాన్ని కొందరు న్యాయశాస్త్ర వేత్తల మండలి తయారు చేసినట్టు! స్మృతులు కూడ అట్లాగే ఆ రచయిత స్వంత అభిప్రాయాలనుకుంటారు.

దీనికి తోడు ఇంకొకటి ఉంది. రాజ్యాంగంలో మన మవలంబించటానికి కష్టమైన అంశమేమైనా ఉంటే దానిని సవరించుకుంటాం, ఆ విధంగానే ధర్మశాస్త్రాలని ఆధునిక పరిస్థితులకనుగుణంగా ఎందుకు మార్చుకోకూడదని అడుగుతారు. ప్రభుత్వం నిబంధనలను సవరిస్తున్నట్లుగా ఈ కాలానికి సరిపోయేట్టు ధర్మశాస్త్రాలని అక్కడా ఇక్కడా ఎందుకు మార్పులు చేయరాదు?

ధర్మశాస్త్రాలంటే ఎంతో గౌరవంకల వారికి కూడ తెలియని విషయమిది : "స్మృతులలో ఆయా రచయితల వ్యక్తిగత అభిప్రాయలుండవు. వేదాలలో ఉన్న వాటినే తీసుకొని సంకలనాలని తయారు చేశారు. వేదాలలోని విధులను ఎట్టి పరిస్థితులలోనూ మార్చలేం కాబట్టి ధర్మశాస్త్రంలోని నియమాలను మార్చే ప్రసక్తేరాదు."

స్మృతులు కేవలం ఋషుల కల్పనలే అయితే వాటిని యథాతథంగా మనం పాటించవలసిన నిర్బంధమేమీ లేదు. మనకిష్టం లేకపోతే వాటిని తిరస్కరించవచ్చు. వేదాలలోలేని విషయాలు వాటిలో జొప్పించినా - ఆ రచయితలు మానవాళికేది మంచో, చెడో అని తమ వివేకానికి తోచిన విషయాలను వ్రాసినా - వాటిని తిరస్కరించవచ్చు. అట్లా తమకి తోచిన వాటిని వ్రాసిన వారూ ఉన్నారు, మనం కూడ మనకి తోచినట్టు నియమాలు ఏర్పర్చుకోవచ్చు.

నిజానికి, స్మృతులు వేదంలో చెప్పిన ధర్మాలనే క్రోడీకరించి చెప్పాయి. అందువల్లే అవి మనకి ఇప్పటికీ, ఎప్పటికీ ప్రమాణాలు.

వేదాల నాధారంగా చేసుకునే స్మృతులు రచించారనటానికి ఋజువేమిటి? అన్న ప్రశ్న వస్తుంది.

**స్మృతులకు మూలం వేదాలే :**

అన్నిటికన్నా పెద్ద ఋజువు మన మహాకవుల వాక్యాలే! మన మతాలస్థాపకులైన శంకరులు, రామానుజులు, మధ్వులు ధర్మశాస్త్రాలు వేదాలపై ఆధారపడినవే అన్నారు.

వాళ్లకి కూడ తమ తమ సిద్ధాంతాల పట్ల భక్తి ఉండటం వల్ల వాళ్లు కూడా తప్పై ఉండవచ్చునని అభ్యంతరం చెప్తారేమో! వారు ఆర్షసంప్రదాయాన్ని పరిరక్షించటానికై బద్ధకంకణులు - కావున సంప్రదాయ విరుద్ధమైన దానిని వారు ప్రచారం చెయ్యరు. కాని అటువంటి ఆంక్షలు కవులకు లేవు. ఏ సిద్ధాంతానికీ వారు అంకితులు కారు. కవి, మత విచక్షణ లేకుండా, తనకి గోచరమైన సత్యాన్ని పలుకుతాడు.

మహాకవులలో అగ్రేసరుడు కాళిదాసు. తన రఘువంశంలో శ్రుతులను గురించి ఈ విధంగా పలికాడు "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్". శ్రుతిభావాన్ని అనుసరించి స్మృతి నడిచినట్లు, సుదక్షిణ గోవు అడవుల వెంట వెళ్లింది".

దిలీపుడు గోవును మేతకై తీసుకొని వెళ్ళినప్పుడు సుదక్షిణ దాని వెంట వెళ్లినట్లు చెప్తూ, కాళిదాసు ఋషులు స్మృతుల నెట్లా కూర్చారో వివరిస్తున్నాడు. ఋషులేమి చేశారో, స్మృతులెట్లా తయారైనాయో చెప్పటం ఆయన ఉద్దేశం కాదు.

ఉపమాలంకారలో ఉపమానము సాధారణంగా ఉపమేయం కంటె గొప్పదిగా ఉండటం పరిపాటి. ఉదాహరణకి, ముఖాన్ని చంద్రుడితోనో, పద్మంతోనో పోల్చి చెప్పినపుడు ఆ చంద్రుడో, పద్మమో ఆ ముఖంకన్నా అందంగా ఉంటుంది. ఇక్కడ పతివ్రత అయిన సుదక్షిణ భర్తయైన దిలీపుని వెంట వెళ్లటాన్ని వర్ణించాడు కవి. దీని అర్థమేమంటే, స్మృతులు శృతులను అంతకంటే సన్నిహితంగా అనుసరిస్తాయని. అందువల్లనే ఉపమాలంకార ప్రయోగంలో నిష్ణాతుడు కాళిదాసు ఈ ఉపమానాన్ని ఇక్కడ వాడాడు. స్మృతులు శృతులను అనుసరించాయనటానికి ఇంతకన్నా పెద్ద ఋజువు అవసరం లేదు.

వేదాలలో స్పష్టంగా చెప్పబడని అనుష్ఠానాలు కొన్ని స్మృతులలో ఉన్నాయి. వీటిని స్మార్తకర్మ అంటారు. వేదాలలో స్పష్టంగా చెప్పబడిన వాటిని శ్రౌత కర్మలంటారు. ఇంత మాత్రాన స్మార్త కర్మ, శ్రౌతకర్మ కంటె తక్కువదని భావింపరాదు.

గృహస్థుకి ముఖ్యమైన ఉపాసన, గృహ్యాకర్మలు (ఇంట్లో చేయవలసిన కర్మలు), వైదిక కర్మలలో ముఖ్యమైనది పితృశ్రాద్ధం, పంచయజ్ఞాలూ - ఇవన్నీ స్మార్తకర్మలే. వీటిని చేసేప్పుడు వేదమంత్రాలనే చెప్తారు. స్మృతులను రచించినవారు శృతుల భావాన్ని అర్థం చేసుకునే ఈ విధులను ఏర్పర్చారు. అందువల్ల - శృతులకంటె స్మృతులు తక్కువనీ, స్మృతుల కంటె పురాణాలు తక్కువవనీ అనుకోకుండా ఈ మూడింటినీ సమగ్రంగా అర్థం చేసుకోవాలి.

వైదిక కర్మలను కథలుగా చెప్తాయి పురాణాలు. వైదిక ధర్మాలను కర్మలను కథలవలె గాక సూచనలుగా, విధులుగా చెప్తాయి స్మృతులు. ఆ కర్మలను ఆచరించే విధానాన్ని కూడ సూచిస్తాయి. వేదాలు ఋషులకి సద్యస్ఫూర్తితో అవగాహన అయాయి. ఆ పిదప ఋషులు తమకు కలిగిన అవగాహనని జ్ఞాపకం తెచ్చుకున్నారు - అవే స్మృతులు. పురాణాలు వేదాలలోని సత్యాలను కథల రూపంలో చెప్తాయి. అన్నీ ప్రామాణికాలే.

శృతి, స్మృతి, పురాణం - అన్నీ ధర్మానికి సంబంధించినవే. మన ఆచార్యులు - ఆది శంకరాచార్యులు - ఈ శృతి స్మృతి పురాణాలలో గల ధర్మాల నిధి. అందుచేతనే మనం వినమ్రులమై ఆయనని ఈ విధంగా స్తుతిస్తాం -

> *"శృతిస్మృతి పురాణానామాలయం కరుణాలయం*
> *నమామి భగవత్పాద శంకరం లోక శంకరం".*





కీ॥శే॥ చల్లా శేషాచల శర్మగారి
ఆధ్వర్యమున జరిగిన
శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ
శంకరాచార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ
మహాస్వామివారి
వివిధ జయంత్యుత్సవములలో ఆవిష్కరింపబడిన
గ్రంథములు.

### సప్తాశీతితమ జన్మదినోత్సవాభివందన సంచిక

శ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రి, జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొ॥లగు పండితుల వ్యాసములు, మరియు శ్రీ స్వామివారి అనుగ్రహ భాషణములతో- (1980)

### నడయాడు దైవము

కంచి ఋషీంద్రులు - Sri TMP Mahadevan వ్రాసిన The Sage of Kanchiకి తెలుగు అనుకృతి, శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారి 'సువర్ణోపదా' మరియు శ్రీ స్వామివారి దివ్య సందేశములతో (1982)

### శ్రీవిద్యా పంచదశ మాలా మంత్రోద్ధారః

శ్రీ మధ్భాస్కర రాయకృత 'గురుకలా' వ్యాఖ్యా సమేతముగా శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారి (రేపల్లె) సంపాదకత్వములో శ్రీ స్వామివారి 90వ జన్మదినోత్సవ సందర్భముగా ప్రచురింప బడిన పారాయణ విధి (1984)

### మహాస్వామి

శ్రీవారి జన్మదినోత్సవముల సందర్భముగా శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి ప॥ప॥ జనార్ధనానంద సరస్వతీస్వామి మొదలగు బ్రహ్మజ్ఞుల ఉపన్యాసములు. శ్రీవారితో అనుభవములున్న పెద్దలు వ్రాసిన వ్యాసములు శ్రీ స్వామివారు చెప్పిన ధార్మిక కథలకు అనువాదములతో మహాస్వామివారి జయంత్యుత్సవ అభినందన సంచిక. (1993)

మరియు :

### ఆచార్యవాణి (ప్రథమ సంపుటము)

'అద్వైతము' 'వైదికమతము' 'గురు సంప్రదాయములపై శ్రీ కంచి మహాస్వామివారి అనుగ్రహ భాషణములకు 'విశాఖ'గారి తెలుగు సేత. (1993)

శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్య
శ్రీ శ్రీ శ్రీ చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ శ్రీచరణుల

# దివ్య సందేశము

శ్లో॥ మైత్రీం భజతాఖిల హృద్జైత్రీం
ఆత్మవదేవ పరానపి పశ్యత
యుద్ధం త్యజత స్పర్ధాం త్యజత
త్యజత పరేష్వక్రమ మాక్రమణమ్॥

తా॥ అందరి హృదయములను జయించుమైత్రిని పెంచుము.
ఇతరుల నందరిని నీవలెనే చూచుకొనుము.
యుద్ధమును, స్పర్థను త్యజించుము.
ఇతరులపై అక్రమ ఆక్రమణను వదలిపెట్టుము.

శ్లో॥ జననీ పృథ్వీ కామదుఘాఽస్తే
జనకో దేవః సకల దయాళుః
దామ్యత దత్త దయధ్వం జనతాః
శ్రేయో భూయాత్ సకలజనానామ్॥



పుడమితల్లి అన్ని కోర్కెలను పిదుక గలదు.
తండ్రి పరమేశ్వరుడు అందరియెడ దయాళువు.
ఓ! ప్రపంచప్రజలారా! దయా దాన నిగ్రహాదులను అలవరచుకొనుడు.
మీకెల్లరకు శ్రేయమగుత.

---

ఈ సందేశము 23 అక్టోబర్ 66వ ఐక్యరాజ్యసమితిలో
శ్రీమతి యమ్.యస్. సుబ్బలక్ష్మిచే గానము చేయబడినది.